శ్రీరస్తు.

శ్రీ శంకరాచార్యకృత

# శివానందలహరి

సంస్కృతాంధ్రటీకాసహితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్‌వారిచేఁ

ప్రకటితము.

1914

 [Rs. 0 8.

శ్రీరస్తు.

# శివానందలహరీశ్లోకానాం

## అకారాదిసూచీపత్త్రికా.



శ్రీ ర స్తు.

# శ్రీశంకరభగవత్పాదప్రణీత

# శివానందలహరి

## సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము.



పూజ్యులైన [illegible] అగు శ్రీశంకరులు పరమేశ్వర నమస్కారములవల్ల సమస్తపురుషార్థములు చేకూరునని యెఱింగి సంసార సాగరము నుండి తాము తరించుటకును ఇతరులను తరింపఁజేయుటకును గాఁ బరమేశ్వర స్తోత్రము చేయ నారంభించుచు నిర్విఘ్నముగా గ్రంథము పూర్తియగుటకై పార్వతీ పరమేశ్వర నమస్కార రూపమగు మంగళ మాచరించుచున్నారు:—

కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే,
శివాభ్యా మస్తోకత్రిభువనశివాభ్యాం హృది పునర్భవాభ్యా
మానందస్ఫురదనుభవాభ్యాం నతి రియమ్. 1

కలాభ్యాం = మహావిద్యాస్వరూపులును, చూ...భ్యాం — చూడాలంకృత = శిఖలచే నలంకరింపఁబడిన, శశికలాభ్యాం = చంద్రరేఖలు గలవారును, ని...భ్యాం - నిజతపః = (ఒకరికొకరు) తమతమ నిరాహారాది వ్రతములయొక్క, ఫలాభ్యాం = ఫలమైనవారును, భక్తేషు = భక్తులయందును, ప్ర...భ్యాం - ప్రకటిత = చూపఁబడిన, ఫలాభ్యాం =

కర్మఫలములు గలవారును, అ...భ్యాం - అస్తోక = కొలఁదిలేని, త్రిభువన = ముల్లోకములయొక్క, శివాభ్యాం = శుభములు గలవారును, హృది=మనస్సునందు (ధ్యానించు నప్పుడు), పునర్భవాభ్యాం = (అప్పటికప్పుడు) మరల మరలఁ దోఁచుచుండువారును, ఆ...భ్యాం - ఆనంద = పరమానందముతోఁగూడ, స్ఫురత్ =తోఁచుచుండెడు, అనుభవాభ్యాం= స్వరూపసాక్షాత్కారము గలవారును నగు, శివాభ్యాం = ఉమామహేశ్వరుల కొఱకు, ఇయం = ఈ, మే = నాయొక్క, నతిః = నమస్కారము, భవతు = అగుఁగాక.

తా. తమలోఁ దాము చేసిన యుగ్రతపస్సుచేత నొకరికొకరు ఫలముగా నర్ధనారీశ్వరమూర్తులై యెల్లలోకములకు శుభదాయకులై కర్మఫలప్రదాయకులై భక్తులు ధ్యానముచేయుపట్ల నిమిష నిమిషమునను వారల హృదయములయం దావిర్భవించుచు ముముక్షువుల కానందసాక్షాత్కారముల నొసఁగుచు సమస్త విద్యాస్వరూపు లయి యున్న యా గౌరీశంకరులకు నమస్కారము.

—॥ వ్యాఖ్యానప్రారంభః ॥—

అవతరణికా:—

చిత్రం వటతరో ర్మూలే వృద్ధా శ్శిష్యా గురు ర్యువా,
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛ్ఛిన్నసంశయాః.

అథ తత్ర భవాన్ పరమ కారుణిక శ్రీశంకరాచార్యః పరమేశ్వర ప్రణతి మహిమ్నా సకలార్థసిద్ధి మధిగత్య స్వయం భవం తర్తు మన్యాంశ్చ తారయితుం పరమేశ్వరం స్తోతు మారభమాణః, అవిఘ్నేన గ్రంథ పరిసమాప్తయే శివయో ర్నమనరూపం మంగళ మాచరతి:—

వ్యా. మే మమ ఇయ మసౌ నతిః ప్రణామః శివాభ్యాం శివాచ శివశ్చ శివౌ తాభ్యాం పుమాంస్త్రియేత్యేకశేషః. పార్వతీ పరమేశ్వరాభ్యాం భవతు అస్తు నమస్కార్యగుణాన్ ప్రకట యితుమాహ:—కలా.

భ్యామితి. కలాభ్యాం శ్రుతి ప్రసిద్ధ సకల విద్యాస్వరూపాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం చూడాభ్యాం శిఖాభ్యాం అలంకృతే మండితే శశికళే చంద్రకళే యయో స్తాభ్యాం శశికళాశిఖాయి చూడా విశిష్టాభ్యా మిత్యర్థః. నిజతపః ఫలాభ్యాం నిజే ఆత్మీయే యే తపసీయే నిరాహారాదితదేకనిష్ఠాస్యుగ్రవ్రతా తయోః ఫలాభ్యాం ఫలభూతాభ్యాం పరస్పరతపః ఫలభూతాభ్యా మిత్యర్థః. భక్తేషు స్వభక్తేషు ప్రకటితఫలాభ్యాం ప్రకటితే ప్రకాశితే ఫలే సర్వాది ఫలదానే యాభ్యాంతాభ్యాం పరహస్త ప్రకటితసర్వ ఫలదానాభ్యా మితి యావత్. అస్తోక త్రిభువన శివాభ్యాం అస్తోకమనల్పం త్రిభువనస్య త్రయాణాం భువనానాం సమాహార స్త్రిభువనం తస్య శివం భద్రం యాభ్యాం తాభ్యాం అనల్ప త్రిభువనభద్రహేతుభ్యా మిత్యర్థః. హృది మనసి పునర్భవాభ్యాం పౌనః పున్యేన ప్రతిధ్యానం జాయమానాభ్యాం యదాయదాధ్యాయతి తదాతదా నవనవోన్మేషణే నోత్పద్యేతే ఇతి యావత్. సద్యోజాతం ప్రపద్యామీతి శ్రుతేః ఆనందస్ఫురదనుభవాభ్యాం ఆనందేన సాకం స్ఫురన్ అనుభవః స్వరూపబోధః యయోస్తాభ్యాం ఏతైః కలాభ్యామిత్యాది విశేషణై ర్నమస్కార్యవస్తునో వైశిష్ట్యం ప్రతిపాద్యతే.

శివానందము తనచిత్తము నెడబాయకుండ వేడుకొనుచున్నారు.—

గళంతీ శంభో త్వచ్చరితసరితః కిల్బిషరజో దళంతీ
ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్,
దిశంతీ సంసారభ్రమణపరితాపోపశమనం వసంతీ
మచ్చేతోహ్రదభువి శివానందలహరీ. 2

టీ. హే శంభో = సుఖమునకుం గారణమైనవాఁడా ? త్వ...తః– త్వత్ = నీయొక్క, చరిత = చరిత్రమనియెడు, సరితః = నదినుండి, గళంతీ = స్రవించి పాఱుచున్నదియును, కి...జః – కిల్బిష = పాపములనియెడు, రజః = ధూళిని, దళంతీ = ఖండించుచు (అణంచివేయు) చున్న

దియు, ధీ...షు - ధీ = బుద్ధులనియెడు, కుల్యా = పిల్లకాలువలయొక్క, సరణిషు = స్రోతస్సులయందు, పతంతీ = ప్రసరించుచున్నదియు, సం...వం - సంసార భ్రమణ = జననమరణ రూపమైన సంసార చక్రమందు తిరుగుటచేఁ గలిగిన, పరితాప = అత్యంత సంతాపములయొక్క, ఉపశమనం = ఉపశాంతిని, దిశంతీ = ఇచ్చుచున్నదియు, మ...వి - మత్ = నాయొక్క, చేతః = చిత్తమనియెడు, హ్రదభువి = మడుఁగునందు, వసంతీ = నిలచియుండు నదియునగు, శివానందలహరీ = పార్వతీ పరమేశ్వరుల వలనఁగలిగిన యానందప్రవాహము, విజయతాం=సర్వోత్కృష్టముగా నుండుఁ గాక.

తా. ఓశంకరా! భక్తపరిపాలనాది రూపములగు నీచరిత్రములు మహానదులు. వానినుండి స్రవించి పాఱుచు పాపములనియెడు నిసుకలఁ దుడుచుచున్న యీ శివానందలహరి బుద్ధియను పిల్లకాలువగుండ వచ్చి సంసారసంతాపము శాంతిపఱుచుచు నాహృదయమను పెద్ద చెఱువులోఁ బడినది. ఇది యెఁక నెన్నఁడును వీడకుండ స్థిరముగా నుండున ట్లనుగ్రహింపుము.

అ. ఏవంమంగళం నిర్వర్త్యస్వచేతసిశివానందస్థైర్యంప్రార్థయతే:-

వ్యా. గళంతీతి. హేశంభో సుఖకారణ త్వచ్చరిత సరితః తవ తే చరితమేవ భక్తపరిపాలనాది చరిత్రమేవ సరిత్ వాహినీ తస్యాస్సకాశాత్ గళంతీ స్రవంతీ కిల్బిషరజః కిల్బిషం పాపమేవ రజః ధూళిః తద్దళంతీ ఛిందంతీ ధీకుల్యా సరణిషు ధియఃబుద్ధయఏవకుల్యాః కృత్రిమసరితః తాసాం సరణిషు పదవీషు పతంతీ గచ్ఛంతీ సంసార భ్రమ పరితాపోపశమనం సంసారే సంసృత్యాం భ్రమణేన భ్రాంత్యా యః పరితాపః దుఃఖం తస్యోపశమనం శాంతిం దిశంతీ ప్రయచ్ఛంతీ మచ్చేతో హ్రదభువి మమ మే చేతః చిత్తమేవ హ్రదః అగాధ జలప్రదేశః తస్య భూః భూమిః తస్యాం వసంతీ తిష్ఠంతీ శివానందలహరీ శివాభ్యాం శ్రుతచరితాభ్యాం జనితః య ఆనందః దుఃఖరాహిత్యరూపః తస్య లహరీ ప్రవాహః విజయతాం సర్వోత్కర్షేణ వర్తతాం సర్వాభ్యః లహరీభ్యః ఉత్కర్షేణ వర్తతా మితి భావః.

శివానందము శివభజన చేయనిదే కలుగదు గనుక శివభజన మావశ్యక మని సూచించుచున్నారు:—

త్రయీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యం త్రిణయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్,
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివ మతివిడంబం హృది భజే. 3

టీ. త్రి...ద్యం - త్రయీ = ఋగ్వేదయజుర్వేదసామవేదములు మూఁటిచేతను, వేద్యం = తెలిసికొనఁ దగినవాఁడును, హృద్యం = హృదయకమలమున వ్యక్తమగువాఁడును, త్రిపురహరం = స్థూలసూక్ష్మకారణ శరీరములు మూఁటిని నశింపఁజేయువాఁడును, ఆద్యం = సృష్టికంతకు మొదటనయున్నవాఁడును, త్రిణయనం = మూఁడు కన్నులవాఁడును, జటాభారోదారం = జటాజూటముచేత గంభీరమైనవాఁడును, చ...రం - చలత్ = కదలుచున్న, ఉరగ = పాములనియెడు, హారం = పేరులు గలవాఁడును, మృగధరం = లేడిని దాల్చినవాఁడును, మహాదేవం = గొప్పదేవుఁడును, (స్వప్రకాశ రూపుఁడు), దేవం = ఆనంద స్వరూపుఁడును, మయి = నాయందు, సదయభావం = దయతోఁగూడిన యభిప్రాయము గలవాఁడును, పశుపతిం = బ్రహ్మాది లోకపాలకుఁడును, చిదాలంబం = స్వరూపజ్ఞానమునకు సాధనమైన వాఁడును, అతివిడంబం = సమయానుసరణము గలవాఁడును, సాంబం = పార్వతీ సమేతుండును నగు, శివం = పరమేశ్వరుని, హృది = మనస్సునఁ, భజే = సేవింతును.

తా. ఏ మహాదేవుఁడు ఋగ్వేద యజుర్వేద సామవేదములు మూఁటియందుఁ దెలియఁబడునో, ఏ మహాదేవుండు హృదయకమలమునందు స్ఫురించునో, ఏమహాదేవుఁడు స్థూలసూక్ష్మకారణ దేహములు మూఁటిని నిర్మూలము చేయునో, ఏ మహాదేవుండు ప్రపంచమునంతయు సృజించుచు సృష్టికిఁ బూర్వమందునుం గలఁడో, ఏ మహాదేవుండు మూఁడు

కన్నులును, జటాజూటమును, సర్పహారమును, హస్తమున లేడియుం గలిగి గంభీరమూర్తియై యొప్పునో, యే మహాదేవుఁడు మేర లేని స్వప్రకాశము పరమానందమును స్వస్వరూపముగా వెలుఁగొందునో, ఏ మహాదేవుండు స్వరూప సాక్షాత్కారమునకుఁ బరమసాధనమో, ఏ మహాదేవుండు బ్రహ్మాది నిఖిలలోకములకుఁ బరిపాలకుఁడై లోకానుకరణముతోఁ గూడి వర్తించునో, అట్టి పార్వతీ సమేతుండగు పరమశివుని నాహృదయమందు బుద్ధి ప్రేరకునిగా భావించెదను.

అ. శివానందస్య శివభజనమూలత్వా త్తద్భజన మావశ్యక మితి స్వయం భజతే:—

వ్యా. త్రయీవేద్యమితి. అహం త్రయీవేద్యం త్రయ్యా వేదత్రయేణ వేద్యం జ్ఞేయం హృద్యం హృదయాభివ్యక్తం త్రిపురహరం స్థూలాది శరీరత్రయహరం ఆద్యం ఆదౌభవం సృష్టేః పూర్వమపి స్థిత మిత్యర్థః. త్రినయనం త్రిలోచనం జటాభారోదారం జటాజూటేన ఉదారం గంభీరం చలదురగహారం ఉరసా గచ్ఛంతీ త్యురగాః సర్పాః చలంతః స్పందమానాః ఉరగా ఏవ హారః భూషణం యస్య తం మృగధరం ధరతీతి ధరః మృగస్య ధరః మృగధరః తం హరిణధర మిత్యర్థః. మహాదేవం దీవ్యతీతి దేవః మహాంశ్చాసౌ దేవశ్చ మహాదేవః తం అపరిచ్ఛిన్న స్వప్రకాశరూపమిత్యర్థః. దేవం దీవ్యతేః ప్రమోదార్థత్వాచ్చ ఆనందరూపం మయి విషయే సదయభావం భావనావిశిష్ట మిత్యర్థః పశుపతిం బ్రహ్మాదిలోకానాం పశూనాం పాలకం పాశవిమోచన మిత్యర్థః. చిదాలంబం చిదః స్వరూపజ్ఞానస్య ఆలంబం సాధనం సాంబ ముమాసహితం అతివిడంబం ప్రాప్తలోకానుకరణం శివం ఈశ్వరం హృదిమనసి భజే భావయే ధీప్రేరకత్వేన ధ్యాయామీత్యర్థః.

దేవత లందఱిలోను శివుఁ డుత్తమోత్తముఁ డని తలఁచి నీపాదారవింద భజన మనుగ్రహింపుమని యాతనినే వేఁడుకొనుచున్నారు.—

సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా న
మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్,
హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరం యాచే శంభో శివ తవ పదాంభోజభజనమ్. 4

టీ. జగతి = లోకమునందు, క్షుద్రఫలదాః = తుచ్ఛమైన ఫలముల నొసఁగునట్టి, విబుధాః = (ఇతర) దేవతలు, సహస్రం = వేలకొలఁది, వర్తంతే = ఉన్నారు. (అహం = నేను), స్వప్నేవా = కలలోనైనను, తదనుసరణం = ఆదేవతలను భజించుటగానీ, తత్కృతఫలం = ఆదేవతలు కలుగఁజేయు ఫలమునుగానీ, నమన్యే = తలఁచను (కోరను) శంభో, శివ = సుఖకారణుఁడవును, మంగళస్వరూపుఁడవునగు శంకరా? నికటభాజాం = సన్నిధిని చేరియున్న, హరిబ్రహ్మాదీనామపి = విష్ణుమూర్తి, బ్రహ్మదేవుఁడు మొదలగు వారలకు సైతము, అసులభం = దుర్లభమైన, తవ = నీయొక్క, పదాంభోజభజనం = పాదపద్మసేవను, చిరం = ఎల్లవేళలను, యాచే = యాచించుచున్నాను.

తా. ఏదో కొంచెము ఫలమిచ్చెడు దేవత లెందఱో కలరు. వారి సేవ, వారిఫలములు నాకు కావలయునని నపేక్ష స్వప్నమందైనను లేదు. వద్దు. ఓ ఈశ్వరా? ఎల్లప్పుడును సన్నిధాన వర్తులైన బ్రహ్మాదులకుఁ గూడ దొరకని మీపాదసేవయే దయచేయుఁడు. మిమ్ము పదేపదే వేఁడుకొనుచున్నాను.

అ. సర్వదేవతాపేక్షయా శివోత్కర్ష మభిప్రేత్య తత్పాదారవిందభజనం తమేవ యాచతే:—

వ్యా. సహస్రమితి. జగతి భువనే క్షుద్రఫలదాః తుచ్ఛఫలప్రదాతారః స్వల్పఫలదానాదేవహేతోః సహస్రం సహస్రసంఖ్యాకాః విబుధాః దేవతాః వర్తంతే సంతి అహం స్వప్నేవా వాశబ్దోఽప్యర్థకః స్వప్నేఽపి కిముత జాగ్రదవస్థాయామితిభావః. తదను సరణం తేషాం భ

జనం తత్కృత ఫలం తైర్దత్తఫలంచ నమస్యే నాభ్యుపగచ్ఛామి కింతు నికటభాజాం నికటం సన్నిధిం భజంతే సేవంత ఇతి నికటభాజః తేషాం హరిబ్రహ్మాదీనామపి హరిశ్చ బ్రహ్మాచ హరిబ్రహ్మాణౌ తావేవాదీ యేషాం తే తేషామపీత్యర్థః. కర్తరిషష్ఠీ. అసులభం దుర్లభం హే శంభో తవ తే పదాంభోజ భజనం పాదారవింద సేవాం చిరం బాహుకాలికం యాచే అభ్యర్థయే.

ఓరిపిచ్చివాఁడా! ఈదేవతలతో నీకేల? వీరెన్నఁడో ఫలమిచ్చెద రఁట. అదియును కన్నులఁగానరాము. ఇంతకన్న నొకరాజు నాశ్రయించ రాదు? ప్రత్యక్షముగా వెంటనే ఫలమిచ్చును. అది మేలుఁగదా అను నభిప్రాయమును మనమునం దుంచుకొని యిట్లు చెప్పుచున్నారు:—

స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితా గానఫణితౌ
 పురాణే మంత్రే వా స్తుతి నటన హాస్యే ష్వచతురః,
కథం రాజ్ఞాం ప్రీతి ర్భవతి మయి కోఽహం పశుపతే
 పశుం మాం సర్వజ్ఞ ప్రథితకృపయా పాలయ విభో. 5

టీ. స్మృతౌ = మనుస్మృతి మొదలగు స్మృతులయందుఁగానీ, శాస్త్రే = తర్క-వ్యాకరణాది శాస్త్రములయందుఁగానీ, వైద్యే = వైద్యమునందుఁగానీ, శ...తా - శకున=శకునములు చెప్పుట యందుఁగానీ, కవితా = కవిత్వముజెప్పి మెప్పించుటయందుఁగానీ, గాన ఫణితౌ సంగీతము పాడి రంజింపఁజేయుట యందుఁగానీ, పురాణే = పురాణములు చెప్పుట యందుఁగానీ, మంత్రేవా = మంత్రశాస్త్రమందుఁగానీ, స్తు ... షు - స్తుతి = స్తోత్రములుచేసి యుప్పొంగించుటయందుఁగానీ, నటన = నాట్యము సల్పి మోహింపఁజేయుటయందుఁగానీ, హాస్యేషు = హాస్యములు చెప్పి నవ్వించుటయందుఁగానీ, అచతురః = నేర్పులేనివాఁడను, మయి= (ఇట్టి) నాయందు, రాజ్ఞాం = రాజులకు, ప్రీతిః = ప్రేమ, కథం=ఎట్లు! భవతి = కలుగును. (ఒకవేళ నిందేదైన నేర్చినను నేర్తునుగాక వారి

ప్రేమవలని లాభంబులమీఁద నాకిచ్ఛయు లేదు). (అతః = కనుక), ప్రథిత = వేదప్రసిద్ధుఁడవును, సర్వజ్ఞ = సమస్తము తెలిసిన వాఁడవును నగు, హేపశుపతే = ఓయి సర్వేశ్వరా? కోఽహం = నే నెవ్వఁడనో యెఱుంగని, పశుం = పశుప్రాయుఁడనైన, మాం = నన్ను, కృపయా = దయతో, పాలయ = రక్షింపుమా.

తా. సర్వజ్ఞుండవైన ఓయీశ్వరా? శాస్త్రపాండిత్యలేదు. వైద్యము చేతగాదు. కవిత్వము చెప్ప నేరను. సంగీతము పాడరాను. పురాణము చదువలేను. మంత్రము తెలియను. ఆటపాటలయందు నేర్పులేదు. మెచ్చుమెచ్చులమాటలు మున్నగునవేవియుఁ జెప్పఁజాల నింక రాజులకు నామీఁద నెట్లు దయవచ్చును? వచ్చియు వారిచ్చు ఫలములునాకేల? వలదు వలదు. వేదవేద్యా? మహానుభావా? నన్ను నేనే యెఱుఁగని పశువను. నీవు పశుపతివిగదా. దయచేసి నీవే నన్ను రక్షింపుము.

అ. పరోక్ష కాలాంతరభావి ఫలదాతృ దేవతానుసరణా త్ప్రత్యక్ష ఆశు ఫలదాతృరాజాద్యనుసరణం వరమితి తేషైవ ఫలం సాధ్య మిత్యత ఆహ:—

వా. స్మృతావితి. స్మృతౌ మన్వాదిస్మృతౌ శాస్త్రే తర్కవ్యాకరణాదౌ వైద్యే భిషక్ఛాస్త్రే శకున కవితా గానఫణితౌ శకునం ప్రయాణాదికాలే కాక గరుడ జంబుకాది సవ్యాప సవ్యగమనవిధినిషేధ శాస్త్రం కవితా కవేర్భావః కవితా ఛందోరూపేణ గద్య పద్య రూపేణచ యన్నో చితార్థాభిలాషుకః శబ్దగుంభనం గానం సంగీతం తేషాం ఫణితిః సభాయాం వాచావిష్కరణం తస్యాం పురాణే శైవవైష్ణవాత్మక గ్రంథ విశేషే మంత్రే మంత్రశాస్త్రేవేతి వికల్పార్థే, స్తుతి నటన హాస్యేషు స్తుతిఃస్తోత్రం నటనం నాట్య హాస్యం పరేషాం హసనానుకూల వ్యాపారః తేష్వహ మచతురః అసమర్థః నపాతనాత్సాధుః. తస్మాత్ రాజ్ఞాం నృపతీనాం మయి ప్రీతిః ప్రేమా కథం కేన ప్రకారేణ భవతి స్యాత్ తత్ప్రీతిజన్యం ఫలంచానీప్సి తం అతః హేపశుపతే హేసర్వజ్ఞ హేప్రథిత శ్రుతిప్రఖ్యాపిత హేవిభో

సర్వవ్యాపక పశుం పశుప్రాయం కోఽహం మిథ్యాజ్ఞానం మాం కృపయా కరుణయా పాలయ రక్ష.

ఇట్లు దేవుని వేఁడుకొని తనబుద్ధిని గుఱించి నీయలవాటు చొప్పున సామాన్యమైన శాస్త్రములమీఁదికే పఱుగెత్తెడు వది నరభ్యాసము సుమా! ఇంక మాను ము. శివభజనము చేయుము అని మెల్లగా నంసుఁ జొప్పించుచున్నారు:—

ఘటో వా మృత్పిండోఽప్యణు రపి చ ధూమోఽగ్ని రచలః
పటో వా తంతు ర్వా పరిహరతి కిం ఘోరశమనమ్,
వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభో ర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః. 6

టీ. సుధీః—ఓ మంచిబుద్ధీ, ఘటోవా=కుండగానీ,మృత్పిండోఽపి=మట్టిముద్దగానీ, అణురపి=పరమాణువుగానీ, ధూమః=పొగగానీ, అగ్నిః=నిప్పుగానీ, అచలః=పర్వతముగానీ, పటోవా=వస్త్రముగానీ, తంతుర్వా=దారముగానీ, ఘోరశమనం = భయంకరుఁడైన యముని, పరిహరతి కిం = పోగొట్టునా యేమి? తర్కవచసా=(పైఁజెప్పిన) తర్కశాస్త్రిసంబంధిమాటలచేత, వృథా = వ్యర్థముగా, కంఠక్షోభం = కంఠమున కాయాసమును, వహసి = కలిగించుకొనుచున్నావు. (అదిమాని), శంభోః = శివునియొక్క, పదాంభోజం = పాదపద్మమును, భజ = సేవించుము, తరసా = శీఘ్రముగా, పరమసౌఖ్యం = మోక్షసామ్రాజ్యమును, వ్రజ= పొందుము.

తా. కుండలు చేయుటకు మట్టి సాధనము, దానికి పరమాణువులు కారణము. కొండమీఁద పొగ కనఁబడుచున్నది గాన నిప్పకలదు(?)మను. బట్టలు దారములవలన జనించును. ఈ తర్కశాస్త్రి వాక్యములలో నొక్కటియు మృత్యువున కడ్డపడునదిగాదు. ఇవి పిడివేసి వల్లించి కంఠక్షోభమేల కలిగించు కొనియెదవు. వద్దు. శివభజన జేసి మోక్షము బొందుము.

అ. ఏవం సంప్రార్థ్య దురభ్యాస బలేన సామాన్య శాస్త్రే ధావమానాం బుద్ధిం నివార్య శివభజనం కుర్వీత్యేను నయతి:—

వ్యా. సుధీః హేశోభనబుద్ధే ఘటోవా కలశోవా మృత్పిండః మృద్వికారోఽపి అణుః పరమాణురపి ధూమః స్పష్టార్థః అగ్నిః వహ్నిః అచలః పర్వతః పటోవా వస్త్రంవా తంతుర్వా సూత్రంవా ఏతే న్యాయశాస్త్రవ్యవహ్రియమాణాః శబ్దాః ఘోరశమనం ఘోరః కర్కశశ్చాసౌ శమనః యమశ్చ, శమనో యమరాడ్యమ ఇత్యమరః. తం పరిహరతికిం దూరీకరోతి కింవేతి సర్వత్ర వికల్పార్థః తర్కవచసా న్యాయవాక్యేన వృథా వ్యర్థం కంఠశోషం గళశ్రమం త్వంవహసి ప్రాప్నోషి శంభోః శం సుఖం భవత్యస్మాదితిశంభుః తస్య పదాంభోజం అంఘ్రి కమలం భజ సేవస్వ తరసా ఝడితి పరమసౌఖ్యం మోక్ష సామ్రాజ్యం వ్రజ లభస్వ.

ఇట్లుబుద్ధిని శివభక్తియందుఁ జొన్పి మనస్సు మొదలగు నింద్రియములనుఁ గూడ నితరవిషయాసక్తి లేకుండ పరమశివ కైంకర్యాసక్తి గలుగునట్లు ప్రార్థించుచున్నారు:—

మన స్తే పాదాబ్జే నివసతు వచ స్స్తోత్రఫణితౌ
కర శ్చాభ్యర్చాయాం శ్రుతి రపి కథాకర్ణనవిధౌ,
తవ ధ్యానే బుద్ధి ర్నయనయుగళం మూర్తివిభవే
పరగ్రంథా న్కైర్వా పరమశివ జానే పరమతః. 7

టీ. హేపరమశివ = ఓపరమేశ్వరా, మనః = మనస్సు, తే = నీయొక్క, పాదాబ్జే = పాదపద్మమందును, వచః = వాక్కు (వాగింద్రియము), స్తోత్రఫణితౌ = స్తోత్రపాఠములు చదువుటయందును, కరః = చేతులు (హస్తేంద్రియము), అభ్యర్చాయాంచ = పూజయందును, శ్రుతిః = చెవులు. (శ్రవణేంద్రియము), కథాకర్ణనవిధౌ = చరిత్రలు వినుటయందును, బుద్ధిః = బుద్ధి. (నిశ్చయాత్మకమైన అంతఃకరణవృత్తి), తవ = నీయొక్క ధ్యానే = ధ్యానమందును, నయనయుగళం = కన్నుదోయి, మూర్తివి.

భవే = నీదివ్యమంగళ విగ్రహముయొక్క చక్కదనమందును, నివసతు = స్థిరపడియుండుఁగాక, అతఃపరం = ఇంకమీఁద, కైర్వా = ఏయింద్రియములచేత, పరగ్రంథాన్ = నీకైంకర్యమునకు వ్యతిరిక్తములైన గ్రంథములను, జానే, = తెలిసికొందును.

తా. మనస్సు, వాక్కు, హస్తము, శ్రవణము, బుద్ధి, నేత్రము అను నింద్రియములు అన్నియు సర్వకాల సర్వావస్థలయందును నీకైంకర్యము నందే మగ్నములై యున్నచో గ్రంథాంతరప్రసక్తి కలుగదు. కావున అట్లు అనుగ్రహింపుమని భావము.

అ. ఏవంబుద్ధి మనునీయ మన ఆదీనాం కరణానాం పరమశివకైంకర్యపరతాం తత్కైంకర్యాన్బహిరంగభూత గ్రంథావలోకనాపహ్నవేన ప్రార్థయతే:—

వ్యా. మనస్త ఇతి. హేపరమశివ తే తవ పాదాబ్జే చరణాంభోజే మనః చిత్తం నివసతు. వచః వాగింద్రియం స్తోత్రఫణితౌ స్తూయతే అనేనేతి స్తోత్రం తావకగ్రంథః ఫణితౌ తదుచ్చారణే నివసతు చిరం తిష్ఠతు వాగింద్రియం శివస్తోత్రాభిలాషి భవత్విత్యభిప్రాయః. కరః హస్తేంద్రియం అభ్యర్చాయాం త్వత్పూజావిధానే నివసతు హస్తేంద్రియం త్వదభ్యర్చన పరం భవత్విత్యభిప్రాయః, చకారేణానుక్తమపి శివగుణగణ లేఖనం సముచ్చీయతే, శ్రుతిః శ్రోత్రేంద్రియం కథాకర్ణనవిధౌ చరిత్రశ్రవణ విధానే నివసతు శ్రోత్రేంద్రియం తవ చరిత్ర శ్రవణే వ్యాప్రియతామితి భావః, బుద్ధిః నిశ్చయాత్మకాంతః కరణవృత్తిః ధ్యానే త్వద్విషయక ప్రత్యయావృత్తౌ నివసతు త్వామేవ సదా ధ్యాయత్వితి భావః. నయనయుగళం నేత్రేంద్రియయుగ్మం ఏకస్యాపీంద్రియస్య యుగళత్వాభిధానం గోళకాభిప్రాయేణ, మూర్తివిభవే తవ శోభాతిశయే నివసతు దివ్యమంగళ విగ్రహరూపం పశ్యత్విత్యభిప్రాయః. ఉక్తరీత్యా షట్సు కరణేషు వ్యాప్రియమాణేషు అతః పరం ఇత ఉత్తరకాలం కైర్వా కరణైః, వాశబ్దః ప్రశ్నే పరగ్రంథాన్ ఉక్తార్థాద్బహిరంగ భూతాన్

గ్రంథాన్ జానేష్యామి, వర్తమానసామీప్య ఇతి భవిష్యదర్థేలట్, ఉక్త. కరణజాతం సదా త్వదాదేశకరణం భవత్వితి స్పష్టార్థః.

నన్ను భజించుటచేతనే సర్వాభీష్టములు సిద్ధించునెడల కొందఱితరుల నేల సేవింతు రనుప్రశ్నయం దిట్లు చెప్పుచున్నారు:—

యథా బుద్ధి శ్శుక్తౌ రజత మితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్,
తథా దేవభ్రాన్త్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే.

టీ. మహాదేవ = ఓదేవదేవుఁడా! పశుపతే=సకలభూతాధిపతీ?. జడజనః = మూఢుఁడు, ఈశం సర్వనియంతవగు, త్వాం = నిన్ను, మనసి = హృదయమునందు, నమత్వా = తలంచక (ఎఱుఁగక), శుక్తౌ = ముత్యపుఁజిప్పయందు, రజతమితి = వెండియనియు, కాచాశ్మని = గాజుఱాయియందు, మణిః = మాణిక్యమనియు, పైష్టే = పిండిగలిపిన, జలే = నీటియందు, క్షీరం = పాలనియు, మృగతృష్ణాసు = ఎండమావులయందు, సలిలం = జలమనియు, బుద్ధిః = మిథ్యాబుద్ధి, యథా = ఎట్లు, భవతి = కలుగుచున్నదో, తథా=అట్లు, భవదన్యమ్=నీకంటె యితరుఁడైనట్టివానిని, దేవభ్రాన్త్యా=దేవుఁడను భ్రాంతిచేత, భజతి = సేవించుచున్నాఁడు.

తా. ముత్యపుఁజిప్పలను వెండియనియు గాజుఱాలను మణులనియు పిండినీళ్లను పాలనియు ఎండమావులను నీళ్లనియు భ్రమించునట్లుగా నిన్ను దెలియ నేరనిమనుజుఁడు ఇతరుని దేవునిగా భ్రమించి సేవించుచున్నాఁడు.

అ. మద్భజనేనైవ సర్వాభీప్సితసిద్ధౌ కేచన మదన్యం కుతో భజంతీత్యతఆహ.—

వ్యా. యథాబుద్ధిరితి. హేమహాదేవ అపరిచ్ఛిన్నస్వప్రకాశరూప హేపశుపతే సకలభూతాధిపతే జడజనః త్వత్స్వరూపమజానానో జనః

ఈశం సర్వనియంతారం త్వాం భవంతం మనసి హృదయే న మత్వా మనసా అనవబుధ్యేత్యర్థః. వేదే నానవబుధ్యేతిచార్థః. భవదన్యం త్వదన్యం తథాత్వప్రకారయా దేవ ఇతిభ్రాంత్యా భజతి సేవతే అధిష్ఠానాజ్ఞానస్యాధ్యాసే హేతుత్వాదిభావః. కింప్రకారా భ్రాంతిరిత్యతఆహ.—శుక్తౌ మాౌక్తికోత్పత్త్యాధారభూతే సాముద్రిక వస్తువిశేషే యథా యత్ప్రకారారజతమితి దుర్వర్ణమితి బుద్ధిః జ్ఞానం భవతి కాచాశ్మనిరత్నాభాసే మణిప్రకాశమాన క్షుద్రశిలాయామిత్యర్థః. మణిరితి మాణిక్యమితి బుద్ధిః పైష్టే పిష్టవికారే జలే ఉదకే క్షీరమితి దుగ్ధమితి బుద్ధిః మృగతృష్ణాసు మరుమరీచికాసు సలిలమితి జలమితి బుద్ధిః యథా యత్ప్రకారా తత్ప్రకారయా భ్రాంత్యేత్యన్వయః.

ఏయుపాయముచేనైనను ఈశ్వర ప్రసాదము సంపాదింప నలయునని చెప్పియున్నది. అందు సులభోపాయ మెద్దియో చెప్పుచున్నారు.—

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః,
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కి మహో. 9

టీ. జనః = మనుష్యుఁడు, జడమతిః = తెలివి తక్కువవాఁడై, కుసుమార్థం = పుష్పములకొఱకుఁగా, గభీరే = లోఁతైన, కాసారే = చెఱువునందు, విశతి = దిగుచున్నాఁడు, విజనే = జనులులేని, ఘోరవిపినే = భయంకరారణ్యమందును. విశాలే = విస్తీర్ణమైన, శైలేచ = పర్వతమందును, భ్రమతి=తిరుగులాడుచున్నాఁడు, హే ఉమానాథ=ఓ పార్వతీపతీ! ఏకం = ఒక్క, చేతస్సరసిజం = మనస్సనియెడు పద్మమును, భవతే = నీకొఱకు, సమర్ప్య = సమర్పించి, ఇహ=ఇచ్చట, సుఖేన=సుఖముగా, అవస్థాతుం = స్థిరుఁడైయుండుటకు, నజానాతి = ఎఱుఁగఁడు, కిమహో = ఏమియాశ్చర్యము !

తా. ఆహాహా! మానవు లెంత వెఱ్ఱులు! పుష్పములకొఱకుఁ దామటవులలోను కొండలలోను దిరుగులాడుచు లోఁతైనచెఱువులలో నీఁదులాడుచుం జిక్కులు పడుచున్నారు. తమయుత్తమ మనస్సను పద్మమును పరమేశ్వరుని పాదారవిందములయం దర్పించిన యెడల నెంతి సుకరముగా నుండును?

అ. యేనకేనాప్యుపాయేన భవత్ప్రసాద స్సంపాదనీయ ఇత్యుక్తం తత్ర సులభః ఉపాయః క ఇతి తత్రాహ.—

వ్యా. గభీరే ఇతి. గభీరే అగాధే కాసారే సరసి విజనే జనరహితే ఘోరవిపినే ఘోరే వ్యాఘ్రాదిభిర్భయంకరే విపినే అరణ్యే విశాలే విస్తీర్ణే శైలే పర్వతే చ, జడమతిః అసులభోపాయజ్ఞః కుసుమార్థం కుసుమం పుష్పం అర్థం ప్రయోజనం యస్మిన్కర్మణి తద్యథా భవతి తథా భ్రమతి సంచరతి హే ఉమానాథ పార్వతీపతే ఏవం సంబోధనం సశక్తికం మహాదేవముపాసనీయం ద్యోతయతి ఏకం ఏకత్వసఖ్యాకం చేతస్సరసిజం చేత ఏవ సరసిజంపద్మం అన్యపుష్పవద్బహుత్వాశ్రయసంపాదనక్లేశో న భవతీతిభావః. భవతే తుభ్యం సమర్ప్య ప్రదాయ జనః ఇహ ఏకత్ర అవస్థాతుం నిశ్చలో భవితుం నజానాతి నబుధ్యతి కిమహో కిమేతదాశ్చర్యకరమిత్యర్థః. దుఃఖకరాల్పఫలక బహుదేశభ్రమణాపేక్షయా సుఖకరబహుఫలకైకదేశావస్థానాజ్ఞాన మాశ్చర్యం జనయతీతి భావః.

ప్రారబ్ధకర్మవశముచేత నేనేమిజన్మము వచ్చినను రానిమ్ము కాని అన్ని జన్మములయందును నీపాదారవింద స్మరణముమాత్రము కలుగునట్లను గ్రహింపుము. అట్లయినఁ గదా చిత్తమును భవదాయత్తముఁ జేయఁగలుగుదును. అని ప్రార్థించుచున్నారు:—

నరత్వం దేవత్వం నగవనమృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాదిజననమ్,
సదా త్వత్పాదాబ్జస్మరణపరమానందలహరీ
విహారాసక్తం చే ద్ధృదయ మిహ కిం తేన వపుషా. 10

టీ. నరత్వం = మనుష్యుఁడుగాఁ గానీ, దేవత్వం = దేవుఁడుగాఁ గానీ, న...త్వం - నగ = పర్వతముగాఁ గానీ, వన = అడవిగాఁ గానీ, మృగత్వం = మృగముగాఁ గానీ, మశకతా = దోమగాఁ గానీ, పశుత్వం = పశువుగాఁ గానీ, కీటత్వం = పురుగుగాఁ గానీ, విహగత్వాది = పక్షులు మొదలగునవిగాఁ గానీ, జననం = పుట్టుక, భవతు = అగుఁగాక, హృదయం = మనస్సు, ఇహ = ఈపైజన్మములయందు, సదా = ఎల్లప్పుడు, త్వ...క్తం - త్వత్ = నీయొక్క, పాదాబ్జ = పాదపద్మములయొక్క, స్మరణ = స్మరించుట యనియెడు, పరమానంద = మహానందముయొక్క, లహరీ ప్రవాహమందలి, విహార = విహరించుటను, ఆసక్తం = ఆసక్తికలిగినది, భవతిచేత్ = అగునేని, తేన = ఆ, వపుషా = శరీరముచేత, కిం = ఏమిభంగము ?

తా. మనస్సు పరమేశ్వరస్మరణము గలదై శివానందలహరియందోలలాడుచున్నచో నేజన్మ మెత్తినను కొఱవ లేదని తాత్పర్యము.

అ. ప్రారబ్ధవశేన తరతమభావాపన్నాని బహూని జన్మాని భవిష్యంతి తత్ర చేతస్సమర్పణం కథం ఘటిష్యత ఇత్యాశంక్య తత్రాపి త్వత్పాదాబ్జస్మరణం ప్రార్థయతే.—

వ్యా. నరత్వమితి. విహగత్వాదిజననం ప్రారబ్ధకర్మ భవతు అస్తు నరత్వం నరభావః. దేవత్వాదీనాం పదానామర్థ్యేవమేవార్థః. హృదయం మమ చిత్తమిహనరాదిభావేషు సదాసర్వదాత్వత్పాదాబ్జస్మరణ పరమానందలహరీ విహారాసక్తం త్వత్పాదాబ్జస్మరణమేవ పరమానందః జన్యజనకయోరభేద వివక్షయాస్మరణస్యానందత్వరూపణం తస్యలహరీ ఆనందస్ఫూర్తి సాంతత్యంతత్రవిహారః ప్రవేశః తస్మిన్నాసక్తం భవతు ఏవంచేత్తేన వపుషా కిం కిమపి నవిహాన్యేత ఇతిభావః.

ఇ ట్లేజన్మమెత్తినను విఘాతము లేదని చెప్పి చిత్త మీశ్వరాయత్తముగాక వర్ణాశ్రమాది ధర్మము లెన్ని చేసినను నిష్ఫలమని చెప్పుచున్నారు.—

వటు ర్వా గేహీ వా యతి రపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చి ద్భవతు భవ కిం తేన భవతి,
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
తదీయ స్త్వం శంభో భవసి భవభారం చ వహసి. 11

టీ. నరః = మానవుఁడు, వటుర్వా = బ్రహ్మచారియైనను, గేహీ వా = గృహస్థైనను, యతిరపి = సన్న్యాసియైనను, జటీవా = జటాధారియైనను, తదితరః, యః, కశ్చిత్ = మఱియింకనెట్టివాఁడైనను, భవతు = కానిమ్ము, తేన = అందుచేత, హేభవ = ఓ యీశ్వరా? కిం భవతి = ఏమియగును. (ఏమియు కార్యము లేదు) పశుపతే = సకలభూతనాయకా? యదీయం = ఎవనిసంబంధమైన, హృత్పద్మం = హృదయకమలము, భవదధీనంయది = నీ యధీనమయినదిగానుండునో, తదీయః = వానిసంబంధుఁడవుగా, త్వం = నీవు, భవసి = అగుదువు, హేశంభో = ఓ శంకరా? భవభారంచ = వానిసంసారభారమును, వహసి = (నీవే)భరింతువు.

తా. ఏయేవర్ణములయందున్నను ఏయాశ్రమమందున్నను ఎన్నెన్ని జడలు పెంచుకొన్నను ఎంతవాఁడైనను సరే ఈశ్వరభక్తిలేనిదే లాభ మిసుమంతయు లేదు. హృదయపద్మమునందు నిన్ను ధ్యానించుచు మనస్సు నీయం దర్పించి భజించువానికి సంబంధివై వానిభారమంతయు నీపై వేసికొని కాపాడుదువు. ఈశ్వరాయత్త చిత్తుం డగువాఁడు చతుర్విధపురుషార్థములను బొంది జనన మరణ ప్రవాహమునుండి తొలఁగి పోవు నని తాత్పర్యము.

అ. ఉచ్చనీచజన్మభి స్స్వేష్టావిఘాతముక్త్వా హృదయస్య శివాధీనతా మంతరేణ రక్తదాశ్రమధర్మం ప్రాప్యాపి ఫలాభావ మాహ:—

వ్యా. వటుర్వేతి. వటుర్వా బ్రహ్మచారీవా గేహీవా గృహస్థోవా యతి రపి సన్న్యాసీవా జటీవా జటాధారీవా తదితరః తదన్యః యః కశ్చిద్వా నరః మర్త్యః భవతు భూయాత్ తేనకారణేన హేభవ శంభో కిం కీదృశం కార్యం భవతి న కిమపీత్యర్థః. హేపశుపతే సకలభూతాధినాయక యదీ

యం యత్సంబంధి హృత్పద్మం హృదయకమలం భవదధీనం యది త్వత్స్వాధీనం చేత్ తదీయః తత్సంబంధీత్వం భవాన్ భవసి అసి హేశంభో త్వం భవభారం చ సంసారభారం చ వహసి ధారయసి బ్రహ్మచర్యాద్యాశ్రమ చతుష్టయేఽపి జనః త్వయ్యర్పితమనాశ్చేత్తత్ఫలం లభతే నోచేన్నేత్యర్థః. యః పుమాన్ చిత్తం త్వదధీనం కరోతి తస్య చతుర్వర్గఫలం కరతలామలక మితి చ భవభారమిత్యనేన జననమరణప్రవాహరాహిత్యం భవతీతి చ మంతవ్యమ్.

ఇట్లు వర్ణాశ్రమాదులకన్న శివభక్తి యుత్తమం బనిచెప్పి పర్వత గుహాదులయందలి నివాసముకన్నను శివభక్తియే మే లని చెప్పుచున్నారు:—

గుహాయాం గేహే వా బహి రపి వనే వాద్రిశిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వస తేః కిం వద ఫలమ్,
సదా య స్యైవాంతఃకరణ మపి శంభో తవ పదే
స్థితం చేద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ.

టీ. గుహాయాం = కొండగుహయందో, గేహేవా = స్వగృహమందో, బహిరపి = బయట నెచ్చటనో, వనేవా = అడవియందో, అద్రిశిఖరే = పర్వతశిఖరమందో, జలేవా = నీటియందో, వహ్నౌవా = పంచాగ్ని మధ్యమందో, వసతు = నివసించుఁగాక, హేశంభో = సుఖకరుండవగు నోయీశ్వరుఁడా, వసతేః = అట్లు నివసించిన మాత్రమున, కిం ఫలం = ఏమిఫలమో, వద = చెప్పుము (ఏమియు ఫలములేదనుట), యస్య = అట్టివానియొక్క, అంతఃకరణమపి = మనస్సుగూడ, సదా = ఎల్లప్పుడును, తవ = నీయొక్క, పదేఏవ = పాదమందే, స్థితంచేత్ = నిలచియున్నచో, అసౌ = ఇట్లు నిలుచుటయే, యోగః = శివయోగము, సచ = అట్టివాఁడే, పరమయోగీ = నిర్వికల్పసమాధి గల పరమయోగియు, సచ = వాఁడే, సుఖీ = పరమానందము గలవాఁడు నగును.

తా. పర్వతగుహాలు అరణ్యములు మున్నగువానియందు నివాసము చేసినంతమాత్రమున ఫలమేమియులేదు. అంతఃకరణముఁగూడ నీశ్వరధ్యాన

మందుఁ జొన్పి తదేకనిష్ఠాగరిష్ఠుఁడై యున్న యో శివయోగి యై పరమానంద ముఁ బొందును.

అ. ఏవ మాశ్రమచతుష్టయ శివభక్త్యో శ్శివభక్తే రేవ వైశిష్ట్య ముక్త్వా శైలగుహాగ్నిజలవాసాదిభ్యః శివపదారవిందార్పిత నిర్మలాంతఃకరణస్య వైశిష్ట్యం సంపాదయ న్నాహ :—

వ్యా. గుహాయామితి. గుహాయాం గిరి గహ్వరే గేహేవా సద్మనివా బహిః బాహ్యప్రదేశేఽపి వనేవా అరణ్యేవా అద్రిశిఖరే పర్వతాగ్రేవా జలేవా సలిలేవా వహ్నౌవా పంచాగ్నిమధ్యేవా యః పురుషః వసతు వాసం కరోతు వసతేః నివాసాత్ కిం ఫలం కింప్రయోజనం ల్వాం ఇదం వద ఘన అంతఃకరణమపి యస్యపురుష స్యాంతరింద్రియం పూర్వోక్త స్థానవాస యుక్తం తదపి హేశంభో సదా సర్వదా తవ తే పదే చరణారవింద ఏవ స్థితం చేత్ అసౌ అయమేవయోగః శివయోగః సచపదారవిందే నిహితాంతః కరణః జనః పరమయోగీ నిర్వికల్పసమాధిమాన్ సచ సఏవపురుషః సుఖీ పరమానందభాగ్భవతీతి శేషః.

అట్టివాఁడను కాలేక యున్న నన్ను జ్ఞాన మొసఁగి రక్షించుట నీ భారమయి యున్నదని చెప్పుచున్నారు:—

అసారే సంసారే నిజభజనదూరే జడధియా
భ్రమంతం మా మంధం పరమకృపయా పాతుముచితమ్,
మదన్యః కో దీన స్తవ కృపణరక్షాతినిపుణః
త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే. 13

టీ. హేపశుపతే = ఆత్మజ్ఞానమును పరిపాలించువాఁడా, అజడ = జడములైన దేహాదులకన్న విలక్షణమైన, పరమ = ఓపరాత్పరా ! అసారే = సారములేనిదియు, నిజభజనదూరే = ఆత్మానుసంధానము దూరమైనదియునగు, సంసారే = సంసారమందు, భ్రమంతం = కొట్టుకొను చున్నట్టియు, అంధం = ఆత్మానాత్మవివేకములేమి గ్రుడ్డివాఁడనై నట్టియు,

మాం = నన్ను, కృపయా = దయతో, ధియా = స్వరూపజ్ఞానము నిచ్చుటచేత, పాతుం = రక్షించుటకు, ఉచితం = యుక్తము. దీనః = సంసారతాపముచేత దీనుడైన, మదన్యః = నాకంటె మఱియొకడు, తవ=నీకు, కః = ఎవడున్నాడు? కృపణరక్షాతినిపుణః = దీనులను సంరక్షించుట యందు మిక్కిలి నేర్పుగలవాడును, మే = నాకు (నన్ను), శరణ్యః = రక్షించదగినవాడు, త్వదన్యః = నీకంటె మఱియొకడు, త్రిజగతి = ముల్లోకములయందును, కః=ఎవడున్నాడు.

తా. దేవా! ముల్లోకములయందును దీనరక్షాపరాయణుండవు నీ వొక్కడవే కలవు. నేను సంసారసంతాపములను సైపలేక దీనుండనై నీవే దిక్కుగా నీపాలబడియున్నాను. నావంటిదీను లింకెందును గానరారు. కనుక దయచేసి ఆత్మజ్ఞాన మొసగి యీదీనుని సంసారతాపము నుండి కాచికొనుము.

అ. అనీదృశస్య మమ జ్ఞాన ప్రదానేన రక్షణవిధానం తవ యుక్తమిత్యాహ:—

వ్యా. అసారేతి. హేపశుపతే ఆత్మజ్ఞానపరిపాలక అజహే హేఽజహ దేహాదిభిన్న అతఏవ పరమ పరాత్పరత్వేన ప్రసిద్ధ అసారే నవిద్యతే సారస్సుఖవిశేషో యస్మిన్ తథోక్తే నిజభజనదూరే నిజస్యస్వస్వరూపస్య పరమేశ్వరస్య భజనమనుసంధానం దూరం విప్రకృష్టం యస్మిన్ తస్మిన్ సంసారే సమ్యక్సరతివిషయాననుధావత్యస్మిన్నితి సంసారః తస్మిన్ భ్రమంతం సారవతా భ్రమేణ చరంతం సారవత్తా భ్రమః కుత ఇత్యతాహ—అంధం ఆత్మానాత్మవివేకశూన్యం మాం కృపయా కరుణయా ధియా వివిక్తస్వరూపజ్ఞానప్రదానేన పాతుం రక్షితు ముచితం యుక్తం అజ్ఞాతనిజస్వరూపం మాం ప్రాప్తాత్మలాభం కుర్వితిభావః. సంసారతప్త శరణేన మాయా తాపాన్నివర్తనీయా. త్వదన్యే సంతి బహవః తన్నివర్త కాశ్చ మదన్యేఽపి సంతిమన్నిర్బంధేన తవ కిం ఫలమితిచేత్తత్రాహ— దీనః సంసారతాపతప్తః మత్తో మత్తః అన్యః తాపాన్నివర్తనీయ స్తవకోఽస్తి మాదృశో న కోఽపి స్యాదిత్యర్థా

నః. కృపణరక్షాతినిపుణః కృపణః ఆత్మానభిజ్ఞః తద్రక్షాయాం తదజ్ఞాననివ ర్తనే అతినిపుణః అతీవసమర్థః మే మమశరణ్యాః రక్షణార్హాః అత్రజగత్య స్మిన్ లోకే త్వదన్యః త్వత్తోభిన్నః కోవాస్తి.

వేదశాస్త్రముల నుల్లంఘించుటచేత నా యాజ్ఞమీఱితివి. కాన నీ వపరాధివి. నిన్నురక్షించుటయెట్లు? అందువేమో! నీ వాఁడను గనుక నా తప్పు క్షమించుము అనుచు బాంధవ్యమును జూపుచున్నారు.—

ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోఽహం తేషామపికిముత బంధుత్వ మనయోః,
త్వయైవ క్షంతవ్యా శివ మదపరాధా శ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః.

టీ. హేపశుపతే = ఓపరమేశ్వరా? త్వం = నీవు, ప్రభుః = దైన్యముఁబాపుటకు సమర్థుఁడవు (కనుకనే), దీనానాం=దీనులకు, పరమ బంధుఃఖలు = ముఖ్యబంధువుఁడవు గదా, అహం = నేను, తేషాం = ఆదీనులలో, ప్రముఖ్యః = మొట్టమొదటివాఁడను, అనయోః అపి = ఇట్టి మనకును, బంధుత్వం = చుట్టఱికము, కిముత = (ఉన్నదనివేఱే) చెప్పవలయునా, శివ = ఓ ఆనందస్వరూపుఁడా, సకలాః = సమస్త మైన, మదపరాధాః = నాతప్పులు, త్వయైవ = నీచేతనే, క్షంతవ్యాః = క్షమింపఁదగినవి, మదవనం = నారక్షణము, ప్రయత్నాత్ = ప్రయ త్నమువలన, కర్తవ్యం = చేయఁదగినది, ఇయం = ఇది, బంధుసరణిః= బంధుమర్యాద.

తా. మహాదేవా! నీవు దీనబంధువుఁడవు. నేను దీనుఁడను. ఇఁక మనకు బాంధవ్యము కలదని వేఱే చెప్ప నక్కఱలేదు గదా కాఁబట్టి నా తప్పులన్నియు మన్నించి తప్పక నన్ను నీవే కరుణించి రక్షించవలసి యు న్నది. ఇదియే గదా బంధువుల పద్ధతి.

అ. శ్రుత్యాద్యుల్లంఘనరూపేణ మదాజ్ఞాభంగే నాపరాధినం త్వాం

కథం రక్షేయ మహ మితిచేద్బంధుత్వా న్మమాపరాధ స్సోఢవ్య ఇతి వదన్ బంధుతా ముపపాదయతి.

వ్యా. ప్రభుస్త్వమితి. హేపశుపతే త్వం ప్రభుః దీనభావనివర్తన సమర్థః అతఏవ దీనానాం పరమబంధుఃఖలు ఆపన్నివర్తకః ఖల్వితి ప్రసిద్ధౌ తేషాందీనానామహంప్రముఖ్యః అగ్రగణ్యః ఏవంచసతి అనయోరానయో రపి బంధుత్వమస్తి కిముత వక్తవ్యంకిం హేశివ ఆనందరూప సకలాస్స ర్వే మదపరాధాః ఆజ్ఞోల్లంఘనరూపాణి త్వదనిష్టా చరణా న్యాగాంసి క్షంత వ్యాః క్షమితుం యోగ్యాః మదవనం మద్రక్షణం ప్రయత్నాత్ సర్వథాకాయ మనోవ్యాపారాత్కర్తవ్యం కర్తుం యోగ్యం|ఇయం ఇయమేవ బంధుసరణిః బంధూనాం పంథాః అతో బంధుత్వాద్ధేతోః మదపరాధం సర్వం సోఢ్వా త్వయాఽహం సంరక్షణీయ ఇతి భావః.

ఈశ్వరుఁడు తన్నుపేక్షించునేమోనని యట్లు కాకుండఁ జెప్పు చున్నారు.—

ఉపేక్షా నో చేత్కిం న హరసి భవద్ధ్యానవిముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్,
శిర స్తద్వైధాత్రం ననఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కరనఖముఖే నైవ లులితమ్. 15

టీ. పశుపతే = సర్వలోకాధీశ్వరా, ఉపేక్షానోచేత్ = (నన్ను రక్షించుటయందు నీకుపేక్షకలదేమో) అట్లుపేక్ష లేనిచో, దురాశాభూ యిష్ఠాం = దుష్టములైన తలంపులతో నిండినదియు, భవద్ధ్యానవిముఖాం= నీధ్యానమునుండి పరాఙ్ముఖమైనదియు, విధిలిపిం = (నాముఖమునిూఁది) బ్రహ్మవ్రాఁతను, కింనహరసి=ఎందుకు తుడిచివేయవు, భవాన్ = నీవు, అశక్తోయది = అశక్తుఁడవేని, ననఖలు = గోటితోఁ గ్రుంచ నలవిగాని, తత్ = ఆ, సువృత్తం = మిక్కిలి దృఢమైన, వైధాత్రం = బ్రహ్మ సంబంధమైన, శిరః = ఐదవ శిరస్సును, నిర్యత్నం = ప్రయత్నమక్కఱ

లేకుండ, కరనఖము ఖే నైవ=చేతిగోటికొనచేతనే, కథంవా=ఎట్లు, లులితం = త్రుంచివేయఁబడినది?

తా. సాంబశివా! దురిచ్ఛలకును నిన్ను ధ్యానించుటయందు దాసక్తి లేమికిని సూచకముగా నానుదుట బ్రహ్మ వ్రాసిన వ్రాఁత నుపేక్షించక తుడిచి వేయుము. నాచేతఁగాదని తప్పించుకొనుటకు వీలుగాదు. ఆబ్రహ్మదేవుని యైదవతలను గోటితోనే త్రుంచితివి గదా.

అ. స్వస్మిన్ ఈశ్వర స్యోపేక్షా మా శంక్య తత్పరిహారా యాహ—

వ్యా. ఉపేక్షేతి. హేపశుపతే మదవనే త వోపేక్షా భవతీతిప్రత్యేమి ఏవంనోచేత్ దురాశాభూయిష్ఠాం దుష్టేషు విషయేషు ఆశా ఇచ్ఛాతయా భూయిష్ఠాం తత్ప్రచురాంతదభివ్యంజికామితిభావః. అతఏవభవద్ధ్యానవిముఖాం భవతో ధ్యానం విజాతీయ ప్రత్యయానంతరితసజాతీయ ప్రత్యయ ప్రవాహఃతస్మాద్విముఖాంతదనభివ్యంజికామితిభావః. విధిలిపింబ్రహ్మణః లిపిం రేఖారూపాంలలాటలిపింకిమితి నహరసి నమార్జయసి తత్రాహ మశక్త ఇతి యదిబ్రూయాస్తే భవాన్ తత్ప్రసిద్ధం నవఖునఖేనలవితుంఛేత్తుం యోగ్యంనఖు తన్న భవతీతి నఖు తత్కుతయిత్యత్రాహ— సువృత్తం సుతరాంవృత్తిమత్ దృఢస్థిమత్ వైధాత్రం విధాతృసంబంధి శిరః పంచమముత్తమాంగం నిర్యత్నం యథాభవతి తథా త్వయా కరనఖముఖేనైవ హస్తనఖాగ్రేణైవ కథంవా లులితం కేన ప్రకారేణ ఛిన్నం సర్వకర్తృత్వసమర్థత్వాన్మదుపేక్షాపరిహరణీయేతి భావః. వాశబ్దః ప్రశ్నే.

భక్తుఁడు దీనసంరక్షకుఁడ వగునీకటాక్షమునకుఁ బాత్రుఁ డగుటకుఁగా బ్రహ్మదేవుఁడు వానినుదుట దైన్యరేఖలు వ్రాయుచున్నాఁడు. పాపమాతని యైదవతలఁ ద్రుంచినాఁడవు. కానిమ్ము దానితోపాటు తక్కిన నాలుగుతలలను మాత్రము ఛేదింపకుము. ఇంక దీర్ఘాయుష్మంతునిగా నుండ నిమ్మని వేఁడుకొను చున్నారు.—

విరించి ర్దీర్ఘాయు ర్భవతు భవతా తత్పరశిర
శ్చతుష్కం సంరక్ష్యం స ఖలు భువి దైన్యం లిఖితవాన్,

విచారః కో వా మాం విశదకృపయా పాతి శివ తే
కటాక్షవ్యాపారః స్వయ మపి చ దీనావనపరః. 16

టీ. విశద = నిర్మలస్వరూపుఁడవైన, శివ = సదాశివుఁడా, విరించిః = బ్రహ్మదేవుఁడు, దీర్ఘాయుః = చిరకాలజీవి, భవతు = అగుఁగాక, భవతా = నీచేత, తత్పరశిరశ్చతుష్కం = ఐదవదిగాక తక్కిననాలుగు తలలు, సంరక్ష్యం = రక్షింపఁదగినది, సః = ఆబ్రహ్మ, భువి = భూలోకమందు, దైన్యం = దీనభావమును, లిఖితవాన్ ఖలు = (లలాటమునఁ) వ్రాసెను గదా, దీనావనపరః = దీనరక్షణమునందాసక్తి గల, తే = నీ యొక్క, కటాక్షవ్యాపారః = కటాక్షప్రసారము, స్వయమపి = తనంతటతానే, కృపయా = దయతో, పాతి = రక్షించుచున్నది, విచారః = (దైన్యమును వ్రాయుటవలని) విచారము, కోవా = ఏమున్నది. (ఏమియు లేదనుట).

తా. ఓసదాశివా! బ్రహ్మదేవుఁడు మాలలాటమున దైన్యము వ్రాయుచున్నాఁడు. అది మా కుపకారకముగా నున్నదిగాని విచారకరము కాదు కాఁబట్టియే కదా దీనపోషకమగు మీకటాక్షమునకు పాత్రులమగుచున్నాము అయినదేమో అయిపోయినది. పోనిమ్ము. ఇఁక నాతని నాల్గు తలలు మాత్రము ఛేదింపకుము. ఆబ్రహ్మదేవుఁడు దీర్ఘాయుష్మంతుఁడై యుండుఁగాక.

అ. భక్తస్య దీనసంరక్షణ తత్పరమశివకటాక్ష విషయతాయాః స్వం పాదనేన పరమోపకారకే దైన్యలేఖనే అధికృతస్య బ్రహ్మణః పంచమశిరశ్ఛేదనప్రసక్తతదన్యశిరశ్చతుష్కచ్ఛేదనాకరణంతత్ప్రియుక్తి దీర్ఘాయుష్ట్వం చ ప్రార్థయతే—

వ్యా. పద్యస్య పూర్వార్ధేన దైన్యలేఖనస్య విచారహేతుత్వాభావస్య స్వోపకారకత్వం కథ మితిచే దుత్తరార్ధేన తద్విశదీకరోతి. విరించిరితి. హే విశద నిర్మలస్వరూప శివ ఆనందరూప విరించిః విధాతా దీర్ఘాయుః దీర్ఘజీవీ భవతు అస్తు భవతా త్వయా తత్పరశిరశ్చతుష్కం తస్మాత్పంచమ

శిరసోఽన్యత్ శిరసాంచతుష్కంసంరక్షం ... తేతిభావః. ప్రార్థనాకుతఇతిచేత్తత్రాహ— ... దీనభావంలిఖితవాన్ ఖలులలాటే లిలేఖ ఖల్వితిప్రసిద్ధా యస్మాద్దేవం తస్మా త్ప్రార్థనాయుక్తేతిభావః తద్దైన్యలేఖనస్యతన్మంగళప్రార్థనాహేతుత్వంకథ మితిచేద్యస్మా ద్దీనావనపరః తేతవకటాక్షవ్యాపారఃమాంపాతిరక్షతితస్మా న్మంగళప్రార్థనాహేతుత్వమితిభావః. ఏవంచసతి దైన్యలేఖనస్య విచార హేతుత్వమపినాస్తిలాభహేతుత్వాదితిభావః. త్వమినవతవకటాక్షవ్యాపా రోఽపి స్వయమపిమాంపాతీతిహేతోః దైన్యలేఖనప్రయుక్తవిచారో న కర్తవ్య ఇతి భావః.

దేవా నీపాదారవింద దర్శనముగానిదే యెనుదుగా నీకటాక్షప్రసా దము నాపైఁ గలుగ నేరదు. అదియును ప్రతిబంధక సామగ్రివలన దుర్లభ ముగా నున్నదని చెప్పుచున్నారు.—

ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేఽపి స్వామిన్ భవదమలపాదాబ్జయుగళమ్,
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణి ర్నిజకనకమాణిక్యమకుటైః. 17

టీ. విభో = ఓసర్వవ్యాపకుఁడవైన, స్వామిన్ = పరమేశ్వరా, మయి = నాయొక్క, పుణ్యానాం=సుకృతములయొక్క, ఫలాద్వా= ఫలమువలననో, మయి = నాయందు, కరుణయావా = దయచేతనో, త్వయి=నీవు, ప్రసన్నేఽపి=ప్రసన్నుఁడవైన, భవదమలపాదాబ్జయుగ ళం = నిర్మలమైన నీపాదపద్మములను, కథం = ఎట్లు, పశ్యేయం = చూతును, నమస్సంభ్రమజుషాం = నమస్కారము చేయుటయందు తొందర పడుచున్న, నిలింపానాం = దేవతలయొక్క, శ్రేణిః = సమూహము, నిజ కనకమాణిక్యమకుటైః=తమతమ రత్నాలు చెక్కిన బంగారు కిరీటముల తో, మాం = నన్ను, స్థగయతి = అడ్డగించుచున్నది.

తా. సర్వవ్యాపకుండవైన ఓస్వామీ? నాపుణ్యమువలననో నీదయా చేతనో నీవనుగ్రహించిన ననుగ్రహింతువుగాని నీపాదదర్శన మగుటయెట్లు? దేవతలందఱును గుంపులు గుంపులుగాఁగూడి నేను నేను నేనని నమస్కరించుటకు సంతోషముతో తొందరపడుచు వారిరత్నాల కిరీటముల మీ పాదములయందు మోపుచు నా కడ్డమగుచున్నారు.

అ. త్వత్కటాక్షపతనమాభిముఖ్యేన వినా త్వత్పాదారవిందదర్శనం న ఘటిష్యతే తచ్చ దర్శనం విఘటకసామగ్రీబలాద్దుర్లభ మిత్యాహ:—

వ్యా. ఫలాద్వేతి. హేవిభో హేసర్వవ్యాపకమ మేత్యధ్యాహారః. పుణ్యానాంసుకృతానాం ఫలాద్వాకరుణయా వాకృపయావా హేస్వామిన్ సకలదేవతాసార్వభౌమ్య మయి మయివిషయే త్వయి భవతి ప్రసన్నేసత్యపి ప్రత్యక్షతఃప్రసాదాభిముఖేసత్యపి భవదమలపాదాబ్జయుగళం భవతః తవ అమలంస్వచ్ఛంశుద్ధసత్త్వరూపమిత్యర్థః. పాదాబ్జే పాదావబ్జేఇవేత్యుపమిత సమాసః. తయోర్యుగళం ద్వంద్వం త్వచ్చరణారవిందయుగళమిత్యర్థః. అహంకథంపశ్యేయమీక్షేయం నమస్సంభ్రమజుషాంనమసి నమస్కారే సంభ్రమః ఐదంపర్యం తజ్జుషాం తద్భాజాం నిలింపానాం సురాణాం శ్రేణిః పరంపరా నిజకనక మాణిక్యమకుటైఃమాణిక్యైః రత్నవిశేషైః ఖచితా నీతిమధ్యమ పదలోపః కనకాని కనకవికారాణిచతాని మాణిక్య ఖచితానిచ నిజాని స్వకీయానిచ తాని కనకమాణిక్య మకుటానిచ నిజకనకమాణిక్యమకుటాని తైః మాం స్థగయత్యంతర్హితం కరోతి హేదేవ మమతవసాక్షాత్కారఃకథంభవేత్.

మోక్ష దాయకుఁ డగు నొక్క పరశివుఁడియే హృదయగ్రంథి వీడ వలయునని కోరుచున్నారు:—

త్వ మేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
మహంత స్త్వన్మూలాం పున రపి భజంతే హరిముఖాః,
కియ ద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా. 18

టీ. హేశివ = సుఖస్వరూపుఁడవైన యీశ్వరుఁడా, లోకానాం = జనులకు, పరమఫలదః = మోక్షఫలము నిచ్చువాఁడవు, త్వం = నీవు, ఏకః = ఒక్కఁడవే, హరిముఖాః = విష్ణువు మొదలగువారు, త్వన్మూలాం = నీవే కారణముగాఁ గలిగిన (నీవొసంగిన), దివ్యపదవీం = వైకుంఠము మొదలగు దివ్యస్థానమును, వహంతః = పొందుచున్నవారై, పునరపి = మరల (ఉత్తమఫలప్రాప్తికై), భజంతే = (నిన్నే) సేవించుచున్నారు, తవ = నీయొక్క, దాక్షిణ్యం = భక్తాభిప్రాయానుసరణము, కియద్వా = ఎంత పరిమాణముకలది' (పరిమితిలేనిదనుట), మదాశాచ = నాయొక్క ఆశయు, కియతీ = ఎంతటిది? (ఇంతయని యెఱుఁగననుట), మద్రక్షాం-మత్ = అహంకారముండి, రక్షాం = నాసంరక్షణమును, కరుణాపూరితదృశా = సంపూర్ణకటాక్ష వీక్షణముతో, కదా = ఎన్నఁడు, వహసి = చేయుదువు.

తా. ఆనందస్వరూపుండవైన ఓమహాదేవా, మోక్షమిచ్చు మహానుభావుఁడవు నీవొక్కఁడవే. విష్ణ్వాదులు నీదయచేతనే వైకుంఠ వాసులైరి. అయ్యును తనివి నొందక నీవలన నున్నత పదవులను గోరుచు సేయుదురు. ఆహా భక్తులమీఁద నీకెంతదయ? నాయాశ యెంత యని చెప్పుదు. సాంబశివా సంపూర్ణకటాక్షము గలిగి అహంభావమును బాపి నన్ను రక్షించుము.

అ. ఏకస్మాన్మోక్షప్రదాత్పరమశివాదాత్మనః హృదయగ్రంథినివృత్తిం ప్రార్థయతే.—

వ్యా. త్వమితి. హేశివ సుఖస్వరూప లోకానాం జనానాం పరమఫలదః పరమం అభ్యర్థితం త్రిభ్యఃపురుషార్థేభ్యోఽభ్యర్థితం ఫలంసాలోక్యాదికమిత్యర్థః. తద్దదాతీతి పరమఫలదః తాదృశస్త్వమేకః కుతఇతిచేత్ హరిముఖాః హరిఃవిష్ణుః సఏవ ముఖం ప్రథమః యేషాం తే దేవాః త్వన్మూలాం త్వమేవ మూలం కారణంయస్యాస్తాం దివ్యపదవీం అమానుషం వైకుంఠాదిస్థానంవహంతఃప్రాప్నువంతస్సంతస్తత్రతృప్తిమలబ్ధ్వాతతోఽభ్యర్థితఫలప్రాప్తయేత్వామేవ భజంతే సేవంతే యతః తస్మాదిత్యర్థః. తవతేదాక్షి

ణ్యం భక్తాభిప్రాయానువర్తనం కియత్ కిం ప్రమాణం ప్రమాణశూన్యమిత్యర్థః. మదాశాచమమాపేక్షా కియతీ కియత్ప్రమాణా ఏతావదితి న జానన్ ఇతి భావః. మత్ అహంకారాత్ రక్షాం మామికాం రక్షాం కరుణాపూరితదృశా పూర్ణకటాక్షనిరీక్షణేన కదా వహసి కరోషి ధాతూనామనేకార్థత్వాద్వహధాతోః కృఞర్థత్వం వక్తుముచితం మమహృదయగ్రంథిం ఛింధీతి ముఖ్యభావః.

తన్ను భజించువాఁడని యీశ్వరుఁడు బ్రహ్మ కొనర్చిన యుపకృతిం బరికించి యీశ్వరభజన చేయుటచేఁ దాము నకృతార్థులమైతి మని నిశ్చయించుచున్నారు.—

దురాశాభూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే
దురంతే సంసారే దురితనిలయే దుఃఖజనకే,
మదాయాసం కిం న వ్యపనయసి క స్యోపకృతయే
వదేయం ప్రీతి శ్చే త్తవ శివ కృతార్థాః ఖలు వయమ్.

టీ. దురాశాభూయిష్ఠే=దుష్టవిషయములయందలి యాశచే మిక్కుటమైనదియు, దురధిపగృహద్వారఘటకే=దుష్టప్రభువుల మందిరద్వారములకుఁ జేర్చునదియు, దురంతే = దురవసానముగలదియు, దురితనిలయే = పాపముల కునికిపట్టును, దుఃఖజనకే=దుఃఖహేతువునైన, సంసారే=జనన మరణప్రవాహరూపమైన సంసారమందు, మదాయాసం=నాపరిశ్రమమును, కస్య=బ్రహ్మదేవునియొక్క, ఉపకృతయే = ఉపకారము కొఱకు, నవ్యపనయసికిం=పోఁగొట్టకుంటివాయేమి? వద = చెప్పుము, ఇయం=ఈ (భక్తుల యుపకారమును గుఱించిన), ప్రీతిః=ప్రేమ, తవ=నీకు, చేత్=కలిగియున్నచో, వయమపి=(నిన్ను భజించుచున్న వారమైన) మేమును, కృతార్థాఃఖలు= కృతార్థులమే గదా.

తా. మృత్యుంజయా! దురాశలచేత దుష్టప్రభువుల గృహద్వారములయందుఁ బడి కొట్టుకొనుచు పలుదుఃఖముల పాలుగావలసిన తుదిలేని సంసారమందలి నాపరిశ్రమల నేల నశింపఁజేయవు? నీ భక్తుఁడుగా నున్న.

బ్రహ్మదేవుని మీఁది వాత్సల్యముచేత నాతని చేఁతలు చెఱుపనొల్లమిఁ గాఁబోలు. సరే నీవు భక్తవత్సలుఁడవై నప్పుడు మాకేమి లోపము? నిన్ను భజించి నేనును కృతార్థుఁడ నగుదుఁ గదా!

అ. పూర్వస్మిన్ పద్యే హరిముఖాస్త్వాం భజంత ఇత్యుక్తం భజమానాయ బ్రహ్మణే ఈశ్వరేణ క్రియమాణా ముపకృతిం పర్యాలోచ్య భజమానస్యాత్మనోఽపి కృతార్థతాం నిశ్చినోతి:—

వ్యా. దురాశేతి. దూరాశాభూయిష్ఠే నిందితవిషయేషు ఆశా ప్రవృత్తిః తయా భూయిష్ఠే బహులే అతఏవ దురధిపగృహద్వార ఘటకే దురధిపాః దుష్టనృపతయః తేషాం గృహాణి మందిరాణి తేషాం ద్వారాణి ప్రవేశమార్గాః తాని ఘటయతీతి తద్ఘటకః తస్మిన్ దురంతే దుర్లభః అంతః అవసానం యస్య తస్మిన్ దురితనిలయే దురితానాం పాపానాం నిలయే స్థానే అతఏవ దుఃఖోత్పాదకే సంసారే జననమరణాది ప్రవాహరూపే మదాయాసం మమ పరిభ్రమణరూపం ప్రయత్నం త్వద్విధేయస్య బ్రహ్మణః ఉపకృతయే తచ్ఛిక్షితానుల్లంఘనరూపాయై న వ్యపనయసి కిం నాపనుదసి కిం కిమితి ప్రశ్నే, వద బ్రూహి ఇత్థమేవేతి చేత్తత్రాహ—ఇయం భక్తోపకరణవిషయికా ప్రీతిః ప్రేమా హే శివ తవ సిద్ధా చేత్ భజమానాః వయమపి కృతార్థాః లబ్ధప్రయోజనాః భవిష్యామః ఖల్వితి నిశ్చయే. ఏకత్వే వివక్షితేఽప్యస్మదో ద్వయోశ్చేతి వికల్పేన బహువచన మహం కృతార్థో భవిష్యామీతి పర్యవసితోఽర్థః.

ఇట్లీశ్వరప్రీతిని గోరికొని యిఁకఁ జాంచల్యము దొలఁగించి నా చిత్తమును నీ యధీనము జేయు మని వేఁడుకొనుచున్నారు.—

సదా మోహాటవ్యాంచరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖా స్వటతి ఝుడితి స్వైర మభితః,
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో. 20

టీ. కపాలిన్ = బ్రహ్మకపాలము ధరించినవాఁడవును, విభో = సర్వవ్యాపకుఁడవును, శివ= ఆనందస్వరూపుఁడవును, భిక్షో=ఆదిభిక్షుఁడవు నగునోదేవా, సదా = ఎల్లప్పుడును, మోహాటవ్యాం=సంసారవాంఛయను మహారణ్యమందు, చరతి = సంచరించుచున్నది, యువతీనాం = జవ్వనుల యొక్క, కుచగిరౌ = స్తనములనియెడు పర్వతమందు, నటతి= ఆటలాడు చున్నది, ఆశాశాఖాసు = దారపుత్రాదులయందలి ప్రేమయను కొమ్మల యందు, అటతి = దుముకులాడుచున్నది, ఝుడితి=శీఘ్రముగా, అభితః= నలువంకలను, ఆటతి = పరుగులిడుచున్నది, అత్యంతచపలం = మిక్కిలి చంచలమైన, మే=నాయొక్క, హృదయకపిం=మనస్సనియెడు కోఁతిని, దృఢం = గట్టిగా, భక్త్యా = భక్తియనెడు త్రాటితో, బద్ధ్వా = కట్టి, భవదధీనం = నీ వశముగా, కురు = చేసికొనుము.

తా. కోఁతివలె సంసారారణ్యమందు చంచలముగాఁ దిరుగుచున్న నా చిత్తమును భక్తి యను గట్టిత్రాటితో బిగియఁగట్టి నీ స్వాధీనపఱచు కొనుము. నా చిత్తమునకు త్వదేకశరణ మైన భక్తి ననుగ్రహింపు మని భావము.

అ. ఏవ మీశ్వరప్రీతిం సంప్రార్థ్య మమ చిత్తచాపల్యం పరిహృత్య మచ్చిత్తం త్వదధీనం కురుష్వేతి ప్రార్థయ న్నాహ:—

వ్యా. సదామోహేతి. భోవిభోసర్వవ్యాపక భోశివ సుఖస్వరూప భోకపాలిన్ కపాలమస్యాస్తీతి తస్యసంబుద్ధిః భోభిక్షో హృదయకపిః సదా సర్వదా మోహాటవ్యాంమోహః సంసారేచ్ఛా సఏవాటవీ అరణ్యాం తస్యాం చరతిసంచరతియువతీనాం నారీణాంకుచగిరౌ స్తనపర్వతేకుచావేవగిరిః తస్మిన్ నటతినృత్యంకరోతి ఆశాశాఖాసు ఆశాఏవపుత్రదారాదిషు ప్రేమాణః తా ఏవశాఖాః విటపాః తాస్వటతి సంచరతి ఝుడితి శీఘ్రం అభితః ఇతస్తతః స్వైరం స్వేచ్ఛావిహారం యథాతథా అటతి సంచరతి అత్యంతంచపలమచ పలం మే మమ హృదయకపిం హృదయమేవ కపిరితి రూపకం తం చిత్త వానరం దృఢం నితాంతం భక్త్యాఖ్యయా రజ్జ్వాబధ్వాచేష్టారహితం కృత్వా

భవదధీనం త్వద్వశం కురు కురుష్వ సంసారనిమగ్నం మచ్చిత్తం సదాత్వదేక శరణం కుర్వితి తాత్పర్యమ్.

ఇట్లు మనస్సు నీశ్వరాయత్తముజేసి యింక దానిని కుటీరముగాఁ జెప్పి యందు నివసింపు మని యీశ్వరుని వేఁడుకొనుచున్నారు.—

ధృతిస్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివససన్మార్గఘటితామ్,
స్మరారే మచ్చేత స్స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిఞ్ శక్త్యా సహ శివగణై స్సేవిత విభో. 21

టీ. హేస్మరారే=కామునికి శత్రువయినవాఁడా, భోస్వామిఞ్= సకలలోకములను వశపఱచుకొనినవాఁడా, గణైః= స్వరూపమును విమర్శించెడు గణములచేత, సేవిత = ధ్యానింపఁ బడువాఁడా, హేవిభో = ఓ సర్వవ్యాపకుఁడా, హేశివ=అఖండానంద స్వరూపుఁడవగు పరమేశ్వరా, ధృ...రాం - ధృతి = ధైర్యమనియెడు, స్తంభ=నిట్రాడు, ఆధారాం= ఆధారముగాఁగలదియు, దృ...ద్ధాం - దృఢ = దృఢమైన, గుణ = త్రిగుణకార్యములగు దేహాదులనియెడు త్రాళ్లతో, నిబద్ధాం = నిలుపఁ బడినదియు, సగమనాం=ఎచ్చటికి కావలయునన్నను పోవునదియు, విచిత్రాం= విచిత్ర (వాసనలనియెడు) నానారంగులుగలదియు, పద్మాఢ్యాం = లక్ష్మీయుక్తమును, పద్మములవంటి చిత్తరువులతో నొప్పునదియు, ప్ర...తాం - ప్రతిదివస=ప్రతిదినమందును, సన్మార్గఘటితాం=బ్రహ్మవిచారమందు చేరిక గలదియు, రాజమార్గమందు మర్పఁ బడినదియు, విశదాం = నిర్మలమైనదియు, మ...టీమ్-మచ్చేతః=నాచిత్తమనియెడు, స్ఫుటపటకుటీం = స్ఫుటమైన డేరాను, ప్రాప్య = పొంది (ప్రవేశించి), శక్త్యాసహ=పార్వతీదేవితోఁగూడ, జయ = సర్వోత్కర్షతో నుండుము.

తా. కామజయము గలిగి సర్వస్వతంత్రుఁడవును సర్వవ్యాపకుఁడవును పరమానంద స్వరూపుఁడవును నగు నోపార్వతీ వల్లభా? నాచిత్త మి

పుడొక గుడారముగానున్నది. అదియెట్లన, గుడారమొక నిట్రాటికొయ్యపై నిలచి యుండును, నాచిత్తకుటీరము విషయనిత్యత్వావధారణమనియెడునిట్రాటిపై నిలిచియున్నది. గుడారము త్రాళ్లతో బిగియఁగట్టి నిలుపఁబడును. చిత్తమును సత్త్వరజస్తమోగుణములవలన జనించిన దేహాంగములతో నిలుపఁబడియున్నది. గుడారమెక్కడకు కావలయునన్నను దీసికొని పోవచ్చును. చిత్తమచ్చటచ్చటకుఁ బోవుచుండును గదా! గుడారమనేక రంగులును పద్మములవంటి చిత్రములును గలిగి మంచి మంచి రాజమార్గములయం దమర్పఁబడియుండును. నాచిత్తము నానావిధములగుజన్మాంతరదుర్వాసనలతోఁ గూడి నిరతము సంపదను గోరుచున్నది మఱియు బ్రహ్మవిచారమునందు ఘటింపఁబడియున్నది. ఇట్టి నాచిత్తకుటీరమందు శక్తిసమేతుండవై నివసించి యుండుము.

అ. ఏవం చిత్తస్య తదధీనతాం సంప్రార్థ్య ఇదానీం చేతసః కుటీత్వనిరూపణేన తత్ర తద్వాసం ప్రార్థయతే :—

వ్యా. ధృతిస్తంభేతి. హేస్మరారే కామశత్రో అనేన జితసర్వవిషయత్వం శివస్య సూచ్యతే భోస్వామిన్ వశీకృతసకలభువన గణైస్సేవితగణైస్స్వరూపం విమృద్భిః సేవితధ్యాత భో విభో సర్వవ్యాప్యస్థిత భో శివ అఖండానందస్వరూప పరమేశ్వర ధృతిస్తంభాధారాం ధృతిః విషయ నిత్యత్వావధారణం సైవ స్తంభః కుటీస్థిత్యాధారభూత మధ్యప్రదేశస్థదారువిశేషః స ఏవ ఆధారం ఆలంబనం యస్యాస్తాం దృఢగుణనిబద్ధాం దృఢైర్బలవద్భిః గుణైః గుణకార్యభూతైః దేహాదిభిః నిబద్ధాం స్థాపితాం అన్యత్ర గుణైః రజ్జుభిః నిబద్ధా మాకృష్య క్లిప్తాం సగమనాం దేశాంతరగమన సహితాం విచిత్రాం వివిధదుర్వాసనా వాసితా మన్యత్ర నానావర్ణాం పద్మాఢ్యాం పద్మయా లక్ష్మీప్రార్థనయా ఆఢ్యాం పూర్ణా మన్యత్ర పద్మాకారచిత్రయుక్తాం ప్రతిదివససన్మార్గఘటితాం ప్రతిదివసం దినసే దివసే సతో బ్రహ్మణః మార్గే అన్వేషణే ఘటితాం యోజితా మన్యత్ర సన్మార్గే రాజమార్గసమీపే. ఘటితాం కల్పితాం విశదాం నిర్మలాం మచ్చేతస్స్ఫుటపటకుటీం

మశ్చైతదేవ స్ఫుటపటకుటీమభివ్యక్తపటగృహం ప్రాప్యానుప్రవిశ్య జయ సర్వోత్కర్షేణవర్తస్వ పంచకోశాతిరేకేణ ప్రకాశస్వేతి భావః. ఆద్యైః పంచభిర్విశేషణైః స్వధర్మసహితం చిత్తస్వరూపం పటకుటీచ ప్రతిపాద్యతే షష్ఠేన విశేషణేన బ్రహ్మాన్వేషణే చిత్తస్య యోజితత్వం విశదమిత్యేత త్తైకరూప్యేణ చిత్తపటకుట్యో రుభయత్రాన్వేతి. స్మరారే ఇత్యనేన శివస్య జితకామత్వం బోధ్యతే స్వామి న్నిత్యనేన సర్వస్వాతంత్ర్యం విభో ఇత్య నేన వ్యాపకస్వరూపతా శివే త్యనే నానందరూపతా అతో హేతోః పూర్వోక్తప్రకారేణ పరమశివప్రార్థనా యుజ్యతే చిత్తపక్షే సర్వాణి విశే షణాని లింగపరిణామేన యోజనీయాని.

ప్రయత్నపూర్వకముగా బ్రహ్మవిచారణయందుఁ జొనుపఁబడియు దొంగవలె లోభమున ధనాకర్షణాసక్తమైన చిత్తము నోర్వక పట్టి దాని తప్పఁ బోఁగొట్టుమని ఈశ్వరుని కిప్పగించుచున్నారు.—

ప్రలోభాద్యై రర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్త స్సన్ భ్రమతి బహుధా తస్కరపతే,
ఇమం చేతశ్చోరం కథ మిహ సహే శంకర విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్.22

టీ. హేతస్కరపతే=చోరులకు ప్రభువైనవాఁడా, హేశంకర= భక్తులకు సుఖముగలుగఁజేయువాఁడా, హేవిభో=ఓమహాప్రభో, ప్రలో భాద్యైః=వశీకరణము మొదలగు నుపాయములచేత, అ...త్రః - అర్థా హరణ=ధనాకర్షణమందు, పరతంత్రః=ఆసక్తిగలవాఁడై, చేతశ్చోరః=చిత్త మనియెడు దొంగ, ధనిగృహే=ధనవంతుని యింటియందు, ప్రవేశోద్యుక్త స్సన్=ప్రవేశింప నుద్యుక్తుఁడగుచు, బహుధా=అనేకవిధములుగా, భ్రమతి =తిరుగుచున్నాఁడు, ఇమం=ఈ, చేతశ్చోరం=చిత్తమనియెడు దొంగను, కథం=ఎట్లుగా, సహే=సహింతును, ఇహ=ఇప్పుడు, తవ, అధీనం, కృ త్వా = నీవశము జేసికొని, నిరపరాధే = అపరాధములేనట్టి, మయి=నా యందు, కృపాం=దయను, కురు=చేయుము. (దొంగను పట్టుట పక్కా—

దొంగవలననే నెఱవేఱవలెను. కావున నా చిత్తచోరుని గడిదొంగనగు నీవే పట్టవలెననియు, దొంగ దొంగలజట్టులోనే యుండవలెగాన నీవే యుంచు కొమ్మనియుఁ జిత్రితము. దొంగను మంచిజేసికొనినచో దొంగలభయము లేదు.)

తా. లేనిపోని కల్లబొల్లిమాటలు చెప్పి ధనికులచిత్తమును వశపఱచు కొనుట మున్నగాఁ గొన్ని దుష్టోపాయములు పన్ని ధనాకర్షణమునకుఁగా ధనవంతుల యిండ్లఁ దూఱుచు తిరుగులాడుచున్న యీనాచిత్తం బనుచోరుని నే నోర్వలేను. నీ కప్పగించెదను. నీ వశము జేసికొని నిరపరాధి నగునన్ను దయతో రక్షింపుము.

అ. ప్రయత్నవిశేషేణ బ్రహ్మాన్వేషణే ఘటిత మపి చోరవత్ప్రలోభాది నార్థాహరణ పరతంత్రం చిత్త మసహమానః తద్దోషపరిహారాయ తస్య శివాయత్తతాం ప్రార్థయతే :—

వ్యా. ప్రలోభేతి. భో తస్కరపతే తచ్చౌర్యం కుర్వంతీతి తస్కరాః తద్బృహతోరితి సుట్, తల్లోపశ్చ. తేషాం పతిః కర్మవిశేషణేన ప్రవర్తకో నివర్తకశ్చ తాదృశ శంకర భక్తసుఖదాయక భో విభో ప్రలోభాద్యైః ప్రలోభనం ధనికస్య మిథ్యాలాభ ప్రదర్శనేన తస్య మనోవశీకరణం తదే వాద్యం యేషాం తైః దురుపాయైః ధనికే ప్రమత్తే తదర్థగ్రహణాభిప్రాయః, ఋణరూపేణ ధనికదత్తస్య ధనస్య ప్రత్యర్పణావసరే తద్దానాపలాపః ఏవమాదయ ఉపాయాః బహువచనే నాకృష్యంతే. అర్థాహరణ పరతంత్రః అర్థం ధనం తస్యాహరణ మాకర్షణం తస్మిన్ పరతంత్రః ఆసక్తః తద్వ్యాపారే జాగరూక ఇత్యర్థః. అయం చేతశ్చోరః చేతశ్చిత్తమేవ చోరః తస్కరః సః ధనిగృహే ధన మస్యాస్తీతి ధనీ తస్య గృహం గేహం తస్మిన్ ప్రవేశోద్యుక్తస్సన్ ప్రవేశః అంతర్గృహగమనం తదర్థ ముద్యుక్తస్సన్ ఉద్యోగీసన్ ప్రయత్నం కుర్వన్నిత్యర్థః. బహుధా అనేకధా ప్రకారార్థే ధాల్. భ్రమతి భ్రామ్యతి ఇమ మేతాదృశపాపగుణవిశిష్టం చేతశ్చోరం చిత్తతస్కర మహ మిత్యధ్యాహార్యం. కథం సహే క్షమే ఇహేదానీం తవ తే అధీనం స్వవశం కృత్వా విధాయ నిరపరాధే నిర్గతః అపరాధః ఆగః యస్మాత్తస్మిన్ మయి మనోభిన్నత్వాత్తస్య నిరపరాధత్వ మితి భావః. కృపాం దయాం కురు కురుష్వ.

శివపూజకు ఫలమగు బ్రహ్మత్వ విష్ణుత్వములు గూడ దోషయుక్తములు గాన అవి వలదని నిర్దుష్టమైన మోక్షానందమును గోరుచున్నారు.—

కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
 విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫల మితి,
పున శ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా
 మదృష్ట్వా తత్ఖేదం కథ మిహ సహే శంకర విభో. 23

టీ. హేవిభో = ఓమహాదేవా! త్వత్పూజాం=నీయారాధనమును, కరోమి=చేయుచున్నాను, సపది=తత్క్షణమే, భోశంకర=ఓసుఖకరమైన వాఁడా, మే=నాకొఱకు, సుఖదః=నిత్యసుఖము నిచ్చువాఁడవు, భవ=అగుము, తస్యాః=ఆపూజకు, విధిత్వం=బ్రహ్మయగుట, విష్ణుత్వం=విష్ణువగుట, ఫల మితి = ఫలమని, దిశసిఖలు = ఇత్తువుగదా, పునశ్చ=మరలనిటుమీఁదను, దివి=ఆకాశమందును, భువిచ=భూమియందును, త్వాం=నిన్ను, ద్రష్టుం= చూచుటకు, పక్షిమృగతాం = హంసపక్షిరూపముగానీ వరాహరూపము గానీ, వహన్=ధరించుచు, అదృష్ట్వా=చూడలేక, తత్ఖేదం=పక్షిమృగ ములుగాఁ బుట్టుటవలని దుఃఖమును, కథం=ఎట్లుగా, సహే=సహింతును, విభో = మహాప్రభో.

తా. ఓసాంబశివా! నిన్నారాధింతును. నాకు పూజాఫలముగా మోక్షానంద మొసంగుము. కాని బ్రహ్మత్వమో విష్ణుత్వమో దానికి ఫలముని మాత్ర మీయవద్దు. అక్కడనుండి హంసగానో పందిగానో బుట్టి నీపాదము లను శిరస్సును కనుఁగొనుటకు పదునాలుగు లోకములుం దిరిగి శ్రమపడలేను. ఆమీఁద తుదకు నిన్ను కన్గొననేరక క్షుద్రజన్మములని యవమానమును సహింపనేరను. కాన బ్రహ్మవిష్ణులోకానందములకన్న నధికమైన సాయుజ్యముక్తి యను పరమానందము దయచేయు మని తాత్పర్యము.

అ. విధిత్వ విష్ణుత్వాదిక మపి శివపూజాయాః ఫలం దోషదర్శనే నాఙ్గీకృత్య నిర్దోషం నిత్యసుఖం చ ప్రార్థయతే:—

వ్యా. కరోమీతి. భో విభో అహంతు త్వత్పూజాం తదాచ్ఛాదికం కరోమి సపద్యవిలంబేనైవ భో శంకర మే మహ్యాం నిర్దోష నిత్య సుఖప్రదాతా భవ ఏధి తస్యాః పూజాయాః విధిత్వం విధాతృత్వం విష్ణుత్వం హరిత్వం వా ఫల మితి మత్వా దిశసి ఖలు దదాసిహి పునశ్చ ఇత ఉత్తరస్మిన్కాలే దివి భువి చ త్వాం ద్రష్టుం వీక్షితుం పక్షిమృగతాం పక్షితాం హంసభావం మృగతాం వరాహభావం వా సహాన్ త్వా మ దృష్ట్వా తత్ఖేదం తద్దుఃఖం పక్షిభావ మృగభావ ప్రయుక్త మదర్శనకృతం శోకం చ కథం సహే కథం క్షమే పూర్వం కిల హరిబ్రహ్మణా వన్యోన్యోత్కృష్ట నిష్కృష్టానిశ్చయేన వివదమానౌ తన్నిర్ణయాయ పరమశివం శరణం గతౌ సంతౌ తదాజ్ఞయా తత్పాదశీర్షో ర్దర్శనాయ మృగపక్షిభావ మవలంబ్య ప్రవృత్తౌ తవ దర్శనాదుభా వపి పరా భూతా విత్తి పురాణే ప్రసిద్ధిః. విభో ఇతి పునర్వచన మాదరార్థః.

పైఁ జెప్పిన సాయుజ్యముక్తికి చేరిక సాధనమైన శివసాన్నిధ్యమునః గూర్చిన తత్తఱపాటును జూపుచున్నారు.——

కదా వా కైలాసే కనకమణిసౌధే సహ గణై
ర్వసన్ శంభో ర(గ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః,
విభో సాంబ స్వామిన్ పరమశివ పా హీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణ మివ వినేష్యామి సుఖతః.

టీ. కైలాసే = శివనివాసస్థానమగు కైలాసమునందు, కనకమణిసౌధే = బంగారు రత్నాలమిద్దెమీఁద, గణైస్సహ = ప్రమథగణములతోఁ గూడ, శంభోః = పరమశివునియొక్క, అగ్రే = ముందర, వసన్ = ఉన్నవాఁడనై, స్ఫు...టః - స్ఫుటఘటిత = దృఢముగా కూర్పఁబడిన, మూర్ధాంజలిపుటః = శిరస్సునందలి అంజలిబంధముగలవాఁడనగుచు, భో విభో, భోసాంబ, భోస్వామిన్, భోపరమశివ, పాహి = రక్షింపుము, ఇతి = ఇట్లు, నిగదన్ = పలుకుచున్నవాఁడనై, సుఖతః=అట్టియానందాను.

భవమువలన, విధాతౄణాం కల్పాన్ = అనేక బ్రహ్మకల్పములను, క్షణ
మివ = నిమేషమాత్రముగా, కదావా = ఎప్పుడు, వినేష్యామి = గడు
పుదునో.

తా. శివస్థానమైన కైలాసమునకుఁ జేరి ప్రమథగణములతోఁ గూడ పరమేశ్వరుని యెదుట హే విభో, హే సాంబ, హే స్వామిన్, హే పరమశివ, పాహి, పాహి యని పలుకుచు సంతోషముతో అనేక బ్రహ్మకల్పములు నిమేషంబులుగాఁ గాలమెప్పుడు కడపుదునో గదా!

అ. శుద్ధసాయుజ్యం సంప్రార్థ్య తదంతరంగ సాధనభూతః సపరిజనసాంబసన్నిధవాసః కదా భవిష్యతీతి కాలవిలంబ మసహమానో౽నుతపతి:—

వ్యా. కదావేతి. కైలాసే పరమశివనివాసస్థానే ప్రఖ్యాతే కిలేతి చిరంతనప్రసిద్ధ్యా కిలాసః పరమేశ్వరః కిలాస స్యాయం కైలాసః తస్మిన్ కనకమణిసౌధే సువర్ణమణిప్రచురే సుధానిర్మితే సుధయా దగ్ధశర్కరా చూర్ణేన నిర్మిత ఉపరిగృహే గణైః సహ శంభో రగ్రే పరమశివ పురోభాగే వసన్ వాసం కుర్వన్ స్ఫుటఘటితమూర్ధాంజలిపుటస్సన్ అంజలిః పుట మివాంజలిపుటం మూర్ధ్న్యంజలిపుటం మూర్ధాంజలిపుటం స్ఫుటం వ్యక్తం ఘటితం యోజితం మూర్ధాంజలిపుటం యేన తథా భూతస్సన్ భో విభో భో సాంబ భో స్వామిన్ భో పరమశివ పాహి రక్ష ఇత్యేవం నిగదన్ ఉచ్చైరుచ్చరన్ సుఖితః ఏవం భూతమత్స్థాన మహం లబ్ధ్వా నితి సుఖానుభవాద్ధేతోః విధాతౄణాం బహూనాం బ్రహ్మణాం కల్పాన్ తత్తదవసితి సమయాన్ క్షణమివ క్షణకాలమివ కదావా వినేష్యామి యాపయిష్యామి 'వసన్ శంభో మూర్ధస్ఫుటఘటితబద్ధాంజలిపుట' ఇతి పాఠే త్వయ మన్వయక్రమః. శంభో ఇత్యస్య సంబుద్ధ్యంతత్వం బోధ్యం. శంభో సుఖజనక భో విభో నానాకారతయా విద్యమాన భో సాంబ అంబయా సహ వర్తత ఇతి సాంబః తస్య సంబుద్ధిః. భో స్వామిన్ సకలాధ్యక్ష భో పరమశివ 'నిరతిశయానందరూప అహం కైలాసే గణైః సహ తేషాం భక్త్యగ్ర

గణ్యత్వాత్ శివసామీప్య నివాస యోగ్యత్వాచ్చ తత్తుల్య సామీప్య మోక్షానందం ప్రార్థయతీతి పదప్రయోజనం. వసన్ సన్ - సామీప్యే నివసన్ - ఉచ్చరన్ సన్ మూర్ధ్ని స్ఫుటఘటితబద్ధాంజలిపుటః అంజలేః పుటం బద్ధం చ తత్ అంజలిపుటం చ మూర్ధ్ని శిరసి స్ఫుటం స్పష్టం ఘటితం యోజితం బద్ధాంజలిపుటం యేన తథావిధ స్సన్ 'నిమిష మివే'తి పాఠే పితౄణాం కల్పాన్ స్థితి సమయాన్ కదా నేష్యామి యాపయిష్యామీత్య న్వయః. 'వినేష్యామీ'తి పాఠే విపూర్వస్య నీఞ్ ధాతోః వినయార్థకత్వేన ప్రకృతానుపయోగాత్ నిమిషమివ నేష్యామీతి పాఠాంతరం సాధుత్వేన స్వీకృతమ్.

అదియే మఱియొక విధముగాఁ జెప్పుచున్నారు.—

స్తవై ర్బ్రహ్మాదీనాం జయజయవచోభి ర్నియమినాం
గణానాం కేళీభి ర్మదకలమహోక్షస్య కకుది,
స్థితం నీలగ్రీవం త్రిణయన ముమాశ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్. 25

టీ. బ్రహ్మాదీనాం = బ్రహ్మ మొదలగువారియొక్క, స్తవైః = స్తోత్రములతోడను, నియమినాం = నియమవంతులగు మహర్షులయొక్క, జయజయవచోభిః = జయజయధ్వనులతోడను, గణానాం = ప్రమథగణములయొక్క, కేళీభిః = క్రీడలతోడను, మదకలమహోక్షస్య = సంతోషాతిశయమున సొంపుగా నున్న వృషభముయొక్క, కకుది = మూఁపురమునందు, స్థితం = ఉన్నట్టివాఁడును, నీలగ్రీవం = నల్లనికంఠము గలవాఁడును, త్రిణయనం = మూఁడుకన్నులు గలవాఁడును, ఉమాశ్లిష్టవపుషమ్ = పార్వతీదేవిచేత నాలింగనము చేసికొనఁబడిన దేహము గలవాఁడును, కరధృతమృగం = చేతితో పట్టుకొనఁబడిన లేడిగలవాఁడును, ఖండపరశుం = ఖండమైన గండ్రగొడ్డలి గలవాఁడును నగు, త్వాం = నిన్నును, కదా = ఎప్పుడు, పశ్యేయం = చూతును.

తా. స్తోత్రపాఠములతో బ్రహ్మాదులును జయజయశబ్దములతో మహర్షులును ఆటపాటలతో ప్రమథగణంబులుం గొలువ పార్వతీసమేతుండవై వృషభవాహనముమీఁద వేంచేసియున్న నీసందర్శనము జేయు భాగ్యము నాకెన్నఁడు లభించునో గదా.

అ. ప్రకారాంతరేణావస్థితం తమేవ స్తౌతి:—

వ్యా. స్తవైరితి. బ్రహ్మాదీనాం బ్రహ్మేంద్రవాదిత్యేషాం తేషాం సర్వేషాం దేవానా మిత్యర్థః. స్తవైః స్తోత్రైః స్తుతిగ్రంథైః స్తుతం నియమినాం వేదోక్తనియమపరిపాలకానా మృషీణాం జయజయవచోభిః జయజయేతి శబ్దైః ప్రోత్సాహితం గణానాం నంది భృంగి చండీశ్వరాది ప్రమథగణానాం కేళీభిః తౌర్యత్రికాదివిలాసైః ప్రమోదితం మదకల మహోక్షస్య మదేన హర్షాతిశయేన కలః మధురః మహాంశ్చాసౌ వృషశ్చ మదకలమహోక్షః అచతురేత్యాదినా నిపాతనాదదంతత్వం. తస్య కకుది పిండాకార మాంసోపలక్షితప్రదేశే పృష్ఠస్థాన ఇతి యావత్. స్థిత మాసేదివాంసం నీలగ్రీవం నీలా గ్రీవా కంఠః యస్య తం నీలగ్రీవం త్రిణయనం త్రీణి నయనాని యస్య త ముమయా శ్లిష్ట వపుషం ముమయా పార్వత్యా ఆశ్లిష్ట మాలింగితం వపుః దేహః యస్య తం కరధృతమృగం కరేణ ధృతః గృహీతః మృగః కురంగః యేన తం ఖండపరశుం ఖండః అర్ధితః పరశుః కుఠారో యస్య త మేతాదృశగుణవిశిష్టం త్వా మహం కదా కస్మిన్కాలే పశ్యేయం సాక్షాత్కుర్యా మిత్యర్థః.

అపరమేశ్వరునే యింకొకప్రకారముగాఁ బ్రార్థించుచున్నారు.—

కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్,
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యై ర్ముద మనుభవిష్యామి హృదయే.

టీ. హేగిరిశ = పర్వతశాయివగు నోయీశ్వరా త్వాం = నిన్ను, దృష్ట్వా = చూచి, తవ = నీయొక్క, భవ్యాంఘ్రియుగళం = క్షేమకరమైన పాదములను, హస్తాభ్యాం = చేతులతో, గృహీత్వా = పట్టుకొని, శిరసి = శిరస్సునందును, నయనే = నేత్రములందును, వక్షసి = వక్షస్స్థలమందును, వహన్ = చేర్చుకొనుచున్నవాఁడనై, సమాశ్లిష్య = కౌఁగిలించుకొని, స్ఫుటజలజగంధాన్ = వికసించిన పద్మములయొక్క సుగంధమునంటి సుగంధముగల, పరిమళాన్ = పరిమళములను, ఆఘ్రాయ = మూర్కొని, బ్రహ్మాద్యైః = బ్రహ్మ మొదలగువారిచేత, అలభ్యాం = పొందశక్యముగాని, ముదం = సంతోషమును, హృదయే = హృదయమునందు, కదా = ఎప్పుడు, అనుభవిష్యామి = అనుభవింతును.

తా. దేవా! నినుఁ జూచి నీపాదములను చేతులతోఁ బట్టి శిరస్సునందును నేత్రములయందును ఱొమ్మునను జేర్చి కౌఁగిలించుకొని వికసితపద్మగంధముల నాఘ్రాణించి బ్రహ్మాదులకును దొరకని యానందము నెప్పుడు బొందుదునో గదా!

అ. తమేవ పరమేశ్వరం భంగ్యంతరేణ ప్రార్థయతే:—

వ్యా. హేగిరిశ గిరౌ శయాన త్వాం భవంతం దృష్ట్వా తవ భవ్యాంఘ్రియుగళం క్షేమం కరపాదద్వయం హస్తాభ్యాం గృహీత్వా ధృత్వా శిరసి మూర్ధ్ని నయనే నేత్రే వక్షస్యురసి చ వహన్ సజ్జయన్నహం సమాశ్లిష్యాలింగ్య స్ఫుటజలజగంధాన్ స్ఫుటాని వికసితాని జలజాని పద్మాని స్ఫుటజలజాని తేషాం గంధఇవ గంధో యేషాం తాన్ పరిమళాన్ విమర్దోత్థగంధానాఘ్రాయ ఘ్రాణేంద్రియేణానుభూయ బ్రహ్మాద్యైః బ్రహ్మాదిసురై రలబ్ధాం లబ్ధుమశక్యాం ముదం ప్రీతిం హృదయే మనసి కదా కస్మిన్కాలే ఽనుభవిష్యామి తాత్పర్యం స్పష్టమ్.

సర్వసంపూర్ణుఁడగుపరమేశ్వరున కీయవలసిన దొకటియు లేమింజేసి నిజమనస్సు నర్పించుచున్నారు.—

కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామరసురభిచింతామణిగణే,
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః.27

టీ. హేగిరిశ = పర్వతశాయియగు నోయీశ్వరుఁడా! హేమాద్రౌ = మేరుపర్వతము (బంగారుకొండ), కరస్థే = చేతిలోనుండఁగా, ధనపతౌ = కుబేరుఁడు (ధనవంతుఁడు), నికటస్థే = దగ్గఱనుండఁగా, స్వ...ణే - స్వర్భూజ = కల్పవృక్షములయొక్కయు, అమరసురభి=కామధేనువుయొక్కయు, చింతామణి = చింతామణులయొక్కయు, గణే= సమూహము, గృహస్థే= ఇంటిలోనుండఁగా, శీతాంశౌ = చంద్రుఁడు, శిరస్థే = శిరస్సుననుండఁగా, అఖిలశుభే = సమస్తశుభమును, చరణయుగళస్థే = పాదద్వంద్వమందుండఁగా, కం = ఏ, అర్థం = ఇష్టార్థమును, అహం= నేను, దాస్యే = మీకిత్తును, మమ = నాయొక్క, మనః= మనస్సు, భవదర్థం = నీకొఱకు, భవతు = అగుఁగాక.

తా. కైలాసవాసా! మహాదేవా! బంగారుకొండ కోదండముగా నీచేతనున్నది. మహాధనవంతుఁడగు కుబేరుండు మిత్రుఁడుగా నీపజ్జ నున్నవాఁడు. కోరినమాత్రముననే యెల్లకోరికల నిచ్చు కల్పవృక్షములు కామధేనువు చింతామణులును నీయధీనములుగా నీయింటనున్నవి. ఆహ్లాదకరుండగు చంద్రుండు భూషణంబుగా నీశిరస్సున నున్నవాఁడు. సమస్తశుభంబులును నీపాదములవలనన కలుగుచున్నవి. సాంబశివా! నేనొసంగఁదగిన దొండును గానరాదు గావున నాచిత్తము నర్పించెదఁ జేకొనుము.

అ. వక్ష్యమాణరీత్యా పరమేశ్వరముద్దిశ్య సిద్ధత్వేన హేతునా దాతవ్య వస్తూనా మయోగాత్ స్వమనసః తదధీనతాం ప్రార్థయతే:—

వ్యా. భోగిరీశ శివ హేమాద్రౌ స్వర్ణగిరౌ కరస్థే కరతలస్థే సతి తత్కరస్థత్వంచ మేరుకోదండత్వాదితి భావః.ధనపతౌ రాజరాజే నికటస్థే సమీపస్థే

సతిసమీపసత్త్వం చ తస్య తత్సఖత్వా దితిభావః. స్వర్భూజాసురసురభి చింతామణిగణే స్వర్భూజాః అమరతరవః అమరసురభిః కామధేనుః చింతామణయః చింతితమాత్రదాయినో మణయః తేషాం గణః సమూహః తస్మిన్ హస్తే సతి ఈశ్వర స్యానంతశక్తిత్వా త్తేషాం తద్వశ్యత్వేన తద్ధస్తస్థిత త్వం సంభవతీతి భావః. శీతాంశౌ చంద్రే శిరస్థే సతి శిరసిస్థితే సతి చంద్ర శేఖరత్వ ప్రసిద్ధే రితిభావః. అఖిలశుభే అఖండమంగళే చరణయుగళస్థే సతి పాదద్వంద్వగతే సతి తచ్చరణానాం సర్వమంగళసిద్ధే రితి భావః. ఘ్రాణోక్తేభ్యో హేతుభ్యః కేనాపి వస్తూపచారేణ తవ ప్రయోజనాభావాత్ కం కీదృగ్విధమర్థం పదార్థం భవత్తోషకరమహం దాస్యే దాస్యామి ఇత్యతో హేతోః మమ మనః త్వదర్థం త్వచ్ఛేషం భవతు భూయాత్ సర్వార్థసిద్ధత్వే నేతరానపేక్షణా ద్ధేతోః తవ కర్తవ్య ముపచార మపశ్య న్నహం కేవలం మనస స్త్వదాయత్తతాం ప్రార్థయా మీతి భావః.

ఉదాహరింపంబోవు హేతువులవలన నట్టిఫలంబులు చేకూఱుటం జేసి తాను ధన్యుఁడనైతి ననుకొనుచున్నారు.—

సారూప్యం తవ పూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తిధుర్యజనతాసాంగత్యసంభాషణే,
సాలోక్యం చ చరాచరాత్మకతనుధ్యానే భవానీపతే
సాయుజ్యంమమసిద్ధమత్రభవతిస్వామిన్కృతార్థోఽస్మ్యహమ్.

టీ. భోస్వామిన్ = ఓసర్వాధ్యక్షుఁడా? తవ = నీయొక్క, పూజనే = పూజచేసినప్పుడు, సారూప్యం = సమానరూపము బొందుటయు, శివమహాదేవేతి సంకీర్తనే = హేశివా హేమహాదేవా అని యిట్లు కీర్తించినప్పుడు, సామీప్యం = సమీపమందుండుటయు, శివ...ణే - శివభక్తి ధుర్య = ఈశ్వర భక్తి యనుభారమును వహించుచున్న, జనతా = జనసమూహముయొక్క, సాంగత్యసంభాషణే = సహవాసము, సల్లాపమును గలిగినప్పుడు, సాలోక్యం = ఒక్కలోకమందునికియు, హేభవానీపతే = ఓసాంబమూర్తి! చ... నే

చరాచరాత్మక=స్థావరజంగమరూపమైన, తను=మూర్తియొక్క, ధ్యానే=ధ్యానముచేసినప్పుడు, సాయుజ్యం = నీతోడనైక్యమును, మమ = నాకు, అత్ర=ఈజన్మమందు, సిద్ధం భవతి = సిద్ధించుచున్నది. (అతః = కనుక) అహం=నేను, కృతార్థః=ధన్యుఁడను, అస్మి=అగుచున్నాను.

తా. దేవా! నీపూజయందు సారూప్యమును, నీనామసంకీర్తనమందు సామీప్యము, నీభక్తులతోఁ గూడి కథాకాలక్షేపములు చేయుపట్ల సాలోక్యము, చరాచరాత్మకమైన నీమూర్తిధ్యానమందు సాయుజ్యమును గూడ నాకీలోకమందే దయచేయుచుంటివిగాన ధన్యుఁడనైతిని.

అ. వక్ష్యమాణహేతుభి ర్వక్ష్యమాణఫలసిద్ధే రాత్మనా కృతార్థతాం స్మరతి:—

వ్యా. సారూప్యమితి. భో స్వామిన్ సర్వాన్స్యత్వ తవ పూజనే కృతే సతి సారూప్యం సరూపతాసిద్ధి ర్భవతి భో శివ మహాదేవఇతి దేవసంకీర్తనే కృతేసతి తవ సామీప్యం సమీపవర్తిత్వం సిద్ధం భవతి సాంగత్యం సంగతస్యభావ స్సాంగత్య మేకాధికరణవర్తిత్వం చ సంభాషణం సమ్యగాలాపః తయో స్సమాహార స్సాంగత్య సంభాషణం శివేభక్తి శ్శివభక్తి స్సైవ ధూః భారః శ్శివభక్తిధూః తాం వహతీతి శివభక్తిధుర్యా జనానాం సమూహో జనతా సాచ సాచ శివభక్తిధుర్యజనతా తస్యా స్సాంగత్యసంభాషణే కృతేసతి సాలోక్యం సమానో లోకో యస్యస లోకః స్తస్యభావ స్సాలోక్యం సమానలోకవర్తిత్వమితి యావత్. తత్సిద్ధం భవతి భో భవానీపతే భవస్యపత్నీ భవానీతి యోగికార్థో న వివక్షితః, ఆన్యోన్యాశ్రయదోషప్రసంగాత్, కింతు రూఢ్యా అంబికా అర్థః. తస్యాః పతిః భవానీపతి స్తస్యసంబుద్ధిః భో భవానీపతే తవచరాచరాత్మకతనుధ్యానే స్థావరజంగమలక్షణమూర్తిధ్యానే కృతేసత్య త్రాస్మిన్ జన్మని మమ సహ యుజ్యత ఇతి సయుక్త స్తస్య భావ స్సాయుజ్యం తచ్చ సిద్ధం భవత్యతోఽహం కృతార్థోఽస్మి కృతః ప్రాప్తః అర్థలాభో యస్యసోఽస్మి భవామి.

వేఱొక తెఱంగునఁ బ్రార్థించుచున్నారు.—

త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయా
మ్యన్వహం, త్వా మీశం శరణం వ్రజామి వచసా త్వా
మేవ యాచే విభో, వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం
దివ్యై శ్చిరం ప్రార్థితాం, శంభో లోకగురో మదీయమన
స స్సౌఖ్యోపదేశం కురు. 29

టీ. హేవిభో=ఓసర్వవ్యాపకుఁడా! పరమం=సర్వోత్కృష్టమైన, త్వత్పాదాంబుజం=నీపాదపద్మమును, అర్చయామి=పూజించుచున్నాను, అన్వహం=ప్రతిదినమును, త్వాం=నిన్ను, చింతయామి=తలఁచుచున్నాను, ఈశం = జగత్కర్తవగు, త్వాం= నిన్ను, శరణం = జననమరణములనుండి రక్షించు దిక్కుగా, వ్రజామి = పొందుచున్నాను, వచసా=వాక్కుచేత, త్వామేవ = నిన్నే, యాచే = (అభీష్టమును) యాచించుచున్నాను, దివ్యైః=దేవతలచేతను, చిరం=చాలకాలముగా, ప్రార్థితాం=ప్రార్థింపఁబడినదియు, సకరుణాం= ప్రేమతోఁ గూడినదియు, చాక్షుషీం = నేత్రముల సంబంధమైన, వీక్షాం = కటాక్షప్రసారమును, మే = నాకు, దిశ = ఇమ్ము, శంభో=సుఖకరుఁడా, లోకగురో=భక్తలోకమునకు రహస్యార్థములను దెలియఁజేయువాఁడా, మదీయమనసః=నామనస్సునకు, సౌఖ్యోపదేశం=బ్రహ్మోపదేశమును, కురు=చేయుమా.

తా. పార్వతీమనోవల్లభా! నీపాదార్చనము చేయుచుఁ బ్రతిదినము నిన్ను దలంచుచు శరణుఁబొంది వేఁడుకొనియెద. దయచేసి నిఖిలదేవతా ప్రార్థనీయమైన నీకరుణాకటాక్షమును నాయందు రానిచ్చి జననమరణ క్లేశంబులఁ దొలఁగించుచు బ్రహ్మోపదేశ మొనర్చుము.

అ. పునః ప్రకారాంతరేణ తం ప్రార్థయతే:—

వ్యా. త్వదితి. హే విభో వివిధేన ప్రకారేణ భవతీతి విభు స్తస్య సంబుద్ధిః సకలభువనవ్యాపకేత్యర్థః. పరమం సర్వోత్కృష్టం త్వత్పాదాం

బుజం తవపాదః అంబుజమివే త్యుపమితసమాసః. తదర్చయామి పూజయా మ్యర్చాయాః కాయికత్వా ద్ధస్తాదిభిః పూజయామీతి ఫలితోఽర్థః. అన్వహం దినేదినే త్వా మేతావ్యశం భక్తపరాధీనం చింతయామి ధ్యాయామ్యేవం పూజానంతరధ్యానం కృత్వా సంరక్షణం శరణం యాచతే—ఈశం జగత్కర్తారం త్వాం శరణం జననమరణభయనివారకం వ్రజామి ప్రపద్యే వచసా వాగింద్రియేణ త్వామేవ ఏవకారేణ తదితరేషాం యాచ్నాకర్మత్వం వ్యావర్త్యతే. ఇష్టం ధాతోర్ద్వికర్మకత్వా దిష్టమిత్యధ్యాహార్యం. యాచే ప్రార్థయే తదిష్టం కిమితి చే దాహ—దివ్యై ర్దేవతాసమూహైః హే శంభో సుఖజనక లోకగురో లోకానాం భక్తజనానాం గురో రహస్యార్థప్రకాశక మే మహ్యం దివ్యై ర్దివి భవై ర్దేవై శ్చిరం చిరకాలా త్ప్రార్థితాం సకరుణాం కరుణా సహితా మత్రిప్రీత్యాసహ వర్తత ఇతి సకరుణాం తాం చాక్షుషీం చక్షుస్సంబంధినీం కటాక్షవీక్షణరూపాం దిశ దేహి సుఖమేవ సౌఖ్యం స్వార్థే తద్ధితః. సుఖస్వరూపం బ్రహ్మతస్యోపదేశం కు ర్వాత్మనః బ్రహ్మతాదాత్మ్యబోధనం కు ర్విత్యభిప్రాయః. మదీయమనసః మమసంబంధి మానసస్య సౌఖ్యోపదేశం కురు కురుష్వ విషయసుఖ స్యానిత్యత్వేన దుఃఖోత్తరత్వేన చ తదుపేక్ష్య సౌఖ్యం బ్రహ్మేతి బ్రహ్మపర్యంతానుధావనం కృతమిత్య ర్థ్యేయమ్.

ఇప్పుడు నే నున్నస్థితితో నీశుశ్రూష చేయఁ జాల నని యనుచున్నారు.—

వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మ తాన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా,
పాత్రే కాంచనగర్భ తాస్తి మయి చే ద్బాలేందుచూడామణే
శుశ్రూషాంకరవాణి తే పశుపతే స్వామిం స్త్రిలోకీగురో.

టీ. హేబాలేందు చూడామణే = ఓచంద్రశేఖరుఁడా! హేపశుపతే = సంసారబంధమోచకుఁడా! హేస్వామిన్ = ఓసర్వశరీరాధ్యక్షా!

త్రిలోకీగురో=మూఁడులోకములకును రహస్యార్థములను ప్రకటించువాఁడా తే=నీయొక్క, వస్త్రోద్ధూతవిధౌ=వస్త్రోపచారము చేయుటయందు, సహస్రకరతా=సూర్యుఁడగుటయు (వేయికరములుగలుగుట), పుష్పార్చనే=పుష్పోపహారార్పణమందు, విష్ణుతా=విష్ణువగుటయు (వ్యాపకత్వము), గంధే=గంధోపచారమందు, గంధవహాత్మతా=వాయురూపుఁడగుటయు, అన్నపచనే=అన్నమువండుటయందు (హవిరుపచారము చేయుటయందు), బర్హిర్ముఖాధ్యక్షతా=ఇంద్రుఁడగుటయు (అగ్నిముఖుల కధ్యక్షుఁడగుట), పాత్రే=పాత్రోపచారమందు (అర్ఘ్యవిధి), కాంచనగర్భతా=హిరణ్యగర్భుఁడగుటయు (ధనపూర్ణుఁడగుట), మయి=నాయందు, అస్తిచేత్=ఉన్నయెడల, తే=నీయొక్క, శుశ్రూషాం=సేవను, కరవాణి = చేయఁజాలుదును.

తా. సర్వవ్యాపకా! నీకు వస్త్రోపచారము చేయుటకు వేయిచేతులవాఁడు గావలయు. నీకు పుష్పోపచారము జేయుటకు వ్యాపకుండు గావలయు. నీకు గంధోపచారము చేయుటకు గంధవహుండు గావలయు. వంటచేసి నీకు హవిస్సు నివేదనజేయుట కగ్నిముఖాధ్యక్షుండు గావలయు. నీ కర్ఘ్యపాత్రము సమర్పించుటకో గర్భశ్రీమంతుఁడు గావలయు. అట్టి సూర్యుండును, విష్ణువును, వాయుదేవుఁడును, దేవేంద్రుఁడును, హిరణ్యగర్భుండును నైననేకాక నీ కుపచారము చేయ నాతరమా?

అ. ఈదృశస్య తే వైవంభూతోఽహం శుశ్రూషాం కర్తుం న ప్రభవామీ త్యాహ:—

వ్యా. వస్త్రోద్ధూతేతి. హే బాలేందుచూడామణే చంద్రశేఖర హేపశుపతే పశూనాం సంసారబద్ధానాం పతే బంధవిమోచకస్వామిన్ సర్వశరీరాధ్యక్ష నాన్యతోఽస్తి ద్రష్టేతి శ్రుతేః. త్రిలోకీగురో లోకత్రయస్యాపి గూఢార్థప్రకాశక ప్రథమ తృతీయ సంబుద్ధిభ్యాం తస్యవ్యాపకతా ప్రత్యాయ్యతే. ద్వితీయచతుర్థాభ్యాం పాశవిమోచకత్వం రహస్యార్థబోధకత్వం చ ప్రత్యాయ్యతే. ఏతావన్మహిమ్న స్తవ శుశ్రూషాం తదాకరవాణి విరచయాని కదేతి చేత్ వస్త్రోద్ధూతవిధౌ వస్త్రోపచారవిధానే సహస్రకర

తా సూర్యతా మయ్యస్తి చేత్ కరసహస్రస్య లోకత్రయవ్యాపకత్వేన వ్యాపకీభూతపరమేశ్వరాచ్ఛాదకత్వం సంభవతి నేతరస్యే త్యభిప్రే త్యాత్మని తత్రాసంభావనం పుష్పార్చనే తదనంతరకర్తవ్యపుష్పోపచారవిధానే విష్ణుతా విష్ణోర్భావః విష్ణుతా వ్యాపకత్వం విష్ణుసదృశవ్యాపకత్వమిత్యర్థః. మయ్యస్తిచేత్ గంధే గంధోపచారే గంధవహాత్మతా వాయుస్వరూపతా విలక్షణగంధప్రాపకత్వశక్తేః వాయౌ విద్యమానత్వాత్. తత్రాసంభావన మన్నపచనే పక్వహవిరుపచారే బర్హిర్ముఖాధ్యక్షతా బర్హిరగ్నిర్ముఖం యేషాం తేషా మధ్యక్షః ఇంద్రః తత్రాచ మయ్యస్తి చే త్తవ శుశ్రూషాం తదాకరవాణిపాత్రే పాత్రోపచారే కాంచనగర్భతా హిరణ్యగర్భత్వం బ్రహ్మత్వ మర్ఘపూర్ణత్వం చ మయ్యస్తి చే త్తదా తవ శుశ్రూషాం కరవాణీ త్యన్వయః.

పరమేశ్వరునియం దున్నలోకోత్తర మైనశక్తిని జూపుచున్నారు.—

నాలం వా పరమోపకారక మిదం త్వేకం పశూనాం పతే
పశ్యన్కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్,
సర్వామర్త్యపలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళేన గిళితం నోద్గీర్ణ మేవ త్వయా. 31

టీ. హేపశూనాంపతే=ఓభూతనాథా! కుక్షిగతాన్=కడుపులో నున్న, చరాచరగణాన్=స్థావరజంగమసమూహములను, బాహ్యస్థితాన్=వెలుపలినున్నవారలను, రక్షితుం=కాపాడుటకు, పశ్యన్=ఆలోచించుచు, త్వయా=నీచేత, అతిజ్వాలాకరం=మిక్కిలి తాపము కలుగఁజేయునదియు, భీకరం=భయంకరమును నగు, గరళం=కాలకూటవిషము, స... ధం - సర్వామర్త్య = సమస్తదేవతలయొక్కయు, పలాయన = పాఱిపోవుట యనియెడు రోగమునకు, ఔషధం = మందగునట్లుగా, గళే = కంఠమందు, నిక్షిప్తం = నిలుపఁబడినదై, నగిళితం = మ్రింగఁబడలేదు, నోద్గీర్ణమేవ = వెడల నుమియఁబడను లేదు, పరమోపకారకం = మిక్కిలి

యుపకారకమైన, ఇదం ఏకం=ఇది యొక్కటియే, సాలంవా = (నీమహిమ దెలియుటకు) చాలదా.

తా. నిఖిల లోకభయంకరమై సంతాపకరమైన కాలకూటమును భయపడి పాఱిపోవుదేవతల నూఱడించుటకుఁగా నీకంఠమందె యుంచుకొని ఉమియక మ్రింగక కడుపులోని వారలకును వెలుపలివారలకును బాధ గలుగకుండ మహోపకార మొనర్చితివి దేవా నీమహిమ యెఱుంగుట కీ దృష్టాంత మొక్కఁడు చాలదా!

అ. పరమేశ్వరనిష్ఠ సర్వాతిశాయిశక్తిమత్త్వం ప్రదర్శయితుమాహ:—

వ్యా. నేతి. భో పశూనాంపతే ఏవం సంబోధనేన జగతా మనన్య భరణీయత్వం సూచ్యతే. కుక్షిగతా నుదరస్థితాన్ చరాచరగణాన్ స్థావర జంగమసమూహాన్ బాహ్యస్థితాంశ్చ తాన్ రక్షితుం నిర్భయా న్కర్తుం పశ్యన్ పర్యాలోచయన్ భూ స్త్వ మిత్థం పర్యాలోచ్య త్వయా అతి జ్వాలాకార మత్యంతతాపకరం భీకరం భయజనకం గరళం కాలకూటం సర్వామర్త్యపలాయనౌషధం యథా తథా అమర్త్యాః అమరణధర్మకాః సర్వే దేవాః తేషాం పలాయనమపహానేన దిశి దిశి ధావనం తదేవ రోగః ఏక దేశవివర్తిరూపకం తస్యౌషధం నివర్తకం యథా భవతి తథా గళే కంఠే నిక్షిప్తం స్థాపిత మతఏవ నగిళితం నభక్షితం నోద్గీర్ణం చ బహిర్నోత్సృష్టం నవాంతం చేత్యర్థః. ఏవకారశ్చార్థః. అవ్యయానా మనేకార్థత్వా దేకం పరమోపకారక మతిశయేనానుగ్రాహక మిద మిత్థంకరణం తవ మహిమాన గతయే నాలంవా నపర్యాప్తంవా వా శబ్దః కాకుస్వరసూచకః. తుశబ్దో ఽన్యేషా మీదృశం మహిమానం వారయ తీత్థంకరణ మనితరసాధారణం త్వన్మహిమానం గమయతీతి భావః.

పరమశివుఁడు తీసికొనిన విషమును గూర్చి మూఁడువిధములఁ బ్రశ్నించుచున్నారు.—

జ్వాలోగ్ర స్సకలామరాతిభయదః క్ష్వేళః కథం వా త్వయా
దృష్టః కించ కరే ధృతః కరతలే కిం పక్వజంబూఫలమ్,

జిహ్వాయాం నిహిత శ్చ సిద్ధఘుటికా వా కంఠ దేశే భృతః
కిం తే నీలమణి ర్విభూషణమయం శంభో మహాత్మన్వద.

టీ. హేమహాత్మన్ = సర్వజ్ఞుఁడవైన యీశ్వరుఁడా! జ్వాలో గ్రః=మంటలచేత సహింపఁగూడనిదియు, స...దః-సకలామర = అందఱు దేవతలను, అతిభయదః=మిగుల భయంకరమునునగు, క్ష్వేళః=విషము, త్వయా=నీచేత, కథంవా=ఎట్లుగా, దృష్టః=చూడఁబడినది? కించ=అంతియ కాక, కరే=హస్తమందు, ధృతః=ధరించఁబడినది(చేతితోఁ దాఁకఁబడినది)? కరతలే=అఱచేతియందు, నిహితః=ఉంచుకొనఁబడినది? పక్వజంబూఫలం కిం=పండిన నేరేడుపండా యేమి? జిహ్వాయాంచ=నాలుకయందును, నిహితః=వేసికొనఁబడినది, సిద్ధఘుటికావా = సకలసిద్ధికారియగు నౌషధఘుటిక యా యేమి? కంఠదేశే = కంఠప్రదేశమందు, భృతః=భరింపఁబడినది. అయం=ఈకాలకూటవిషము, తే=నీకు, విభూషణం=అలంకారమైన, నీలమణిః కిం=ఇంద్రనీలమాణిక్యమా యేమి? వద=చెప్పుము.

తా. తీవ్రజ్వాలలు గ్రమ్ముచు సకలదేవతలకును భయంకరమైన యీ కాలకూటవిషమును కన్నులతో గాంచుటయేకాక చేతితో యెత్తి అఱచేతిలో నుంచుకొంటివి ఎది నేరేడుపండా ఏమి? ఇదిగాక నాలుకమీఁద వేసికొన్నావు. సిద్ధఘుటికయా ఏమి? మఱియును కంఠమందటులనే యుంచుకొంటివి విది యింద్రనీలమాణిక్యమా ఏమి? చెప్పుము.

అథ పరమశివ పరిగృహీతం విషం త్రేధా వికల్ప్య పృచ్ఛతి:—

వ్యా. జ్వాలేతి. భో మహాత్మన్ అపరిచ్ఛిన్నస్వరూప సర్వజ్ఞేతి యావత్. జ్వాలోగ్రః జ్వాలాభి స్సర్వతో వ్యాపినీభిః కీలాభిః వహ్నేర్జ్వాయో ర్జ్వాలకీలా విత్యమరః. క్ష్వేళస్యాపి వహ్నితుల్యత్వా జ్జ్వాలానాం గౌణ్యాప్రాప్త్యా తద్ధర్మత్వోపపత్తిః. ఉగ్రః అసహ్యః సకలామరాతిభయద స్సకలదేవతాతిభయంకరః క్ష్వేళః త్వయా కథం వా దృష్టః కించ కరేచ ధృతః గృహీతః కరతలే నిహితశ్చ అతః పక్వజంబూఫలం కిం సఏవ క్ష్వే

శః జిహ్వాయాం నిహితశ్చ అతః సిద్ధఘుటికా వా సకలసిద్ధికారిణీ ఘుటికా ఔషధగోలకం వా కంఠదేశే భృతశ్చ తో౽యంతే భూషణం నీలమణిః కిం వద బ్రూహి కింవా శబ్దా సర్వత్ర ప్రశ్నార్థకా. స్పష్టార్థో౽యమ్.

దిగువ నుదాహరింపఁబోవు సాధనములలో నేదేని యొక్కదానిచేత మోక్షము సులభమగుట నూహించి యితరదేవతానుసరణము విఫల మను చున్నారు.—

నాలం వా సకృ దేవ దేవ భవత స్సేవా నతి ర్వా నుతిః
పూజా వా స్మరణంకథాశ్రవణమప్యాలోకనం మాదృశామ్,
స్వామి న్నస్థిర దేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కా వా ముక్తిరితః కుతో భవతిచే త్కిం ప్రార్థనీయం తదా. ౭౭

టీ. హేస్వామిన్ = సర్వభూతాధ్యక్షుండ వైనదేవా! భవతః = నీయొక్క, నతిర్వా=కాయికమైననమస్కారమేని, నుతిర్వా=వాక్కుతోడి స్తోత్రమేని, పూజావా = పూజయేని, స్మరణం = మనసులో స్మరించుట యేని, కథాశ్రవణమపి = చెవులతో నీచరిత్రలు వినుటయేని, ఆలోకనం = కన్నులతో నీమూర్తిఁ జూచుటయేని, సకృదేవ = ఒక్కమాఱుమాత్రమే, భవతః=నీయొక్క, సేవా=భజనము, మాదృశాం= నావంటివారలకు, నా లంవా = (ముక్తియొసఁగ) చాలదా? ఇతః=ఈపైయుపాయమును విడిచి, ముక్తిః=మోక్షము, కా వా=ఎట్టిది? కుతో౽పి = పైయుపాయములలో నే యొకదానినుండియైనను, భవతిచేత్ = ముక్తిగలుగు నేని, తదా =అప్పుడు, అ...న-అస్థిర=శాశ్వతముగాని, దేవతా=దేవతలయొక్క, అనుసరణాయా సేన = ఆశ్రయించు ప్రయత్నముచేత, కింలభ్యతే=ఏమిలాభమగును, ప్రార్థ నీయం=కోరఁదగినదియు, కిం=ఏమున్నది?

తా. ఓస్వామీ! మహాదేవా! కాయిక వాచిక మానసికంబు లగు నమస్కారము, స్తోత్రము, స్మరణము మున్నగు నీసేవలయం దొకొక్కటి యు మోక్షమునకు సంపూర్ణసాధన మగును. ఈయుపాయములను వీడి వేఱ

మోక్షములేదు. అస్థిరులయిన యితరదేవతల ననుసరించి యేమిలాభము? వారిని కోరఁదగిన దే మున్నది?

అ. వక్ష్యమాణానాం సాధనానా మన్యతమేన ముక్తి స్సులభేతి మ త్వాన్యదేవతానుసరణే వైయర్థ్య ముపపాదయతి:—

వ్యా. నాలమితి. హే స్వామిన్ సర్వభూతాధ్యక్ష దేవ స్వప్రకాశ స్వరూప భవత స్తవ సకృత్సేవా ఆవృత్త్యా వినా భజనం కరణత్రయసాధారణమిదం. ఇద మేవ విశిష్యాహ—నతిర్వా నమస్కారో వా ఇదం కాయికం నుతిః స్తోత్రం వా ఇదం సేవనం వాచికం పూజా వా సపర్యా వా ఇదం చ సర్వసాధారణం స్మరణం స్మృతిరిదం సేవనం మానసికం కథాశ్రవణ మపి చరిత్రశ్రుతిరప్యేవం శ్రోత్ర మాలోకనం చ దర్శనం చ చాక్షుష మేత దేవ ముక్తానా మన్యతమ త్వద్భజనం మాదృశా మస్మద్విధానాం ముక్తిప్రాపణే నాలం వా న పర్యాప్తం వా అంతిమో వాశబ్దః కాక్వర్థః. ఆదిమాః వాశబ్దాః వికల్పార్థాః. ఇద మేవ పర్యాప్తమితి పర్యవసితోఽర్థః. ఇతః ఇమ మన్యతమ ముపాయం విహాయ ప్రాప్యాముక్తిః కా వా కీదృశీతి ప్రశ్నార్థే కాకుః నకాపీత్యర్థః. ఉక్తానాం మధ్యే కుతోఽప్యుపాయా న్ముక్తిర్భవతీతిచే త్తదా అస్థిర దేవతానుసరణాయాసేన అస్థిరాః యా దేవతాః ఉపాధ్యభిమానప్రయుక్త మస్థిరత్వం తాసా మనుసరణం భజనం తస్య య ఆయాస స్తదనుకూలప్రయత్నవిశేష స్తేన కిం లభ్యతే తతః ప్రార్థనీయం కిం న కిమపీత్యర్థః. ఉక్తానాం భజనానాం మధ్యే సకృత్కృత మప్యేక మేవ భజనం ముక్తిప్రాపణే పర్యాప్తమితి భావః.

అపసమశివుని తెలుఁగు మతి యేరికిని రా దని చెప్పుచున్నారు.—

కిం బ్రూమ స్తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో భవ
ద్ధైర్యం చేదృశ మాత్మనస్థితిరియం చాన్యైః కథం లభ్యతే,
భ్రశ్య ద్దేవగణం త్రస న్మునిగణం నశ్య త్ప్రపంచం లయం
పశ్య న్నిర్భయ ఏకఏవ విహరత్యానందసాంద్రో భవాన్.

తా. ప్రజలయోగక్షేమభారము వహించుట, సకల శ్రేయస్సుల నొసంగుచుండుట, ఐహికాముష్మికసాధనంబులైన యుపాయముల నుపదేశించుట, ఎక్కడఁ జూచినను తానయై నిండియుండుట, సర్వజ్ఞత్వము, ఎల్లరను దయతోఁ జూచుట, ఇవియన్నియు నీగుణములు గదా!- పరమేశ్వరా! మహాదేవా! మహానుభావా! ఇంక నేనేమి తెలిసికొనవలయును? నీవే నాకు పరమాప్తుఁడ వని యెల్లవేళలను దలంతును. అదియే నాకు శ్రేయస్కరమగుఁగాక.

అ. పరమశివస్య గుణాన్ విదిత ప్రాయా న్మత్వా తస్య పరమాప్తత్వస్మరణం ప్రతిజానీతే:—

వ్యా. యోగక్షేమఇతి. శంభో యోగక్షేమధురంధరస్య వహతి వహతీతి ధరః ధురోధరః ధురంధరః అలబ్ధస్య లాభో యోగః లబ్ధస్య పరిపాలనం క్షేమ స్తయో ర్ధురంధరస్య సకలశ్రేయః ప్రదోద్యోగినః సకలాని చ తాని శ్రేయాంసి చ తాని ప్రదదాతీతి తత్ప్రద స్సచాసా వుద్యోగశ్చ సోఽస్యాస్తీతి సకలశ్రేయఃప్రదోద్యోగీ తస్య దృష్టాదృష్టమతోపదేశకృతినః దృష్ట మైహిక మదృష్ట మాముష్మిక మేతదుభయఫలకత్వే నాభిమతో య ఉపాయ స్త స్యోపదేశ స్తత్ర కృతిన స్సమర్థస్య బాహ్యాంతర వ్యాపినః బహి ర్భవాని బాహ్య వ్యంతర్భవా న్యాంతరా ణి తాని వ్యాప్నోతీతి వ్యాప్య తిష్ఠతీతి తద్వ్యాపిన స్సర్వజ్ఞస్య సర్వం జానాతీతి సర్వజ్ఞ స్తస్య దయాకరస్య కరోతీతి కరః దయాయాః కరః దయాకర స్తస్య భవతః భవ త్సంబంధి మయా వేదితవ్యం జ్ఞాతవ్యం కిం కిమ స్తీతి శేషః. త్వం మే పరమాంతరంగ అత్యంతాప్తః ఇత్యన్వహ మనుదిన మహం చిత్తే స్మరామి సర్వదా త్వయి పరమాప్తత్వస్మరణం మమ శ్రేయస్కర మితి భావః.

భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభే సాంబ తవాంఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలమ్,
సత్త్వం మంత్ర ముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణ మాపాదయన్. .

టీ. హేసాంబ=ఓసాంబమూర్తీ! భక్తః=భక్తుఁడనైన నేను, నిజశరీర = స్వకీయశరీరమనునట్టి, అగారశుద్ధిం=గృహముయొక్క పరిశుద్ధిని (దోషములు లేమి), వహన్=సంపాదించుచున్నవాఁడనై, రుచిరం = మనస్సునకింపైన, కల్యాణం=మంగళమనియెడు వివాహమంగళమును, ఆపాదయన్=సంపాదింపఁ బోవుచు, భక్తిగుణావృతే=భక్తియను నూలుపోఁగులతోఁ జుట్టఁబడినదియు, ముదమృతాపూర్ణే=సంతోషమనునట్టి యుదకములతో నిండించఁబడినదియు, ప్రసన్నే=స్వచ్ఛమైనదియు నగు, మనఃకుంభే=మనస్సను కలశమందు, తవ=నీయొక్క, అంఘ్రిపల్లవయుగం=పాదంబులను రెండు పల్లవములను, సంవిత్ఫలం=జ్ఞానంబను కొబ్బరిబొండంబును, సంస్థాప్య=ఉనిచి, సత్త్వం=సత్త్వగుణ ప్రధానమైన, మంత్రం = తారకమంత్రమును, ఉదీరయన్ = ఉచ్చరించుచు, పుణ్యాహం = పుణ్యాహవాచనమును, ప్రకటీకరోమి=ప్రకాశింపఁజేయుచున్నాను.

తా. ఓ సాంబమూర్తీ! నేను భక్తుండనై నాశరీరం బనుగృహంబును నిర్దుష్టముగా శుద్ధపఱచికొని మనఃప్రియంబగు కల్యాణంబును గావింపఁబూని యందులకుగా భక్తియను నూలుపోఁగులు చుట్టి సంతోషమను జలంబుతో నించిన నామనస్సను కలశంబున నీపాదపల్లవములను, నీజ్ఞానం బను నారికేళఫలంబును జేర్చి కలశస్థాపనము చేసి తారకమంత్రోచ్చారణపూర్వకముగాఁ బుణ్యాహవాచనము నెఱవేర్తును. ఎల్లవేళలను మనస్ఫూర్తిగా మీపాదపద్మములను స్మరించెద నని తాత్పర్యము.

అ. పదార్థరూపకేణ పరమశివం ప్రీణయతి:—

వ్యా. భక్తఇతి. హే సాంబ భక్తః నిజశరీరాగారశుద్ధిం వహన్ అహం నిజం ఆత్మీయం శరీరం త దేవాగారం గృహం తస్య శుద్ధిం దోషశూన్యతాం వహ న్సంపాదయ న్నహం రుచిరం మనః ప్రియం కల్యాణం మంగళం త దేవ వివాహం మంగళ మాపాదయ న్సంపాదయ న్నితి శతృప్రత్యయః. కల్యాణఫలక ఇత్యర్థః. తథా భూత స్సన్భక్తిగుణావృతే భక్తిరేవ గుణ స్తంతు స్తేనావృతే వేష్టితే ముదమృతాపూర్ణే ముత్సంతోష స్సైవామృత

ముదకం తే నాపూర్ణే వ్యాప్తే ప్రసన్నే స్వచ్ఛే మనః కుంభే మనః మానస మేవ కుంభః కలశ స్తస్మిన్ తవాంఘ్రిపవ పల్లవే కిసలయే తయో ర్యుగం యుగ్మం సంవిత్ఫలం సంవి ద్భవద్జ్ఞానమేవఫలం నారికేళఫలం తచ్చ సం స్థాప్య నిక్షిప్య సత్త్వం సత్త్వగుణప్రధానం మంత్రం తారకమంత్ర ముదీరయ న్నుచ్చరన్ పుణ్యాహం పుణ్యాఖ్యాహం కర్మ ప్రకటీ కరోమి ప్రకాశ యామి మనసా త్వదంఘ్రియుగళం సదా స్మరామీతి భావః.

విద్వాంసులు వేదసముద్రము తరిచి యందు సారముగా నిను గ్రహిం తు రనుచున్నారు.—

ఆమ్నాయాంబుధి మాదరేణసుమనస్సంఘాస్సముద్యన్మనో
మంథానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వా మథిత్వా తతః,
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్య మాతన్వతే.

టీ. సుమనస్సంఘాః=పండితబృందములు (దేవబృందములు), సము ద్యత్=గుణసముదాయముతో నొప్పుచున్న, మనః=మనస్సును, దృఢభక్తి రజ్జుసహితం=అచంచలభక్తి యనుత్రాడుతోఁ గూడిన, మంథానం=కవ్వ మునుగా, కృత్వా=చేసి, ఆమ్నాయాంబుధిం = వేదసముద్రమును, ఆదరే ణ=ఆసక్తితో, మథిత్వా=తరచి, తతః=దానివలన, సోమం=చంద్రుని,కల్ప తరుం=కల్పవృక్షమును, సుపర్వసురభిం=కామధేనువును, చింతామణిం = చింతామణిని, ధీమతాం=బుద్ధికి సమ్మతమైన, నిత్యానందసుధాం = శాశ్వ తానందప్రదమైన యమృతమును, నిరంతరరమాసౌభాగ్యం = అవిచ్ఛిన్న లక్ష్మీసమృద్ధిని, ధీమతాం=బుద్ధిమంతులకు, కల్పద్రుమం = కల్పవృక్షము వంటివాఁడును, సుపర్వసురభిం = కామధేనువువంటివాఁడును, చింతామ ణిం=చింతామణివంటివాఁడును, నిత్యానందసుధాం = అమృతమువంటి ని త్యానందస్వరూపుఁడును, నిరంతరరమాసౌభాగ్యం = మోక్షలక్ష్మీసమృద్ధి రూపుఁడును నగు, సోమం=ఉమాసమేతుఁ డగుపరమేశ్వరుని, ఆతన్వతే= విస్తరించి పొందుచున్నారు.

తా. దేవతలందఱును మందరగిరిని కవ్వముగాఁ జేసి సముద్రము మథించి కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, అమృతము, చంద్రుఁడు వీనిని సంపాదించినట్లు విద్వాంసులందఱు తమమనస్సును కవ్వముగాఁజేసి భక్తి యనుత్రాడు గట్టి వేదంబు లనియెడు మహాసముద్రమును తరిచి యం దుండి భక్తిశాలురకు కల్పవృక్ష చింతామణి కామధేనువులవంటివాఁడును నిత్యానందస్వరూపుఁడును మోక్షలక్ష్మీస్వరూపుఁడును నగు సోమేశ్వరుని సాధించుచున్నారు.

అ. విపశ్చిత్సమూహః ఆమ్నాయసముద్రం మథిత్వా తజ్జన్యఫల భూతం త్వాం లభంత ఇత్యాహ:—

వ్యా. ఆమ్నాయాంబుధిమితి. సుమన స్సంఘాః సుమనసాం విదు షాం సుష్ఠు శాస్త్రాభ్యాససంస్కృతం మనః యేషాం తేషాం విదుషాం సుపర్వాణ స్సుమనసఇతి కోశమహిమ్నా దేవానామపి సంఘాః సమూహా స్సముద్యత్ గుణసముదాయం ప్రాప్నువ న్మనః మానసం దృఢభక్తి రజ్జు సహితం దృఢభక్తి రచంచలాభక్తిస్సైవ రజ్జుస్తయాసహితం యుక్తం మంథా నం కృత్వా మథనదండం కృత్వా తేన ఆమ్నాయాంబుధి మామ్నాయః వేదఏవాంబుధిః జలధి స్త మాదరేణాసక్త్యా మథిత్వా తత స్తస్మా త్సో మం కల్పతరుం సుపర్వ సురభిం చింతామణిం ధీమతాం నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్య మాతన్వతే విస్తరేణ లభంతే ధీమతాం బుద్ధిశాలినా మర్థాంతరే నిత్యానందసుధా మిత్యస్య విశేషణం ధియః మతే రిష్టాం సమ్మ తాం కల్పద్రుమం దేవతరుసదృశం సుపర్వసురభిం కామధేనుసమానం చింతామణిసదృశం నిత్యానందసుధా మమృతతుల్యా నిత్యానందస్వరూపం నిరంతరరమాసౌభాగ్యం శాశ్వతముక్తిలక్ష్మీసమృద్ధిరూపం సోమ ముమాస హితం పరమేశ్వర మాతన్వతే విస్తరేణ లభంతే దేవసమూహాః సముద్రం మథిత్వా చంద్రాదిపదార్థా న్యథా అలభంత తథా వేదా న్సంశోధ్య మథన జన్యసకలపదార్థ సమష్టిరూపం పరమశివం లభంత ఇతి భావః.

పరమశివచంద్రుని దర్శనముచేత ఆనందసముద్రము పొంగి యభివృద్ధి నొందును. అందు విబుధులకుఁ బ్రవృత్తి గలుగు నని చెప్పుచున్నారు.—

ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్నః శ్శివ
స్సోమ స్సద్గణసేవితో మృగధరః పూర్ణ స్తమోమోచకః,
చేతః పుష్కరలక్షితో భవతి చే దానందపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తి స్తదా జాయతే.

టీ. ప్రా... ర్తి-ప్రాక్పుణ్యాచల = పూర్వజన్మమందలి పుణ్యముల గుట్టయొక్క; తూర్పుదిక్కున నుండు పుణ్యాకరమైన పర్వతము(ఉదయగిరి) యొక్క, మార్గ=మార్గమున, దర్శిత=చూపఁబడిన, సుధామూర్తిః=అమృత శరీరము (అమృతమయమగుబింబము) కలవాఁడు, ప్రసన్నః=స్వచ్ఛమైన వాఁడును, శివః=ఆనందస్వరూపుఁడు (ఆహ్లాదకరమైనవాఁడు), సద్గణసేవితః=సజ్జనపుంజముచేఁ బూజింపఁబడినవాఁడు (నక్షత్రగణముచేఁ జుట్టుకొనఁబడినవాఁడు), మృగధరః=లేడినిదాల్చినవాఁడు, పూర్ణః=అంతటను నిండినవాఁడు(షోడశకలాపరిపూర్ణుఁడు), తమోమోచకః=అజ్ఞానము(చీఁకటి)బాపువాఁడు, సోమః=ఈశ్వరుం డనుచంద్రుఁడు, ప్రాగల్భ్యేన=ప్రౌఢిమచేత, చేతఃపుష్కరలక్షితః = హృదయాకాశమందు చూడఁబడినవాఁడు, భవతి చేత్=అగునేని, ఆనందపాథోనిధిః=ఆనందసముద్రము, విజృంభతే = ఉప్పొంగుచున్నది. తదా=అప్పుడు, సుమనసాం=సంస్కరింపఁబడిన చిత్తము గలవారలకు, వృత్తిః = (అం దోలలాడవలయునను) ప్రవృత్తి, జాయతే= కలుగుచున్నది.

తా. పురుషుఁడు పూర్వజన్మమందు సంపాదించుకొనిన యుదయపర్వతప్రాయం బగుపుణ్యము మీఁదుగాఁ దనయమృతశరీరంబు భక్తలోకంబులకుఁ గనుపఱిచి ప్రసన్నుఁడు ఆనందమయుఁడు నయి నక్షత్రపుంజం బట్లు సాధుబృందంబులు చుట్టుకొని సేవింప మృగధరుండును పరిపూర్ణుఁడును తమోనివారకుండు నగుచు చంద్రుఁడుంబోలె హృదయాకాశమందు

సోమేశ్వరుండు పరమప్రబోధముతో వెలుగొంఔనేని ఆనందసముద్ర ము ప్పొంగును. అప్పుడు శుద్ధతరంగు లగు విబుధులచిత్తము రంజిల్లును.

అ. పరమశివం చంద్రదర్శనే నానందసముద్రో వర్ధతే తత్ర సుమనసాం ప్రవృత్తి ర్జాయత ఇత్యాహ:—

వ్యా. ప్రాగితి. సోమఏవ సోమశ్చంద్ర స్స కథం భూతః ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః. అచలసదృశం పర్వతసదృశః పుణ్యం పుణ్యాచలః ప్రాక్పూర్వజన్మని సంభూతః పుణ్యాచలః ప్రాక్పుణ్యాచలః సఏవ ప్రాగ్దిగ్వర్తిపుణ్యపర్వత స్తస్య మార్గః పంథాః తేన దర్శితా ప్రదర్శితా సుధా అమృతమయీమూర్తి శ్శరీరం యస్య స తథోక్తః. అన్యత్ర ప్రాక్తన పుణ్యాతిశయేన సంసూచితామృతశరీరఇత్యర్థః. ప్రసన్న స్స్వచ్ఛః ఉభయత్ర స్వచ్ఛత్వం తుల్యం. శివః ఆనందకరః అన్యత్ర సుఖస్వరూపః సద్గణసేవితః నక్షత్రసమూహ పరివృతః అన్యత్ర సాధుసందోహపూజితః మృగధరః ధరతీతి ధరః మృగస్య ధరః మృగధరః ఇదం చోభయత్ర సమానం. పూర్ణః షోడశభిః కలాభిః పూర్ణః పూర్తింగతః అన్యత్ర సర్వవ్యాపక స్తమో మోచకః తమః అంధకార స్తస్య మోచకః నివర్తకః అన్యత్రాజ్ఞానమోచకః ఏతాదృశ స్సోమః ప్రాగల్భ్యేన బోధనశక్త్యా చేతః పుష్కరలక్షితః హృదయాకాశే లక్షితః దృష్టః భవతి చే దానందపాథోనిధిః ఆనంద ఏవ పాథోనిధి స్సముద్రః స విజృంభతే వర్ధతే తదా సుమనసాం సంస్కృతచిత్తానాం వృత్తిః ప్రవృత్తి ర్జాయతే తస్మి న్నిమజ్జనబుద్ధి ర్జాయత ఇతి భావః.

ఒక నగరమందు మంచిరాజుండుటంజేసి దేశంబునకు సర్వసమృద్ధి గలిగినట్లు హృదయపుండరీకమునందు పరమేశ్వరుఁ డుండుటంజేసి నాకు సర్వసమృద్ధియుఁ గలిగిన దని చెప్పుచున్నారు.—

ధర్మో మే చతురంఘ్రికః సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతాః,

జ్ఞానానంద మహౌషధి స్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతంసే స్థితే. 39

టీ. రాజావతంసే = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడును (రాజశ్రేష్ఠుఁడును), మాన్యే=సర్వపూజ్యుఁడును (సర్వసమ్మతుఁడును) నగు శివుఁడు (రాజు), మే=నాయొక్క, మానసపుండరీకనగరే= కమలమువంటి మనస్సనియెడు నగరమందు, కైవల్యనాథే=కైవల్యముతోఁ గూడినప్రభువై, స్థితే=ఉండఁగా, చతురంఘ్రికః = నాలుగుపాదములు గలిగిన, ధర్మః = ధర్మము, సుచరితః=సుఖముగా నాచరింపఁబడినది. పాపం=పాపము, వినాశం=నాశమును, గతం = పొందినది. కామక్రోధమదాదయః = కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ననునవి, విగళితాః = తొలఁగిపోయినవి, కాలాః = పక్షము మాసము సంవత్సరము మొదలగు కాలములు, సుఖావిష్కృతః=సుఖమును ప్రకటించుచున్నవి. జ్ఞా...ధిః= జ్ఞానానంత్య=జ్ఞానసాధనగ్రంథబాహుళ్య మనియెడు, మహౌషధిః = సిద్ధి సాధనమయిన యోషధి, సదా=ఎల్లవేళలను, సుఫలితా=చక్కఁగా ఫలించినది. భవతి=అగుచున్నది.

తా. ధార్మికుఁ డైనరాజు స్వతంత్రాధీశ్వరుఁడై నగరియందుండి పరిపాలించుచుండఁగా దోషములన్నియుఁ దొలఁగిపోయి భూమి ఫలవంత మై సర్వసమృద్ధి గలిగినట్లు నాహృదయపుండరీకమందు పరమేశ్వరుఁడు మోక్షాధినాథుఁడై నివసించియుండ నాకు కామక్రోధాద్యంతశ్శత్రువర్గము పాపములుఁ దొలఁగిపోయి జ్ఞానసాధనంబు లనియెడు నోషధులు ఫలించి యెల్లవేళలను సుఖంబు సమకూడినది.

అ. కస్మింశ్చి న్నగరే సురాజస్థిత్యా దేశస్య సర్వసమృద్ధివ ద్ధృత్పుండరీకే పరమేశ్వరస్థిత్యా మమ సర్వసమృద్ధి స్సంజాతే త్యాహ:—

వ్యా. ధర్మ ఇతి. రాజావతంసే రాజా చంద్రః అవతంసః శిరోభూషణం యస్య తస్మిన్ అన్య త్రావతంసశబ్దస్య శ్రేష్ఠవాచిత్వా ద్రాజశ్రేష్ఠ ఇత్యర్థః. మాన్యే సర్వపూజ్యే అన్యత్ర సర్వసమ్మతే శివే రాజని చ మే

మమ మానస పుండరీకనగరే మానసం పుండరీక మివ మానసపుండరీకం తదేవనగరం పురం తస్మిన్ కైవల్యనాథే కేవలత్వ విశిష్టనాథే ఏకనాథ ఇత్యర్థః. అన్యత్ర లోకప్రసిద్ధపుర్యామివ స్థితే సతి కైవల్యనాథ ఇత్యేత ద్విధేయ విశేషణం. చతురంఘ్రిక శ్చత్వారోంఘ్రయో యస్య సధర్మః సుచరిత స్సుఖే నాచరితః అనుష్ఠితఇత్యర్థః. పాపం దురితం వినాశం గత మదర్శనం ప్రాప్తం కామక్రోధమదాదయ షడంత శ్శత్రవో విగళితాః బహి ర్నిర్గతాః కాలాః మాస పక్ష సంవత్సరాత్మకా స్సుఖా విస్ఫూర్తి స్సుఖమేవా విస్ఫూర్వంతీతి ప్రకాశయంతీతి తథోక్తాః క్విబంతోఽయం శబ్దః. జ్ఞానానంత్యమహౌషధిః జ్ఞానానాం జ్ఞానసాధనగ్రంథానా మానంత్యం బాహుళ్యం తదేవ మహౌషధిః సిద్ధిసాధనౌషధిః సదా సర్వస్మిన్కాలే సుఫలితా సుతరాం సంజాతఫలాభవతీ త్యధ్యాహారః. ధార్మికే రాజన్యేక నాథే శాసతి సతి దేశే సర్వదోషనివృత్తిః సర్వగుణసమృద్ధి శ్చ యథా భవతి జనానాం తథా మమ హృదయపుండరీకే పరమశివే వసతి సర్వగుణ సమృద్ధి స్సర్వదోషనివృత్తి శ్చ సంజాతేతి భావః.

ఉదాహరింపంబడు ఫలంబు బొందియున్నందున నాకు దుర్భిక్షము వలని భయము లేదనుచున్నారు.—

ధీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై
రానీతై శ్చ సదాశివస్య చరితాంభోరాశిదివ్యామృతైః,
హృత్కేదారయుతా శ్చ భక్తికలమా స్సాఫల్యమాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవ న్విశ్వేశ భీతిః కుతః. 40

టీ. హేభగవన్=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవైన, హేవిశ్వేశ = ఓ సకలభువనాధిపతీ, ధీయంత్రేణ=బుద్ధియనుమోటతో, వచోఘటేన = వాక్కనుబొక్కెచేత, కవితాకుల్యోపకుల్యాక్రమైః=కవిత్వమనియెడు కాలువలు పిల్లకాలువలు మొదలగువానిగుండా, ఆనీతైః = (హృదయ మనుపొలములోనికి) తేఁబడిన, సదాశివస్య = పరమశివునియొక్క, చ...తైః-చరితాంభోరాశి=చరిత్రలనియెడు సముద్రముయొక్క, దివ్యామృతైః=మంచి

నీళ్ళచేతను, హృత్కేదారయుతాః= హృదయం బనుపొలమునఁ బుట్టియున్న, భక్తికలమాః=భక్తి యను వరిపైరులు, సాఫల్యం=పంటను, ఆతన్వతే=విస్తరించుచున్నవి. సేవకస్య=నీసేవకుఁడ నగు, మమ=నాకు, దుర్భిక్షాత్=కఱవువలన, భీతిః=భయము, కుతః=ఎక్కడిది?

తా. హే భగవన్! విశ్వేశ్వరా! నీచరిత్రం బనుమహాసముద్రములోని దివ్యామృతము కవిత్వం బనుకాలువలు పిల్లకాలువలు మొదలగువాని గుండ వాక్కనుకుండతో నాబుద్ధి యనుమోటవలన హృదయ మనుపొలములోనికి ప్రవహించి భక్తి యనుసస్యమును ఫలవంతమునుగాఁ జేయుచున్నది. ఇఁక నెంతకఱవు వచ్చినను నాకేమి భయము. మీచరిత్రలు తలఁచుచు భక్తితో మిమ్మెప్పుడు సేవించు చుందు నని భావము.

అ. వక్ష్యమాణ లక్షణస్య ఫలభాజో మమ న దుర్భిక్షా ద్భీతి రిత్యాహ:—

వ్యా. హే భగవన్ సమగ్రైశ్వర్యాది సంపన్న ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః, జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా. ఉత్పత్తిం చ వినాశం చ భూతానామాగతిం గతిం, వేత్తి విద్యా మవిద్యాం చ భగవాన్ స ఇతి స్మృతః. ఇతి చ ప్రమాణాత్ హే విశ్వేశ సకలభువనాధిప తే త్వత్సేవకస్య మమ ధీయంత్రేణ ధీరేవ బుద్ధిరేవ యంత్రం ఘటీయంత్రం తేన వచోఘటేన వాక్కలశేన కవితా కుల్యోపకుల్యాక్రమైః కవే ర్భావః కవితా సాహిత్యం సైవ కుల్యా ఉపకుల్యా చ తస్యాః క్రమై రానుపూర్వీభిః హృత్కేదారం ప్రాపితైః హృదయక్షేత్రం ప్రాపితైః సదాశివస్య పరమశివస్య తవచరితాంభోరాశిదివ్యామృతైశ్చరితం చరిత్రమేవాంభోరాశి స్సముద్ర స్తస్య దివ్యామృతై శ్శుద్ధోదకైః హృత్కేదారయుతా శ్చ హృత్ హృదయమేవ కేదారః క్షేత్రం తస్య క్తా శ్చ భక్తికలమాః భక్తయఏవ కలమాః శాలీ సస్యాని తే సాఫల్యం సఫలత్వ మాతన్వతే విస్తారయంతి ఆతన్వత ఇత్యత్ర వికరణభేదా ద్బహువచన మితిగ్రాహ్యం. ఏవం సేవకస్య మమ దుర్భిక్షా త్క్షామకాలాత్ భీతి ర్భయం

కుతః కాభీతి రిత్యర్థః. సార్వవిభక్తిక స్తసిః. మమ హృదయే సర్వదా త్వాం భజామీ త్యభిప్రాయః.

ఈ క్రిందివిషయములయందు మాఁగతనము చెవిటితనము మున్నగునవి రాకుండఁ జేయు మని వేఁడుకొనుచున్నారు.—

పాపోత్పాతవిమోచనాయరుచిరైశ్వర్యాయ మృత్యుంజయ
స్తోత్రధ్యాననతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే,
జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయన శ్రోత్రైరహం ప్రార్థితో
మామాజ్ఞాపయతన్నిరూపయముహుర్మామేవమామేఽవచః.

టీ. హేమృత్యుంజయ = మృత్యువును జయించినవాఁడా పాపోత్పాతవిమోచనాయ = పాపం బనునుత్పాతమును బాపుటకొఱకును, రుచిరైశ్వర్యాయ=ఇష్టమైన యైశ్వర్యముకొఱకును, స్తో... నే-స్తోత్ర=(నిన్ను) స్తోత్రముచేయుట, ధ్యాన=(నిన్ను) ధ్యానించుట, నతి=(నీకు) నమస్కారము చేయుట, ప్రదక్షిణ=(నీ) ప్రదక్షిణముచేయుట, సపర్యా = (నీ) పూజసేయుట, ఆలోకన = (నిను) జూచుట, ఆకర్ణనే = (నీకథలు) వినుట-వీని విషయమై, జి... త్రైః-జిహ్వా=నాలుకచేతను, చిత్త=మనస్సుచేతను, శిరః= శిరస్సుచేతను, అంఘ్రి=పాదములచేతను, హస్త = చేతులచేతను, నయన= కన్నులచేతను, శ్రోత్రైః=చెవులచేతను, అహం=నేను, ప్రార్థితః=ప్రార్థింపఁబడితిని. మాం=నన్ను, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపింపుము (అట్లు చేయుమని శెలవిమ్ము), తత్=ఆస్తోత్రాదికమునుగూర్చి, మాం=నన్ను, ముహుః = మాటిమాటికి, నిరూపయ=పురికొల్పుము. మే=నాకు, అవచః = మూఁగతనము, మైన=కలుగనీయకుము.

తా. ఓ మృత్యుంజయుఁడా! పాపములు బోయి యిష్టార్థము సిద్ధించుటకుగా పరమేశ్వరుని స్తుతింపు మని నాలుకయు, ధ్యానింపు మని మనమును, నమస్కరింపు మని శిరస్సును, ప్రదక్షిణము చేయు మని పాదములును, పూజించు మని చేతులును, చూడు మని కన్నులును, కథలు విను మని

చెవులును నన్ను కోరుచున్నవి. నీయాజ్ఞ లేనిదే ఆకోరిక నే నెట్లు తీర్ప గలుగుదును? నాకాజ్ఞయిచ్చి పలుమా అట్లు చేయుటకు నన్నలవఱుపుము. ఇంచు నాకు మూఁగతనము మతిలేమి కుంటితనము గ్రుడ్డితనము మొదలగు నవి రాకుండఁ జూడుము. ప్రతిబంధక మేమియు లేకుండఁ జింతితార్థసిద్ధి యొసఁగు మని తాత్పర్యము.

అ. వక్ష్యమాణార్థజాతే మూకత్వాదిదోషపరిహారార్థం ప్రార్థ్యతే:—

వ్యా. పాపోత్పాతఇతి. హే మృత్యుంజయ మృత్యుః యమః తం జయతీతి మృత్యుంజయ స్తస్య సంబుద్ధిః పాపోత్పాతవిమోచనాయ పాప మే వోత్పాతః విపత్సూచక కొదాచి త్క నిమిత్తం తస్య విమోచనాయ పరిత్యాగాయ రుచిరైశ్వర్యాయ సర్వస్వాతంత్ర్యాయ స్తోత్రధ్యాననతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే స్తోత్రం చ ధ్యానం చ నతిశ్చ ప్రదక్షిణం చ సపర్యా చ ఆలోకనం చ ఆకర్ణం చ ఏతేషాం సమాహారే విషయే జిహ్వాచిత్త శిరోంఘ్రిహ స్తనయనశ్రోత్రైః సమాహారఘటక స్వస్వవిషయే యథా సంఖ్యం ప్రార్థితోఽహ మస్మి త్వదాజ్ఞాపనం వినా తత్ప్రార్థిత మర్థం నిర్వోఢుం న శక్నోమి తస్మా న్మా మాజ్ఞాపయ ఏవం ప్రార్థిత మర్థం కుర్వితి విధేహి తత్సమాహారపదార్థం మాం నిరూపయ ముహుః ప్రదక్షిణ మనుసంధాపయ మే మమ అవచః వచసోఽభావః మూకత్వమితి యావత్. ఏత చ్చ అధ్యాత్మత్వాదీనాం దోషాణా ముపలక్షణం. మూకత్వాదయో దోషాః మైవ భూవన్ మా మేవ మా మేవ చ ఇత్యత్ర మాం ఏవ మా మే అవచః ఇతి ఛేదః. ప్రతిబంధకేన వినా ప్రార్థితార్థనిర్వాహో మమ భూయా దితి ప్రార్థయితు రభిప్రాయః.

ఈశ్వరుఁడు దుర్గాతిప్రియుఁడు గావునఁ దన మనోదుర్గమున నివసింపు మని వేఁడుచున్నారు.—

గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమశ్చాప్తబలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహాస్థితః,

విద్యావస్తు సమృద్ధి రిత్యఖిలసామగ్రీసమేతే సదా
దుర్గాతిప్రియదేవ మామకమనో దుర్గే నివాసం కురు. 42

టీ. హేదుర్గాతిప్రియ = పర్వతదుర్గమందు మిగుల ప్రీతిగలిగిన, హేదేవ=ఓయిపరమశివుఁడా, పరిఖాపదం=అగడ్తకు లక్షణమయిన, గాంభీర్యం=గాంభీర్యము (లోఁతు) ను, ఘనధృతిః= దిట్టమైనధైర్యము, ప్రాకారః=కోటగోడయును, ఉద్యద్గుణస్తోమః=పుట్టుచున్న సద్గుణపుంజము, ఆప్త బలం = నమ్మకమైన బలమును, దేహస్థితః = శరీరమందున్న, ఘనేంద్రియచయః=కన్ను మొదలగు నింద్రియములు, ద్వారాణి = రాకపోకలకు ద్వారములును, విద్యా=ఈశ్వరునిగుఱించిన జ్ఞానము, వస్తుసమృద్ధిః=పదార్థ సంపత్తియును, ఇతి=ఇట్టి, అఖిలసామగ్రీసమేతే -దుర్గమునకుఁ గావలసిన పదార్థములన్నియు సమగ్రముగానున్న, మామకమనోదుర్గే నామనస్సను దుర్గమందు, సదా=ఎప్పుడును, నివాసం=నివాసము, కురు=చేయుము.

తా. మిగుల దుర్గమంబగు కైలాసపర్వతమునఁ బ్రీతితో నివసించుచున్న యోదేవా! నామనంబు గాంభీర్య మగడ్తగను, ధైర్యము ప్రాకారముగను, ఉదయించుసుగుణంబులు బలంబుగను, చక్షురాదీంద్రియములు ద్వారములుగను, పరమశివజ్ఞానము సర్వపదార్థసంపత్తిగను దుర్గలక్షణసమగ్రం బై యున్నది దుర్గప్రియుండవుగావున నీవిందు నివసింపుము.

అ. దుర్గాతిప్రియత్వేన హేతునా స్వమనో దుర్గే శివస్య వాసం ప్రార్థయతే:—

వ్యా. గాంభీర్యమితి. హే దుర్గాతిప్రియదుర్గః దుఃఖేన గంతు మర్హః అచలః అత్యంతం ప్రీతివిషయో యస్యసతథోక్త స్తస్య సంబుద్ధిః హేదేవ పరమశివ పరిఖాపదం పరితః ఖాయతే అవదార్యతఇతి పరిఖాజలదుర్గ స్తస్యాః పదం లక్షణం గాంభీర్యం గంభీరభావం అగాధతేతి యావత్ ఘనధృతి స్సాంద్రధైర్యం తదేవ ప్రాకారస్సాలః. ని. 'ప్రాకారో వరణ స్సాల' ఇత్యమరః. ఉద్యద్గుణస్తోమః ఉద్యంతః ఉత్పద్యమానాః గుణాః స్సాఘు

గుణా స్తేషాం స్తోమ స్సమూహ స్సఏ వా ప్తబల మా ప్తం విశ్వసనీయం బల మాపన్నివృత్తిసాధకం దేహస్థితః దేహే విద్యమానఘనేంద్రియ చయః ఘనేంద్రియాణి చక్షురాదీని తేషాం చయ స్సందోహ స్సఏవ ద్వారాణి గమాగమస్థానాని విద్యా శివవిషయకజ్ఞానం సైవ వస్తుసమృద్ధి ర్గోప్యపదార్థ సంపదిత్యేవం భూతానాం దుర్గాపేక్షితాఖిలపదార్థానాం సామగ్రీసమగ్ర భావః పౌష్కల్యం తయా సమేతే మామకమనోదుర్గే మమేదం మామకం యన్మన స్తదేవదుర్గం దుష్ప్రవేశస్థానం తస్మిన్ త్వమిత్యధ్యాహారః సదా సర్వదా నివాసం వసతిం కురు విధేహీతి ప్రార్థనాయాం లోట్.

పరమశివుఁ డాదికిరాతమూర్తియగుట దలంచి కిరాతవాంఛితముల న్నియు నాయందున్నవిగాన మఱెందును బోవలదని వేఁడుచున్నారు.—

మాగచ్ఛ స్త్వమిత స్తతో గిరిశ భో మయ్యేవ వాసం కురు
స్వామి న్నాదికిరాత మామకమనః కాంతార సీమాంతరే,
వర్తంతే బహుశో మృగామదజుషో మాత్సర్యమోహాదయ
స్తాన్హత్వా మృగయావినోదరుచితా లాభంచసంప్రాప్స్యసి.

టీ. హే ఆదికిరాత = ఓయాదికిరాతమూర్తీ! భోగిరీశ=ఓకైలాస వాసా! స్వామిన్=మహాప్రభో! త్వం=నీవు, ఇత స్తతః=ఇటునటు, మాగచ్ఛః=పోకుము. మయ్యేవ=నాయందే, వాసం=నివాసమును,కురు=చేయుము. మామకమనః కాంతారసీమాంతరే=నాహృదయంబను నరణ్యప్రాంతమున, మదజుషః=(మమ్మెవ్వరును జయింపలేరను) గర్వముతోఁగూడిన, మాత్సర్య మోహాదయః=మాత్సర్యము, మోహము మొదలగు, మృగాః = అడవిమృగ ములు, బహుశః=అనేకములుగా, వర్తంతే=తిరుగుచున్నవి. తాన్=వానిని, హత్వా=చంపి, మృగయావినోదరుచితాలాభంచ = వేఁటతో కాలముగడ పుటయందలి కోరికయొక్క ఫలితమును, సంప్రాప్స్యసి = పొందఁగలవు.

తా. ఓ ఆదికిరాతమూర్తీ! దేవా! నీవెందును బోక నామనమునంద యుండుము. నామనంబు మహారణ్యంబు. అందు కామక్రోధాదులు క్రూర

మృగంబులు మెండుగానున్నవి. వాని వేఁటాడి వేఁటయందలి నీయానందము దీర్చికొంచువు.

అ. పరమశివస్యాది కిరాతభావం సంభావ్య కిరాతలభ్యం ఫలం మయి సులభ మితి హేతో ర్మత్తోఽన్యత్ర గమనం మాభూ దితి ప్రార్థయతే.

వ్యా. మాగచ్ఛఇతి. భో ఆదికిరాత ఆదివ్యాధ అతఏవ గిరి గిరౌశయాన స్వామిన్ సర్వాధ్యక్ష త్వ మిత స్తతః మాగచ్ఛ మైన వ్రజ మయి వాసంకురు మల్లభ్యం ఫలమిహ నాస్తీతిచే దస్తీత్యాహ మామకమనః కాంతారసీమాంతరే మదీయమనఏవ కాంతార మితరదుర్గమో వనప్రదేశ స్తస్య సీమాంతరే మర్యాదామధ్యే మదజుషః అస్మాన్ జేతుం కోపి న సమర్థ ఇతి గర్వభాజః మాత్సర్యమోహాదయః మాత్సర్యం మత్సరభావః అన్యస్మి న్నకారణతః ప్రద్వేషః మోహః అనాత్మ న్యహం బుద్ధిరహంకారఇతి యావ త్తదాదయో దోషాః కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాఖ్యా ఏవమృగాః వనజంతవః బహుశః బాహుళ్యేన ప్రవర్తంతే తాన్ హత్వా హింసిత్వా మృగయా వినోదరుచితాలాభం మృగార్థమటనం మృగయా తయా వినోదః కాలయాపనం తస్మిన్ రుచిరిచ్ఛాయస్య సః తస్యభావ స్తత్తా తస్యాః లాభః ఫలం మృగహననం తం చ సంప్రాప్స్యసి యథేచ్ఛం లప్స్యసే భవతః ఇష్టలాభాద్ధేతోః మయ్యేవ వాసం కుర్వితి ప్రార్థయితు స్తాత్పర్యం వినోద మచిరాదాగత్య సంప్రాప్స్యతి ఇతిపాఠే అరా త్క్షిప్రమేవాగత్య ఏత్య మృగయా వినోదం సంప్రాప్స్యసీత్యర్థః. 43

మహాదేవుని సింహరూపముగా గొనియాడుచున్నాఁడు.—

కరలగ్నమృగః కరీంద్ర భంగో
ఘనశార్దూలవిఖండనో స్త జంతుః,
గిరిశో విశదాకృతి శ్చ చేతః
కుహరే పంచముఖోఽస్తి మే కుతో భీః. 44

టీ. కరలగ్నమృగః = చేతనిఱికిన మృగముగలవాఁడును, కరీంద్రభంగః= గజాసురుని భంగపఱచినవాఁడును (ఏనుఁగులజంపునదియు), ఘన. శార్దూలవిఖండనః=ప్రబలుఁడైన వ్యాఘ్రాసురుని ఖండించినవాఁడును (పెద్దపులులజంపునదియు), అస్తజంతుః=తనయందు లీనమగు ప్రాణికోటిగలవాఁడును (జంతువులనిరసించునదియు), గిరిశః = పర్వతమందు శయనించువాఁడును, విశదాకృతిః= తెల్లని శరీరకాంతిగలవాఁడును, పంచముఖః=అయిదుముఖములుఁగలవాఁడును (తెఱువఁబడిన ముఖముగలదియు) నగు పరమేశ్వరుఁడను సింహము, మే-నాయొక్క, చేతఃకుహరే=చిత్తంబను గుహయందు, అస్తి=కలఁడు. మే=నాకు, భీః=భయము, కుతః=ఎక్కడిది ?

తా. సింహమునకు మృగములు చేత జిక్కుచుండును. పరమేశ్వరుఁడు మృగమును చేత నిఱికించుకొనియె. అది వ్యాఘ్రముల ఖండించును. ఈయన వ్యాఘ్రాసురుని ఖండించెను. దానిఁజూచి జంతువులన్నియుఁ గనపడకుండఁ బాఱిపోవును. ఆయనయందే జంతుజాలమంతయు లయించును. ఇరువురకును పర్వతమే వాసస్థలము, శరీరకాంతి తెలుపు, పంచముఖత్వ ముభయులకు నున్నది. అట్టి మహాదేవుఁడు సింహములాగున నా చిత్తకుహరమునందు నివసించియున్నాఁడు. నాకేభీతియును లేదు.

అ. మహాదేవం సింహత్వనిరూపణేన స్తౌతి:—

వ్యా. కరలగ్న ఇతి. పంచముఖః ఏవపంచముఖః పంచముఖాని యస్యేతి వ్యుత్పత్త్యా పరమేశ్వరః అన్యత్ర పంచముఖః వ్యక్తముఖః సింహః పచివ్యక్తీకరణే ఇతిధాతోః కర్తరి అచ్ప్రత్యయే పంచేతరూపసిద్ధిః మే మమ చేతః కుహరే చేతఏవ చిత్తమేవ కుహరః గిరిగుహా తత్రాస్త్యేవం సతి భీతి ర్భయం కుతః కస్మా ద్భయం భవిష్యతి న కుతోపీత్యర్థః స కథంభూత ఇత్యాకాంక్షాయామాహ—కరలగ్నమృగః కరే హస్తే లగ్నస్సంబద్ధో మృగో యస్యేతి తథోక్తః కరీంద్రభంగః కరీంద్రస్య కరిశ్రేష్ఠస్యాన్యత్ర గజాసురస్య భంగో యేన తథోక్తః వ్యధికరణబహువ్రీహిః ఘనశార్దూలవిఖండనః ఘనో బలవాన్ యశ్శార్దూలః వ్యాఘ్రః అన్యత్ర వ్యాఘ్రాసురః తం వివిధం ఖండయతి

ఛిన త్తిత్రి తథోక్తః అస్తజంతుః అస్తాః నిరస్తాః జంతవో యేన అన్యత్రాస్తాః స్వరూపే లీనాః జంతవో యస్య తథోక్తః గిరిశః గిరౌ శయానః గిరిశత్వముభయత్ర తుల్యమేవ విశదాకృతి ర్విశదా ధవళా ఆకృతిర్యస్య ఇదమప్యుభయత్రాపి తుల్యమేవ స్పష్టార్థోఽయం.

పరమశివునియొక్క పాదద్వంద్వమను పక్షి గూఁటిలో తన చిత్తపక్షి విహరించుటను గోరుచున్నారు.—

ఛందశ్శాఖిశిఖాన్వితై ర్ద్విజవరై స్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే,
చేతః పక్షిశిఖామణే త్యజ వృథా సంచార మన్యై రలం
నిత్యం శంకర పాదపద్మయుగళీ నీడే విహారం కురు. 45

టీ. హేచేతఃపక్షిశిఖామణే=మనస్సనియెడు పక్షిశ్రేష్ఠమా! ఛందశ్శాఖిశిఖాన్వితైః = వేదములనియెడు వృక్షములయొక్క కొమ్మలచివరలతో (వేదాంతములతో), అన్వితైః=సంబంధించిన, ద్విజవరైః=బ్రాహ్మణశ్రేష్ఠుల (పక్షిశ్రేష్ఠముల)చేత, సంసేవితే=ఆశ్రయింపఁబడినదియు, శాశ్వతే=నిత్యమైనదియు, సౌఖ్యాపాదిని=సుఖముసంపాదించునదియు, సుధాసారైః=అమృతరసముగల, ఫలైః=ఫలములతో, ఖేదభేదిని=సంసారదుఃఖమును (ఆఁకలిని) పోఁగొట్టునదియు, దీపితే=ప్రకాశవంతమైన, శంకరపాదపద్మయుగళీనీడే=ఈశ్వరునియొక్క పాదపద్మద్వంద్వమను గూఁటియందు, విహారం=విహారమును, కురు=చేయుము. అన్యైః=ఇతరములతో, అలం చాలును. వృథా=నిష్ఫలమైన, సంచారం=సంచారమును, త్యజ=విడువుము.

తా. ఓ చిత్తపక్షిసత్తమా! ఇటునటు దిరిగి యేల వృథా శ్రమపడెదవు? పరమేశ్వరుని పాదద్వంద్వము చక్కని చిలుకగూఁడు. దానికెన్నఁడును చలనంబులేదు. అందు చక్కని వెలుతురుగలదు. అది మిగుల సౌఖ్యావహము. అమృతఫలముగలిగి దుఃఖనివారకమై యొప్పుచున్నది. అందు విహరించి యానందింపుము. చూడు. అనేక ద్విజసత్తములాయాశాఖల శిఖ

రంబులకు సంబంధించియుండి దాని నాశ్రయించుచుందురు. నామనస్సు పరమశివుని పాదారవిందములనుమాత్రము దలంచుచుండుఁగాక యని తాత్పర్యము.

అ. పరమశివపాదయుగళీనీడే చేతఃపక్షిసంచారం ప్రార్థయతే:—

వ్యా. హే చేతఃపక్షిశిఖామణే చేత శ్చిత్తమేవ పక్షిశిఖామణిః పక్షిశ్రేష్ఠ స్తస్య సంబుద్ధి స్త్వం ఛందశ్శాఖిశిఖాన్వితై శ్శాఖాః ఏషాం సతీతి శాఖిన శ్ఛందాస్యేవ శాఖినః వృక్షా స్తేషాం శిఖాఏవ శిఖాః ఉపనిషద స్తాభి రన్వితై స్సంబద్ధై స్తద్విద్భి రిత్యర్థః ద్విజవరైః బ్రాహ్మణోత్తమై స్తైరేవ పక్షిశ్రేష్ఠై స్సంసేవితే సమ్య గాశ్రితే శాశ్వతే నిత్యే నాశరహిత ఇత్యర్థః సౌఖ్యాపాదిని సుఖసంపాదిని సుధాసారై స్సుధాయా ఇవ సారో రసః యేషాం తైః ఫలైః జ్ఞానవైరాగ్యాదిభి స్తైరేవ ఫలై ర్వ్యాప్తే ఖేదభేదిని ఖేదం సంసారదుఃఖం తద్భినత్తి ఛినత్తీతి తద్భేదిని అన్యత్ర క్షుధాజన్యశోకభేదిని దీపితే సంజాతప్రకాశే శంకరపాదపద్మయుగళీనీడే పాదౌ పద్మే ఇవ పాదపద్మే శంకరస్య శివస్య పాదపద్మే శంకరపాదపద్మే తయోర్యుగళీ ద్వంద్వం సైవ నీడః కులాయ స్తస్మిన్ విహారం కురు సంచారం విధేహి అన్యై రితరదేవసంబంధిపాదయుగళీనీడై రలం తే ఉపేక్షణీయా ఇతి భావ స్తత్ర వృథా విఫలం సంచారం త్యజ పరిహర. పరమశివ పాదారవింద విషయమేవ మన్మనో ఽస్త్వితి తాత్పర్యం.

మానసరాజహంసకు గౌరీపతియొక్క పాదసౌధాంతరాళమునందు నివాసము విధించుచున్నారు.

ఆకీర్ణే నఖరాజికాంతివిభవై రుద్యత్సుధావైభవై<br>
రాధౌతేఽపి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే,<br>
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు<br>
స్థిత్వా మానసరాజహంస గిరిజా నాథాంఘ్రిసౌధాంతరే.

టీ. హేమానసరాజహంస = ఓమనస్సనురాజహంసమా! నఖరాజికాంతివిభవైః=గోటివరుసలయొక్క కాంత్యతిశయములచేత, ఆకీర్ణే=నిండియున్నదియు, ఉద్యత్సుధావైభవైః = దినదినము వృద్ధిఁబొందుచున్న చంద్రునియమృతకిరణములు వ్యాపించుటచే (సున్న పుప్పూతలచే), అఢౌతే=శుభ్రపడినదియు, అపిచ = మఱియును, పద్మరాగలలితే = పద్మములయొక్క యెఱుపువంటి యెఱుపుతో నొప్పునదియు (పద్మరాగమణులు చెక్కినదియు), హంసవ్రజైః=హంసమంత్రధాన్యపరుల సమూహములచేత (హంసలగుంపులచేత), ఆశ్రితే = సేవింపఁబడినదియు నగు, గిరిజానాథాంఘ్రిసౌధాంతరే = పార్వతీపతియొక్క పాదంబను మేడలోపల, రహసి = రహస్యమందు, భక్తినిధూగణైస్సహ = భక్తియను భార్యలతోఁగూడ, నిత్యం = ఎప్పుడును, స్వేచ్ఛావిహారం = ఇష్టమైనసంచారమును, కురు = చేయుము.

తా. ఓ నామానసరాజహంసమా! నీ వాపార్వతీకాంతుని పాదంబను సౌధాంతరాళమునం దేకాగ్రముగ భక్తికాంతాసమేతవై స్వేచ్ఛావిహారము ననుభవించి యానందింపుము. ఆపాదసౌధము గోళ్ళవరుసమెఱుంగుసమృద్ధిగా వెలుంగ నాచంద్రశేఖరుని మస్తకంబున నిత్యోదితుండై యుండుచంద్రుని యమృతకిరణప్రసారము సున్నపుఁబూతగను పద్మములవంటి రక్తిమ పద్మరాగముల చెక్కడముగను జెలువొంది యున్నది. మఱియు హంస (హంసమంత్రము జపంచువారియొక్క, హంసలయొక్క) సముదాయములచే నిత్యము నాశ్రయింపఁబడుచున్నది.

అ. మానసరాజహంసస్య గౌరీ రమణాంఘ్రిసౌధాంతరే వాసం విధత్తే:—

వ్యా. ఆకీర్ణ ఇతి. హే మానసరాజహంస హంసానాం రాజా రాజహంసః రాజదంతాదిషుపరమిత్యుపసర్జనస్యోత్తరనిపాతః హంసశ్రేష్ఠ ఇత్యర్థః మానసమేవ రాజహంస స్తస్య సంబుద్ధిః నఖరాజికాంతివిభవై ర్నఖానాం రాజీః పంక్తిః తస్యాః కాంతిః ద్యుతి స్తస్యాః విభవై ర్విభూతిభి

స్సమృద్ధిభి రిత్యర్థః ఆకీర్ణే వ్యాప్తే ఉద్యత్సుధా వైభవై రుద్యతః నిత్యా భ్యుదయం ప్రాప్నువతః మూర్ధ్ని స్థితస్య చంద్రస్య సుధాః అమృతమ యకిరణా స్తాసాం వైభవై ర్వ్యాప్తిభి రన్యత్ర సుధా ఏవ సుధాః సుధ్ధ ర్కరాచూర్ణాని తాసాం విభవై ర్వ్యాప్తిభి రాఢాతే ధవళితే అపిచ కించ పద్మరాగలలితే పద్మస్య రాగ ఇవరాగః కాంతివిశేష స్సఏవ పద్మ రాగాఖ్య రత్నవిశేష స్తేన లలితే ఖచితే హంసవ్రజై రాశ్రితే హంసాః హంసమంత్రార్థధ్యానపరా స్తఏవ హంసాః హంసపక్షిణ స్తేషాం వ్రజై స్సమూహై రాశ్రితే ఉపాసితే అన్యత్రాశ్రితే ఆక్రాంతే గిరిజానాథాంఘ్రి సౌధాంతరే గిరిజానాథస్య పార్వతీనాథస్యాంఘ్రి రేవ సౌధః ప్రాసాదః తస్యాంతరే అంతర్విద్యమానే గృహే త్వత్ర భవ ఇత్యర్థ్. ఆదిస్సిద్ధిశ్చ రహస్యావృతస్థానే భక్తివధూగణైస్సహ భక్త్యయ ఏవ వధ్వః భార్యా స్తాసాం గణా స్సంఘా స్తై స్సహ నిత్యం సదా స్వేచ్ఛావిహారం స్వచ్ఛందక్రీడాం కురు విధేహి మహాదేవస్య పాదారవింద సేవాజన్యసుఖం ప్రియతమాసంగ జన్యసుఖ సదృశ మితిభావః. 46

శంభుధ్యానవసంతసంగిని హృదా రామేఽఘజీర్ణచ్ఛదా
స్స్రస్తా భక్తిలతా చ్ఛటావిలసితా పుణ్యప్రవాళశ్రితాః,
దీప్యంతే గుణకోరకాజపవచః పుష్పాణి సద్వాసనాః
జ్ఞానానందసుధామరందలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః. 47

టీ. శంభుధ్యాన = ఈశ్వర ధ్యానంబను, వసంతసంగిని = వసంత ర్తువుసంబంధముగల, హృదారామే = హృదయం బను పూవులతోఁట యందు, స్రస్తాః = రాలిపోయిన, అఘజీర్ణచ్ఛదాః = పాపంబులనునట్టి పండుటాకులును; విలసితాః = శోభమానములైన, పుణ్యప్రవాళశ్రితాః= పుణ్యములనునట్టి చిగురుటాకులను బొందినవియు, గుణకోరకాః = సద్గుణము లనునట్టి మొగ్గలుగలవియు, జపవచఃపుష్పాః = జపవాక్కు లనునట్టి పుష్ప ములు గలవియు, సద్వాసనాః=సత్కర్మసంస్కారములనునట్టి సువాసనలు

గలవియు నగు, భక్తిలతాచ్ఛటాః = భక్తియను తీవజొంపములును; జ్ఞానానందసుధామరందలహరీ = జ్ఞానము, ఆనందము నను అమృతమకరందముల యొక్క ప్రవాహము; సంవిత్ఫలాభ్యున్నతిః = బ్రహ్మజ్ఞానమను ఫలాభివృద్ధియును, దీప్యంతే = ప్రకాశించుచున్నవి.

తా. దేవా! మీధ్యానంబు వసంతకాలముగా సంప్రాప్తమగుట వలన నాహృదయంబను పూలతోఁటలోని పాపములన్నియు పండుటాకులుగా రాలిపోయినవి. పుణ్యములు చిగురుటాకులుగా మొలకలెత్తినవి. వాని మీఁద సద్గుణములు మొగ్గలుగా బయలుదేరినవి. నవనవలాడుచు మీభక్తి తీవలు సాగుచున్నవి. అందు జపవచనంబులు పుష్పములుగ నుదయించినవి. సత్కర్మసంస్కారములు సువాసన వెదజల్లుచున్నవి. జ్ఞానానందము లమృతమకరందములుగాఁ జాలుచున్నవి. బ్రహ్మజ్ఞానము ఫలంబుగా స్ఫురించుచున్నది. ఇట్లునాహృదయ ముద్యానగుణంబు లన్నియుంగల్గి యొప్పారుచున్నది. కనుకనే హృదయారామ మనఁదగియున్నదని తాత్పర్యము.

అ. హృదయారామే ఆరామలక్షణాని సంఘటయతి:—

వ్యా. శంభుధ్యానఇతి. శంభుధ్యానవసంతసంగిని శంభుధ్యానమేవ వసంతః వసంతసమయ స్తేన సంగ స్సంబంధోస్యాస్తీతి తథోక్తే హృదారామే హృదయోద్యానే సరిస్తాః చ్యుతాః అఘుజీర్ణచ్ఛదాః అఘాని పాపాన్యేవ జీర్ణపత్రాణి తే విలసితా శ్శోభమానాః పుణ్యప్రవాళశ్రితాః పుణ్యాన్యేవ ప్రవాళాని కిసలయాని తాని శ్రితాః ప్రాప్తాః ద్వితీయాశ్రితేత్యాదినా ద్వితీయాతత్పురుషః గుణకోరకాః స్సద్గుణా ఏవకోరకాః కుట్మలాః యాసాంతాః జపవచాంసి వ్యక్తవర్ణోచ్చారణాని తాన్యేవ పుష్పాణి యాసాంతాః స్సద్వాసనా స్సతాం సాధుకర్మణాం వాసనా సంస్కారస్సైవ వాసనాగంధో యాసాంతాః భక్తిలతాచ్ఛటాః భక్తయఏవ లతాః ప్రతతేయ స్తాసాం ఛటా స్సంఘాస్తాశ్చ జ్ఞానానంద సుధామరందలహరీ జ్ఞానం చానంద శ్చ జ్ఞానానందౌ సుధామృతంమరందం మధుసాచ సచ తౌ జ్ఞానానం

దావేవ సుధామరందౌ తయోర్లహరీ ప్రవాహస్సా చ సంవిత్ఫలాభ్యున్నతి స్సంవిద్బ్రహ్మజ్ఞానం తదేవ ఫలం తస్యాభ్యున్నతి ర్వృద్ధి స్సా చైతే సర్వే దీప్యంతే ప్రకాశంతే మమ హృదయ ముద్యానసర్వగుణసంపన్న మితిభావః. 47

పరశివధ్యాన ముత్తమఫలదాయకమని బోధించి యితరదేవతాశ్రయణమునుండి మనస్సును మరలించుచున్నారు.—

నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృ త్సద్వాసనావిష్కృతమ్,
శంభుధ్యానసరోవరం వ్రజ మనో హంసావతంసస్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం ప్రాప్స్యసి. 48

టీ. హేమనోహంసావతంస=ఓమానసరాజహంసమా! ని...యం–నిత్యానంద=శాశ్వతానందమను, రస = ఉదకమునకు, ఆలయం = ఉనికిపట్టును, సు...యం – సుర = దేవతలయొక్కయు, ముని = పరమహంసలయొక్కయు, స్వాంత = హృదయములను, అంబుజాత=పద్మములకు, ఆశ్రయం = ఆధారమును, స్వచ్ఛం = నిర్మలమును, సద్ద్విజసేవితం =యోగ్యులయిన ద్విజుల (రాజహంసల) చేత సేవింపఁబడినదియు, కలుషహృత్ = పాపహరమును, స...తం – సద్వాసనా = సత్కర్మవాసనల చేత (సువాసనలచేత), ఆవిష్కృతం = ప్రకటింపఁబడినదియునగు, శం...రం–శంభుధ్యాన = ఈశ్వరధ్యానంబను, సరోవరం = మంచిసరస్సును, స్థిరం = స్థిరమైనదానిని, వ్రజ = పొందుమా, క్షు...మం–క్షుద్రాశ్రయ = అల్పుల నాశ్రయించుటయను, పల్వలభ్రమణ = పడియలనుగుఱించిన త్రిప్పటచేత, సంజాత = పుట్టిన, శ్రమం = ఆయాసమును, కిం = ఏల, ప్రాప్స్యసి = పొందెదవు.

[illegible] మనో రాజహంసమా! క్షుద్రదేవతల నాశ్రయించుట వల్ల కొన్ని పాపములు తొలఁగినఁ దొలఁగుఁగాక. శాశ్వతానందము చేకూ

అను. అది కేవలము నీరునిలిచెడు చిన్న చిన్న గుంటలకెల్లఁబోయి శ్రమజెందు టగాని వేఱుకాదు. అట్టి యిట్టియాయాస మేలపడియెదవు ? శంభుధ్యానము చేయుము. అది మహాసరోవరము. అందు శాశ్వతానందము జలముగను, దేవతలు, మునులు మున్నగువారిచిత్తములు కమలములుగను స్థిరముగా నిండియుండును. బ్రాహ్మణ క్షత్రియాదులగు పెద్దలెల్లరును హంసాదిపక్షులుగా నిత్యము సేవించుచుందురు. అది పాపములెల్లఁ బాపును. సత్కర్మసంస్కారమునగాని లభింపదు. మంచిమంచివాసనలను వెదజల్లుచుండును. తక్కినచెఱువులవలె నది యొకప్పుడును తఱుఁగునది కాదు. బహిరంగసాధనములను విడిచి యంతరంగసాధనము నవలంబింపుమని ముఖ్యాభిప్రాయము.

అ పునః శివధ్యానాశ్రయణమేవ సర్వోత్తమఫలదాయక మితి నిర్ణీయాన్యదేవతాశ్రయణవ్యావృత్తిం కుర్వన్నాహ.—

వ్యా. నిత్యానంద ఇతి. హే మనోహంసావతంస హంసానా మవతంస శ్శ్రేష్ఠః రాజహంసః మనఏవ హంసావతంస స్తస్య సంబుద్ధిః నిత్యానంద రసాలయం నిత్యానంద శ్శాశ్వతానంద స్సఏవ రసః ఉదకం తస్యాలయం స్థానం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం సురా శ్చ దేవా శ్చ మునయ శ్చ పరమహంసా శ్చ తేషాం స్వాంతాని హృదయాని తా న్యేవాంబుజాతాని జలజాని తేషా మాశ్రయం మాలయం స్వచ్ఛం మలరహిత మన్యత్ర విజాతీయప్రత్యయానంతరితం సద్విజసేవితం సంత శ్చ తే ద్విజాః బ్రాహ్మణాదయ స్త్రయోవర్ణా స్తై స్సేవిత మన్యత్ర సద్విజాః రాజహంసా స్తై స్సేవితం కలుషహృత్కలుషాణి పాపాని హరతీతి కలుషహృత్ అన్యత్రాపి సమానమేవ సద్వాసనావిష్కృతం సతాం సాధుకర్మణాం వాసనయా సంస్కారేణావిష్కృతం ప్రకటిత మన్యత్ర సద్వాసనా సుగంధ స్తేనావిష్కృతం ప్రకటితం శంభుధ్యానసరోవరం శంభో ర్ధ్యానం విజాతీయప్రత్యయానంతరిత సజాతీయప్రత్యయప్రవాహ[illegible] త్వం వ్రజ గచ్ఛ స్థిరం [illegible] సరః అస్థిర మితిభావః క్షుద్రాశ్రయపల్వలభ్రమణ సంజాత[illegible]

ఉభయతారతమ్యా నభిజ్ఞా స్తేషా మాశ్రయః పాపేక్ష్య స్తారణసమర్థం న ముక్తిద మిత్యర్థః తాదృశం యత్స్వల్పాలం శంభుధ్యానసరోవరాదల్పం తదు ద్దిశ్య యద్భ్రమణం సంచార స్తేన జాతోయ శ్శ్రమ స్తం కిం కిమర్థం ప్రాప్స్యసి గమిష్యసి బహిరంగసాధనం పరిత్యజ్యాంతరంగసాధన . మనుతిష్ఠేతి భావః.

శివభక్తిలభ్యమగు ఫలమును గోరుచున్నారు.—

ఆనందామృతపూరితాహరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్న ముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా,
ఉచ్చైర్మానసకాయమానపటలీ మాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మ సంవర్ధితా. 49

టీ. ఆ...తా-ఆనందా= (శివభక్తియందలి) ప్రేమయను, అమృత= ఉదకముచేత, పూరితా=నింపఁబడినదియు, హ...తా-హర=శివునియొక్క, పదాంభోజ = పాదపద్మమను, ఆలవాల = పాదునుండి, ఉద్యతా = పుట్టిపెరిఁగినదియు, స్థై...ఘ్నం-స్థైర్య = చిత్తస్థైర్యంబను, ఉపఘ్నం = ప్రాఁకను, ఉపేత్య=పొంది, శాఖోపశాఖాన్వితా=చిలవలు పలవలు పొందు కొనినదియు, ఉచ్చైః = ఉన్నతమైన, మా...లీం-మానస = మనస్సను, కాయమాన = పందిళ్ళయొక్క, పటలీం = సమూహమును, ఆక్రమ్య = అలముకొని, నిష్కల్మషా=చీడమొదలగువానిచే శిథిలముగాక, సత్కర్మ సంవర్ధితా= పురాకృత పుణ్యకర్మముల (దోహదక్రియల) చేత వృద్ధిబొందింపఁబడినదియు నగు, భక్తిలతికా=భక్తియనుతీఁగ, మే=నాకు, నిత్యాభీష్టఫల ప్రదా = శాశ్వతమైన నాయభీష్టఫలము నిచ్చునది, భవతు = అగుగాక.

తా. పరమేశ్వర సేవానురక్తి నీరుపోతగను పరశివచరణకమలము పాదుగను జిత్తస్థైర్యము ప్రాఁకుదుకంపగను నమరఁ బయలుదేరి చిలవల పలవల నల్లుకొనుచుఁ గ్రమముగా నున్నతమైన నామనస్సనియెడుపందిరి యం

తట నలముకొని చీడమున్నగు దోషములచే శిథిలము గాకుండనున్న యీభక్తిలతామతల్లి పురాకృత పుణ్యకర్మమను దోహదక్రియలచేఁ బెంపొంది నామనోభీష్టమగు శాశ్వతఫలంబును ఫలించుగాత.

అ. శివభక్తిసాధ్యం ఫలం ప్రార్థయతే:—

వ్యా. ఆనందామృతేతి. ఆనందామృతపూరితా ఆనందః శివభక్త్యా ప్రీతి స్స ఏవామృతమంభస్తేనపూరితా సంతర్పితా హరపదాంభోజాలవాలోద్యతా శివపదాంభోజమేవ ఆలవాలః ఆశ్రయభూమి స్తస్మాదుద్యతా ఊర్ధ్వం ప్రసృతా వృద్ధిం గతేత్యర్థః స్థైర్యోపఘ్నం స్థైర్యం స్థిరభావ స్స ఏవోపఘ్నః ఆశ్రయః ఉపష్టంభదారువిశేష స్తముపేత్యావష్టభ్య శాఖోపశాఖాన్వితా శాఖాః మహాశాఖాః ఉపశాఖాః అల్పశాఖా అవయవవిశేషా ఇత్యర్థ స్తాభి రన్వితా సంయుతా ఉచ్చై ర్మానసకాయమానపటలీ ఉత్కృష్టాని చ తాని మానసాని చ త్యాన్యేవ కాయమానాని లతారోహణార్థం కల్పితచ్ఛదీంషి (ఆంధ్రభాషాయాం పందిళ్ళు) తేషాం పటలీ సమూహ స్తా మాక్రమ్యారుహ్య నిష్కల్మషాః శైథిల్యాదిరహితా సత్కర్మప్రవర్ధితా సత్కర్మభిః పురాకృత పుణ్యవిశేషైః సంవర్ధితా వృద్ధిం ప్రాపితాన్యత్ర దోహదాదిభిర్వర్ధితా ఓషధీవర్ధక సంస్కారై రిత్యర్థః భక్తిలతికా భక్తిస్సేవా సైవ లతికాలతాస్వార్థేకః మే మమ నిత్యాభీష్టఫలప్రదా అభీష్టఫల మైచ్ఛికఫలం నిత్యం శాశ్వతం చ తదభీష్టఫలం చ తత్ప్రకర్షేణ దదాతీ సా భవత్వస్తు.

ఇప్పుడు శ్రీశైలవాసియగు భ్రమరాంబికాసమేత మల్లికార్జును భజించుచున్నారు.—

సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామ మసకృ త్సద్వాసనాశోభితమ్,
భోగీంద్రాభరణం సమస్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం;
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితమ్. 50

టీ. సం...తం-సంధ్యారంభ = సాయంకాలమందు, విజృంభితం = తాండవనృత్యమునవిజృంభించునట్టియు(పుష్పములువికసించునదియు),శ్రు... తం-శ్రుతిశిరస్థానాంతర = వేదములకు శిరస్థానము లైనయుపనిషత్తు లను నితరస్థలమందు (చెవులయందును, తలమీఁదను), అధిష్ఠితం = బోధ్యముగా నున్నదియు (అలంకారముగానున్నదియు), స..మం-సప్రేమ=ప్రేమతోఁ గూడిన, భ్రమరా(ర) = భ్రమరాంబికచేతను (తుమ్మెదలచేతను), అభిరామం = మనోహరమైనట్టియు, అసకృత్ = ఎల్లప్పుడును, సం...తం-సద్వాసనా = సాధువులయొక్క భావనచేత (మంచిసువాసనచేత), శోభితం = ఒప్పునట్టియు, భో...ణం-భోగీంద్ర = వాసుకి (భోగవంతులకు), ఆభరణం=భూషణముగాఁ గలిగినట్టియు (భూషణమైనట్టియు), స...జ్యం-సమస్తసుమనః=ఎల్లదేవతల (విద్వాంసుల) చేతను (సకలపుష్పములకంటెను), పూజ్యం = పూజింపఁదగినట్టియు, గు...తం-గుణ = సత్వగుణముచేత (సుగంధగుణముచేత), ఆవిష్కృతం=ప్రకటితమైనట్టియు, శివాలింగితం= పార్వతీదేవిచేతఁ గౌఁగలించుకొనఁబడిన, శ్రీ...గం-శ్రీగిరి=శ్రీశైలమందున్న, మల్లికార్జున = మల్లెతీఁగయల్లుకొన్న మద్దిచెట్టుంబోలిన, మహాలింగం= పరమాత్మసూచకమైన మహాలింగమును, సేవే = భజించుచున్నాను.

తా. శ్రీశైలపర్వతమందు వేంచేసి యున్న మల్లికార్జునమహాలింగము మల్లెతీఁగయల్లుకొన్న మద్దిచెట్టుతోఁబోల్చి వర్ణింపఁబడినది. యెట్లన, ఈశ్వరుఁడు సాయంకాలమందు తాండవనృత్యముతో భక్తుల నానందపఱచును. అది పుష్పవికాసములతో నట్లుచేయును. ఆతఁడు శ్రీశైలమందుగాక శ్రుతిశిరస్సులనగా ఉపనిషత్తులయందునుండును. దానిపుష్పములు శ్రవణములయందును శిరస్సులయందు నలంకారములుగా నుండును. మల్లికార్జునుఁడు భ్రమరాంబతోడను అర్జునవృక్షము భ్రమరములతోడను గూడి యొప్పును. ఈశ్వరునికి సద్వాసనయనగా సాధుభావనయొక్క శోభయు దానికి సువాసనయొక్క శోభయు గలదు. భోగీంద్రుఁడు (శేషాహి) శంకరుని కాభరణము. భోగీంద్రులనగా మహాభోగవంతులకు దాని పుష్పము లలంకారములు. పర

మేశ్వరుఁడు సుమనస్పూజ్యుఁడు అనఁగా సర్వదేవతలచేతనుఁ బూజింపఁబడువాఁడు. దానిపుష్పంబు లన్నిపుష్పములకంటెను మిగుల శ్లాఘనీయములు. భగవంతుఁడు సత్త్వమువలన దెలియఁబడును. అయ్యది సుగంధగుణంబునఁ దెలియనగును. ఇట్లు శ్రీశైలపర్వతంబున పరమాత్మసూచకంబుగా నవతరించియున్న మల్లికార్జునమహాలింగమూర్తిని భజించెద నని తాత్పర్యము.

అ. అధునా శ్రీశైలవాసినం శివం భజతే:—

వ్యా. సంధ్యారంభ ఇతి. శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శ్రీగిరౌ శ్రీశైలే విద్యమానం మల్లికార్జునమహాలింగం మల్లికావల్ల్యా సంశ్లిష్టార్జునవృక్షసదృశం మహాలింగం లీనం సూక్ష్మం పరమాత్మానం గమయతీతి లింగమత ఏవ మహత్తల్లింగమహం సేవే భజే ఇతి క్రియాన్వయః. తత్కీదృశం శివాలింగితం శివయా పార్వత్యా ఆలింగితం పీఠికారూపయా శక్త్యా ఆవిష్టమితి భావః ఉభయో రుపమానోపమేయ భూతయో రర్జునమహాలింగయో ర్ధర్మాన్ ప్రతిపాదయితుం శ్లిష్టవిశేషణై రర్జునమహాలింగే విశినష్టి సంధ్యారంభవిజృంభితం సంధ్యాయాః స్సాయంసంధ్యాకాలస్యారంభే ప్రాదుర్భావే విజృంభితం నర్తనప్రకటనేన భక్తానుగ్రాహక మన్యత్ర పుష్పవికసనేన శోభితం శ్రుతిశిరస్స్థానాంతరాధిష్ఠితం శ్రుతీనాం వేదానాం శిరస్స్థానా న్యుపనిషదశ్శైలాదన్యాని స్థానాని స్థానాంతరాణ్య స్వపదవిగ్రహాస్తాన్యధిష్ఠాయాభిధేయతా సంబంధేన స్థితం కర్తరి క్తః అన్యత్ర శ్రుతి శ్చ శిర శ్చ శ్రుతిశిరసీ కర్ణమూర్ధానౌ తయోస్స్థానాంతరం స్థానభేద స్తదధిష్ఠాయ స్థితం స్వావయవైః పుష్పైరిత్యర్థః సప్రేమభ్రమరాభిరామం ప్రేమయుక్తయా భ్రమరయా భ్రమరాంబికయా భిన్నశక్త్యాభిరామం మనోజ్ఞ మన్యత్ర ప్రేమసహిత చంచరీకై రభిరామ మసకృ త్సర్వదా సతాం సాధూనాం వాసనయా భావనయా శోభితం వ్యాప్త మన్యత్ర సద్వాసనయా సాధుగంధేన శోభితం భోగీంద్రాభరణం సర్వభూషణ మన్యత్ర భోగః ఏషా మస్తీతి భోగిన స్తేషా మింద్రాశ్శ్రేష్ఠాః విషయానుభవితార స్తేషా మాభరణం భూషణం

సమస్తసుమనఃపూజ్యం సమస్తైస్సుమనోభి ర్దేవైర్విద్భిశ్చ ర్విద పూజ్య మన్యత్ర సర్వేభ్యః పుష్పేభ్యః పూజ్యం పూజ్యకుసుమవిశిష్టం గుణావిష్కృతం గుణే సత్వగుణసంబంధేనావిష్కృతం ప్రకాశిత మన్యత్ర గంధాదిగుణైరావిష్కృతం ప్రకాశిత మేతాదృశం లింగం సేవేఇతి క్రియాయా మన్వయః మల్లికార్జునమితి విభక్తిపరిణామేన విశేషణానాం తత్రా ప్యన్వయః స్పష్టార్థోఽయం.

భ్రమరాంబాపతిని భ్రమరపతిగా నిరూపించి తన మానసకమలమునందు విహరించుటకు వేఁడుకొనుచున్నారు.—

భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసిత వపుః పంచేషుణా చాదృతః,
సత్పక్షః సుమనోవనేషు సపున స్సాక్షాన్మదీయే మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః. 51

టీ. భృంగీచ్ఛానటనోత్కటః-భృంగి(గీ) = భృంగియను ప్రమథుని యొక్క (భృంగజాతియొక్క), ఇచ్ఛా=అభిప్రాయముచేత (అపేక్షలను), నటన=వర్తించుటయందు (అనుకరించుటయందు), ఉత్కటః=ఉత్కటేచ్ఛ లిగినగట్టియు, క...హీ-కరిమద=గజాసురుని బలగర్వమును (ఏనుఁగుమదము), గ్రాహీ=అణఁచిపట్టినట్టియు (గ్రహించుస్వభావముగలిగినట్టియు), స్ఫు...దః-స్ఫురత్ = ప్రకాశించుచున్న, మాధవ = మోహినీరూపుఁడైన మాధవునియందు (వసంతమందు), ఆహ్లాదః = ఆనందముగలిగినట్టియు, నాదయుతః = ప్రణవనాదప్రతిపాద్యుఁడైనట్టియు (ఝుంకారధ్వనితోఁ గూడినట్టియు), మహత్=గొప్ప, (అ) సితవపుః = తెల్లనిశరీరము గలిగినట్టియు (నల్లనిశరీరము గలిగినట్టియు), పంచేషుణా = మన్మథునిచేత, ఆదృతః = బాణలక్ష్యముగను(సహాయముగను) ఆదరింపబడినట్టియు, సుమనోఽవనేషు-సుమనః=దేవతల (విద్వాంసుల) యొక్క, అవనేషు=సంరక్షణములయందు (సుమనోవనేషు=పూలతోటలయందు),సత్పక్షః=ఉన్న యభిమానము గలిగి

నట్టియు, సాక్షాత్=కన్నులయెదుర నున్నట్టియు, శ్రీశైలవాసీ=శ్రీశైలమందు భక్తుల ననుగ్రహింప లింగరూపమున నున్నట్టియు, విభుః=పలువిధరూపం బు లగుచున్నట్టియు, భ్రమరాధిపః=భ్రమరాంబాపతియగునట్టి భృంగశ్రేష్ఠ ము, మదీయే=నాసంబంధమైన, మనోరాజీవే=మానసకమలమందు, విహర తాం=విహరించుఁగాక.

తా. హేవిభో! శ్రీశైలవాసా! భ్రమరాంబాధిపతీ! నీవు భ్రమరాధి పతివి అనఁగా తుమ్మెదఱేఁడుగావున నాచిత్తకమలంబున విహరింపుము. అది యెట్లన, నీవు నీభక్తుఁడగు భృంగీశ్వరుని యిచ్ఛానుగుణముగా నర్తింపఁ జూతువు, తుమ్మెదఱేఁడు భృంగియనఁగా తుమ్మెదలజాతి, దానియపేక్ష ననుసరించి ప్రవర్తించును. నీవు గజాసురునిమదమును నిగ్రహించితివి, అది గజముల మదజలము గ్రహించును. నీకు మోహినీరూపము ధరించిన మాధవుని యందు దాహ్లాదము స్ఫురించినదిగదా దానికి (మాధవ అనఁగా) వసంతమునం దాహ్లాదము ప్రస్ఫురించును. నీకు ప్రణవనాదము, దానికి ఝుంకారనాదము. మన్మథుఁడు నిన్ను పుష్పబాణముతో నాదరించెను, దానిని సహాయముగా నాదరించెను. నీకు సుమనోవనము=విబుధరక్షణమం దభిమానము, దానికి సుమనోవనము = పుష్పవనమం దభిమానము. కాఁబట్టి నాచిత్తకమలమం దెడబాయక యుండుట సహజమేగదా యని తాత్పర్యము. 51

అ. భ్రమరాధిపతిత్వ నిరూపణేన స్వమనోరాజీవే విహరణం ప్రార్థ్యతే:—

వ్యా. వివిధం భవతీతి విభుః సోకామయత బహుస్స్యామితి శ్రుతేః శ్రీశైలవాసీ భక్తానుగ్రహాయ లింగరూపేణ శ్రీశైలవాసీ భ్రమరాధిపః భ్రమరాంబాయాః అధిపః సఏవ భ్రమరాధిపః భృంగరాజః మన్మనఏవ రాజీవం పద్మం తస్మిన్విహరతాం సంచరతు భృంగాణాం రాజీవవాసస్స్వ భావ్యాదితిభావః తమేవ శ్లిష్టవిశేషణై ర్విశినష్టి భృంగీచ్ఛానటనోత్కటః భృంగిణః భక్తవిశేషస్యేచ్ఛయా నటనే నర్తనే ఉత్కటః ఉత్కటేచ్ఛ అన్యత్ర భృంగజాతే రిచ్ఛాయా అపేక్షయాః నటనేఽనుకరణే,

ఉత్కటః ఉత్కటేచ్ఛః కరిమదగ్రాహీ కరిణో గజాసురస్య మదః బలవత్త్వాభిమాన స్తం గృహ్ణాతి తత్సంహరణేనహంతీతి తథోక్తః అన్యత్ర కరిణాం గజానాం మదః మదజలం తద్గ్రహణశీలస్తా, చ్ఛేత్యే ణి నిః స్ఫురన్మాధవాహ్లాదః మాధవే మోహినీ రూపాపన్నే ఆహ్లాదః ప్రవృత్త్యౌత్సుక్యం స్ఫురన్ప్రకాశమానః మాధవాహ్లాదో యస్యాన్యత్ర మాధవే వసంతే ఆహ్లాదః ఆనందః స్ఫురన్మాధవాహ్లాదో యస్య నాదయుతః ప్రతిపాద్యత్వసంబంధేన ప్రణవనాదసహితః అన్యత్ర ఝుంకారధ్వనియుతః మహాసితవపు స్సితం శుభ్రం వపు ర్యస్యసః మహాంశ్చాసౌ సితవపుశ్చేతి తథోక్త మన్యత్రాసితం నీలం వపు ర్యస్య మహాంశ్చాసౌ నీలవపు శ్చ తథోక్తం పంచేషుణాచాదృతః పంచేషుణా మన్మథేనాదృత స్స్వబాణలక్ష్యత్వేన నిశ్చితః అన్యత్రాదృత స్స్వసహాయత్వేన నిశ్చిత స్సుమనోవనేషు సత్పక్షః సుమనసాం దేవానా మవనేషు రక్షణేషు సత్పక్ష స్సత్పక్షో భిమానో యస్య తథోక్తః అన్యత్ర సుమనసాం పుష్పాణాం వనేషూద్యానాదిషు సన్ విద్యమానః పక్షోఽభిమానో యస్య తథోక్త స్సాక్షా చ్చక్షురాదీంద్రియవిషయః ఉభయత్ర తుల్యార్థక మిద మేవం భూత స్స శ్రీశైలవాసీ భ్రమరాధిపతి ర్విహరతామితి పూర్వేణాన్వయః సర్వదా మనస్యాత్యంతికసంయోగేన తిష్ఠత్వితి భావః.

మేఘముగా భావించిన శంకరుని నాచిత్తచాతకంబు కోరుచున్నది యని చెప్పచున్నారు.—

కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్యఫలోదయాయ సుమన స్సంసేవ్య మిచ్ఛాకృతిమ్,
నృత్యద్భక్తమయూర మద్రినిలయం చంచజ్జటామండలం
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాం మే మన శ్చాతకః.

టీ. హేశంభో = సుఖోత్పత్తికారణమైనవాఁడా! హేనీలకంధర= నల్లనికంఠముగలవాఁడా, (నీల=నల్లని, కం=జలము, ధర = ధరించినవాఁడు,

మేఘుఁడా!) మే=నాయొక్క, మనశ్చాతకః = మనస్సను చాతకపక్షి, కారు ణ్యామృతవర్షిణం=దయయను నమృతమును వర్షించునట్టియు (కనికరమువల్ల జలమునువర్షించునట్టియు), ఘు...రం-ఘన-గొప్పదియగు, విపత్=ఆపదయను (సస్యనాశము మున్నగువిపత్తుగలిగిన), గ్రీష్మ=అతితాపమును (గ్రీష్మమును), ఛిదా=ఛేదించుటకు, కర్మఠం=సమర్థమైనట్టియు, వి...య-విద్యాసస్య=విద్య యను పైరయొక్క, ఫలోదయాయ=ఫలము (బ్రహ్మానందానుభవము) జనిం చుటకొఱకు, సుమనస్సంసేవ్యం = దేవతలచేతను, పండితులచేతను (కర్షకుల చేతను), ఆశ్రయింపఁదగినట్టియు, ఇచ్ఛాకృతిం=కామరూపమైనట్టియు, నృ త్యద్భక్తమయూరం-నృత్యత్ = నాట్యముచేయుచున్న, భక్త=భక్తులనియెడు (మేఘమందుప్రీతిగల), మయూరం = నెమళ్లుగలిగినట్టియు, అద్రినిలయం= పర్వతము నివాసస్థలముగాఁ గలిగినట్టియు, చం...లం - చంచత్=చలించు చున్న, జటా = జడలయొక్క (మెఱుపులయొక్క), మండలం=సమూ హము గలిగినట్టియు, త్వాం = నిన్ను, సదా = ఎల్లప్పుడును, వాంఛతి= కోరుచున్నది.

తా. హేశంభో! నీలకంధరా! నాచిత్తచాతకంబు నీలమేఘంబునుం బోలె వాంఛితసిద్ధికై నిన్నుదర్శింప వేచియున్నది. మేఘుంబు కరుణతో జలం బును వర్షించును, నీవుకరుణామృతంబునువర్షింతువు. అది సస్యాదుల నెండిం పఁజేయు గ్రీష్మమును దొలఁగింపఁగలదు, నీవు మహావిపత్సంతాపములను తొ లఁగింతువు. అది సస్యములు చక్కగా ఫలింపఁజేయును, నీవును విద్యయను సస్యమునకు బ్రహ్మానందానుభవమును ఫలముగాఁ గలిగించెదవు. దేవతలు పం డితులు మున్నగువారందరు సుమనస్కులై నిన్ను భజించెదరు, కర్షకులెల్ల శుభప్రదమైన సస్యఫలమందు మనస్సుగలవారై మేఘునపేక్షింతురు. మయూ రంబులు మేఘునిఁజూచి ప్రీతిమంతములై నాట్యముసేయును, భక్తులట్లు నీ యెదుర నాట్యముసల్పుదురు. నీవు కైలాసపర్వతమున నివసింతువు, మేఘుఁ డును పర్వతంబున నివసించును. కామరూపంబును జటావల్లియు నుభయుల కుం గలదు. (మేఘపక్షమున జట యనఁగా మెఱుపు).

అ. మేఘత్వేన నిరూప్యమాణం శంకరం మే మనశ్చాతకో వాంఛతీత్యాహ:—

వ్యా. కారుణ్యామృతఇతి. హే నీలకంధర నీలః కంధరః గ్రీవాయస్య తస్య సంబుద్ధి రన్యత్ర ధరతీతి ధరః కస్య జలస్య ధరః కంధరః మేఘః నీలశ్చాసౌ కంధరశ్చ నీలకంధరః తస్య సంబుద్ధి శ్శంభో సుఖోత్పత్తికారణభూత త్వాం భవంతం సదా సర్వదా మే మమ మనశ్చేతఏవ చాతకః పతన్మేఘబిందుభక్షణః పక్షివిశేషః వాంఛతీచ్ఛతి త్వద్దర్శనేన వాంఛితమర్థం ప్రాప్తుమిచ్ఛతీతి భావః కథంభూతంత్వా మిత్యాకాంక్షాయాం కారుణ్యామృతవర్షిణం కారుణ్యమేవామృతం తద్వర్షణశీల మన్యత్ర కారుణ్యా దమృత ముదకం వర్షతి తచ్ఛీలమస్యేతి కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం ఘనా మహతీ విపత్ క్షయాదుఃఖం సైవ గ్రీష్మః అతితాప స్తస్యచ్ఛిదా ఛేదనం భిదాదిభ్యోఽజిత్యజ్ ప్రత్యయః. స్త్రీలింగతా చ తస్యాం కర్మఠం కర్మశూరం తచ్ఛేదన సమర్థమిత్యర్థః అన్యత్ర ఘనామహతీ విపత్సస్యాదిశోషణరూపాయస్యసః ఘనవిపత్సచాసౌ గ్రీష్మస్తస్య ఛిదాఛేదనం తస్యాం కర్మఠం తచ్ఛేదనసమర్థమిత్యర్థః విద్యాసస్యఫలోదయాయ విద్యైవ సస్యం తస్యఫలం బ్రహ్మానందానుభవ స్తస్యోదయః ఉత్పత్తిస్తస్మై సుమన స్సంసేవ్యం సుమనోభి ర్దేవై ర్విద్వద్భిశ్చ సంసేవ్యం సమ్యక్సేవితు మర్హ మన్యత్ర సస్యఫలోదయాయ సుమనోభి శ్శోభనే సస్యాదిఫలే మనః యేషాంతే సుమనసః కర్షకా స్తైస్సంసేవ్యం సమ్యగపేక్షితు మర్హ మిచ్ఛాకృతిం స్వేచ్ఛయా ప్రాప్యాకార ముభయత్ర సమానమేవేదం నృత్యద్భక్తమయూరం భక్తా ఏవ మయూరాః కేకినః నృత్యంతో భక్తమయూరాః యస్య దర్శనేన తథోక్త మన్యత్ర భక్తాః మేఘే ప్రీతిమంతః అర్శఆదిభ్యోఽజితి భక్తిశబ్దా దచ్ప్రత్యయః యే మయూరాః భక్తాశ్చ తేమయూరాశ్చ భక్తమయూరాః నృత్యంతో భక్తమయూరాః యస్య పురతస్స తథోక్తః అద్రినిలయ మద్రిః కైలాసస్స ఏవ నిలయో నివాసో యస్య తథోక్త మన్యత్ర చ ఏష ఏవార్థః వర్షాకాలే అత్ర మేఘానా ముపస్థానస్య

ప్రత్యక్షదృష్టత్వా దద్రినిలయత్వోపపత్తిః చంచజ్జటామండలం జటానాం కేశపాశానాం మండలః చంచత్ జటామండలః యస్య తథోక్త మన్యత్ర జటానాం విన్యస్తానాం మండల శ్చంచత్ జటామండలో యస్య తథోక్త మేతాదృశం త్వామితి క్రియాయా మన్వయః ఈశ్వరస్య మేఘత్వేన స్తుతిః.

ఆకాశేన శిఖీసమ స్తఫణినాం నేత్రా కలాపీనతా
నుగ్రాహి ప్రణవోపదేశనినదైః కేకీతి యోగీయతే,
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతం ముదా
వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే. 53

టీ. యః=ఏశివుఁడు (ఏనెమలి), ఆకాశేన=ఆకాశముచేత, శిఖీ=శిఖావంతుఁడు అనఁగా వ్యోమకేశుఁడనుట (శిఖండకముగలిగిననెమలి), సమ స్తఫణినాం=సకలసర్పములకును, నేత్రా=నాయకుఁడైన వాసుకిచేత, కలాపీ=భూషణవంతుఁడు (పింఛముగలనెమలి), న...తైః-నతే=నమ్రులైనవారిని, అనుగ్రాహి = అనుగ్రహించుస్వభావముగల, ప్రణవ = ప్రణవమంత్రము యొక్క, ఉపదేశ=ఉపదేశమందలి, నినదైః=ధ్వనులచేత, కేకీతిచ=కేకాధ్వనిగలవాఁడు అనియును(కేకాధ్వనిగల నెమలి),గీయతే=గానము చేయఁబడు చున్నాఁడో, శ్యామాం=శామవర్ణమైనట్టియు, ఘనరుచిం=మేఘకాంతివంటి కాంతిగల, శైలసముద్భవాం=పార్వతిని (పర్వతమందు బయలుదేరినమేఘ కాంతిని), దృష్ట్వా=చూచి, నటంతం=నాట్యము సేయునట్టియు, వేదాంతోపవనే=వేదాంతమను నుద్యానవనమందు, విహారరసికం=సంచరించుటయందు రసికుఁడైనట్టియు, తం=ఆ, నీలకంఠం=నల్లనికంఠముగల యీశ్వరుఁడను నెమలిని, ముదా=సంతోషముతో, భజే=సేవించుచున్నాను.

తా. నెమలి శిఖండము, కలాపము (పింఛము) గలది గనుక శిఖియు, కలాపియు, కేకాధ్వనిచేయునది గనుక కేకియునని పేరుపడసెను. దేవా నీవును ఆకాశముచేత శిఖి (శిఖిగలవాఁడు)యు, వాసుకిచేత కలాపి (భూషణముగల వాఁడు) యు భక్తానుగ్రహార్థమైన ప్రణవనాదముచేత కేకియు నయితివి. ఇది

గాక యదిపర్వతమందుబుట్టిన మేఘకాంతిఁజూచి యానందముతో నృత్యము సేయును, నీవును హిమవత్పర్వతమం దుదయించి మేఘకాంతితో నొప్పుచున్న యాశ్యామలాంబనుజూచి యానందనృత్యము సల్పుదువు. అది యుద్యానవనమందును దేవరయుపనిషదుద్యానవనమందు నానందసంచారము చేయుఁదురు. నీలకంఠశబ్దము భయార్థకమేగదా! వ్యోమకేశుండును నాగయజ్ఞోపవీతుండును ప్రణవోపదేశముచేత భక్తుల ననుగ్రహించువాఁడును పార్వతీవల్లభుండును వేదాంతవేద్యుండునునగు నీలకంఠుని భజించెదనని తాత్పర్యము.

అ. మహాదేవం మయూరత్వే నిరూపణేన స్తౌతి:—

వ్యా. ఆకాశేతి. నీలకంఠం నీలః కంఠో యస్యే త్యుభయత్రాపి తుల్యావ్యుత్పత్తిః నీలకంఠమేవ నీలకంఠం మయూరం భజే కథం భూతం నీలకంఠ మిత్యాకాంక్షాయా మాహ యః మయూరత్వేన నిరూపితః ఆకాశేన శిఖీశిఖాస్యాస్తీతి శిఖీ ఆకాశేన శిఖీ వ్యోమకేశత్వా త్సమస్తఫణినాం నేత్రాసమస్తసర్పాణా మధిపతినా ఆదిశేషేణ కలాపీ కలాపోస్యాస్తీతి కలాపీ కలాపో భూషణే బర్హ ఇత్యమరః. నతానుగ్రాహి ప్రణవోపదేశనినదైర్నతానంతః ప్రవణమనసా ననుగృహ్ణాతి తచ్ఛీల మస్యేతి వ్యుత్పత్యా నతానుగ్రాహీనతానుగ్రహణశీల ఇత్యర్థః స చాసౌ ప్రణవశ్చ తస్యోపదేశో విజ్ఞాపనం తజ్జన్యనినదై ర్ధ్వనిభిః కేకీతి చ గీయతే త్రిభి ర్విశేషణై శ్శిఖిత్వ కలాపిత్వ కేకిత్వరూపధర్మాః పరమశివే ఉపపాద్యంత ఇతిభావః శ్యామాం శ్యామలవర్ణాం ఘనరుచిం ఘనస్య మేఘస్యేవ రుచిః కాంతి ర్యస్యా స్తాం శైలస్సముద్భవాం శైలస్సముద్భవః ఉత్పత్తిహేతు ర్యస్యా స్తాం దృష్ట్వా ముదా సంతోషేణ నటంతం నృత్యంతం ఘనరుచిం మేఘశోభాం దృష్ట్వా నటంతమితి మయూరపక్షే వేదాంతోపవనే వేదాంతః ఉపనిష త్సఏవోపవనం క్రీడావనం తస్మి న్విహారరసికం సరసంతం నీలకంఠం మహం భజే ఇతి క్రియాయా మన్వయః స్పష్టార్థోఽయం.

పార్వతీ పరమేశ్వరులను మయూరీమయూరములుగా నిరూపించి ప్రార్థించుచున్నారు.—

సంధ్యాఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటాచంచలా,
భక్తానాం పరితోషబాష్పవితతి ర్వృష్టి ర్మయూరీ శివా
యస్మి న్నుజ్జ్వలతాండవం విజయతే తం నీలకంఠం భజే.

టీ. సంధ్యా=సాయంకాలము, ఘర్మదినాత్యయః=వర్షారంభకాలము గను, హ...నః-హరి=విష్ణుమూర్తియొక్క, కర=హస్తముల చేతనైన, అఘాత=వాయింపుచేత, ప్రభూత=పుట్టిన, ఆనక=మద్దెలయొక్క, ధ్వానః=ధ్వని, వారిదగర్జితం=ఉరుముగను, దివిషదాం = దేవతలయొక్క, దృష్టిచ్ఛటా=చూపులపరంపర, చంచలా=మెఱుపుగను, భక్తానాం=భక్తులయొక్క, పరితోషబాష్పవితతిః=ఆనందాశ్రుధార, వృష్టిః=వర్షముగను, శివా=పార్వతీదేవి, మయూరీ=ఆడనెమలిగను, యస్మిన్=ఏనీలకంఠుఁడను నెమలియందు, ఉ...వం-ఉజ్జ్వల=ప్రకాశమానమైన, తాండవం=తాండవమనునృత్యము, విజయతే = సర్వోత్కృష్టముగానున్నదో, తం=ఆ, నీలకంఠం = శివుని, భజే=కొలుచుచున్నాను.

తా. ప్రదోషకాలమను వర్షాకాలంబున శ్రీహరివాయించు మద్దెల చప్పుడుఱుముగను నంతరిక్షమందుండి చూచుచున్న దేవతలచూడ్కులు మెఱుపులుగను భక్తుల యానందబాష్పధార ధారావృష్టిగను జెలువొంద పరమానందముతోఁ దాను మయూరీమయూరములుగాఁ దాండవనృత్యక్రీడాభిరతులైన పార్వతీపరమేశ్వరుల నాశ్రయింతును. 54

అ. పార్వతీపరమేశ్వరౌ మయూరీమయూరత్వనిరూపణేనస్తౌతి.—

వ్యా. సంధ్యేతి. సంధ్యాసాయంకాలసమయఏవ ఘర్మదినాత్యయః ఘర్మదినాని గ్రీష్మర్తుదివసాస్తా న్యతియంతి యస్మిన్ సః ఘర్మదినాత్యయః మేఘప్రాదుర్భావకాలఇత్యర్థః- హరికరాఘాతప్రభూతానకధ్వానః హరే ర్విష్ణోః కరాభ్యాం య అఘాతస్తాడనం తేన ప్రభూతః ప్రకర్షేణోత్పన్నః ఆనకస్య వాద్యవిశేషస్య ధ్వానః ధ్వని స్సఏవ వారిదగర్జితం

మేఘ స్తనితం దివిషదాం దేవానాం దృష్టిచ్ఛటాదృష్టీనాం వీక్షణానాం ఛటాసమూహస్యైవ చంచలావిద్యుచ్ఛక్తీనాం సేవమానానాం పరితోష బాష్పః ఆనందాశ్రూణి తేషాం వితతి ర్ధారాసైవ వృష్టి ర్జలోత్సర్గ శ్శివా పార్వతీ సామయూరీ పుంయోగే జీష్ నీలకంఠఏవ నీలకంఠః పుమాన్మయూర స్తం భజే యస్మిన్నీలకంఠే ఉజ్జ్వలతాండవ ముజ్జ్వలం ప్రకాశమానం తాండవంనటనం విజయతే సర్వోత్కర్షేణ వర్తతే స్వలింగసహితో వర్షర్తుర్యథామయూరాణా మానందతాండవహేతు రేవం సంధ్యాసమయః పార్వతీపతేరానందతాండవహేతు రితి భావ స్తస్మయే తస్య సాయంనటత్వప్రసిద్ధేర్నీలకంఠే మయూరత్వారోపణమాత్రేః ప్రకృతాలంకారపూర్తౌ సత్యాం శివాయాం మయూరీత్వారోపణం తస్యా అపి స్తుతకోటిప్రవేశం ద్యోతయతి శివాయాః యద్యపి భజనక్రియాయాం నాన్వయ స్తథాపి తస్యాః పృథఙ్మయూరీత్వారోపణే స్తుతివిషయతాం వినా అన్యత్ఫలం నపశ్యామః.

ఆద్యాయామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయసాధ్యాయ తే
విద్యానందమయాత్మనే త్రిజగత స్సంరక్షణోద్యోగినే,
ధ్యేయాయాఖిలయోగిభి స్సురగణై ర్గేయాయమాయావినే
సమ్యక్తాండవసంభ్రమాయజటినే సేయం నతి శ్శంభవే. 55

టీ. ఆద్యాయ=ప్రపంచమునకు మొదటివాఁడును, అమితతేజసే=మితిలేని తేజస్స్వరూపముగలవాఁడును, శ్రుతిపదైః = వేదవాక్యముల చేత, వేద్యాయ= తెలియఁదగినవాఁడును, సాధ్యాయ = భక్తానుగ్రహము కొఱకు ప్రతిమాదిరూపమునఁ బ్రతిష్ఠింపఁబడినవాఁడును, విద్యానందమయాత్మనే = చిదానందమయమైన యాత్మస్వరూపుఁడును, త్రిజగతః= ముల్లోకములయొక్క, సం... నే-సంరక్షణ= కాపాడుటయందు, ఉద్యోగినే=ప్రవృత్తిగలవాఁడును, అఖిలయోగిభిః = యోగులందఱిచేతను, ధ్యేయాయ=ధ్యానించఁదగినవాఁడును, సురగణైః=దేవగణములచేతను, గేయాయ = గానముసేయఁదగినవాఁడును, మాయావినే=చిచ్ఛక్తితోఁగూడినవాఁడును, సమ్యక్తాండవసంభ్రమ

మాయ=చక్కనితాండవనృత్యమందు తొందరగలవాఁడును, జటినే=జడలు దాల్చినవాఁడును, శంభవే = సుఖకరుండునునగు, తే=నీకొఱకు, సా=ఆ, ఇయం=ఈ, నతిః=నమస్కారము అగుఁగాక.

తా. ఎవరెవరి నుద్దేశించి చేసిననమస్కారమైనను సర్వజగత్కారణుండును సర్వాంతర్యామియునగు శుద్ధస్వరూపుఁడైన యాపరమశివునికే చెందుఁగాక యని తాత్పర్యము.

అ. శుద్ధరూపం శంభుం నమస్కరోతి:—

వ్యా. ఆద్యాయేతి. శంభవే శం సుఖ మస్మాద్భవతీతి శంభు స్తస్మై సా యా నతి స్సర్వోద్దేశ్యకా భాతిలోకే సేయం నతి శ్శంభవే శంభూద్దేశ్య కాభవ త్వితి ప్రార్థనా స్వర్వోద్దేశ్యకాయాః నతే శ్శంభుమాత్రోద్దేశ్యక త్వప్రార్థనాకథం ఘటతే ఇతిచే త్తస్యైవ కృత్స్నజగత్కారణత్వేన సర్వాత్మత్వాద్ఘటత ఇత్యాహ ఆద్యాయకృత్స్నజగతః పూర్వం విద్యమానాయ నిత్యాయేత్యర్థః తత్కుతఇతి చేదాహ అమితతేజసే అమిత మపరిచ్ఛిన్నం తేజః జ్యోతి స్తత్స్వరూపాయ తత్కేనవేద్యతే ఇతిచే దాహ శ్రుతిపద్దై ర్వేదవాక్యై ర్వేద్యాయ బోధ్యాయ అర్చాదిరూపేణ కథం దృశ్యతే ఇతిచేదాహ సాధ్యాయ భక్తానుగ్రహార్థం ప్రతిష్ఠాప్యాయ తత్స్వరూపం కిమితి చేదాహ విద్యానందమయాత్మనే విద్యాచిత్ ఆనంద స్సుఖం తన్మయా తదభిన్న ఆత్మస్వరూపం యస్యతస్మై స్వార్థే మయట్ తస్య లీలామయం వ్యాపారమాహ త్రిజగత స్సంరక్షణోద్యోగినే త్రయా ణాం జగతాం సమాహార స్త్రిజగ త్తస్యసంరక్షణే ఉద్యోగినే ప్రవృత్తిమతే సః యోగైః గమ్యఇత్యాహ అఖిలయోగిభి రఖిలై ర్యోగిభి స్సమాధిమద్భి ర్ధ్యేయాయ ధ్యాతుమర్హాయ ఏవంభూతః కై ర్గీయత ఇతిచేదాహ సురగణై ర్దేవసంఘై ర్గేయాయ గాతుం యోగ్యాయ తస్య నిత్యశక్తియోగమాహ మాయావినే మాయాచిచ్ఛక్తి స్సాస్యాస్తీతి మాయావీ అస్మాయా మేధాస్ర జో వినిరితి వినిః సమ్యక్తాండవ సంభ్రమాయ సమ్యక్తాండవం సమీచీనవర్త నం తస్మి న్సంభ్రమ స్త్వరా యస్య తస్మై జటినే జటాః అస్య సంతీతి జటీ

తస్మై భక్తానుగ్రహార్థం మునిరూప మాశ్రయమాణాయేత్యర్థః తస్మై నతిరితి క్రియాన్వయః. స్పష్టోఽర్థః.

సకలప్రపంచస్వరూపుఁడగు పరమశివుని కొనియాడుచున్నారు.—

నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయినీ శ్రేయసే
సత్యాయాదికుటుంబినే ముని మనఃప్రత్యక్షచిన్మూర్తయే,
మాయాసృష్టజగత్త్రియాయ సకలామ్నాయాంతసంచారిణే
సాయం తాండవసంభ్రమాయ జటినే సేయంనతిశ్శంభవే.

టీ. నిత్యాయ=నిత్యుఁడును (చలనములేనివాఁడు), త్రిగుణాత్మనే=సత్వరజస్తమోగుణములు శరీరములుగాఁ గలవాఁడును (బ్రహ్మ విష్ణు రుద్ర స్వరూపుఁడు), పురజితే=స్థూలసూక్ష్మకారణశరీరములను, లేక త్రిపురాసురులను జయించినవాఁడును, కాత్యాయనీశ్రేయసే = పార్వతీదేవియొక్క తపఃఫలమైనవాఁడును, సత్యాయ=భూతభవిష్యద్వర్తమానకాలములు మూటియందును బాధలేనివాఁడును, ఆదికుటుంబినే=మొట్టమొదటి సంసారియైనవాఁడును, ము...యే-మునిమనః=మునీశ్వరులయొక్క మనస్సులకు, ప్రత్యక్ష=గోచరమైన, చిన్మూర్తయే = చిత్స్వరూపముగలవాఁడును, మా...య-మాయా=మాయాశక్తిచేత, సృష్ట=సృజింపఁబడిన, జగత్త్రియాయ= ముల్లోకములు గలవాఁడును, స...ణే-సకల=సమస్తమైన, ఆమ్నాయాంత=ఉపనిషత్తులయందును, సంచారిణే=సంచరించువాఁడును(ఉపనిషద్వాక్యములచే బోధింపఁబడువాఁడు), సాయం=సాయంకాలమున, తాండవసంభ్రమాయ=తాండవమాడుతొందరగలవాఁడును, జటినే=జడలుదాల్చినవాఁడును, శంభవే=సుఖోత్పత్తికారణమైనవాఁడును నగు పరమేశ్వరునికొఱకు, సా=అ, ఇయం=ఈ, నతిః=నమస్కారము అగుగాక.

తా. నిత్యుండును, బ్రహ్మవిష్ణురుద్రరూపములు గలవాఁడును, త్రిపుర విజయుఁడు, కాత్యాయనీమనోహరుండును, సత్యస్వరూపుఁడును, మునుల మనంబులకు గోచరమగు చిత్స్వరూపుఁడును, మాయవలన ముల్లోకములు

గల్పించువాఁడును, వేదాంతవేద్యుండును, తాండవనృత్యమునందు పరమానందము నొందువాఁడును, జటాజూటముగలవాఁడును, మొట్టమొదటి సంసారియునగు శివునికి నానమస్కారము.

అ. సకలప్రపంచరూపిణం పరమశివం స్తౌతి:—

వ్యా. నిత్యాయ ధ్రువాయ చలనరహితాయేత్యర్థః త్రిగుణాత్మనే త్రయోగుణా స్సత్వరజస్తమాం స్యాత్మాన శ్శరీరాణి యస్య తస్మై బ్రహ్మవిష్ణురుద్రాత్మనే ఇత్యర్థః పురజితే పురాణి స్థూలసూక్ష్మకారణాఖ్యశరీరాణి తాని జయతీ త్యభిభవతీతి పురజిత్ తస్మై అథవా ప్రసిద్ధాని త్రీణి పురాణి 'తేషా మసురాణా మి'త్యర్థవాదసిద్ధాని తాని జయతీ త్యభిభవతీతి పురజిత్తస్మై కాత్యాయనీ శ్రేయసే కాత్యాయన్యాః పార్వత్యా శ్శ్రియసే తపః ఫలరూపాయ సత్యాయ కాలత్రయాబాధ్యాయ ఆదికుటుంబినే ప్రాథమికసంసారిణే భక్తానుగ్రహాయ కుటుంబవేషధారిణే ఇత్యర్థః మునిమనః ప్రత్యక్షచిన్మూర్తయే మునీనాం మనాంసి తేషాం ప్రత్యక్షో గోచరః చిన్మూర్తి శ్చ చిచ్ఛరీరస్య తస్మై మాయాసృష్టజగత్రయాయ జగతాం త్రయం జగత్రయం మాయయాసృష్టం మాయాసృష్టం మాయాసృష్టం జగత్రయం యేన తస్మై సకలామ్నాయాంతసంచారిణే సకలోపనిషత్ప్రతిపాద్యాయేతిభావః సాయం తాండవసంభ్రమాయ తురీయపాదస్య పూర్వవదేవార్థః. స్పష్టోఽర్థః. 56

సేవించుటయందు నేర్పులేనివాఁడనైనను నన్ను తప్పక సంరక్షించవలయునని సహేతుకముగాఁ జెప్పుకొనుచున్నారు.—

నిత్యం స్వోదరపోషణాయ సకలా నుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవత స్సేవాం నజానే విభో,
మజ్జన్మాంతరపుణ్యపాకబలత స్త్వంశర్వసర్వాంతర
స్తిష్ఠ స్యేవహి తేన వా పశుపతే తే రక్షణీయోఽస్మ్యహమ్.

టీ. నిత్యం=అనుదినమును, స్వోదరపోషణాయ=తనపొట్టపోసికొనుటకొఱకు, విత్తాశయా=ధనలోభముతో, సర్వాన్=ధనముగలవారినంద

అను, ఉద్దిశ్య=గుఱించి, వ్యర్థం=నిష్ప్రయోజనముగా, పర్యటనం=సంచారమును, కరోమి=చేయుచున్నాను. హేవిభో=సర్వవ్యాపకుఁడవైనయో దేవా! భవతః=నీయొక్క, సేవాం=భజనమును, నజానే=ఎఱుఁగను. హేపశుపతే=సర్వప్రపంచపాలకుండవును, హేశర్వ=భక్తపాపధ్వంసకుఁడవునగు పరమేశ్వరా, మ...తః-మజ్జన్మాంతరపుణ్య=నాపూర్వజన్మార్జితపుణ్యముయొక్క, పాకబలతః=పరిపాకవశమువలన, త్వం=నీవు, సర్వాంతరః=అన్నమయాదికోశము లన్నిటికంటెను సూక్ష్మరూపుఁడవై యంతర్యామివిగా నా యంతరంగమున, తిష్ఠస్యేవహి=ఉన్నావుగదా తేనవా — ఆహేతువుచేతనైనను, తే=నీకు, అహం=నేను, రక్షణీయః=రక్షింపఁదగినవాఁడను, అస్మి=అగుదును. 57

తా. దేవా! పొట్టపోసికొనుటకు ధనాశతో ధనవంతుల నెందఱనో యాశ్రయించి తిరుగుచుంటినేగాని నినుసేవించుట యొంతమాత్రమెఱుంగకయుంటిని. ఇంతమాత్రముతో నన్ను పేక్షించి యూరకుండకుము. పూర్వజన్మమందేదో యించుక పుణ్యముచేసికొంటిని గావుననే గదా సర్వాంతర్యామివగు నీవు నాయందును పంచకోశవిలక్షణుండవై యున్నావు! కావునన్ను రక్షించుభారము నీమీఁద నున్నదని తాత్పర్యము.

అ. సేవాపరిజ్ఞానశూన్యోప్యహంతే అవశ్యం సంరక్షణీయ ఇత్యత్ర హేతుమాహ:—

వా. నిత్యమితి. నిత్య మనవరతం స్వోదరపోషణాయ స్వోదరం కుక్షి స్తస్య పోషణాయ తదాదిసర్వాంగానాం పుష్టికారణాయ విత్తాశయా ధనవాంఛయా సకలానుద్దిశ్య సర్వా న్విత్తవతః నిమిత్తీకృత్యవ్యర్థం నిష్ప్రయోజనం పర్యటనం పరితస్సంచరణం కరోమి రచయామి మత్సేవాకరణేన సప్రయోజనం క్రియతామితిచే త్తత్రాహ – హే విభో సర్వవ్యాపక ఈదృశస్య భవత్సేవాం భజనం నజానే తర్హి కిం కర్తవ్యమితి ప్రార్థయసే ఇతిచే త్తత్రాహ. హే పశుపతే పశూనాం బ్రహ్మాదినామాంతానాం సర్వేషాం పతే పాలకహే యస్మా న్మజ్జన్మాంతరపుణ్యపాకబలతః మమ జన్మాంతరే

ష్వన్యేషు జన్మసుకృతాని యాని పుణ్యాని తేషాం పాకబలతః పాకఫల ప్రదానోన్ముఖత్వం తద్వశాత్ హే శర్వ భక్తపాపహింసకః త్వం సర్వాంతరః అన్నమయాదిభ్యః కోశేభ్యః ఆంతరః సూక్ష్మత్వేనాంతర్యామితయా తిష్ఠస్యేవ స్థితిం కరోష్యేవ తేన వా హేతునా తే త్వయా కర్తరి షష్ఠీ అహం రక్షణీయోఽస్మి. రక్షితుం యోగ్యో భవామి. స్పష్టార్థోఽయం.

అజ్ఞానమును తెర దొలఁగించి సాక్షాత్కరింపుమని పరమేశ్వరుని వేఁడుకొనుచున్నారు:—

ఏకో వారిజబాంధవః క్షితినభో వ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోపి భవతి త్వం కోటిసూర్యప్రభః,
వేద్యః కిం నభవ స్యహో ఘనతరం కీదృగ్భవే న్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే సాక్షాత్ప్రసన్నో భవ.

టీ. హేపశుపతే=ఓయిపరమేశ్వరా! వారిజబాంధవః=పద్మబాంధవుఁడైన సూర్యుఁడు, ఏకః=ఒక్కఁడయ్యును, క్షితినభోవ్యాప్తం=భూమ్యంతరిక్షములు నిండిన, తమోమండలం = అంధకారరాశిని, భిత్వా=భేదించి, లోచనగోచరోఽపి = కన్నులకగుపడుచున్నవాఁడును, భవతి = అగుచున్నాఁడు. త్వం=నీవు, కోటిసూర్యప్రభః=కోట్లకొలఁది సూర్యులయొక్క కాంతిగలవాఁడవు, వేద్యః= తెలిసికొనఁదగినవాఁడవు, కింనభవసి=ఏలకావు? అహో = ఎంతవింత! ఘనతరం=మిగులదట్టమైనది యయ్యును, మత్తమః= నాయజ్ఞానాంధకారము, కీదృక్ = ఏపాటిది, భవేత్ = అగును? తత్ = కనుక, సర్వం=ఆయజ్ఞానమునంతను, వ్యపనీయ=తొలఁగించి, సాక్షాత్ = ప్రత్యక్షమై, ప్రసన్నః = అనుగ్రహించువాఁడవు, భవ=అగుమా.

తా. దేవా! మహాదేవా! ఒక్కసూర్యుఁడే భూమి ఆకాశమునిండిన చీఁకటినిబోఁగొట్టి కన్నులకగపడుచున్నాఁడు. కోటిసూర్యుల వెలుఁగొందుచున్నాఁడవు. నీవేల ప్రత్యక్షముగావు? ఎంతదట్టముగానున్నను నాయజ్ఞానాంధకారము దొలఁగించుట నీకొకలెక్కయా? కాదు కాదు. నాయజ్ఞానము బాపి సాక్షాత్కరించి యనుగ్రహింపుము.

అ. అజ్ఞానరూపప్రతిబంధభేదనపూర్వకం పశుపతి సాక్షాత్కారం ప్రార్థయతే:—

వ్యా. ఏకేతి. హే పశుపతే అజ్ఞానవారకవారిజబాంధవః పద్మబంధు శ్శేషోఽద్వితీయస్సన్ క్షితి నభోవ్యాప్తం క్షితి ర్భూమిః నభ ఆకాశంచ క్షితినభసీతే వ్యాప్తం వ్యాప్యస్థితం తమోమండల మంధకారసమూహం భిత్వా లోచనగోచరోఽపి చక్షుర్విషయోఽపి భవతి త్వం తు కోటిసూర్యప్రభః అపరిమితసూర్యాణాం ప్రభేవ ప్రభా యస్య తథోక్త స్త్వం వేద్యః జ్ఞానవిషయః కిం నభవసి కిమితి నభవసి ఘనతరమతిశయేన సాంద్రమపి మత్తమః మమాజ్ఞానరూపం తమః కీదృ క్తవ కియతీత్యర్థః తత్తస్మా త్సర్వం కృత్స్నం పూర్వోక్తం తమః వ్యపనీయాపనోద్య సాక్షాత్ ప్రత్యక్షః ప్రసన్నః అనుగ్రాహక శ్చ భవ ఏధి. ఏకస్మిన్నేవ సూర్యే సకలజనప్రత్యక్షే సమ స్తతమోభేదిని చ సతి తత్కోటిసదృశ స్త్వ మప్రత్యక్షః అతమోభేదే చ భవసీతి య త్తచ్చిత్రం తస్మా త్ప్రత్యక్ష స్తమో నివర్తక శ్చ భవేతి భావః.

ఆర్యా తెలియఁగున నీపాదారవింద భజనముసేయ నాచిత్తము గోరుచున్నది అనుచున్నారు.—

హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా,
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథభవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్. 59

టీ. హేపశుపతే=సకలభూతములకునధిపతియు, హేవిభో=సర్వవ్యాపకుఁడవునగు, హేగౌరీనాథ=ఓపార్వతీపతీ! హంసః=హంసపక్షి, పద్మవనం=కమలములగుంపును, చాతకః=చాతకపక్షి, నీలాంబుదం=నల్లమబ్బును, కోకః=చక్రవాకపక్షి, కోకనదప్రియం=సూర్యుని, చకోరః=చకోరపక్షి, ప్రతిదినం=దినదినమును, చంద్రం= చంద్రునిని, యథా = ఏప్రకారముగా,

సమిచ్ఛతి=కోరుచున్నదో, తథా=అప్రకారముగా, మామకం=నాసంబంధమైన, చేతః=చిత్తము, చిన్మార్గమృగ్యం=ఉపనిషత్తులయందు వెదుకఁదగిన, కైవల్యసౌఖ్యప్రదం=కేవలనిర్గుణపరబ్రహ్మభావంబనుసౌఖ్యంబొసఁగునట్టి,భవత్పాదాబ్జయుగళం=మీపాదపద్మద్వంద్వమును, వాంఛతి=కోరుచున్నది.

తా. పార్వతీవల్లభా! హంస పద్మములను, చాతకము వర్షాకాలమేఘమును, చక్రవాకము సూర్యుని, చకోరము చంద్రునిగోరినట్లు, ఉపనిషద్వేద్యమై కైవల్యసౌఖ్యము నొసఁగునట్టి నీపాదకమలమును నాచిత్తము కోరుచున్నది.

అ. సోపమానం త్వత్పాదారవిందభజనం మన్మనః వాంఛతీతి ప్రార్థ్యతే:—

వ్యా. హంసఇతి. హే పశుపతే హే విభో హే గౌరీనాథ హంసః పద్మవనం కమలషండం యథా సమిచ్ఛతి వాంఛతి చాతకః జలదోత్సృజ్యమానోదకబిందూనపేక్షమాణః పక్షివిశేషః నీలాంబుదం వర్షుకమేఘం యథా వాంఛతి సమిచ్ఛతి కోక శ్చక్రవాకః కోకనదప్రియం పద్మబంధుం సూర్యమిత్యర్థః యథా చకోరశ్చంద్రకిరణభుక్పక్షివిశేషశ్చంద్రం సమిచ్ఛతి తథా మామకం మదీయం చేతశ్చిత్తం చిన్మార్గమృగ్యం చిన్మార్గే షూపనిషత్సు మృగ్య మన్వేషణీయం కైవల్య సౌఖ్యప్రదం కైవల్యం కేవలం నిర్గుణం బ్రహ్మ తస్య భావ స్తత్త్వం తదేవ సౌఖ్యం సుఖం తత్ప్రదదాతీతి తత్ప్రదం భవత్పదాబ్జయుగళం భవతః పదే అబ్జే ఇవ భవత్పదాబ్జే తయోర్యుగళం వాంఛతి అభిలషతి స్పష్టార్థోఽయం.

తనమనమును శంకరుపాదసేవచేయుమని నియమించుచున్నారు.—

రోధ స్తోయహృత శ్శ్రమేణపధిక శ్ఛాయాంతరోర్వృష్టితో
భీత స్స్వస్థగృహం గృహస్థ మతిథి ర్దీనః ప్రభుం ధార్మికమ్,
దీపం సంతమసాకుల శ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేత స్సర్వభయాపహం వ్రజసుఖం శంభోః పదాంభోరుహమ్.

టీ. హేచేతః=ఓమానసమా! తోయహృతః=నీటివేగమున కొట్టుకొనిపోవువాఁడు, రోధః=తీరమును, పథికః=బాటసారి, శ్రమేణ=అలసటచేత, తరోః=చెట్టుయొక్క, ఛాయాం=నీడను, వృష్టితః = వర్షమువలన, భీతః=భయపడినవాఁడు, స్వస్థగృహం=సుఖమైనయిల్లును, అతిథిః=భోజనసమయమునకు పొరుగూరునుండి వచ్చినవాఁడు, గృహస్థం=సంసారిని, దీనః=దరిద్రుఁడు, ధార్మికం=ధర్మాత్ముఁడైన, ప్రభుం=రాజును, సంతమసాకులః=చీఁకటిలోకొట్టుకొనుచున్నవాఁడు, దీపం=దీపమును, శీతావృతః=చలిపట్టుకొన్నవాఁడు, శిఖినంచ=అగ్నిహోత్రమునున్ను, యథా=ఏప్రకారముగా (ఆశ్రయించునో), తథా=ఆప్రకారముగా, త్వం=నీవు, సర్వభయాపహం=ఎల్లభయములను బాపునదియు, సుఖం=సుఖకరమైనదియునగు, శంభోః=శివునియొక్క, పదాంభోరుహం=పాదకమలమును, వ్రజ=ఆశ్రయింపుము.

తా. చెట్టునీడ నడకవలనిబడలికమాత్రము దీర్చును. గట్టియిల్లు వానకు తడియకుండ నాపును. ఏటియొడ్డు ప్రవాహవేగమున కొట్టుకొనిపోకుండ సహాయమగును. గృహస్థు అతిథియొక్క ఆకలినిమాత్రము తీర్చును. ధర్మాత్ముఁడైన ప్రభువు దారిద్ర్యముమాత్రము తొలఁగించును. దీపము చీఁకటిఁబాపి వెలుతురునిచ్చును. నిప్పుదగ్గఱకుఁబోయిన చలిపోనాడు. ఓచిత్తమా పరమేశ్వరుని పాదపద్మము సంసారమంటలి సమస్తభయములను పోఁగొట్టును. నీవీశ్వరపాదకమలము నాశ్రయించి సుఖంబు గనుము. 60

అ. చేతస స్సోపమానం శంభోః పాదాంబుజభజనం విధత్తే:—

వ్యా. రోధఇతి. హే చేతః మానసతోయహృత స్తోయేన వేగవతా జలేన హృతః ఆకృష్టః పురుషః రోధః తీరం యథావ్రజ పథికః మార్గగామీ శ్రమేణ గ్లానాన్యాతరోర్వృక్షస్య ఛాయామనాతపం యథావృష్టితః వర్షాద్భీతః భయం ప్రాప్తః పురుష స్స్వస్థగృహం స్వారిత్యవ్యయం సుఖేన తిష్ఠం త్యస్మిన్నితి స్వస్థం సుఖానస్థానాదికరణం గృహంయథా అతిథిరైశ్వో దేవాంతే అన్నాపేక్షయా గ్రామాంతరా దాగచ్ఛన్పురుషః గృహస్థం గార్హస్థ్యధర్మయుక్తం సంసారిణం యథాదీనః దారిద్ర్యత ప్తః పురుషః ధార్మి

కః ధర్మానుసారిణం ప్రభుం దానసమర్థం పురుషం యథా సంతమసాకుల స్సంతమసేన గాఢాంధకారేణ పీడ్యమానః దీపం యథా శీతావృత శ్శైతేన హిమేన అన్వృతః వ్యాప్తః పురుషః శిఖిన మగ్నిం యథాతథా త్వం సర్వభయాపహం సకలభయఘ్నం సుఖం సుఖకరం శంభో శ్శివస్య పదాంభోరుహం వ్రజ పాప్నుహి దృష్టాంతభూతార్థజాతం తత్తత్సంకటమాత్రనివర్తకం దార్ష్ఠాంతికం పదాంభోరుహం తు సంకటసుఖయో ర్నివర్తన ప్రవర్తన హేతుత్వా దనశ్యగమ్య మితిభావః.

భక్తిస్వరూపము నిర్ణయించుచున్నారు.—

అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతాక్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే. 61

టీ. ఇహ=ఈలోకమందు, నిజబీజసంతతిః = తనగింజలరాశి, అంకోలం=ఊడుగుచెట్టును, సూచికా=సూది, అయస్కాంతోపలం=సూదంటుఱాయిని, సాధ్వీ=పతివ్రత, నైజవిభుం=తనభర్తను, లతా=తీఁగ, క్షితిరుహం=వృక్షమును, సింధుః=నది, సరిద్వల్లభం=సముద్రమును, యథా=ఏప్రకారముగా (తనంతట తానే), ప్రాప్నోతి=పొందుచున్నదో, తథా=ఆప్రకారముగా, చేతోవృత్తిః=చిత్తవృత్తి, పశుపతేః=ఈశ్వరునియొక్క, పాదారవిందద్వయం = పాదకమలయుగళమును, సదా=ఎల్లప్పుడును, ఉపేత్య=పొంది, తిష్ఠతి=ఉండుట ఏదికలదో, సా=అది, భక్తిరితి=భక్తియని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. ఊడుగుగింజలుపండి నేలరాలిపోయి మరల వానికవియే యాచెట్లు నంటుకొనిపోవును. సూది సూదంటుఱాయిదగ్గఱకు పరుగెత్తిపోయి దానినంటుకొనును. పతివ్రత యెడబాయక యెన్నడుఁ దనపతిని వెంబడించియుండును. తీఁగ దానికదియే చెట్టునల్లుకొని పెనవైచుకొనును. నదులు

దొరలిదొరలిపోయి సముద్రముతో నేకమగును. అట్లు మనోవృత్తి శివుని చరణకమలములయందుఁ జొచ్చియుండుటయే భక్తి (పరమశివసాయుజ్యము వలయుననుప్రీతి) యని పెద్దలుచెప్పుదురు.

అ. భక్తిస్వరూపం నిశ్చినోతి :—

వ్యా. అంకోలమితి. నిజబీజసంతతి ర్నిజాని చ తాని బీజాని చ తేషాం సంతతి స్సమూహః అంకోల మంకోలః వృక్షవిశేష స్తం యథా స్వయమేవ ప్రాప్నోత్యస్య వృక్షవిశేషస్య బీజాని పరిపాకకాలే భూమౌ పతిత్వా పురుషప్రయత్నం వినైవ పునస్స్వస్థానం ప్రవిశంతీతి ప్రసిద్ధిః సూచికా అయో మయీ సూక్ష్మశలాకికా అయస్కాంతోపల మయస్కాంతే స్స్వయం లోహాకర్షణశక్తోపలవిశేష స్తం యథా సాధ్వీ పతివ్రతా నైజ మాత్మీయం విభుం భర్తారం యథా స్వయం లతా వ్రతతిః క్షితిరుహం వృక్షం యథా స్వయం సింధు స్సరిత్సరిద్వల్లభం నదీపతి మిహాత్ర యథా ప్రాప్నోతి చేతోవృత్తిః చిత్తస్య వ్యాపృత్తిః పశుపతే ర్మహాదేవస్య పాదారవిందద్వయం చరణపద్మయుగళం స్వయ ముపేత్య సదా సార్వదా తథా తిష్ఠతీతి యత్ సా భక్తిః పరమశివేప్రీతి స్తత్సాయుజ్యం మే భూయాదితి ప్రీతి రిత్యుచ్యతే అభిధీయతే భక్తిరేతాదృశీతి నిశ్చినోమీతి భావః.

తల్లి బిడ్డను పోషించునట్లు భక్తిభక్తుని కాపాడునని చెప్పుచున్నారు—

ఆనందాశ్రుభి రాతనోతి పులకం నైర్మల్యత శ్ఛాదనం
వాచాశఙ్ఖముఖస్థితై శ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః,
రుద్రాక్షై ర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యఙ్కే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి. 62

టీ. హేదేవ=స్వయంప్రకాశస్వరూపుఁడవైన ఓపరమేశ్వరుఁడా! భక్తిజననీ=నీభక్తియనియెడు తల్లి, ఆనందాశ్రుభిః=ఆనందబాష్పములచేత, పులకం=రోమాంచమును, ఆతనోతి=విస్తరింపఁజేయును. నైర్మల్యతః=నిర్మలత్వముచేత, ఛాదనం (ఆతనోతి)=(ఈఁగలు దోమలు చలి మొదలగు బాధ

లేకుండ) బట్టకప్పుటయు నొనర్చును. వాచాశంఖముఖస్థైః=వేదవాక్యను శంఖముయొక్క ముఖమందున్నట్టి, చ...త్రైః-చరిత్ర=నీచరిత్రము లనియెడు, అమృతైః=పాలతో, జఠరాపూర్తిం (ఆతనోతి)=కడుపునిండఁ జేయును. రుద్రాక్షైః = రుద్రాక్షలచేతను, భసితేన=విభూతిచేతను, వపుషః=శరీరము యొక్క, రక్షాం (ఆతనోతి)=సంరక్షణము చేయును. భవద్భావనాపర్యంకే= నీతలంపనియెడు మంచమందు, వినివేశ్య=పరుండఁబెట్టి, భక్తార్భకం= భక్తుండను శిశువును, రక్షతి=కాపాడును.

తా. ఓమహాదేవా! తల్లి ప్రేమవల్ల నానందబాష్పములొలుక బిడ్డను జేరదీసి రోమాంచితగాత్రుని చేయునట్లు భక్తిరసము భక్తుని కానందబాష్పము లొలికించి యొడలుపులకించి యుప్పొంగఁజేయును. తల్లి బిడ్డకు ఈఁగలు, దోమలు, చలి మున్నగు బాధలేకుండ బట్టకప్పినట్లు భక్తినిర్మలభావము నాసరింపఁజేయును. తల్లి శంఖములోఁ బోసి కడుపార పాలుగుడిపినట్లు భక్తి వేదాది వాక్యముఖముగా నీ చరిత్రామృతములు తనివిదీర నాస్వాదింపఁ జేయును. రుద్రాక్షములు ధరింపఁజేసి విభూతి పెట్టించి యంగరక్ష గావించును. తల్లి బిడ్డను మంచమున బరుండబెట్టి కాపాడుచుండినట్లు భక్తి మన మునం దీశ్వరధారణయను మంచమునఁ బ్రవేశపెట్టి పరిపాలించును. భక్త రక్షకము భక్తిగాక వేఱొండు లేదని తాత్పర్యము.

అ. జననీవద్భక్తి ర్భక్తార్భకం రక్షతీత్యాహ.—

వ్యా. ఆనందాశ్రుభి రితి. హేదేవ స్వప్రకాశ స్వరూప భక్తిజననీ తవ భక్తిరేవ మాతా సా భక్తార్భకం భక్తఏవార్భక శ్శిశు స్తంభవ ద్భావనా పర్యంకే భవతః భావనామనసిధారణం సైవ పర్యంకః మంచః తస్మి న్వినివేశ్య శాయయిత్వా రక్షత్యవతి రక్షణప్రకారమాహ ఆనందాశ్రుభి స్సంతోషబాష్పజలైః పులకం రోమాంచం శిశుశరీరే ఆతనోతి విస్తారయతి యథామాతా శిశుప్రేమజన్యనేత్రసలిలై శ్శిశుశరీరపతితై శ్శిశుశరీరే పులక ముత్పాదయతి తథా స్వాశ్రయనిష్ఠచక్షుర్గళితై స్తచ్ఛరీరపతితైః పులకం జన యతీతి భావః స్వాశ్రయభక్త్యో రభేదో వివక్షితః నైర్మల్యతః భక్తశిశునిష్ఠ

నిర్మలభావేన ఛాదనం శీతమశకాదిపీడానివర్తకం వస్త్రరూపకం వచన మాతనోతి నైర్మల్యత ఇత్యత్ర సార్వవిభక్తికస్తసిః వాచా శంఖముఖస్థితైః వాచా వేదాదివాక్ హలంతానాం వాగురేర్మనే రాబంతత్వస్యేష్టత్వా ద్వాచాశబ్దో నశంకాస్పదః 'వష్టివాగురిరల్లోప' మితి కారికాత్ర ప్రమాణం సైవ శంఖస్తన్ముఖస్థితైస్తన్నిష్ఠైశ్చరిత్రామృతైర్భవచ్చరిత్రాణ్యేవామృతానిక్షీరాణి తైర్జఠరాపూర్తిం జఠరస్యోదరస్యాపూర్తిం సమంతాత్పూరణ మాతనోతి యథా శంఖస్థితేన పయసా శిశూదరం పూరయతి తథా భక్తజననీ పూర్వోక్తలక్షణైస్త్వచ్చరిత్రామృతైశ్శిశోః క్షుధానివృత్తిం సంపాదయతీతి భావః రుద్రాక్షైర్భసితేన భస్మనా చ వపుషశ్శరీరస్య రక్షామాతనోతీతి సర్వత్రానుషజ్యతే భక్తరక్షణవిషయే భక్తితుల్యాన్యారక్షికా నాస్తీతి భావః. 62

శివభక్తియొక్క వైచిత్ర్యము వర్ణించుచున్నారు.—

మార్గావర్తితపాదుకాపశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపో ర్దివ్యాభిషేచాయతే,
కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం నకరో త్యహో వనచరో భక్తావతంసాయతే. 63

టీ. పశుపతేః=శివునియొక్క, అంగస్య=అవయవమునకు, మార్గావర్తితపాదుకా=పలుమారు దారినడచిన ప్రాతచెప్పు, కూర్చాయతే=కనుబొమలనడుమైనది. పురరిపోః = త్రిపురాంతకునికి, గండూషాంబునిషేచనం = పుక్కిలించిన నీరుచల్లుట, దివ్యాభిషేచాయతే=గంగాజలముతోడియభిషేకమయినది. కించిద్భక్షితమాంసశేషకబళం=కొంచెముతినఁగా మిగిలినమాంసపుముద్ద, నవ్యోపహారాయతే = క్రొత్తనివేదనద్రవ్య మగుచున్నది. వనచరః = కిరాతుఁడు, భక్తావతంసాయతే = ఉత్తమభక్తుఁ డగుచున్నాఁడు, భక్తిః=భక్తి, కిం నకరోతి=ఏమిచేయదు? అహో=ఎంతవిచిత్రము!

తా. ఆహాహా! ఏమి శివభక్తిమహిమ చమత్కారము? చిరకాలము దారినడచి ప్రాంతగిలిపోయిన కాలిచెప్పు ఆకాళహస్తీశ్వరునకు * కనుబొమలనడిమి చోటుగాఁ జేర్పనయ్యె. ఒకభక్తుఁడు పుక్కిలించి యుమిసిననీరు, ఆత్రిపురహరునకు గంగాజలాభిషేకమయినది. సగముకొఱికితినగా మిగిలిన మాంసఖండము ఆజగదీశ్వరునకు మహానివేదనద్రవ్యముగా నుపయోగపడినది. అడవులందిరుగుచు మృగాదహింసకుండైన కిరాతుండు భక్తాగ్రగణ్యుండయ్యె. ఇంతయేల? భక్తివల్ల ఏమేమి కానోపదు?

అ. శివభక్తై ర్వైచిత్ర్యం వర్ణయతి:—

వ్యా. మార్గేతి. పశుపతే శ్శివసంబంధినః అంగస్యావయస్య మూర్ధా వర్తితపాదుకా మార్గే ష్వధ్వస్వావర్తితా సకృదనుభూతా పాదుకా పాదరక్షా కూర్చాయతే భ్రూమధ్యస్థానాయతే భ్రూమధ్యస్థానమివాచరతి పురరిపో స్త్రిపురాంతకస్యాంగస్య గండూషాంబునిషేచనం ముఖప్రవేశితజలవిషేచనం దివ్యాభిషేచాయతే దివ్యాంబునః గంగాజలస్యాభిషేక ఇవాచరతి కించి ద్భక్షిత మాంసశేషకబళం కించి దీష ద్భక్షితం ఖాదితం మాంసఫలం తస్య శేషః అవశిష్టాంశ ఏవకబళం గ్రాస స్తన్నవ్యోపహారాయతే నవ్యః నూతనః ఉపహారః నివేద్య ద్రవ్యం సఇవాచరతి వనచరః వ్యాధః భక్తావతంసాయతే భక్తశ్రేష్ఠఇవాచరతి సర్వత్రాచారార్థే క్యఙ్భక్తిః కిం నకరోతి సర్వం కరో త్యేవేతి భావః. స్పష్టోఽర్థః. పాదుకా కూర్చాయత ఇత్యస్య కశ్చన భక్తః ఆరబ్ధ కాళహస్తీశ్వరపూజనః భక్త్యతిశయేన మహాదేవస్య ప్రసాదసిద్ధయే భక్తదృఢతరభక్తి పరీక్షణాయ స్వముఖస్థయో ర్నేత్రయో స్స్రశుణోః ప్రకటితయో స్సతో స్తత్స్థానే ప్రశస్తే స్వీయనేత్రే ఉత్పాట్యదిత్సు స్తన్నేత్రస్థానప్రత్యభిజ్ఞానాయ స్వపాదుకాం భ్రూవో ర్మధ్యస్థానే నిచిక్షేపేతి పురాణప్రసిద్ధి బలా దుపపత్తిః.

---

* ఒకభక్తుఁడు, భక్తిదార్ఢ్యము పరీక్షించుటకు భగవంతుఁడు కన్నుల నీరు దెచ్చుకొనఁగా ఆవితీసి తనమంచికన్ను లమర్చబోయి గుఱుతునకుగా తన కాలిచెప్పును దేవునికనుబొమలనడుమ నుంచినాఁడని పురాణప్రసిద్ధము.

దేవా! నాచిత్తపాదుకలు దొడిగికొని విహరింపుము. అని వేడుకొనుచున్నారు.—

వక్షస్తాడన మంతకస్య కఠినాపస్మారసంమర్దనం
భూభృత్పర్యటనం నమ త్సురశిరః కోటీరసంఘర్షణమ్,
కర్మేదం మృదుళస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే
మచ్చేతో మణిపాదుకావిహరణం శంభో సదాంగీకురు. 64

టీ. గౌరీపతే=పార్వతీవల్లభా! శంభో=మంగళకరుఁడ! అంతకస్య=యమునియొక్క, వక్షస్తాడనం=అఱ్ఱు మ్మదన్నుటయు, క...నం - కఠిన=కఠినమైన (భేదింపరాని), అపస్మార = స్వరూపాజ్ఞానముయొక్క, సంమర్దనం = నిగ్రహించుటయు (చితుకఁద్రొక్కుట), భూభృత్పర్యటనం=వెండికొండయందు సంచరించుటయు, న...ణం-నమత్ = నమస్కరించుచున్న, సుర=దేవతలయొక్క,శిరః = శిరస్సులయందలి, కోటీర = కిరీటములయందు, సంఘర్షణం = ఒరయుటయు, ఇదం = ఈనాలుఁగును, మృదులస్య = మార్దవయుక్తమైన, తావక పదద్వంద్వస్య = నీపాదములయొక్క, కర్మ = వ్యాపారము. మచ్చేతోమణిపాదుకావిహరణం - మత్= నాయొక్క, చేతః = చిత్తమనియెడు, మణిపాదుకావిహరణం=మణిమయమైన పాదుకలతో సంచారమును, సదా=ఎల్లప్పుడును, అంగీకురు=అంగీకరింపుము.

తా. పార్వతీవల్లభా! యమునిఱొమ్ము తన్నవలెను. అతికఠోరమైన యపస్మారమణఁగఁద్రొక్కవలెను. కొండమీఁదఁ దిరుగవలెను. నమస్కరింపవచ్చిన దేవతానుల కిరీటములరాపిడి కోర్వవలెను. ఇదియంతేయు నీ గుల కఠినకృత్యము. నీపాదము లతికోమలములు. నాచిత్తంబను నున్నని మణిపాదుకలను దొడిగికొనుటకు దయచేసి యంగీకరింపుము. నామనస్సునను మీ పాదములు నిలిపి నన్ను రక్షింపుఁడని తాత్పర్యము.

అ. స్వచేతః పాదుకావిహరణం ప్రార్థయతే:—

వ్యా. వక్ష స్తాడన మితి. అంతకస్య యమస్య వక్ష స్తాడనం వక్ష స్యురసి తాడనం పాదేన ప్రహరణం కఠినాపస్మారసంమర్దనం కఠినః దుర్భేదః యోపస్మారః స్వరూపాప్రత్యయ స్తస్య సమ్మర్దనంనిగ్రహణం భూభృత్ప ర్యటనం భూభృతి రజతాద్రౌ పర్యటనం పరిభ్రమణం నమ త్సురశ్శిరః కోటీరసంఘర్షణం నమతాం సురాణాం శిరాంసి తదలంకారభూతేషు కోటీరేషు సంఘర్షణం సంస్పర్శనం హే గౌరీపతే పార్వతీపతే హే శంభో సుఖదాయక ఇద మేతత్రయం మృదులస్య మార్దవయుక్తస్య తావకపద ద్వంద్వస్య తవేదం తావకం పదయో ర్ద్వంద్వం తచ్చ తథోక్తం తస్య కర్మవ్యాపార స్త్వం మచ్చేతో మణిపాదుకా విహరణం మణేః పాదుకా మణిపాదుకా మణిమయీ పాదుకేత్యర్థః మచ్చేతః మమ చిత్తమేవ మణిపాదుకాతయా విహరణం మచ్చేతోమణిపాదుకా విహరణం సదానవరత మంగీకురు స్వీకురు పూర్వోక్తకఠినవక్ష ఆద్యకసంఘర్షణ జన్యపీడానివృతయే అతిమృదుళమామకచిత్తమణిపాదుకావిహరణ మంగీకృత్య మాంత్రాయస్వేతి ప్రార్థయితు రభిప్రాయః.

పరమశివుని పాదారవిందములు సేవించువానికి దుర్లభమేమియు లేదని రూఢిగాఁ జెప్పుచున్నారు.—

వక్ష స్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకలికా నీరాజనం కుర్వతే,
దృష్ట్వా ముక్తివధూ స్తనోతి నిభృతా శ్లేషం భవానీపతే
యచ్చేత స్తవ పాదపద్మ భజనం తస్యేహకిందుర్లభమ్. ६५

టీ. హేభవానీపతే=ఓపార్వతీవల్లభా! యచ్చేతః=ఏపురుషుని యొక్క-చిత్తము, తవ=నీయొక్క-, పాదపద్మభజనం = పాదకమలము సేవచేయునో, దృష్ట్వా=వానిఁజూచి, వైవస్వతః=యముఁడు, వక్షస్తాడనశంకయా=ఱొమ్ముతన్నునను భయముచేత, విచలితః=పాఱిపోవుచున్నాఁడు. నిర్జ

రాః=దేవతలు, కో...నం-కోటీర=కిరీటములయందు, ఉజ్జ్వల=ప్రకాశించు చున్న, రత్న దీప=దీపములవంటి రత్నములయొక్క-, కలికా=అంకురముల చేత, నీరాజనం=నీరాజనమును, కుర్వతే=చేయుచున్నారు. ముక్తివధూః=ముక్తికాంత, నిభృతాశ్లేషం = గాఢాలింగనమును, తనోతి = చేయుచున్నది. తస్య = అభక్తునికి, ఇహ = ఈలోకమందు, దుర్లభం = లభ్యముకానిది, కిం=ఏది ?

తా. పార్వతీమనోహరా! చంద్రశేఖర! మీపాదసేవకునిజూచి మునుపటియట్లే బొమ్మునఁ దన్నుదువేమోయని భయపడి యముఁడు పాఱి పోవును. దేవతలందఱు కాళ్ళమీఁదఁబడి మ్రొక్కి- తమకిరీటములయందలి మాణిక్యదీపములతో నీరాజనము లిత్తురు. ముక్తికాంత తనంతఁ దావచ్చి గాఢాలింగనమొసఁగును. ఇఁక నీభక్తునకేమి దుర్లభము? సర్వము సులభము యనితాత్పర్యము.

అ. పరమశివపాదపద్మం భజమానస్య దుర్లభరాహిత్యం ప్రతిజానీతే.—

వ్యా. వక్షేతి. హే భవానీపతే పార్వతీరమణ యచ్చేతః యస్య పురుషస్య చేతశ్చిత్తం తవ పాదపద్మభజనం భవతి తవ తే పాదపద్మభజనం పాదపద్మసేవకం భవతి జాయతే తం దృష్ట్వా వైవస్వతః యమః వక్షస్తాడన శంకయా శివభక్తద్రోహేణ పూర్వవన్మమ వక్షః పరమశివ స్తాడయిష్య తీతి శంకయా విచలితః దూరం పలాయితో భవతి నిర్జరాః వార్ధకహీనాః దేవాః కోటీరోజ్జ్వలరత్నదీపకలికా నీరాజనం కోటీరేషు కిరీటే షూజ్జ్వలాః ప్రకాశమానాః రత్నాని దీపాఇవ రత్నదీపాః కోటీరోజ్జ్వలాశ్చ తే రత్నదీపా శ్చ తేషాం కలికాభి రంకురై ర్నీరాజనం కోటీరోజ్జ్వల రత్నదీపకలికానీరాజనం తత్తస్య కుర్వతే విరచయంతి ముక్తివధూ ర్ముక్తి రేవ వధూ రంగనాతస్య నిభృతాశ్లేషం దృఢాలింగనం తనోతి విస్తరేణ కరోతి తత స్తస్య భక్తస్యేహాస్మిన్ లోకే కిం కిం ఫలం తేదుర్లభం లబ్ధు మశక్యం సర్వం సులభమేవేతి భావః శివపాదారవిందార్పితచిత్తస్య సర్వం సులభమేవేతి భావః.

'నన్ను రక్షింపుము' అని వేఁడుకొనుచున్నారు.—

క్రీడార్థం సృజసి ప్రపంచ మఖిలం క్రీడామృగా స్తే జనాః
యత్కర్మాచరితం మయా చ భవతః ప్రీత్యై భవ త్యేవ తత్,
శంభో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మా న్మామకరక్షణం పశుపతే కర్తవ్య మేవ త్వయా. 66

టీ. శంభో = సుఖకరుండవైన పరమేశ్వరుఁడా! అఖిలం=సమస్తమైన, ప్రపంచం = లోకమును, క్రీడార్థం = లీలామాత్రఫలముగా, సృజసి = సృజించుచున్నావు. తే = నీకు, జనాః=ప్రజలు, క్రీడామృగాః = విలాసార్థమైన జంతువులు, మయా = నాచేత, యత్ = ఏ, కర్మ = కర్మము, ఆచరితం=ఆచరింపఁ బడినదో, తత్=ఆకర్మము, భవతః=నీయొక్క, ప్రీత్యై = ప్రేమకొఱకు, భవత్యేవ = అగుచున్నది. మచ్చేష్టితం=నావ్యాపారము, స్వస్య=నీసంబంధమైన, కుతూహలస్య=ఇష్టమునకు, కరణం=సాధకమైనది, నిశ్చితం=నిశ్చయము. తస్మాత్ = కాఁబట్టి, హేపశుపతే = ఓ పరమశివుఁడా! మామకరక్షణం = నాసంరక్షణము, త్వయా = నీచేత, కర్తవ్యమేవ = చేయఁదగినదియ.

తా. పరమేశ్వరా! నీ వీప్రపంచమంతయు సృజించుట లీలార్థము గదా! ఈప్రజలందఱు నీవినోదార్థమైన జంతువులుగదా! వారివారి పెంపుడుజంతువుల నడవడులు వారికి ప్రేమాస్పదములగుట జగత్ప్రసిద్ధమే. కావున నేఁజేయుసత్కర్మములుగాని దుష్కర్మములుగాని యేచేష్టలైనను నీకు తృప్తికరములగును. కాన నన్ను రక్షింపవలసినవాఁడ వగుచున్నావు.

అ. ఆత్మరక్షణం కర్తవ్యమితి ప్రార్థయతే:—

వ్యా. క్రీడార్థమితి. హే శంభో ఇదం పరిదృశ్యమాన మఖిలం ప్రపంచం క్రీడార్థం క్రీడాలీలా అర్థః ప్రయోజనం యస్మి న్కర్మణి తద్యథా భవతి తథా సృజసి నిర్మాసి ఆప్తసర్వకామస్య తవ వినా క్రీడయా నాన్యత్ప్రయోజనం పశ్యామః తే తవే మే జనాః క్రీడామృగాః క్రీడాయై లీలాయై నిర్మ

తామృగాః భవంతి మయా యత్కర్మాచరితం యద్య త్కర్మాచరితం కృతం చకారః అసాధుకర్మసముచ్చినోతి తత్సర్వం భవత స్తవ ప్రీత్యై ప్రేమ్ణే భవత్యేవ ఏవకారః అప్రీతిం వ్యవచ్ఛినత్తి మచ్చేష్టితం మద్వ్యాపారః స్వస్య భవ త్సంబంధినః కుతూహలస్య కుతూహలవిషయస్య కరణ మనుష్ఠాన రూపం భవతీదం నిశ్చితం నిశ్చయ ఇత్యర్థ స్తస్మాత్ హే పశుపతే మామక రక్షణం మదీయరక్షణం త్వయా భవతా కర్తవ్యమేవ ఏవకారేణాకర్తవ్యతాయాః వ్యుదాసః లోకే క్రీడా మృగకృతం సర్వం క్రీడయితు రిష్టాయ యథా భవతి తథాఽస్మత్కృతం సర్వం భవదిష్టాయ భవ త్వితి ప్రార్థయితు ర్భావః.

ఈశ్వరధ్యానము శరణుజేసికొనియెద ననుచున్నారు.—

బహువిధపరితోష బాష్పపూర
స్ఫుటపులకాంకితచారుభోగభూమిమ్,
చిరపద ఫలకాంక్షి సేవ్యమానాం
పరమసదాశివభావనాం ప్రపద్యే. 67

టీ. బ...మిం-బహువిధ = నానాప్రకారములైన, పరితోషబాష్పపూర = ఆనందబాష్పములయొక్క ప్రవాహమునను, స్ఫుట = వ్యక్తపడిన, పులకాంకిత = రోమాంచరూపమైన, భక్తిచిహ్న = భక్తియొక్క గుఱుతునను, చారు= రమ్యమైన, భోగభూమిం = భోగస్థానమును, చి... నాం—చిరపద=శాశ్వత కైలాసస్థానమనెడు, ఫల=ఫలమును, కాంక్షి = అపేక్షించువారిచే, సేవ్యమానాం = సేవింపఁబడునదియు, పరమసదాశివభావనాం = సర్వోత్కృష్టుండగు, సాంబశివుని ధ్యానమును, ప్రపద్యే = శరణుపొందుచున్నాను.

తా. ఆనందబాష్పములు రోమాంచము మొదలగు భక్తిభావముల కాలవాలమై నిరంతరము కైలాసవాసము గోరువారి కాశ్రయణీయమైన యీశ్వరధ్యానము చేయుచుందుమనని తాత్పర్యము.

అ. శివభావనాం ప్రపద్య ఇతి నివేదయతి:—

వ్యా. బహ్వితి. బహువిధపరితోషబాష్పపూరస్ఫుటపులకాంకితచారుభోగభూమిం పరితోషబాష్పాణ్యానందాశ్రూణి బహువిధాని బహుప్రకారాణి చ తా న్యానందాశ్రూణి చ తేషాం పూరః ప్రవాహ స్తస్య చ స్ఫుటం స్పష్టం పులకాంకితం పులకరూపం భక్తిచిహ్నం తస్య చ చారుభోగభూమిం రమణీయభోగస్థానం చిరపదఫలకాంక్షిసేవ్యమానాం చిరపదం శాశ్వతస్థానం కైలాస ఇత్యర్థః తదేవ ఫలం ప్రయోజనం తత్కాంక్షతే అపేక్షంత ఇతి తత్కాంక్షిణ స్తై స్సేవ్యమానా మాశ్రయమాణాం పరమసదాశివభావనాం సదాశివః నిత్యానందస్వరూపః పరమ శ్చ సర్వేభ్యః ఉత్కృష్ట స్తథాభూతస్య భావనాం ధ్యానం ప్రపద్యే శరణీ కుర్వే సర్వదా శివధ్యానపరో భవామీ త్యభిప్రాయః.

తన కావుపాలు కావలసి యావును మేపుకొనలేనివాఁ డందులకుగాఁ జాల పశువులుగలవాని నాశ్రయించినట్లు తనభక్తిగోవుయొక్కపుష్టికై పశుపతియగు పరమశివుని ప్రార్థించుచున్నారు.—

అమితముదమృతం ముహు ర్దుహంతీం
విమలభవత్పదగోష్ఠ మావసంతీమ్,
సదయ పశుపతే సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తిధేను మేకామ్. 68.

టీ. సదయ=దయతోఁగూడినవాఁడా! పశుపతే = ఓపశుపాలకుఁడా! అమితముదమృతం=అపరిమితానందంబను పాలు, ముహుః = మాటిమాటికి, దుహంతీం=పితుకనిచ్చునదియు, వి...ష్ఠం-విమల = నిర్మలంబగు, భవత్పద=నీపాదంబులనెడు, గోష్ఠం = పశువులచావడిని, ఆవసంతీం=నివసించునదియు, సుపుణ్యపాకాం = మంచిపుణ్యములకు ఫలమైనదియునగు, మమ=నాయొక్క, భక్తిధేనుం = భక్తియనుగోవును, ఏకాం= ఒక్కదానిని, పరిపాలయ=కాపాడుము.

తా. పశుపతీ! పరమేశ్వరా ! నీవపారమైన దయగలవాఁడవు. ఎంత రో పుణ్యము ఫలింపఁబట్టి నాకీభక్తియనుగోవు లభించినది. ఇది యపరిమితా నందరూపమైనపాలు పదేపదే యిచ్చును. నీపాదరూపమైన పశువులచావడి లోఁ గట్టికొనవిచ్చి యీయావు నొక్కటిఁ గాచిపెట్టుము.

అ. భక్తిపరిపాలనం ప్రార్థయతే:—

వ్యా. అమితమితి. హే సదయదయాసహిత పశుపతే పశుపాలక అమితముదమృతం అమితముదపరిచ్ఛిన్నానందస్సైవామృతం క్షీరం తద్దుహాం తీం ప్రపూరయంతీం విమలభవ త్పదగోష్ఠం భవతః పదమేవగోష్ఠం గోస్థానం విమలం చ తత్ భవత్పదగోష్ఠం చ తదావసంతీం తత్రవాసంకుర్వంతీ మిత్య ర్థః ఉపాన్వధ్యాఙ్వస ఇత్యాధారస్య కర్మసంజ్ఞయా ద్వితీయా సుపుణ్యా పాకాం విమలపుణ్యఫలభూతా మేవం భూతాం మమ మే భక్తిధేనుం భక్తి రేవ ధేను స్తా మేకాం పరిపాలయ పుష్య యథా వా లోకేకశ్చన ధేను జన్యఫలం భోక్తు కామ స్తద్రక్షణా సమర్థ స్సన్ తద్రక్షణసమర్థం కంచ న గోమంతం దయాళుం ధేనురక్షణాయ ప్రార్థయతే తస్వత్త్వద్విషయక మద్భక్తిపరిపాలనాసమర్థ స్త త్ఫలభోగకామః అహం భక్తిపోషణసమర్థం త్వాం తత్పుష్టిం సంపాదయేతి ప్రార్థయామీతి పార్థయితు ర్భావః.

దేవా ! నేననేకదోషముల కొటపట్టైనను చంద్రునివలె నన్నునుం జేకొనుమని వేఁడుచున్నారు.—

జడతా పశుతా కళంకితా
 కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ,
అస్తి యది రాజమౌళే
 భవ దాభరణస్య నాస్తి కిం పాత్రమ్. 69

టీ. జడతా=మూఢత్వము (జలమయుఁడగుట), పశుతా=వివేకము లేమి (పశువగుట), కళంకితా=కళంకము గలిగియుండుట, కుటిలచరత్వం చ=కుటిలముగా సంచరించుటయు, మయి=నాయందు, నాస్తి=లేదు. దేవ =

మహాదేవా ! రాజమౌళే=చంద్రశేఖర ! అస్తియది=ఉన్నయెడల, భవదాభరణస్య = నీయలంకారమునకు, పాత్రం = తగినవాఁడను, నాస్మి కిం= కానా ?

తా. దేవా ! జడత్వము, పశుత్వము, కళంకము, కుటిల సంచారము నాకు లేవు. ఇవియన్నియు చంద్రుని కున్నవి. అతను జలమునఁ బుట్టినాఁడు గనుక జడుఁడు. గురుపత్నీగమనము చేసినాఁడుగనుక పశువు. కళంకము గలవాఁడు గనుక కళంకి. వంకరగానున్న బింబముతోఁ దిరుగువాఁడు గనుక కుటిలచరుఁడు. అట్టిచంద్రుని శిరస్సునఁ బెట్టికొను చంద్రశేఖరుఁడ వైతివి. ' ఓచంద్రశేఖరా ! ననుగూర్చి ఈలక్షణములు నీకునుఁ గలవు. నీవు మూఁఢుడవు గనుక జడుఁడవు. వివేకము లేనివాఁడవు గనుక పశువు. పాపములచేత కళంకివి. కుటిలప్రవర్తనవలన కుటిలచరుఁడవు' నని యందు వారేమి ? అట్లయినచో భూషణముగా నన్నేల గ్రహింపవు? గ్రహింప వల సినదే. అందుకు దగినవాఁడనే యగుదును. మేధావులు దోషశాలురను దరికి జేయనీయరు. నీవు దయతో నట్టివారలను సైతము చేరఁదీసి కాపాడు దువని నీతలమీఁది చంద్రునిమూలమున దెలిసికొంటిని. కాఁబట్టి నన్ను ను రక్షింపుమని తాత్పర్యము.

అ. దోషాశ్రయ మపి మాం చంద్రమివ భూషణాయ స్వీకుర్వితి ప్రార్థయతే:—

వ్యా. జడేతి. జడతామాఢ్యం జలాత్మతా చ ప్రకాశా నాశ్రయత్వ మేవ మాఢ్యం సూర్యతేజసాభిభవాచ్చంద్రస్య ప్రకాశా నాశ్రయత్వం తదా మాయాంసం భవతి పశుపతా పశుప ద్వివేకాభావః పశుతా సా చ గురుపత్నీగ్రహణేన ప్రసిద్ధా కళంకితా కళంకలింగత్వం కుటిలచరత్వం బింబకాటిల్యేన సంచరిష్ణుత్వం ఏతేషాం దోషాణాం సముదాయ శ్చంద్రేస్తి న మయి హే దేవ హే రాజమౌళే చంద్రశేఖరభవదాభరణస్య భవతః భూషణత్వేన గ్రహణస్య కిమితి పాత్రంనాస్మి యద్యపి దోషవద్గ్రహణం బుద్ధిశాలినో న సమ్మన్యతే త్వంతు దయావశా త్తదపి సమ్మన్యసే దోషయుక్తచం

ద్రపరిగ్రహాదేవం ప్రత్యేమితస్మాన్మద్గ్రిహణమపి యుక్తమేవేతి ప్రార్థయితు రభిప్రాయః.

శివుఁ డెల్లప్పుడును నా హృదయమందే కలఁడు గాన పూజించుట సులభమని చెప్పుచున్నారు.—

అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యా
పరివసితుం సులభః ప్రసన్నమూర్తిః,
అగణితఫలదాయకః ప్రభు ర్మే
జగదధికో హృది రాజశేఖరోఽస్తి. 70

టీ. ప్రసన్నమూర్తిః=సుముఖమైన మూర్తిగలవాఁడును, అ...కః-అగణిత=ఎంచఁ దరముగాని, ఫల=వాంఛితమునకు, దాయకః=దాతయు, ప్రభుః=సర్వసమర్థుఁడును, జగదధికః=జగత్తుకన్న నెక్కువవాఁడును నగు, రాజశేఖరః=చంద్రశేఖరుఁడు, మే = నాయొక్క, హృది = హృదయమందు, అస్తి = కలఁడు. అరహసి = బహిరంగముగను, రహసి=ఏకాంతమందును, స్వతంత్రబుద్ధ్యా=స్వాధీనమనుతలంపుతో, పరివసితుం=పరిచర్య సేయుటకు, సులభః=సులభమైనవాఁడు, భవతి=అగును.

తా. స్వాధీనుఁడైన సార్వభౌముని తన యిష్టము వచ్చినచోటికిఁ గొనిపోయి తనయభీష్టము సాధించుకొనుట సులభమైనట్లు సుముఖుఁడై యెల్లకోర్కెలు దీర్చుచు సర్వసమర్థుఁడై జగదతీతుఁడుగానున్న యీరాజశేఖరుఁడు నాహృదయమందేయున్నవాఁడు గనుక నేకాంతముగను బహిరంగముగను గూడ స్వతంత్రముగాఁ బూజింప వచ్చును.

అ. సర్వదా మమ హృదయవర్తిత్వా త్పూజయితుం సులభ ఇత్యాహ :—

వ్యా. అరహసీతి. ప్రసన్నమూర్తిః ప్రసాదోన్ముఖీమూర్తి ర్యస్య తథోక్తః అగణితఫలదాయకః అగణితం సంఖ్యారహితం ఫలం మనోవాంఛితం తస్య దాయకః ప్రదాతా ప్రభుః ప్రభవతి సృష్ట్యాదికర్మ కర్తుం

శక్నోతీతి ప్రభుః అభిలషితకర్తుకరణసమర్థ ఇత్యర్థః జగదధికః జగతోధికః చిద్రూపత్వేన జగద్విలక్షణ ఇతియావత్ జగదధిపఇతి పాఠే సర్వేషాం జగతాం సర్వేషు కర్మసు ప్రేరకః 'యస్సర్వేషు భూతేషు' ఇత్యంతర్యామి బ్రాహ్మణమంత్రప్రమాణ మేవంభూతః రాజశేఖరః చంద్రమౌళి స్సార్వభౌమఇతి చ ధ్వన్యతే మమ హృదిమనస్యస్థిరీభవత్యతః కారణాత్సః అరహసి బహిఃప్రదేశే అంతఃకరణాద్భిన్న దేశ ఇత్యర్థః. రహస్యంతఃకరణప్రదేశే చ మనసీత్యర్థః స్వతంత్రబుధ్యా స్వాయత్తఇతి బుధ్యావరివసితుం పరిచరితుం సులభః అనాయాసలభ్యః భవతీత్యధ్యాహారః.యథాలోకే స్వాయత్తః ప్రసాదాదపూర్వోక్తగుణోపేత స్సార్వభౌమ స్స్వాయత్తం ప్రదేశం ప్రాప్య స్వేష్టం సాధయితుం సులభ స్తథాయమపి సులభో భవతీతి భావః.

ఈశ్వరస్మరణములచేత పాపములు నిర్మూలమైపోయి విద్వద్వరిష్ఠుఁడు శివసారూప్యము బొందునని చెప్పుచున్నారు.—

ఆరూఢభక్తిగుణకుంచితభావచాప
యుక్తైశ్శివస్మరణబాణగణై రమోఘైః,
నిర్జిత్య కిల్బిషరిపూ న్విజయీసుధీంద్ర
స్సానంద మావహతి సుస్థిరరాజలక్ష్మీమ్. 71

టీ. సుధీంద్రః=విద్వద్వరిష్ఠుండు, ఆరూఢభక్తిగుణకుంచితభావచాపయుక్తైః - ఆరూఢ=పొడమకొనిన, భక్తి=భక్తియను, గుణ=అల్లెత్రాటిచేత, కుంచిత = వంచఁబడిన, భావ = అంతఃకరణంబను, చాప=ధనుస్సునందు, యుక్తైః = కూర్చఁబడిన, అమోఘైః = విఫలములుగాని, శివస్మరణచాపగణైః - శివ = ఈశ్వరునియొక్క, స్మరణ = స్మరణమను, బాణగణైః = బాణపుంజములతో, కిల్బిషరిపూన్=పాపంబులనెడు శత్రువులను, నిర్జిత్య= నిశ్శేషముగా జయించి, విజయీ = జయముగలవాఁడగుచు, సానందం = ఆనందముతోఁగూడునట్లుగా, సుస్థిరరాజలక్ష్మీం = స్థిరులైన బ్రహ్మాదులకు రాజైన పరమశివునియొక్క సారూప్యమను స్థిరమైన రాజలక్ష్మిని, ఆవహతి = పొందును.

తా. లోకమందొక రాజు ధనుర్బాణములతో శత్రురాజుల జయించి ఆరాజలక్ష్మిని పొంది సార్వభౌముఁడైనట్లు విద్వద్వరిష్ఠుఁడు ఆరూఢభక్తియను త్రాడుగను అంతఃకరణవృత్తి ధనుస్సుగను నమర్చికొని అం దీశ్వరస్మరణము బాణముగా నెక్కుపెట్టి పాపంబులను శత్రువులనెల్ల జయించి పరమానందముతో పరమేశ్వర సారూప్యలక్ష్మిని పొంది దుష్టనిగ్రహ శిష్టపరిపాలనరూపముగా సర్వశాసకుఁడగును.

అ. శివస్మరణైః పాపాని నిర్మూలీకృత్య విద్వద్వరిష్ఠ శ్శివసారూప్యలక్ష్మీం ప్రాప్నోతీత్యాహ:—

వ్యా. ఆరూఢేతి. సుధీంద్రః బుద్ధిమద్వరిష్ఠః ఆరూఢభక్తిగుణకుంచితభావచాపయుక్తై రారూఢా అభివ్యాప్యా త్పన్నా భక్తిస్సైవ గుణః జ్యా ధనుర్గుణ ఇత్యర్థః తేన కుంచితః నమీకృతః భావః అంతఃకరణవృత్తిరూపా బుద్ధి స్సఏవ చాపః కోదండః కుంచిత శ్చాసౌ భావచాప శ్చ తత్ర యుక్తై ర్యోజితై ర్యోజన మంతర్భావితణిజర్థః అమోఘై రవిఫలై శ్శివస్మరణబాణగణైః శ్శివస్మరణాన్యేవ బాణా స్తేషాం గణైః పుంజైః కిల్బిషరిపూన్ కిల్బిషాణ్యేవ రిపవ శ్శత్రవ స్తాన్ నిర్జిత్య నిశ్శేషం జిత్వా విజయీ సన్ విజయవాన్ సన్ సానంద మానందసహితం యథా తథా సుస్థిరరాజలక్ష్మీం రాజ్ఞో లక్ష్మీః రాజలక్ష్మీః దుష్టనిగ్రహశిష్టపరిపాలనరూపా లక్ష్మీ స్సర్వశాసనమితి యావదిత్యర్థాంతరం సుతరాం స్థిరాః బ్రహ్మాదయ స్తేషాం రాజా సుస్థిరరాజా పరమశివ స్తస్య లక్ష్మీ స్సారూప్యలక్ష్మీ స్తా మావహతి ప్రాప్నోతి యథాలోకే కశ్చన భూపతి ర్బాణై స్సర్వాన్ రిపూన్ జిత్వా రిపురాజలక్ష్మీం ప్రాప్నో త్యేవం భక్తః భక్తిపూర్వకశివస్మరణైః కిల్బిషజయపూర్వకం శివసాయుజ్యం ప్రాప్నోతీతి భావః.

శివభక్తులు ధన్యులని చెప్పుచున్నారు.—

ధ్యానాంజనేన సమవేక్ష్య తమః ప్రదేశం
భిత్వా మహాబలిభి రీశ్వరనామమంత్రైః,

దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యేపాదపద్మ మిహ తే శివ తే కృతార్థాః. 72

టీ. శివ=సాంబశివుఁడా! ధ్యానాంజనేన = ధ్యానంబను కాటుక చేత, సమవేక్ష్య = తెస్సగా కనిపెట్టి, ఈశ్వరనామమంత్రైః=ఈశ్వరుని యొక్క నామమంత్రములనియెడు, మహాబలిభిః=గొప్పపూజోపకరణముల చేత, తమఃప్రదేశం = అజ్ఞానంబను స్థలమును, భిత్వా = త్రవ్వి, యే=ఏ భక్తులు, దివ్యాశ్రితం = దేవతలచేత పొందఁబడిన, భుజగభూషణం = సర్ప మాభరణముగాఁ గలిగిన, తే = నీయొక్క, పాదపద్మం = పాదకమల మును, ఇహ = ఈజన్మమునను, ఉద్వహంతి = ఎత్తికొనుచున్నారో, తే = వారు, కృతార్థాః = జన్మసాఫల్యము బొందినవారు.

తా. నిధులు వెదకువాఁడు కన్నుల కంజనము వేసికొని యది కనిపెట్టి యాచోట నిధిరక్షక దేవతలం బూజించి త్రవ్వి యానిధిగొని ముదమందినట్లు భక్తుఁడు ధ్యానాంజనముతో మీపాదపద్మనిధిం గనుఁగొని మీనామమంత్ర ముతో మహాబలియొనర్చి ఆవరణమైన యజ్ఞానము దొలఁగించి దేవతాశ్రిత మును భుజగభూషితమునగు మీపాదపద్మములంగొని కొల్చి జన్మసాఫల్యము గాఁ బరమానంద మొందునని తాత్పర్యము.

అ. శివపాదభక్తసేవకానాం కార్తార్థ్యమాహ :—

వ్యా. హే శివ ధ్యానాంజనేన ధ్యానమేవాంజన మంతఃస్థాపిత ప రోక్షవస్తుప్రకాశనసమర్థ మౌషధం తేన సమవేక్ష్య సమ్య గంతస్థితం శివ పాదపద్మరూపం వస్తుజ్ఞాత్వా ఈశ్వరనామమంత్రైరేవ మహాబలిభి ర్నిధి పరిపాలకదేవతాప్రసాదజననసమర్థైః పూజోపకరణై స్తమః ప్రదేశంతమః పదపద్మాజ్ఞానమేవ ప్రదేశః వస్త్వావారకస్థలవిశేష స్తంభిత్వా ఖాత్వా యే భక్తాః దివ్యాశ్రితం దివి భవాః దివ్యా స్సురై స్తై రాశ్రితం ప్రాప్తం భుజగ భూషణం భుజగ స్సర్పో భూషణం యస్య తథోక్తం తే పాదపద్మ మి హాస్మిన్ జన్మన్యుద్వహంత్యుద్ధృత్యానుభవంతి తే కృతార్థాః ప్రాప్తజన్మ

ఫలాభవంతి లోకే యదా కశ్చి దంజనవిశేషాక్తే నేత్రే కృత్వా నిక్షేపప్రదేశం జ్ఞాత్వా నిక్షేపరక్షకదేవతాం బల్యాదిభి స్స్వాయత్తీకృత్వావారక ప్రదేశభేదనేన తత్రత్యం నిధిం లబ్ధ్వా ముదమనుభవతి తథా భక్తా అపి ధ్యానాదిపూర్వోక్తోపాయై స్త్వ త్పాదారవిందం సాక్షాత్కృత్వానన్యసులభం తజ్జనిత మానంద మనుభవంతీతి భావః.

శివపాదభజన మక్కఱయైన దనుచున్నారు.—

భూదారతా ముదవహ ద్యదపేక్షయాశ్రీ
భూదారఏవ కి మత స్సుమతే లభస్వ,
కేదార మాకలితముక్తిమహౌషధీనాం
పాదారవిందభజనం పరమేశ్వరస్య. 73

టీ. హేసుమతే = ఓసద్బుద్ధీ! యదపేక్షయా = దేనియపేక్షచేత, శ్రీభూదారఏవ=లక్ష్మియు భూమియు భార్యలుగాఁగల మహావిష్ణువే, భూదారతాం=వరాహరూపమును, ఉదవహత్ = తాల్చెనో, కిం=ఇది సుప్రసిద్ధమేకద! అతః=కనుక, ఆకలితముక్తిమహౌషధీనాం-ఆకలిత = అపేక్షితములైన, ముక్తి=సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యముక్తులనియెడు, మహౌషధీనాం = గొప్పమూలికలకు, కేదారం = పంటపొలమైన, పరమేశ్వరస్య=మహాదేవునియొక్క, పాదారవిందభజనం = పాదకమల సేవను, లభస్వ = పొందుము.

తా. ఓసుబుద్ధీ! చూచితివా! లోకవంద్యుఁడైన యామహావిష్ణువు సైతము మహాదేవుని పాదసందర్శనమునకై వరాహరూపమెత్తి పలువిధముల పరిశ్రమముల కోర్చినాఁడు! నీవా పరమేశ్వర పాదభజనముసేయుము. దానివలన సాలోక్యము సామీప్యము సారూప్యము సాయుజ్యము నను ముక్తులు పంటనేలయం దోషధులు ఫలించినట్లు ఫలించును.

అ. పాదారవిందభజనస్యావశ్యకతామాహ:—

వ్యా. హే సుమతే శోభనా చ సా మతి శ్చ తస్యా స్సంబుద్ధిర్యద పేక్షయా యత్పాదారవిందదర్శనాపేక్షయా శ్రీ భూదార శ్రీ శ్చ భూ శ్చ శ్రీ భువౌ తే దారాః యస్య సః విష్ణు రేవ భూదారతాం వరాహభావ మదనహాత్ ప్రాపోన్నత్ కిం కిము ? ప్రసిద్ధా అతః కారణాదాకలితము క్తి మహౌషధీనా మాకలితాః ఆశంసితాః ముక్తయ స్సాలోక్యాద్యా శ్చతు ర్విధాః తా ఏవ ఓషధయ స్తాసాం కేదార ముత్పాదకం పరమేశ్వరస్య తత్పాదారవింద భజనం పాదారవిందయో ర్భజనం సేవాం లభస్వ ప్రాప్ను హి యతః కారణాల్లోకసందోహ్ మహావిష్ణు రేవ స్వాభిలషితపూర్తయే వరా హీ భూయ శివపాదారవిందదర్శన మైచ్ఛ త్తావృశం భజనం త్వమపి కురుష్వేతి ప్రార్థయితు ర్భావః హరిబ్రహ్మణౌ పరస్పర శ్రైష్ఠ్య నిర్ధారణప రౌ శివపాదమూర్ధదిదృక్షయా వరాహహంసరూపం ప్రాప్తా ఇతి పురాణ ప్రసిద్ధిః.

ఆశాపాశ క్లేశ దుర్వాసనాది
  భేదోద్యుక్తై ర్దివ్యగంధై రమందైః,
ఆశాశాటీ కస్య పాదారవిందం
  చేతఃపేటీం వాసితాం మే తనోతు. 74

టీ. ఆశాశాటీకస్య = దిగంబరుఁడైన యీశ్వరునియొక్క, పాదా రవిందం = పాదపద్మము, మే=నాయొక్క, చేతఃపేటీం = చిత్తమను పె ట్టెను, ఆశాపాశక్లేశదుర్వాసనాదిభేదోద్యుక్తైః-ఆశాపాశ = పాశమువలె బంధకమైన యాశయు, క్లేశ= అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభి నివేశ మను పంచక్లేశములు ననియెడు, దుర్వాసనాది = చెడ్డసంస్కారము (దుర్గంధము) లను, భేద = భేదించుటయందు, ఉద్యుక్తైః=ప్రవృత్తము లైన, అమందైః=కొలఁదిగాని, దివ్యగంధైః = దివ్యమైన పరిమళములచేత, వాసితాం = సువాసనగలదానిఁగా, తనోతు = చేయుఁగాక.

తా. దిగంబరుండగు పరమేశ్వరునియొక్క పాదకమలము నాచిత్త పేటికయందలి యాశాపాశములు పంచక్లేశములు మున్నగు దుర్వాసనల నణంచి దివ్యమైన సువాసనలతో నింపుగాక. ఈశ్వరపాదపద్మము నాచిత్తమం దెడబాయక యుండుగాక యని తాత్పర్యము.

అ. స్వచేతః పేటీ సౌగంధ్యం ప్రార్థయతే:—

వ్యా. ఆశాపాశ ఇతి. ఆశాశాటీకస్య ఆశా దిక్శాటీ అంబరం యస్య బహువ్రీహౌ కప్రత్యయః ఆశాశాటీకస్య దిగంబరస్యేత్యర్థః తస్య పాదారవిందం పాదఏవారవిందం పద్మం తస్మై మమ చేతః పేటీం చేతశ్చిత్తమేవ పేటీ మంజూషా తా మాశాపాశక్లేశదుర్వాసనాదిభేదోద్యుక్తై రాశా విషయతృష్ణా అలం బుద్ధివిరహరూపా సా పాశ ఇవ రజ్జురివ పాశసాదృశ్యం చ ఆశాయాః బంధకత్వేన ఆశాపాశః ఉపమానోత్తరపదకర్మధారయః క్లేశాః పంచ అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశాః అవిద్యా స్వరూపాజ్ఞాన మస్మితా అస్మీత్యస్యభావః అస్మితా దేహే అహ మిత్యభిమానః రాగః విషయే అనురక్తి ర్ద్వేషః అనిష్టవిషయే అప్రీతి రభినివేశః వ్యర్థేషు కర్మసు కర్తవ్యతాగ్రహః క్లిశ్యంతేజనాః ఏభిరితి క్లేశాః అవిద్యాదయః ఆశాపాశ శ్చ క్లేశా శ్చ ఆశాపాశక్లేశా స్తఏవ దుర్వాసనాః దుస్సంస్కారాః దుర్గంధా శ్చ తాసాం భేదేభేదనే ఉద్యుక్తైః ప్రవృత్తై రమందై రనల్పై ర్దివ్యగంధై ర్దేవయోగ్యపరిమళై ర్వాసితాం సంజాతవాసనాం వాసశబ్దాది తచ్ప్రత్యయ స్తనోతుకరోతు మమ చేతసి దిగంబరస్య పాదారవిందం సదా తిష్ఠత్వితి భావః.

కళ్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్,
చేతస్తురంగ మధిరుహ్య చర స్మరారే
నేత స్సమస్తజగతాం వృషభాధిరూఢ. 75

టీ. వృషభాధిరూఢ=నందివాహనమెక్కినవాఁడా! సమస్తజగతాం= ఎల్లలోకములకును, నేతః=నాయకుఁడా! స్మరారే=కామవైరీ! కల్యాణినం=

శుభలక్షణములు గలదియు, సరసచిత్రగతిం = సరసముగాఁ జిత్రములైన యాస్కందితము మున్నగు నడకలుగలదియు, సవేగం = వేగముతోఁగూడినదియు, సర్వేంగితజ్ఞం=అందరి యింగితంబులు నెఱిఁగినదియు, అనఘం=నిర్దుష్టమైనదియు, ధ్రువలక్షణాఢ్యం = (సుళ్లుమొదలగు) స్థిరమైన చిహ్నములుగలదియునగు, చేతస్తురంగం=(నా) చిత్తంబను గుఱ్ఱంబును, అధిరుహ్య =ఎక్కి, చర=సంచరింపుము.

తా. సకల జగన్నాయకా! మహాదేవా! నీకు వృషభముగదా వాహనము? అంతకన్న గుఱ్ఱము మెఱుఁగుగాదు? ఇదిగోచూడుము. ఇప్పుడు నామనస్సొక గుఱ్ఱముగానున్నది. దీనినెక్కి చక్కగా స్వారిచేయుము. ఇదికల్యాణి. యజమానికి శుభసూచకములైన లక్షణములు కలిగియున్నవి. సరసమైనది. అనురాగముఁ జూపుచుఁ బోవును. దీనిపోకలు పలుతెఱఁగులు. కదము మున్నగు నడకలన్నియు నడచును. మిగుల వేగమైనది. ఇంగితముకని పెట్టి ప్రవర్తించును. ఏదోషములు లేవు. స్థిరమైన లక్షణములున్నవి. అనఁగా సుళ్లుమంచివి. నీవు జగన్నాయకుఁడవు గనుక గుఱ్ఱమునెక్కి సంచరించుట యుక్తమైనది. నిత్యము నామనస్సునందు నీస్మరణము గలుగునట్లనుగ్రహింపుమని తాత్పర్యము.

అ. తదేవ భంగ్యంతరేణ స్తౌతి :—

వ్యా. కల్యాణినమితి. హే వృషభాధిరూఢ హే సమస్తజగతాం నేతః సమస్తజగత్ప్రభో స్మరారే కామరిపో చేతస్తురంగం చేత ఏవాశ్వః అశ్వసాదృశ్యా దశ్వస్త మధిరుహ్యారుహ్య చర భ్రమ చేతస్తురంగం కళ్యాణినమిత్యాది విశేషణై ర్విశినష్టి కల్యాణినం కల్యాణాఖ్యలక్షణయుక్తం. యజమానస్యాశ్వపతే శ్శుభసూచక మిత్యపి ద్యోత్యతే సరసం చిత్రగతిం సరసా సానురాగా చిత్రాబహుప్రకారా చ గతిర్యస్య తం తథోక్త మాస్కందితం ధౌరితకం రేచితం వల్గితం ప్లుత మిత్యేవం రూపాగతిః సవేగం వేగసహితం సర్వేంగితజ్ఞం సర్వేషా మింగిత మంతర్గతం భావం జానాతీతి తజ్జ మనఘం నిర్దోషం ధ్రువలక్షణాఢ్యం రేఖారూపావర్తనాది స్థిరలక్షణ

సహితం చేతః పక్షే విషయపరిత్యాగేన ఈశ్వరే స్థిరస్థిత్వం లక్షణం నిర్మలమనసః లక్షణమేతత్ చేతసి తురంగత్వారోపణస్య చేతస్తురంగయో స్సాదృశ్యం వినా అనాచిత్యాదిమాని విశేషణాని చేతస్యపి యోజనీయాని తురంగస్య వృషాధిక గుణత్వా జగన్నేతృత్వా త్తవ తురంగాధిరోహణేన సంచరణం యుక్తమితి భావః.

జన్మసాఫల్యమును వేఱొకవిధముగాఁ జెప్పుచున్నారు.—

భక్తి ర్మహేశ పదపుష్కర మావసంతీ
కాదంబినీవ కురు తే పరితోషవర్షమ్,
సంపూరితో భవతి యస్య మన స్తటాక
స్తజ్జన్మసస్య మఖిలం సఫలం చ నాన్యత్. 76

టీ. భక్తిః=సేన, మహేశపదపుష్కరం = ఈశ్వరపాదరూపమైన యాకాశమున, ఆవసంతీ = స్థిరముగానున్నదై, కాదంబినీవ = మేఘమాల యుంబోలె, పరితోషవర్షం = ఆనందవృష్టిని, కురుతే = కలిగించుచున్నది, (తేన=ఆవర్షముచేత) యస్య = ఏపురుషునియొక్క, మన స్తటాకః = మన స్సనుచెఱువు, సంపూరితః=నిండింపఁబడినది, భవతి=అగునో, తజ్జన్మసస్యం= వానిజన్మమనుపైరు, అఖిలం = నిశ్శేషముగా, సఫలం = ఫలవంతమైనది (అగును), తదితరంచ=అదిగాక తక్కినదిమాత్రము, న=(సఫలము) కాదు.

తా. భక్తిమేఘమాలికబోలె మహాదేవుని పాదపద్మంబను గగనం బునందు వ్యాపించినదియై యానందవర్షము కురియును. అట్టి యావర్షమున కేపురుషుని మానససరోవరమంతయు నిండునో వానిజన్మంబను సస్యంబ సఫలమైనది యగునుగాని తక్కినది కాదు. ఈశ్వర చరణారవిందభక్తి లేక యానందము కలుగుట దుర్లభమని తాత్పర్యము.

అ. జన్మసాఫల్యం భంగ్యంతరేణాహ:—

వ్యా. భక్తి రితి. భక్తి స్సేవా మహేశపదపుష్కరం మహేశస్య పద పుష్కరం చరణాకాశం. ని. 'వ్యోమపుష్కర మంబర' మిత్యమరః. ఆవ

పంతీ సతీ తత్ర స్థిరా భవంతీ సతీత్యర్థః కాదంబినీప మేఘమాలేవ పరితోషవర్ష మానందవృష్టిం కురు తే జనయతి యస్య పురుషస్య మన స్తటాకః మన ఏవ తటాకస్తేన సంపూరితో భవతి సంవర్ధితో భవతి తజ్జన్మ సస్యం తస్య పురుషస్య జన్మ ఉత్పత్తి స్తదేవ సస్య మోషధి రఖిలం నిశ్శేషం యథాభవతి తథాసఫలం ఫలవ ద్భవ త్యస్యచ్చాన్యత్తదితర జ్జన్మ సస్యంచోత్పత్తి సస్యం న సఫలం చ శబ్దోఽయం తు స్థాననివేశీ పూర్వపక్షవ్యావృత్తిప్రయోజనః. ఈశ్వరచరణారవిందభక్తిం వినా ఆనందో దుర్లభఇతి భావః.

ఇంక రెండుశ్లోకములలో పలువిధములగు విచారపడుచున్న బుద్ధి యొక్క విచారము బాపుమని వేడుకొనుచున్నారు.—

బుద్ధి స్థిరా భవితు మీశ్వరపాదపద్మ
సక్తా వధూ ర్విరహిణీవ సదా స్మరంతీ,
సద్భావనా స్మరణదర్శనకీర్తనాది
సమ్మోహితైవ శివమంత్రజపేన వింతే. 77

టీ. హే ఈశ్వర=నిగ్రహానుగ్రహసమర్థుఁడవైన ఓదేవా! విరహిణీ=భర్తృవియోగముఁబొందిన, వధూరివ = భార్యవలె, పాదపద్మసక్తా=(మీ) పాదకమలములయందు దాసక్తికలిగినది గనుకనే, సదా=ఎల్లప్పుడును, స్మరంతీ=తలఁచుచున్న, బుద్ధిః=అంతఃకరణవృత్తి, శివమంత్రజపేన = 'శివ' అను మీనామమంత్రముయొక్క జపముచేత, సమ్మోహితైవ = మోహపడినదియేయగుచు, స్థిరా=స్థైర్యము గలిగినది, భవితుం=అగుటకు, సద్భావనా స్మరణదర్శనకీర్తనాది - సత్ = సత్యమైన మీపాదపద్మముయొక్క, భావనా=ధ్యానము, స్మరణ=స్మరణము, దర్శన=దర్శనము, కీర్తన=కీర్తనము, ఆది=మున్నగువానిఁగూర్చి, వింతే=విచారపడుచున్నది.

తా. కరుణాసముద్రుండవైన మహాదేవా! మీపాదపద్మములయందు దాసక్తి గలిగియున్న నాబుద్ధి భర్తృవియోగముఁ బొందినభార్యవలె నిరంతరముధ్యానముచేయుచు 'శివ' యను మీనామమంత్రము జపించుచు మోహ

ము నొందినదియై స్థైర్యముకొఱకు మీపాదధ్యానము, మీపాదస్మరణము, మీపాదసందర్శనము, మీపాదసంకీర్తనము, మీపాదపూజనము మొదలగు వానిఁగూర్చి విచారించుచున్నయది. దీని నుద్ధరింపుము.

అ. అనేకధా విచారయంతీం బుద్ధిం విచారాత్సముద్ధరేతి ద్వాభ్యాం ప్రార్థయతే:—

వ్యా. బుద్ధీతి. హే ఈశ్వర కర్తు మకర్తు మన్యథాకర్తుం చ సమర్థ విరహిణీ వధూరివ విరహిణీ భర్తృవియోగం ప్రాప్నువతీ వధూరివ భార్యేవ పాదపద్మసక్తా ఇవ పాదపద్మే సక్తా ఆసక్తిమత్ అతఏవ సదా సర్వదా స్మరంతీ ధ్యాయంతీ బుద్ధి రంతఃకరణవృత్తి శ్శివమంత్రజపేన శివఇతి మంత్ర స్తస్య జపే నావృత్త్యా సమ్మోహితై వేదం కర్తవ్య మిదం నేతి విచారం ప్రాపితైవ సతీ స్థిరాస్వయమేకత్ర స్థైర్యశాలినీ భవితుం సద్భావనా స్మరణదర్శన కీర్తనాది ప్రతి సతః సత్యస్య పాదపద్మస్య భావనా ధ్యానం చ స్మరణ మనుభూతానుసంధానం చ దర్శనం తద్విషయకచాక్షుషజ్ఞానం చ కీర్తనం తదభిలాషక శబ్దోచ్చార శ్చ తా న్యేవాదయో యస్య తత్ప్రీతి విందతే విచారయతి విచారణార్థోఽయంశ్నమ్ వికరణస్థో విదధాతు స్సత్తాయాం విద్యతే జ్ఞానేవేత్తి విందతే విచారణే విందతే విందతి ప్రాప్తౌ శ్యన్ లుక్ శ్నం శేషః వ్యయంక్రమాత్.

ధ్యానము మున్నగు వ్యాపారములయందేమి చేయుదునని సంశయపడుచున్న యీనాబుద్ధికి శ్రేష్ఠగుణము లుపదేశించి విచారము దొలఁగింపుమని వేఁడుకొనుచున్నారు.—

సదుపచారవిధి ష్వనుబోధితాం
 సవినయాం సుహృదం సముపాశ్రితామ్,
మమ సముద్ధర బుద్ధి మిమాం ప్రభో
 వరగుణేన నవోఢవధూ మివ. 78

టీ. ప్రభో=సమర్థుఁడవైన పరమేశ్వరా! సముపచారవిధిషు - సత్=సత్యమైన మీపాదపద్మముయొక్క, ఉపచారవిధిషు=పూజావిధానముల యందు, అనుబోధితాం = క్రమముగా సుశిక్షితమైనదియు, సవినయాం = విధేయమైనదియు, సుహృదం=శుద్ధమైన మనస్సుగలదియు, సముపాశ్రితాం =మంచియాశ్రయణము గలదియునగు, మమ=నాయొక్క, ఇమాం=ఈ, బుద్ధిం=బుద్ధిని, వరగుణేన=శ్రేష్ఠమైనగుణము నుపదేశించుటచేత, నవోఢ వధూమివ=క్రొత్తగాఁబెండ్లాడిన భార్యనుంబోలె, సముద్ధర=ఉద్ధరింపుము.

తా. సర్వార్థ సిద్ధిదాయకుఁడవగు పరమేశ్వరా! మీపాదపూజ యందు సుశిక్షితమై వినయముతోఁగూడి పరిశుద్ధభావముతోఁ బెద్దలయాశ్రయణముచేయు నాబుద్ధికి, ఉపచారము చేయుటయందు సుశిక్షితురాలును, వినయవంతురాలును, శుద్ధాంతరంగము గలిగినదియు, ఆశ్రయించి యున్నదియు నగు క్రొత్తగాఁబెండ్లిచేసికొనిన భార్యకుంబోలె సద్గుణముల నుపదేశించి సంశయము దీర్చి చేకొనుము.

అ. భావనాదిషు వ్యాపారేషు కిం కుర్యా మితి సందిహానా మిమాం పూర్వోక్తాం బుద్ధిం శ్రేష్ఠగుణోపదేశేన విచారా త్సముద్ధరేతి ప్రార్థ్యతే:—

వ్యా. సముపచారేతి. హే ప్రభో సర్వార్థఘటనసమర్థ సదుపచార విధిషు సదిత్యత్పాదపద్మస్యోపచారవిధిషు పూజావిధానే ష్వనుబోధితా మనుక్రమేణ బోధితాం శిక్షితాం సవినయాం సన్మనోనుసరణయుక్తాం సుహృదం శుద్ధమనస్కాం సంతముపాశ్రితా మాశ్రయమాణాం కర్తరి క్తః మమ మే ఇమాం బుద్ధిం వరగుణేన శ్రేష్ఠగుణోపదేశేన నవోఢవధూమివ నవం యథాతథా ఊఢాపత్నీత్వేన స్వీకృతా సా చ సా వధూశ్చతా మివ సముద్ధరోద్ధమయ ప్రకృతసందేహం పరిహరేతి భావః యథా కశ్చిద్వర స్సద్యో వివాహసంస్కృతాం భార్యాం శ్రేష్ఠగుణోపదేశేన సంశయా దుద్ధరతి తథేమాం బుద్ధిం సంశయా త్సముద్ధరేతి భావః.

ఈశ్వరపాదప్రత్యక్షముఁ గోరుచున్నారు.—

నిత్యం యోగిమనస్సరోజదళసంచారక్షమ స్త్వత్క్రమ
శ్శంభో తేన కథం కఠోరయమరాడ్వక్షః కవాటక్షతిః,
అత్యంతంమృదులంత్వదంఘ్రియుగళంహా మేమనశ్చింతయ
త్యేతల్లోచనగోచరం కురు విభో హస్తేన సంవాహయే. 79

టీ. హేశంభో = ఓయీశ్వరుఁడా! త్వత్క్రమః = మీపాద విన్యాసము, నిత్యం = ఎల్లప్పుడును, యోగిమనస్సరోజదళసంచారక్షమః - యోగిమనః = యోగీశ్వరులయొక్క మనస్సనియెడు, సరోజ = పద్మము యొక్క, దళ=రేకులతోఁ గూడ, సంచార = కూడితిరుగుటయందు, క్ష మః = సమర్థమైనది. తేన = అట్టిమృదువైన మీపాదముతో, కఠోరయ మరాడ్వక్షఃకవాటక్షతిః - కఠోర=మిక్కిలికఠినమైన, యమరాట్=యమ ధర్మరాజుయొక్క, వక్షఃకవాట = తలుపువంటిఱొమ్ముయొక్క, క్షతిః= ఛేదనము(తన్నుట), కథం = ఎట్లు ? అత్యంతం = మిక్కిలి, మృదులం = మార్దవముగలిగిన, త్వదంఘ్రియుగళం=మీపాదయుగ్మమును గూర్చి, మే =నాయొక్క, మనః = మనస్సు, చింతయతి = చింతిల్లుచున్నది, హా = అ య్యో! ఏతత్ = ఈపాదయుగ్మమును, లోచనగోచరం = కన్నుల కగ పడుదానిఁగా, కురు=చేయుము. హస్తేన=చేతితో, సంవాహయే = పట్టి యొత్తెదను.

తా. దేవా! యోగిమానసపద్మములయందు సంచరింపఁదగిన మీ పాదములతోనా? మొద్దుతలుపువలె కఠోరమైనయాయమునిఱొమ్ము ద న్నుట! మీపాదములు మిగుల కోమలమైనవి. అన్నన్నా! నామనస్సునకు మిగుల విచారముగా నున్నది. దేవా! నాకన్నులకగపడునట్లుచేయుము నా చేతులతో మీ యడుగులొత్తి సేవించెదను.

అ. శివపాదాపరోక్ష్యం ప్రార్థయతే:—

వ్యా. హే శంభో త్వత్క్రమ స్త్వత్పదవిన్యాసః నిత్యం సదా యోగిమనస్సరోజదళసంచారక్షమః, యోగిమనఏవ సరోజం పద్మం తస్య

దస్త్వేచ్ఛద్దై స్సహ సంచారోఽఘటనం తత్ర క్షమ స్సుమర్ధస్తేన మృదుశేన పదేన కఠోరయమురాద్వక్షఃకవాటక్షతి ర్యమరా ద్ధర్మరాజః స్తస్యవక్షః ఉరః కఠోర మతికఠినం తచ్చ తత్ తత్కవాటఇవ కవాటసదృశం తస్య క్షతిర్భేదనం కథ మాసీదితి చిత్ర మత్యంతం మృదులం త్వదంఘ్రి యుగళం మే మనశ్చింతయతి హా కష్టం హే విభో ఏతత్పదయుగళం మే లోచనగోచరం నేత్రవిషయం కురు, తద్ధస్తేన కరేణ సంవాహయే పీడయా మి. స్పష్టోభావః

ఏష్య త్యేష జనిం మనోఽస్య కఠినం తస్మి న్నటా నీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః,
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమన స్తల్పేషు వేద్యాదిషు
ప్రాయ స్సత్సు శిలాతలేషు నటనం శంభో కిమర్థం తవ. 80

టీ. హేశంభో = ఓశంకరుఁడా! ఏషః = వీఁడు, జనిం = ఉత్ప త్తిని, ఏష్యతి = పొందఁబోవుచున్నాఁడు. అస్య = వీనియొక్క, మనః = మనస్సు, కఠినం = కఠోరమైనది. తస్మిన్ = దానియందు, అటాని = సం చరింపవలసినవాఁడను, ఇతి = అని, మద్రక్షాయై = నాసంరక్షణముకొఱ కు, కోమలపదన్యాసః = మృదువైనయడుగులు వెట్టుట, గిరిసీమ్ని=పర్వత ప్రదేశమందు, పురా = (నేనుపుట్టక) మునుపు, అభ్యాసితః = అలవాటు చేయఁబడినది. నోచేత్ = అట్లుకాదేని, దివ్యగృహాంతరేషు = రమ్యమైన గృహములయొక్క మధ్యప్రదేశములును, సుమనస్తల్పేషు= పూవులపాన్పు లును, వేద్యాదిషు = అరుఁగులు మొదలగునవియు, ప్రాయః = బాహు ళ్యముగా, సత్సు = ఉండఁగా, శిలాతలేషు = ఱాతినేలలయందు, తవ = నీకు, నటనం = నాట్యము, కిమర్థం = ఎందుకొఱకు?

తా. ఓకైలాసవాసా! సాంబశివ! నీవునన్నుగూర్చి యీపురుషుఁడు భూమిలోఁ బుట్టఁబోవును. వీనిమనస్సు మిగులకఠినముగానుండును. అప్పుడు నాకు దానియందు సంచరింపవలసివచ్చును. అని యాలోచించి నాసంరక్షణ

మునకై నేను పుట్టకపూర్వమే కొండలమీఁద నీకోమలపాదములతో నడచు టకలవాటుచేసితివి. లేకపోయినచో మిద్దెలు, మేడలు, పూలపాన్పులు, మంచిమంచియరుఁగులు నుండఁగా నీకేల యీఱాళ్లమీఁద నాట్యముచేయ వలసివచ్చినది?

అ. ప్రకారాంతరేణ స్తౌతి:—

వ్యా. ఏష్యతీతి. హే శంభో ఏష జనః జని ముత్పత్తి మేష్యతి లప్స్యతేఅస్యమనః కఠినం కఠోరం తస్మి న్నటాని సంచ రాణీతి హేతునా మద్రక్షాయై మమ త్రాణాయ కోమలపదన్యాసః మృదులపదయో ర్విన్యాసః గిరిసీమ్ని పర్వతమధ్యప్రదేశే పురా మజ్జననా త్పూర్వ మభ్యాసితః, ఆచరితః నోచే న్నైవం యది దివ్యగృహాంతరేషు రమణీయగృహమధ్యేషు సుమనస్తల్పేషు పుష్పసమానశయనేషు వేద్యాదిషు వేదికాప్రభృతిషు చ స్థానేషు ప్రాయస్సత్సు శిలాతలేషు పాషాణప్రదేశేషు తవ నటనం నాట్యం కిమర్థం కిం ఫలకం స్పష్టోఽర్థః.

ఇట్టిలక్షణములుగలవాఁడు జీవన్ముక్తుఁడగునని చెప్పుచున్నారు.—

కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచిద్ధ్యానసమాధిభి శ్చ నతిభిః కంచి త్కథాకర్ణనైః,
కంచి త్కంచి దవేక్షణై శ్చ నుతిభిః కంచి ద్దశా మీదృశీం
యఃప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవ న్సముక్తః ఖలు.

టీ. హే ఉమామహేశ = పార్వతీప్రాణవల్లభుఁడవైన ఓమహాదేవా! కంచిత్కాలం = కొంతసేపు, భవతః = నీయొక్క, పాదారవిందార్చనైః=కమలములవంటి పాదములపూజలతోఁడను, కంచిత్=కొంతసేపు, ధ్యానసమాధిభిశ్చ = నిరంతరధ్యానముయొక్క నియమములతోఁడను, కంచిత్ = కొంతసేపు, నతిభిః = నమస్కారములతోఁడను, కంచిత్ = కొంతసేపు, కథాకర్ణనైః=చరిత్రలు వినుటతోఁడను, కంచిత్=కొంతసేపు, అవేక్షణైశ్చ = దర్శనములతోఁడను, కంచిత్=కొంతసేపు, నుతిభిః=స్తోత్రముల

తోడనుంగూడి, ముదా = సంతోషముతో, త్వదర్పితమనాః = నీయందు నిలుపఁబడిన మనస్సుగలవాఁడై, ఈదృశీం = ఇట్టి, దశాం = స్థితిని, యః = ఏపురుషుఁడు, ప్రాప్నోతి = పొందుచున్నాఁడో, సః=వాఁడు, జీవన్ = జీవించియున్నవాఁడగుచునే, ముక్తఃఖలు=మోక్షము బొందినవాఁడగును గదా!

తా. ఉమామహేశ్వరా! మీయందు మనసు నిలిపి యెడతెఱిపిలేక యొకప్పుడు మీ పాదపూజలును, వేఱొకప్పుడు నియతమైన మీనిరంతర ధ్యానంబులును, మఱియొకప్పుడు మీ పాదవందనములును ఇంకొకప్పుడు శివకథలువినుటయు, కొన్నివేళల మీదర్శనములునుం జేయుచు సంతోషము నొందువాఁడు జీవన్ముక్తుఁడగును.

అ. ఏవంభూతో జీవన్ముక్తో భవతీత్యాహ:—

వ్యా. కంచిదితి. హే ఉమామహేశ మహాంశ్చాసావీశ శ్చ మహేశః ఉమయా పార్వత్యా సహితో మహేశః మధ్యమపదలోపీసమాస స్తస్య సంబుద్ధిః కంచిత్కాలం కంచిత్సమయా భవత స్తవ పాదారవిందార్చనై రరవిందసదృశ పాదపూజాభిః కంచిత్కంచిత్కాలం ధ్యానసమాధిభి ర్ధ్యానం నిరంతరం భవచ్చింతనం, తస్య సమాధిభి ర్నియమైః కంచిత్కాలం నతిభి ర్నమస్కారైః కంచిత్కాలం కథాకర్ణనైః కథాశ్రవణైః కంచిత్కాల మవేక్షణై ర్దర్శనైః కంచిత్కాలం నుతిభి స్తోత్రైశ్చ సహితః ముదా సంతోషేణ త్వ దర్పితమనా స్త్వయి నిహితచిత్తః యః యాదృశీం దశాం పూర్వోక్తార్చనాదియుక్త త్వేనావస్థితిం ప్రాప్నోతి లభతే సః జీవన్నేవ ముక్తః ఖలుమోక్షంప్రాప్తఏవ భవతీ త్యర్థ్యాహార్యం పూర్వోక్తై స్తృతీయాంతవిశేషణై ర్భవత ఇత్యస్యాన్వయః కాల మిత్యస్యాధ్యాహృతసహిత పదార్థే నాన్వయః.

శివునియనుగ్రహముచేలననె విష్ణుమూర్తి మిగుల పూజ్యుం డయ్యెనని చెప్పుచున్నారు.—

బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే
ఘోణిత్వం సఖితామృదంగవహతా చేత్యాదిరూపం దధౌ,
త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహభాగో హరిః
పూజ్యాత్పూజ్యతర స్సఏవ హి న చేత్కోవా తదన్యోధికః.

టీ. ఆర్యాపతే=ఓపార్వతీపతీ! హి = ఏకారణమువలన, హరిః= విష్ణుమూర్తి, బాణత్వం= (నీకు) బాణమగుటయు, వృషభత్వం = (నీయొక్క) నందివాహన మగుటయు, అర్ధవపుషా=సగముశరీరముతో, భార్యాత్వం=(నీ) భార్యయగుటయు, ఘోణిత్వం=(నీపాదదర్శనమునకై) వరాహమగుటయు, సఖితా = (మోహినీరూపముతో) మిత్రమగుటయు, మృదంగవహతాచ = (తాండవమప్పుడు) మద్దెలగాఁడగుటయు, ఇత్యాదిరూపం= ఈమొదలగు నాకారమును, దధౌ = ధరించెనో, త్వత్పాదే = నీపాదమునందు, నయనార్పణంచ = (కమలములుపూజించునప్పుడు వేయింటిపూర్తికిగా) నేత్రమును సమర్పించుటయు, కృతవాన్=చేసినవాఁడయ్యెనో, చ = ఇంతియకాక, త్వద్దేహభాగః = నీ దేహమందొక్కభాగము గలవాఁడయ్యెనో (అందువలన), సఏవ=ఆవిష్ణువే, పూజ్యాత్=పూజ్యులైనబ్రహ్మాదులకన్న, పూజ్యతరః=ఎక్కువగాఁ బూజింపఁదగినవాఁడు. నోచేత్ = అటులకాదేని, తదన్యః=ఆవిష్ణువుదక్కమఱియొక్కఁడు, అధికః = ఎక్కువవాఁడు, కోవా=ఎవ్వఁడు ?

తా. ఓపార్వతీవల్లభా ! శ్రీమహావిష్ణువు త్రిపురసంహారకాలమందు నీకు బాణమయ్యె. వృషభరూపమై నీకు వాహనముగానుండె. ఆర్యారూపంబుతో నీయర్ధాంగంబున భార్యయై యొప్పారె. నీపాదసందర్శనమునకై వరాహరూపమెత్తె. జగన్మోహినీరూపంబున నీవాల్లభ్యంబునడసె. నీవానంద తాండవమాడుచో మద్దెల వాయించుచు మెలఁగె. తాను సహస్రకమలార్చనము చేయునప్పు డొక్కకమలము తక్కువగాఁగఁ దననేత్రంబును మీ పాదములయందర్పించియుండె నిటుల మీయనుగ్రహమునకుఁ బాత్రుఁడై

మీయర్ధాంగసంగి యగుటంబట్టియేగదా బ్రహ్మాదు లందఱికంటెను బూజ్యతరుండయ్యెను. కానిచో వానియంతవాఁ డింకెవ్వఁడైనఁగలఁడా? దీనిచే బ్రహ్మాదులు పూజ్యులనియు విష్ణువు పూజ్యతరుఁడనియు శివుఁడు పూజ్యతముఁడనియుఁ దాత్పర్యము తేలుచున్నది. 82

అ. శివప్రసాదాదేవ విష్ణోః పూజ్యతరత్వం సిద్ధ మిత్యాహ:—

వ్యా. హే ఆర్యాపతే పార్వతీపతే ఇదం చ సంబోధన మార్యాయా విష్ణ్వభేదం సూచయతి తత్సూచిత మర్థం వక్ష్యమాణప్రకారేణ వివృణోతి హరిః విష్ణుః హి యస్మాత్ కారణా త్తవ బాణత్వం శరభావః వృషభత్వం వృషభవాహనభావః అర్ధవపుషా శరీరార్ధేన భార్యాత్వం కళత్రభావః ఘోణిత్వం వరాహతా మహాదేవస్య పాదదర్శనాయ వరాహరూప స్వీకారాదితి భావః సఖితాసఖిత్వం మోహినీరూపాపన్న విష్ణో శ్శివవా లభ్య ప్రసిద్ధే రితి భావః మృదంగవహతా మృదంగవాద్యవాదిత్రత్వ మానందతాండవకాలే తత్ప్రసిద్ధే రితిభావః ఏవ మాదిరూపం చ దధా దధార త్వత్పాదే నయనార్పణం చ నేత్రార్పణం చ కృతవా నాచరితవాన్ సహస్రకమలార్చనవేళాయాం సహస్రతమసంఖ్యాపూరకత్వా త్తే న్నేత్రకమలస్యేతి భావః కిం చ త్వద్దేహభాగ స్తవదేహే భాగో యస్య సతథోక్త స్తస్మాత్సఏవ పూజ్యాత్. బ్రహ్మాదిసమూహా త్పూజ్యతరః అతిశయేన పూజయితుమర్హః అభవత్ నచే దేవం నో యది తదన్యః విష్ణోరితరః అధికః కోవా న కోపీత్యర్థః ఏతేన బ్రహ్మాదయః పూజ్యాః హరిః పూజ్యతర స్త్వం పూజ్యతమః. ఇత్యర్థో లభ్యతే.

ఇతరదేవతలను సేవించుటచే సుఖము లభింపదనియు శివునిసేవించుటచేత పరమసౌఖ్యము లభించుననియుఁ జెప్పుచున్నారు.—

జననమృతియుతానాం సేవయా దేవతానాం
నభవతి సుఖలేశ స్సంశయో నాస్తి తత్ర,
అజని మమృతరూపం సాంబ మీశం భజంతే
య ఇహ పరమసౌఖ్యం తే హి ధన్యా లభంతే. 83

టీ. జననమృతియుతానాం=చావుపుట్టుకలతోఁగూడిన, దేవతానాం =దేవతలయొక్క, సేవయా=భజనముచేత, సుఖలేశః=సుఖము లేశమైనను (విషయసుఖమైనను), నభవతి=కలుగదు. తత్ర=అక్కడ, సంశయః=సందేహము, నాస్తి=లేదు, యే=ఏపురుషులు, అజనిం=ఉత్పత్తిశూన్యుఁడును, అమృతరూపం=మరణరహితమైన రూపముగలవాఁడును, సాంబం=జగత్కర్త్రి యగు శక్తితోఁగూడినవాఁడును, ఈశం=నిరతిశయానందము నిచ్చుటకు సమర్థుఁడునునైన శివుని, ఇహ = ఈశరీర ముండియుండఁగనే, భజంతే= సేవించుచున్నారో, తే=వారు, ధన్యాః=కృతార్థులై, పరమసౌఖ్యం=మోక్షానందమును, లభంతే=పొందుదురు.

తా. ఇతరదేవతలందఱును జననమరణములుగలవారు. అట్టిక్లేశములు గలవారిని సేవించువారలకు విషయానందమైనను దృప్తిగాఁ గలుగదు. ఇది నిశ్చయము. పార్వతీసమేతుఁడైన పరమేశ్వరుఁడు జననమరణములు లేనివాఁడును బరమసౌఖ్యప్రదుండునుంగావున శరీరవంతులై యుండఁగనే శివుని సేవించువారు గృతార్థులై మోక్షానందము బొందుదురు.

అ. శివేతరదేవతానాం సేవయా సుఖాలాభ శ్శివసేవయా సౌఖ్యం చ భవతీత్యాహ:—

వ్యా. జననఇతి. జననమృతియుతానా ముత్పత్తిమరణభాజాం దేవతానాం సేవయా భజనేన *సుఖలేశః సుఖస్య లేశోఽపీతి లేశపదమహిమ్నా విషయసుఖమపీతి గమ్యతే నభవతి నజాయతే స్వయం నుఃఖవతీనాం తాసాం సేవయా సేవకస్య సుఖంభవతీతి న వక్తవ్య మితి భావః అత్ర సంశయో నాస్తి యేత్వ జనిం జననశూన్య మమృతరూపం మరణరహితం రూపం యస్య తం తథోక్తం సాంబ మంబయాసహిత మతఏవేశం నిరతిశయసుఖదానసమర్థం శివమిహదేహే సత్యేవ భజంతే సేవంతే తే ధన్యాః కృతార్థా స్సంతః పరమ సౌఖ్యం మోక్షం లభంతే సర్వోత్తమత్వా చ్ఛివసకాశా న్మోక్షప్రాప్తౌ న సంశయలేశోఽపీతి భావః.

హృదయమందు బుద్ధితోఁగూడ విడువకయుండఁగోరుచున్నారు.-

శివ తవ పరిచర్యా సన్నిధానాయ గౌర్యా
భవ మమగుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే,
సకలభువనబంధో సచ్చిదానందసింధో
సదయ హృదయగేహే సర్వదా సంవస త్వమ్. 84

టీ. శివ=ఓ శుభప్రదుఁడా! భవ = ఓసర్వోత్పాదకుఁడా! సకలభువనబంధో=సమస్తలోకములకు బంధువైనవాఁడా! సచ్చిదానందసింధో=సచ్చిదానందములకు సముద్రుఁడైనవాఁడా! సదయ=దయావంతుఁడా! గౌర్యా=పార్వతీదేవితోఁగూడ, తవ = నీయొక్క, పరిచర్యాసన్నిధానాయ=సేవించుటకై సమీపమందుండుటకొఱకు, మమ=నాయొక్క, గుణధుర్యాం=సకలగుణములను వహించిన, బుద్ధియనుకన్యకను, ప్రదాస్యే = దానముచేసెదను, త్వం=నీవు, హృదయగేహే=(నా) హృదయమను గృహమందు, సర్వదా=ఎల్లపుడును, సంవస=సుఖముగా నివసింపుము.

తా. మహాదేవా! నీవు సకలసౌభాగ్యదాయకుఁడవు గాన కన్యకిచ్చు గలిగించుపుంస్త్వగుణంబును, సకలప్రపంచోత్పాదకుండవుగాన సంతానోత్పాదకత్వగుణంబును, సకలలోకబాంధవుఁడవుగాన బంధుమత్వగుణంబును, సత్స్వరూపుఁడవుగాన సాధుశీలత్వగుణమును,చిత్స్వరూపుఁడవుగాన శ్రుతసత్వగుణంబును, ఆనందస్వరూపుఁడవు గాన నీరోగత్వాదిగుణంబులును,సదయుండవుగాన దయాళుత్వంబును మొదలుగా వరగుణంబులన్నియు నీయందు గన్పట్టుచున్నవి. నీవు తగినవరుఁడవు. బుద్ధియనునాకన్యయుశాస్త్రోక్తంబైన యెల్లగుణంబులుం గలిగి గుణధుర్య యైయున్నది. గౌరీదేవితోఁగూడ నీకు పరిచర్య చేయుచు నీయొద్దనుండునట్లుగా దీని కన్యాప్రదానము చేసెదను. బ్రాహ్మవివాహవిధితోఁ బరిగ్రహించి చాతుర్యముతోడ నీయుభయపత్నులకును సామరస్యము సంపాదించుచు నాహృదయ గేహము నెప్పుడును గృహస్థుడవై సుఖముగా నివసింపుము. నాబుద్ధి యెప్పుడును శివుని విడువక

యుండుఁగాక యనియు నిట్లు శివునికిమామగారినై యానందించెద ననియుఁ దాత్పర్యము.

అ. హృదయే బుధ్యా సహావినాభావం ప్రార్థయతే:—

వ్యా. శివఇతి. హే శివ భవ సకలభువనబంధో సచ్చిదానందసింధో సదయ శివేత్యనేన కన్యాయా మిచ్ఛాజనకపుంస్త్వాఖ్యో గుణస్సూచ్యతే భవేత్యనేన భవత్యస్మాత్సర్వమితి వ్యుత్పత్త్యా సంతానోత్పాదకత్వాఖ్యో గుణః సకలభువనబంధో ఇత్యనేన బంధుమత్త్వాఖ్యో గుణ స్సచ్చిదానంద సింధో ఇత్యనేన సదిత్యస్య సత్త్వమర్థః భావప్రధానో నిర్దేశః అనేన సాధుకారిత్వం సూచ్యతే చి దిత్యనేన శ్రుతసత్త్వాఖ్యో గుణః ఆనందేత్యనేన ఆరోగత్వగుణః సదయ ఇత్యనేన దయాళుత్వ మేభి ర్వరగుణాః నిర్ణీయంతే గుణధుర్యా మిత్యనేన శాస్త్రబోధ్యా స్సర్వేగుణా ఉచ్యంతే ఇత్థం ఏవమ్ వరగుణాన్ మనసి దృఢీకృత్య కన్యాం దాస్యామీత్యాహ సచ్చిదానంద సింధో సత్యం చ చిచ్చ ఆనందశ్చ తేషాం సింధో నదీనాం సింధువదాస్పదీభూతపూర్వోక్త యావద్గుణ విశిష్ట గౌర్యా సహ పార్వత్యాసహ తన పరిచర్యాసన్నిధానాయ పరిచర్యార్థం సమీపస్థితయే పూర్వోక్తగుణవిశిష్టాం మమ మే బుద్ధికన్యాం బుద్ధిరేవ కన్యాతాం ప్రదాస్యే దాజిదానే ఇత్యస్మిన్ ధాతౌ ప్రేత్యుపసర్గసాహిత్యేన బ్రాహ్మో వివాహ ఇతి గమ్యతే ఉభయోః పత్న్యో స్సమరసతా సంపాదనచతురత్వా చ్ఛివస్య గౌర్యాసహేత్యుక్త మిమాం వివాహ్య త్వం హృదయగేహే హృదయమేవ గేహ మంతర్గృహం తస్మి న్సర్వదా అనైరాశ్యేన సంపస సుఖేన వసేత్యర్థః బుద్ధే శ్శివా వినా భూతత్వం భవ త్వితి భావః. శివ శ్వశురతాం ప్రాప్య మోదిష్యే ఇతి చ భావః.

నీకుఁగావలసిన యుపచారములు నేను సమకూర్పఁజాలనని వేఱొక తెఱఁగున ననుచున్నారు.—

జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ

నచ వనమృగయాయా నైవ లుబ్ధః ప్రవీణః,

అశనకుసుమభూషా వస్త్రముఖ్యాం సపర్యాం
కథయ కథ మహం తే కల్పయానీందుమౌళే. 85

టీ. ఇందుమౌళే = చంద్రుని శిరస్సునందు ధరించినవాఁడా ! తే=నీకు, అశన...ఖ్యాం, అశన=ఆహారము, కుసుమ=పుష్పము, భూషా=భూషణము, వస్త్ర = వస్త్రమును, ముఖ్యాం = ప్రధానములుగాఁ గలిగిన, సపర్యాం=పూజోపచారమును, కథం=ఎట్లుగా, కల్పయాని=కలిగించెదను? కథయ=చెప్పుము. అహం=నేను, జలధిమథనదక్షః – జలధి=సముద్రమును, మథన = తరుచుటకు, దక్షః = చాలినవాఁడను, నైవ=కాను. పా... ద్వీ-పాతాళ=పాతాళలోకమును, భేదీ = భేదించువాఁడను, నచ = కాను. వ...యాం-వన=అడవియందు, మృగయాయాం=వేఁటాడుటయందు, ప్రవీణః=నేర్పుగల, లుబ్ధః=బోయవాఁడను, నైవ=కాను.

తా. చంద్రశేఖరా! సముద్రము మథింపఁజాలిన వాఁడనా కాను. నీ కిష్టమైన కాలకూటాహారముగాని పుష్పమువలె శిరోభూషణంబుగ చంద్రుని గాని యెట్లీ నేర్తును? పాతాళలోకము భేదించువాఁడనైనఁ గాను. నీ కిష్టమైన భుజగభూషణ మెట్లు గల్పించఁగలను? అడవులలో మృగముల వేఁటాడ నేర్చిన బోయవాఁడనైనఁగాను. నీకభిమతంబైన గజచర్మవస్త్ర మెట్లీయఁగలను? దేవా ! నిన్ను నే నెట్లు పూజింపఁగలుగుదునో చెప్పుము?

అ. తవేష్టమాణాం సపర్యాం కర్తుం నాహం సమర్థ ఇతి భంగ్యంతరేణాహ:—

వ్యా. జలధీతి. హే ఇందుమౌళే చంద్రశేఖర తే తవాశనకుసుమభూషావస్త్రముఖ్యామశనం చ కుసుమం చ తయోః స్సమాహారః అశనకుసుమం తచ్చ భూషాభూషణం చ వస్త్రం వసనం చ ఏతాని ముఖ్యాని యస్యాం తాం సపర్యా ముపచారం కథం కేనప్రకారేణ కల్పయాని కరవాణి కథయ వద కల్పయితు మసమర్థ ఇతి భావః. కుత ఇతి చే దనేనం భూతత్వా దిత్యాహ. అహం జలధిమథనదక్ష స్సముద్రమథనసమర్థో నైవ భవామి తథాత్వే

త్వదభిమత విధురూపాంశనచంద్రరూపకుసుమప్రదానే సమర్థస్స్యాం న చ పాంతాళభేదీ పాతాళం భినత్తి తచ్ఛీల మస్యేతి పాతాళభేదీ తథాత్వే తవాభిమత భుజంగభూషణం కల్పయితుం సమర్థ స్స్యాం వనమృగయాయాం నిపుణ స్సమర్థః లుబ్ధః మృగహింసకః నభవామి తథా త్వే త్వదభిమతగజచర్మాఖ్యవస్త్రం కల్పయితుం సమర్థ స్స్యా మేవం భూతత్వాత్ త్వదభిమత ముపచారం కర్తు మసమర్థోఽహ మితి భావః.

పూజాసామగ్రియున్నను పూజాస్థానము తెలియక పోవుట వలనఁ బూజింప సమర్థుఁడనుగా ననుచున్నారు.—

పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే
పక్షిత్వం న చ వా కిటిత్వ మపినప్రాప్తం మయా దుర్లభం,
జానే మస్తక మంఘ్రిపల్లవ ముమాజానేన తేఽహం విభో
నజ్ఞాతం హి పితామహేన హరిణా తత్త్వేన తద్రూపిణా. 86

టీ. ఉమాజానే=పార్వతీదేవిభార్యగాఁ గలవాఁడా! పూ...యః—పూజాద్రవ్య=పూజించుటకుఁ గావలసిన వస్తువులయొక్క, సమృద్ధయః = అతిశయములు, విరచితాః=సమకూర్పఁబడినవి. పూజాం=పూజను, కథం= ఎట్లుగా, కుర్మహే=చేయుదుము? దుర్లభం=పొందశక్యముగాని,పక్షిత్వం= హంసపక్షిరూపమగుటయు, న-చ-వా=లేనిచో, కిటిత్వమపి=వరాహరూపమగుటయైనను, మయా=నాచేత, నప్రాప్తం=పొందఁబడలేదు. అహం= నేను, తే=నీ యొక్క, మస్తకం=శిరస్సును, అంఘ్రిపల్లవం = చిగురువంటి పాదమును, నజానే=ఎఱుఁగను. విభో=సర్వవ్యాపకుఁడా! తద్రూపిణా= హంసకిటిరూపములు బొందిన, పితామహేన=బ్రహ్మదేవునిచేతను, హరిణా=విష్ణుమూర్తిచేతను, తత్త్వేన=యథార్థముగా, నజ్ఞాతంహి = తెలియఁబడలేదుగదా!

తా. పార్వతీ మనోహరా! పూజాద్రవ్యములు విశేషముగా సమకూర్పఁబడియుండె నిమ్మె. అపుడుమాత్రము నిన్ను పూజించుట యెట్లు?

నీ శిరస్సును తెలియను. నీ పాదములును తెలియవు. హంసరూపము, వరాహరూపమును దుర్లభములు. అవి నాకుఁ గలిగినవి కావు. ఆరూపములు దాల్చిన బ్రహ్మదేవుడు, విష్ణుమూర్తియు మాత్రమే పాటి తెలిసికొనఁ గలిగిరి? యథార్థము తెలియనేలేదు గదా!

అట్టి బ్రహ్మవిష్ణువులే తెలిసికొనలేక పోయిన పూజాస్థానమగు మీ మస్తకమును పాదపల్లవమునుఁ దెలిసికొని నే నెట్లు పూజింపఁగలుగుదునని తాత్పర్యము.

అ. పూజాసామగ్ర్యాం సత్యామపి పూజాస్థానా పరిజ్ఞానాత్ పూజాం కర్తు మసమర్థ ఇత్యాహ :—

వ్యా. హే శివమాజానే శివా పార్వతీ జాయా యస్య తస్య సంబుద్ధి శివమాజానే యద్యపి పూజాద్రవ్య సమృద్ధయః పూజాయాః ద్రవ్యాణి పూజాసాధనవస్తూని తేషాం సమృద్ధయః అతిశయాః విరచితాః స్సంపాదితా స్తథాపి పూజాం పూజనం కథం కుర్మహే నకథ మపీత్యర్థః - దుర్లభం దుష్ప్రాపం పక్షిత్వం పక్షిభావః కించ నవానో వా కిటిత్వమపి వరాహభావోపి మయా న ప్రాప్తం నాలంబిత మతస్తే తవ మస్తకమంఘ్రిపల్లవం చాంఘ్రిః పల్లవమివే త్యుపమితసమాసః హే విభో వ్యాపకనజానే హి యస్మాత్ తత్త్వేన యాథార్థ్యేన తద్రూపిణా పక్షిరూపిణా కిటిరూపిణా చ పితామహేన బ్రహ్మణా హరిణా విష్ణునాచ న జ్ఞాతం నవిదితం తస్మాదహంలిం నజానే ఇతి కిముత పూజాద్రవ్యసంపత్తిషు సతీష్వపి తద్రూపాపన్నేన బ్రహ్మణా విష్ణునా చానవగతం పూజాస్థానం మస్తక మంఘ్రిపల్లవఞ్చ జ్ఞాత్వా కథమహం పూజాం కర్తుం శక్నుయా మితి భావః.

శివపాదభక్తిమాత్రము కావలె నని కోరుచున్నారు.—

అశనం గరళం ఫణీకలాపో
 వసనం చర్మ చ వాహనం మహోక్షః,

మమ దాస్యసి కిం కి మ స్తి శంభో
తవ పాదాంబుజభ క్తిమేవ దేహి. 87

టీ. శంభో=ఓ శంకరుఁడా! తవ=నీకు, అశనం = భోజనము, గర ళం=విషము. కలాపః = భూషణము, ఫణీ=పాము. వసనం = వస్త్రము, చర్మ=ఏనుఁగుతోలు. వాహనంచ=వాహనమును, మహోక్షః=ముసలియెద్దు. కిం=ఏమి, దాస్యసి=ఇచ్చెదవు? మమ=నాకుఁగావలసినది, కిం=ఏమి, అస్తి= ఉన్నది? తవ=నీయొక్క, పాదాంబుజభక్తిమేవ - పాదాంబుజ = పాద పద్మములయందు, భక్తిమేవ=భక్తిమాత్రమే, దేహి=ఇమ్ము.

తా. సౌఖ్యనిధీ! నీవు భుజించునది విషము. అలంకరించు కొనునది పాము. కట్టుకొనునది యేనుఁగుతోలు. ఎక్కుతిరుగు వాహనము ముసలి యెద్దు. ఇంక నాకిష్టమైనది నీయొద్ద నేమియున్నది? నీవేమి యిచ్చెదవు? నీ పాదభక్తి యొక్కటే చాలునది యిమ్ము.

ఇచ్చట పరమేశ్వరుని నిందించినట్లు తోఁచును. కాని దాని పర్య వసానము స్తుతియేగాని నిందగాదు. "ఏష ఆత్మాఽపహతపాప్మా" శ్రుతి. ఈశ్వరుఁడు సర్వదోషవర్జితుఁడు. గరళము భోజనమనుట భక్తరక్షణాభి ప్రాయముచేతను, పాముభూషణమనుట అభయుండు అనునభిప్రాయము చేతను, గజచర్మము వస్త్రమనుట నిస్పృహుఁడను నభిప్రాయముచేతను, నాకుఁ గావలసినదేదియు నీయొద్దలేదనుట 'నేను నిస్పృహుఁడను' అను నభిప్రాయముచేతను నని వక్తయొక్క తాత్పర్యమును గమనింపవలయును. కావుననే భక్తియొసఁగుమని వేఁడుకొనుటయు సమంజసమగు.

అ. శివపాదాంబుజభక్తిమేవ యాచతే:—

వ్యా. అశనమితి. హే శంభో సుఖనిధే భక్తాపేక్ష్యమాణం దేయం త్వయి నాస్తీత్యాహ తవాశనం భక్షణం గరళం హాలాహలం కలాపో భూ షణం ఫణీ భుజగః వసనం వస్త్రం చర్మకృత్తివిశేషః వాహనం చ చ త్వర్థః మహోక్షః వృద్ధవృషభః అతో హేతోర్భక్తాభీష్టం కిం దాస్యసి మమ ప్రా

ర్థనీయం తవ కి మస్తి కిమపి నాస్తీత్యర్థః- తథాపి దేయం కించి దస్తీతిమత్వాహ- తత్కిమితి చే త్తత్రాహ. తవ పాదాంబుజభక్తిమేవ దేహినాన్యదస్త్వ పేక్షిత మితిభావః- ఈశ్వరే భాసమానా నిందా స్తుతిపర్యవసాయినీ ఈశ్వరస్తు "ఏష ఆత్మాపహత పాప్మే"త్యాది శ్రుత్యా సర్వదోషశూన్యః ప్రతీయతే అశనే గరళత్వప్రతిజ్ఞానం భక్తరక్షణాభిప్రాయేణ ఫణిభూషణత్వ ప్రతిజ్ఞాన మభయత్వాభిప్రాయేణ వసనే చర్మత్వకల్పనం నిస్పృహాత్వాభిప్రాయేణ దుష్టనిగ్రాహకత్వ సూచనాభిప్రాయేణ వాహనే మహోక్షత్వ కథనం మమ ప్రార్థనీయం కిమస్తీ త్యనేన స్వస్య నైస్పృహ్యాం ద్యోత్యతే ఇతి వక్తృతాత్పర్యం.

ఇట్టివాఁడను గనుక నేని నీయర్చనము, స్తోత్రము, ధ్యానముంజేయ సమర్థుఁడ నగుదును. అని చెప్పుచున్నారు.—

యదాకృతాంభోనిధిసేతుబంధనః
కరస్థలాధఃకృతపర్వతాధిపః,
భవాని తే లంఘితపద్మసంభవ
స్తదాశివార్చాస్తవ భావనక్షమః. 88

టీ. శివ=ఓ సాంబమూర్తీ యదా = ఎప్పుడు, కృ...నః - కృత= చేయఁబడిన, అంభోనిధి=సముద్రమందు, సేతుబంధనః = వారధినిర్మాణము గలవాఁడను, కర...పః - కరస్థల = అఱచేతితో, అధఃకృత=దిగువకణఁచఁ బడిన, పర్వతాధిపః = వింధ్యపర్వతముగలవాఁడను, లంఘి...వః-లంఘిత= అతిశయింపఁబడిన, పద్మసంభవః=బ్రహ్మదేవుఁడు గలవాఁడను, (అగుదునో) తదా=అప్పుడు, తే=నీయొక్క, అర్చా...మః - అర్చా = పూజయందును, స్తవ=స్తోత్రమందును, భావన=ధ్యానమందును, క్షమః=సమర్థుఁడను, భవాని=అగుదును.

తా. సాంబశివా! సముద్రమునకు వారధి గట్టిన శ్రీరాములును అఱచేతితో వింధ్యపర్వతము నేలకణఁచిన యగస్త్యులును, బ్రహ్మదేవునికన్న

నెక్కు వవాఁడును నే నగుఁనేని క్రమముగా నీపూజాస్తోత్ర ధ్యానములు చేయుటకు సమర్థుఁడనుగా నుందును.

అ. ఏవంభూత శ్చే త్తవార్చాస్తోత్రభావనా క్షమస్స్యా మిత్యాహ:-

వ్యా. యదాకృతఇతి. హే శివ యదా యస్మిన్ కాలే కృతాంభోనిధిసేతుబంధనః అంభసాం నిధిస్థానం సముద్ర స్తస్మిన్ సేతుబంధనం సేతుర్వారివారకమృత్కూటవిశేష స్తస్య బంధనం నిర్మాణం కృతిః యేన తథోక్తః కరస్థలాధఃకృతపర్వతాధిపః కరస్థలేన హస్తప్రదేశే నాధఃకృతః భూమౌ నిమజ్జితః పర్వతాధిపః వింధ్యాద్రిర్యేన తథోక్తః లంఘితపద్మసంభవః లంఘితః అతిశయితః పద్మసంభవః బ్రహ్మాయేన తథోక్త ఏవంభూతో భవిష్యామి తదా తే తవార్చాస్తవభావనక్షమః అర్చా అర్చనం స్తవస్తుతి ర్భావనం ధ్యానం తేషు క్షమస్సమర్థః భవాని శ్రీరామః అగస్త్యః బ్రహ్మాచ యది భవిష్యా మ్యుక్తేషు త్రిష్వర్థేషు తదా సమర్థో భవామీతి భావః.

ఈశ్వరునికి పూజనమును తాడనమునుఁగూడ ప్రియమైనది అనియెఱిఁగి తానాచరించుటకు 'అందెక్కువప్రియమైనది ఏది ?' అని అడుగుచున్నారు.—

నతిభి ర్నుతిభి స్త్వ మీశపూజా
విధిభి ర్ధ్యానసమాధిభి ర్నతుష్టః,
ధనుషా ముసలేన చాశ్మభిర్వా
వద తే ప్రీతికరం తథాకరోమి. 89

టీ. ఈశ=ఓఈశ్వరుఁడా! త్వం=నీవు, నతిభిః = నమస్కారముల చేతను, నుతిభిః=స్తోత్రముల చేతను, పూజావిధిభిః=పూజావిధానముల చేతను, ధ్యానసమాధిభిః=ధ్యానసమాధులచేతను, ధనుషా = వింటి దెబ్బలచేతను, ముసలేన=రోకలిపోట్లచేతను, అశ్మభిర్వా=రాళ్లు రువ్వుటచేతనుంబట్టి,

తుష్టః=సంతోషించినవాఁడవు, న=కావు. తే=నీకు, ప్రీతికరం=(పైరెంటిలో) ప్రియమైనది, వద=చెప్పుము. తథా=అట్లు, కరోమి=చేయుదును.

తా. పరమేశ్వరా! నమస్కారములు, స్తోత్రములు, పూజలు, ధ్యానములు, సమాధులు మున్నగువానితోఁ దృప్తినొందక వింటిదెబ్బలు, రోకలిపోట్లు, రాళ్లురువ్వుట మొదలగువానితోఁ బరమప్రీతి నొందితివని పురాణగాథలువింటిని. ఇందు నీకేది ప్రియమో చెప్పు మట్లుచేయుదును.

కొందఱు భక్తులు భక్తిపరీక్షయందు ధైర్యశాలులై వింటిదెబ్బలుమున్నగువానితో శివుని సంతోషపఱచి తమమనోరథముల నీడేర్చుకొనిరి. అని అర్జునాదులకథలు పురాణప్రసిద్ధముగా నున్నవి.

అ. శివస్య పూజనతాడనయో రుభయోరపి ప్రీతికరత్వం బుధ్వా స్వానుష్ఠానాయ తత్రాతిశయేన ప్రీతికరం పృచ్ఛతి:—

వ్యా. నతిభిరితి. హే ఈశత్వం నతిభి ర్నమస్కారై ర్నుతిభి స్స్తోత్రైః పూజావిధిభి స్సపర్యావిధానై ర్ధ్యాన సమాధిభి స్సమాధి ర్విషయిణి సర్వాకారణే కృత్స్న విషయ విలాపనం ధ్యానం మనసః ధ్యేయైకరూపతా తస్మై సమాధయః ధ్యానసమాదయ స్తై స్తథా నతుష్టః ధనుషా కార్ముకతాడనేన ముసలేన ముసలప్రహారేణాశ్మభిః పాషాణప్రక్షేపైర్వా యథా తుష్టః ఇత్థం పురాణకథాశ్రవణేన జానామ్యుభయో ర్మధ్యే యదతిప్రీతికరం తత్ తద్వద తత్కరోమి విదథే కేచన భక్తాః భక్తిపరీక్షణే ధృతిం విందంతః ధనుస్తాడనాదభి శ్శివం సంతోష్యస్వేష్టం ప్రాపురితి పురాణప్రసిద్ధిః.

భక్తికొలఁద త్రికరణశుద్ధిగా నిన్ను సేవింతును, అనుచున్నారు.—

వచసా చరితం వదామి శంభో
రహ ముద్యోగవిధాసు తేఽప్రసక్తః,
మనసా కృతి మీశ్వరస్య సేవే
శిరసాచైవ సదాశివం నమామి. 90

టీ. అహం=నేను, తే=నీయొక్క, ఉ...సు-ఉద్యోగ = ఉన్నత యోగములయొక్క, విధాసు=విధానములయందు, అప్రసక్తః=పరిచయము లేనివాఁడను, వచసా=వాక్కుచేత, శంభోః=సుఖస్వరూపుఁడవగు, తే= నీయొక్క, చరితం = చరిత్రమును, వదామి = చెప్పుచున్నాను. మనసా= మనస్సుచేత, ఈశ్వరస్య=ఈశ్వరుఁడవైన, తవ = నీయొక్క, ఆకృతిం= ఆకారమును, సేవే=సేవించుచున్నాను. శిరసా = శిరస్సుచేత, సదాశివం= నిత్యసుఖస్వరూపుఁడవైన, త్వామేవ=నిన్నే, నమామిచ = నమస్కరించు చున్నాను.

తా. దేవా! ఉత్తమంబులైన శివయోగంబుల యందు పరిచయము లేదు. చిత్తమంత స్థిరముగా నిలువదు కావున వాక్కుతో మీచరిత్రంబులు పలుకుచు మనస్సున మీయాకృతిధ్యానించుచు శిరస్సుతో మీపాదపద్మ ములకు నమస్కరించుచు శక్తివంచనలేక సేవించెదను.

అ. త్రిభిఃకరణైర్యథోచితం త్వాం సేవే ఇత్యాహ:—

వ్యా. అహం తే తవోద్యోగవిధా సూచ్చైర్యోగఉద్యోగః స్థిరత యా చిత్త సమర్పణం తస్య విధాసుప్రకారేష్వ ప్రసక్తః ప్రసక్తిః పరిచితిస్త ద్రహితః, అర్శఆదిత్వా దచ్ప్రత్యయః. అతఃకారణా ద్వచసా వాచా శంభోసుఖస్వరూపస్యతే తవ చరిత్రం వదామి వచ్మి మనసా ఈశ్వరస్య తవాకృతి మాకారం సేవే ధ్యాయామి శిరసా మూర్ధ్నా సదాశివం సదా సు ఖస్వరూపం త్వామేవ నమామి చ నమస్కరోమి; స్పష్టోఽర్థః.

ఆద్యా విద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్,
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తే ర్భాజనం రాజమౌళే. 91

టీ. రాజమౌళే=ఓచంద్రశేఖరా! త్వత్ప్రసాదాత్ = నీయనుగ్రహ మువలన, హృద్గతా=హృదయము నంటియున్న, ఆద్యా=మొట్టమొదటిది

యగు, అవిద్యా = అజ్ఞానము, నిర్గతా = తొలఁగిపోయినది, ఆసీత్ = అయ్యెను. యా=ఏజ్ఞానము, హృత్=హృదయగ్రంధిని హరించునదియో, (సా = అ), విద్యా = జ్ఞానము, హృద్యా = హృదయమునఁ బ్రవేశించిన (వయ్యెను). శ్రీకరం=సంపత్కరమును, ముక్తేః=మోక్షమునకు, భాజనం =ఆధారమైనదియునగు, త్వత్పదాబ్జం= నీపాదపద్మమును, భావే = మనస్సునందు, నిత్యం=ఎప్పుడును, సేవే=ధ్యానించుచున్నాను.

తా. సాంబశివా ! నీ యనుగ్రహమువలన నాయజ్ఞానము తొలఁగిపోయి హృదయగ్రంథిభేదకం బగుసుజ్ఞానంబు గలిగినది. లక్ష్మీకరంబును మోక్షప్రదంబుననగు నీపాదయుగ్మము సేవించెదను.

అ. త్వత్పదాబ్జం సేవ ఇత్యాహ :—

వ్యా. హే రాజమౌళే చంద్రశేఖర త్వత్ప్రసాదాత్ తవానుగ్రహాద్ధృ న్నతామానసం ప్రాప్తా ఆద్యా ఆదౌ భవా ఆద్యా అనాదిభూతేత్యర్థః అవిద్యా అజ్ఞానం నిర్గతా మనసః నివృత్తా ఆసీ దభూద్ధృద్యా హృత్ యేతి చ్ఛేదః యా హరతి హృదయగ్రంథిం నాశయతీతి హృత్సా విద్యా జ్ఞానం విద్యతే అస్తి తస్మాచ్ఛ్రీకరం సంపత్కరం ముక్తే ర్భాజనం మోక్షస్య కారణం తే తవ పదాబ్జం భావే మనసి నిత్యం సేవే సదా ధ్యాయామి.

తన నీ సంసారసాగరమునుండి కడతేర్పు మని వేఁడుకొనుచున్నారు. —

దూరీకృతాని దురితాని దురక్షరాణి
దౌర్భాగ్యదుఃఖదురహంకృతిదుర్వచాంసి,
సారం త్వదీయచరితం నితరాం పిబంతం
గౌరీశ మా మిహ సముద్ధర సత్కటాక్షైః. 92

టీ. గౌరీశ=ఓపార్వతీరమణా ! దురక్షరాణి= బ్రహ్మ లలాటమునందు వ్రాసినదుష్టలిపిసూచకములును, దురితాని=పాపకర్మముచేతఁ గలిగినవియు, దౌ...సి—దౌర్భాగ్య=దురదృష్టము, దుఃఖ=దుఃఖము, దురహంకృతి=

నుష్టములగు దేహాదులయందు 'అహం' అనునభిమానమును, దుర్వచాంసి=పరుషభాషణమును, సత్కటాక్షైః=నీకడకంటి చూపులచేత, దూరీకృతాని=దూరముగాఁబోఁగొట్టఁబడినవి. సారం = సారమైన, త్వదీయచరితం=నీచరిత్రను, నితరాం = మిక్కిలి, పిబంతం = వినుచున్న, మాం=నన్ను, ఇహ = ఈజన్మమందు, సముద్ధర=ఉద్ధరింపుము.

తా. సాంబశివా! ఉత్పత్తికాలమున బ్రహ్మ నుదుట వ్రాసినవ్రాతలను సూచకంబులై పాపకర్మమువలన గలిగిన దురదృష్టము, దుఃఖము, దురహంకారమును నీకటాక్ష వీక్షణముచేఁ బాసినవి. ఇంక సారభూతమైన నీచరిత్రంబులు వినుచుందును. నన్నీ జన్మమునుండి తరింపఁజేయుము.

అ. సంసారా దాత్మన స్సముద్ధరణం ప్రార్థయతే :—

దూరీకృత ఇతి. హే గౌరీశ ఉమారమణ దురక్షరాణి బ్రహ్మకృత దుర్లిపిసూచకాని సూచ్యసూచకయో రభేదవివక్షయా తద్విశేషణత్వేన నిర్దేశః దురితాని దోషేణ ప్రాప్తాని దౌర్భాగ్యదుఃఖ దురహంకృతి దుర్వచాంసి దుఃఖదః భగః అధర్మోయస్యసః దుర్భగః తస్యభావః దౌర్భాగ్యం దురదృష్టమితి యావత్ దుఃఖం సర్వప్రతికూలతయా వేద్యోంతఃకరణ వృత్తివిశేషః దురహంకృతిః దుష్టే దేహాదావహ మిత్యభిమానకరణం దుర్వచః పరుషోక్తి రేతాని త్వత్కటాక్షై స్త్వదపాంగ పాతై ర్దూరీ కృతాని దూరస్థానికృతాని వ్యుదస్తానీతి యావత్ త్వచ్చరితం తవ చరితమేవ సార మితరచరిత్రేభ్యో బలవత్త్వదీయ చరితం తవ సంబంధిచరిత్రం పిబంతం శృణ్వంతం మామిహాస్మి న్నేవ జన్మని సముద్ధర పునరావృత్తిరహితం యథాతథా సంసార సాగరా దుత్తారయేతి భావః.

సోమకళాధరమౌళౌ
కోమలఘనకంధరే మహామహసి,
స్వామిని గిరిజానాథే
మామకహృదయం నిరంతరం రమతామ్. 93

టీ. మామకహృదయం = నామనస్సు, సోమకళాధరమౌళౌ = శిరస్సున చంద్రకళ ధరించినట్టియు, కో...రే-కోమల = కోమలమైన, ఘన= మేఘమువంటి, కంధరే= మెడగలిగినట్టియు, స్వామిని = సర్వనియామకమైన ట్టియు, గిరిజానాథే = పార్వతీపతిరూపమైన, మహామహసి = మహాజ్యోతి యందు, నిరంతరం=ఎల్లప్పుడును, రమతాం=క్రీడించుగాక.

తా. శిరస్సున చంద్రరేఖ, కోమలమైన మేఘమునంటి కంఠమును గలిగి సర్వనియంతయై పార్వతీ పరమేశ్వర రూపముతో వెలయుచున్న పరజ్యోతిస్స్వరూపమైన పరబ్రహ్మమునందు నాచిత్తమెప్పుడును విహరించు చుండుఁగాక.

అ. మనోరమం ప్రార్థయతే:—

వ్యా. సోమకళాధర ఇతి. మామకహృదయం మత్సంబంధి చేత స్సోమకళాధరమౌళౌ - ధరతీతి ధరః సోమకళాయాః ధరస్సోమకళా ధరస్సః మౌళౌ యస్య తస్మిన్ కోమలఘనకంధరే కోమలః మృదుళః ఘనః నీరదః స ఇవ కంధరః గ్రీవాయస్య తథోక్తే గ్రీవాయాః కంధరత్వేన ఘన సాదృశ్యం నైల్యేనవా స్వామిని సర్వనియంతరి గిరిజానాథే పార్వతీనాథే మహామహసి మహతి మహసి జ్యోతిషాం జ్యోతిః బ్రహ్మణి నిరంతరం రమ తాం రతిం ప్రాప్నోతు.

నాలుక మొదలగునవి యీశ్వరాయత్తము లగుటచేతనే సాఫల్యం బు నొందునని చెప్పుచున్నారు.—

సారసనా తే నయనే తావేవకరౌ స ఏవ కృతకృత్యః,
యాయే యౌ యో భర్గం వదతీ క్షే తే సదార్చతః స్మరతి.

టీ. యా=ఏనాలుక, భర్గం=పరమశివునిబోధించు 'భర్గ' శబ్దమును, వదతి=పలుకుచుండునో, యే=ఏకన్నులు, భర్గం=శివుని, ఈక్షేతే=చూచు చుండునో, యౌ=ఏచేతులు, భర్గం=శివుని, సదా=ఎల్లప్పుడును, అర్చతః= పూజించుచుండునో, యః=ఏపురుషుఁడు, భర్గం=శివుని, స్మరతి = తలంచు

చుండునో, సా=అదియే, రసనా=నాలుక, తే=అవియే, నయనే=కన్ను లు, తావేవ=అవియే, కరౌ=చేతులు, సఏవ = వాఁడే, కృతకృత్యః= కృతార్థుఁడు.

ఎల్లప్పుడీశ్వరనామముచ్చరించుచుండు నాలుకయేనాలుక. ఎల్లవేళల నీశ్వరుని చూచుచుండు కన్నులేకన్నులు. ప్రతిదినమీశ్వరుని పూజించుచుండు చేతులేచేతులు. నిరంతరము పరమేశ్వరుని ధ్యానించుచుండు భక్తుఁడే కృతకృత్యుండునగును. తక్కినవి నిరర్థకంబులని తాత్పర్యము.

అ. రసనాదీనాం తదేకవిషయత్వేన సాఫల్యమాహ :—

వ్యా. సఇతి యారసనాభర్గం పరమశివవాచకం భర్గనామవదతి యే నయనే భర్గం శివమీక్షేతే పశ్యతః యౌ కరౌ భర్గ మర్చతః పూజయతః, యః భక్తః భర్గం స్మరతి చింతయతి సదేతి సర్వత్రాన్వేతి సారసనా నాన్యేత్యర్థః సఏవ కృతకృత్యః ప్రాప్తకర్తవ్యః నాన్యఇత్యర్థః స్పష్టోఽర్థః.

మిగులకఠినంబగు ప్రదేశమందు సంచరింపనలసివచ్చె ననుసంశయము విడువుమని వేఁడుకొను చున్నారు —

**అతిమృదులౌ మమ చరణా వతికఠినం తే మనో భవానీశ,**
**ఇతి విచికిత్సాం సంత్యజ శివకథ మాసీద్గిరౌ తథా ప్రవేశః.**

టీ. శివ = ఓమంగళ స్వరూపుఁడా! భవానీపతే=ఓపార్వతీపతీ! మమ = నాయొక్క, చరణౌ=పాదములు, అతిమృదులౌ = మిగులకోమలమైనవి, తే = నీయొక్క, మనః = మనస్సు, అతికఠినం = మిక్కిలి కఠినమైనది, ఇతి = అని, విచికిత్సాం = సంశయమును, సంత్యజ = విడువుము. తథా = అట్టి, గిరౌ = పర్వతముమీఁద, ప్రవేశః = సంచారము, కథం = ఎట్లు, ఆసీత్ = అయ్యెను ?

తా. దేవా! భవానీసనాథా ఈభక్తునిచిత్తము మిక్కిలి కఠోరముగా నుండును. కోమలమైన నాపాదములతో దానియందు సంచరించుటయెట్లని

మీరు సంశయింపఁ బనిలేదు. అంతకఠోరముగా నుండు పర్వతమువీఁద గౌరీసమేతులై మీరుసంచరించుటలేదా?

అ. అతికఠిన ప్రదేశసంచార విచికిత్సాం సంత్యజేతి ప్రార్థయతే:-

వ్యా. అతీతి. హే శివమంగళస్వరూప హేభవానీశ భవాన్యాః పార్వత్యాః ఈశ రమణ భవానీపతే త్వమచరణౌ చాతిమృదులావితి మార్దనవంతౌ తే తవ భక్తస్య మనః అతికఠిన మతి కర్కశ మిత్యేవం ప్రకారేణ విచికిత్సాం సంశయం సంత్యజ నిశ్శేషం పరిహార దోషః కథం సుపరిహార ఇతిచే దభ్యస్తకఠినప్రదేశసంచరణత్వా త్తవ నదోషఇయిత్యాహ తథాభూతే కఠినే గిరౌ ప్రదేశ స్సంచరణం కథమాసీ దభూత్ భవాన్యాసహ కఠినగిరౌ సంచరణాద్ధేతోః కఠినే మమ మనసి సంచరణం యుక్తమేవేతి భావః.

ఈశ్వర పాదమందు తన మనస్సును నిర్బంధింప వేఁడుకొనుచున్నారు.—

ధైర్యాంకుశేన నిభృతం
రభసా దాకృష్య భక్తిశృంఖలయా,
పురహరచరణాలానే
హృదయ మదేభం బధానచిద్యంత్రైః. 96

టీ. పురహర=త్రిపురములు జయించినవాఁడా! హృదయమదేభం=(నా)మనస్సను మదపుటేనుఁగును, ధైర్యాంకుశేన = ధైర్యంబనెడి యంకుశముతో, రభసాత్ = వేగమువలన, ఆకృష్య = వశపఱచుకొని, భక్తిశృంఖలయా = భక్తియనుగొలుసుతో, చరణాలానే = మీపాదంబను రేసికట్టాడునందు, చిద్యంత్రైః = ఈశ్వరమహిమజ్ఞానంబు లనెడి యంత్రములతో, నిభృతం = కదలకుండ, బధాన = బంధింపుము.

తా. పురహరుండవైన ఓమహాదేవా! త్రిపురంబులు జయించినరాజు మత్తగజంబుల నంకుశంబుతో వశపఱచుకొని గొలుసులతో బిగించి యు

పాయమున కట్టుఁగంబంబులం గట్టియుంచున్నట్లు నామనోగజంబును స్థైర్య మంకుశముగా నీవశము చేసికొని భక్తియను సంకెలతో నీమహత్త్వజ్ఞానము ముడివెట్టి నీపాదంబున బంధింపుము.

అ. ఈశ్వరచరణే స్వమనోబంధం ప్రార్థయతే:—

వ్యా. ధైర్యాంకుశ ఇతి. హే పురహర త్రిపురజయిన్ త్వం హృదయమేవ మదేభః మత్తగజః మదోస్యాస్తీతి మదః, అర్శ ఆదిత్వా న్మత్వర్థీయోఽచ్ప్రత్యయః, మదవత్వ సామాన్యాద్ధృదయే మదేభత్వారోప స్తథా ధైర్యాంకుశేన ధీరస్య భావో ధైర్యం త్వయి స్థిరతా నిశ్చయరూపం తదేవాంకుశస్తేన రభసా ద్వేగా దాకృష్యస్వాయత్తీకృత్య భక్తిశృంఖల యా భక్త్యాఖ్యయా శృంఖలయా అగ్రశేన చరణాలానే చరణమేవాలానం గజబంధనస్తంభ స్తస్మిన్ చిద్యంత్రైః శ్చిదః ఈశ్వరమహిమవిషయకజ్ఞానాని తా ఏవ యంత్రాణి గజనియమనోపాయా స్తైః స్నిగ్ధం నిశ్చలం యథా తథా బధాన బద్ధం కురు రిపురహృతోరాజ్ఞః మత్తేభనశీకరణవ త్తవేదం యుక్తమేవేతి భావః.

మనసునకు శాశ్వత పదవి మ్మని వేఁడుకొనుచున్నారు.—

ప్రచరత్యభితః ప్రగల్భవృత్త్యా
మదవా నేష మనఃకరీగరీయాన్,
పరిగృహ్య నయేన భక్తిరజ్వా
పరమస్థాణుపదం దృఢన్నయాముమ్. 97

టీ. పరమ=ఓఅపరిచ్ఛిన్నస్వరూపుఁడా! మదవాన్=మదముగలిగిన, గరీయాన్ = గొప్పదియగు, ఏషః = ఈ, మనఃకరీ = చిత్తగజము, ప్రగల్భవృత్త్యా = అపరానిగమనముతో, అభితః = అంతటను, ప్రచరతి = సంచరించుచున్నది, అముం = దీనిని, భక్తిరజ్వా = భక్తియనుత్రాడుతో, నయేన = అనునయముతో, పరిగృహ్య = పట్టుకొని, స్థాణు = స్థిరమయిన పదం = స్థానమును, దృఢం = మరలతిరిగిరాకుండ, నయ=పొందింపుము.

తా. ఓ అపరిచ్ఛిన్నానందమూర్తీ! ఈనామానసమత్తగజము నిలుపు టకు వీలుపడని గమనముతో నలువంకలఁ బరువు లిడుచున్నది. దీని నీభక్తి యను త్రాడుతో గట్టి మెల్లగాఁబట్టుకొని పునరావృత్తి రహితముగా స్థిర మైన బ్రహ్మపదము జేర్పుము.

సగుణోపాసనముచేయునాత్మ పర్యవసానమున నిర్గుణభావమునొందుఁ గాన మనస్సునకు బ్రహ్మాకారత్వము గలిగింపుమని వేఁడుకొనుట గ్రంథాం తమందు సమంజసముగా నున్నది. దీనికిఫలము నిర్విశేషానందావిర్భావము అని తాత్పర్యము.

అ. మనసశ్శాశ్వతపదప్రాప్తిం ప్రార్థయతే:—

వ్యా. ప్రచరత్యేతి. హే పరమ అపరిచ్ఛిన్నస్వరూప మదవాన్మదో స్యాస్తీతి మదవాన్ గరీయానేషాఽయం మనఃకరీ చిత్తగజః ప్రగల్భవృత్త్యా దుర్నివారవ్యాపారేణాభిత స్సర్వత శ్చరన్ సంచరతి తథా సంచరంత మ ముం మనఃకరిణం భక్తిరజ్జ్వా భక్తిరేవ రజ్జుః పాశ స్తయానయోనానునయో నానుశాసనే నేత్యర్థః పరిగృహ్య స్వీయత్వేన గృహీత్వా స్థాణుస్థావరం పరం స్థానం బ్రహ్మపదం దృఢ మపునరావృత్తి యథా తథా నయప్రాపయ సగుణోపాసనస్యాత్మనః నిర్గుణభావపర్యవసాయిత్వా దిహ మనసః బ్రహ్మా కారతా ప్రార్థనం నిర్విశేషఫలకం గ్రంథాంతే సమంజస మితి భావః.

కవి కన్యగా భావించినతనకవితను గౌరీప్రియుండగు పరమేశ్వరున కర్పించుచున్నారు.—

సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సు
వర్ణాం, సద్భి స్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షి
తాం లక్షణాఢ్యాం, ఉద్యద్భూషావిశేషా ముపగతవిన
యాం ద్యోతమానార్థరేఖాం, కల్యాణీం దేవ గౌరీప్రియ
మమ కవితా కన్యకాం త్వం గృహాణ. 98

టీ. గౌరీప్రియ = గౌరీదేవి ప్రియురాలుగాఁగల, దేవా = మహా దేవా! స...క్తాం-సర్వ = సమస్తమైన, అలంకార= ఉపమ, ఉత్ప్రేక్ష మొదలగుఅలంకారములతోడను (భూషణములతోడను), యుక్తాం=కూడిన దియు, స...తాం-సరళ = మృదువైన, లేక, సుబోధమైన (మందపుగు) పద = శబ్దములతో (నడకలతో), యుతాం=కూడినదియు, సాధువృత్తాం =సలక్షణమైన ఆర్యావృత్తము మొదలగువృత్తములు గలదియు (మంచినడత గలదియు), సువర్ణాం=పరుషములుగాని అక్షరములుగలదియు (చక్కనిరూపముగలదియు), సద్భిః=కావ్యలక్షణము (శరీరలక్షణము) దెలిసినపెద్దలచేత, సంస్తూయమానాం=కొనియాడఁబడుచున్నదియు, సరసగుణయుతాం=శృం గారాదిరసములు మాధుర్యాదిగుణములు వీనితోఁగూడినదియు(భర్తకిష్టంబగు గుణములతోఁ గూడినదియు), లక్షితాం = ప్రతిపాద్యవస్తువుగలదియు(సరిం పఁదగినదిగా నెన్నఁబడినదియు), లక్షణాఢ్యాం=సర్వలక్షణములనొప్పునది యు,ఉ...షాం-ఉద్యత్=ఎక్కువగా ప్రకాశించుచున్న,భూషావిశేషాం= అలంకారవిశేషముగలదియు(సుశీలత్వముగలదియు), ఉపగతవినయాం-ఉప గత=తెలియఁబడిన, వినయాం=(కవియొక్క)వినయముగలదియు (పొందఁ బడినన్రమతగలదియు),ద్యో...ఖాం-ద్యోతమాన=స్పష్టముగా స్ఫురించుచు న్న, అర్థరేఖాం=అర్థములపరంపరగలదియు (భాగ్యరేఖగలదియు), కల్యా ణీం=అర్థపుష్టిగాభాషించునదయు నగు,మమ=నాయొక్క, కవితాకన్యకాం =కవితయనుకన్యకను, త్వం = నీవు, గృహాణ=స్వీకరింపుము.

తా. గౌరియందు ప్రేమగలవాఁడవైన ఓమహాదేవా! ఈనాకవితా కన్య కన్యకాలక్షణంబులు గలిగి కల్యాణమునకుఁ దగియున్నది. లోకమందు కన్య సర్వాభరణంబులు గలిగియుండును. ఇయ్యదియు సర్వాలంకారములుఁ గలిగియున్నది. కన్యక సరళపదంబు (మందగమనంబు)ల నొప్పారు. ఇయ్య దియు మృదువై సుబోధంబులగు పదంబులతో సొంపు నింపుచున్నది. కన్యక సాధువృత్త (సత్కర్మములయందు ప్రవర్తించునది) యగును. ఇయ్యదియు లక్షణ విరుద్ధముగాని వృత్తములు గలిగియున్నది. 'సువర్ణ' మనఁగా కన్యకు

సురూపంబును గవితకుఁ బరుషంబులుగాని యక్షరములుం గలవు. శరీరలక్షణమెఱిఁగిన వారాకన్యను మెచ్చుకొందురు కావ్యలక్షణ వేత్తలీ కవితనుఁ గొనియాడుచున్నారు. కన్యకు సరసమైన గుణములుండును. దీనికి శృంగారాది రసంబులును మాధుర్యాది గుణంబులుం గలవు. కన్యవరుల యెన్నికవడసినట్లు లియ్యదియు నొక్కొక యంశమును గూర్చిన యెన్నికఁగలదియై యున్నది. సర్వలక్షణసంపత్తి యిరువురకుం గలను కన్య వినయము గలదియగును. కవితయుఁ గవివినయముఁ దెలుపఁగలిగి యున్నది. కన్యకు సుశీలత్వము ఆభరణ విశేషముగాఁ బ్రకాశించును. కవితయందును విశేషాలంకారములు ప్రకాశించుచున్నవి. కన్యయం దర్థరేఖలనఁగా భాగ్యరేఖలు స్ఫురించుచుండును కవితయందును పదార్థపరంపర స్ఫురించుచున్నది. అర్థపుష్టి గలిగిన భాషణము సాధారణముగాఁగలదు. ఇట్టి నాకవితాకన్యను నీకిచ్చెదం బ్రతిగ్రహింపుము.

అ. కన్యాత్వేన భావితాం కవితాం ప్రబంధం గౌరీప్రియాయ ప్రియచ్ఛతి.

వ్యా. హే దేవక్రీడాసమర్థ గౌరీప్రియ గౌరీపార్వతీ ప్రియాఇష్టభార్యా యస్య తథోక్త స్సర్వాలంకారయుక్తాం సర్వే ఉపమాదయః అలంకారా స్తైర్యుక్తా మన్యత్ర సర్వభూషణభూషితాం సరళపదయుతాం సరళాని మృదూని సుబోధార్థానివా పదాని తై ర్యుతా మన్యత్ర సరళం మందం పదం పదవిన్యాస స్తేన యుతాం హంసగామినీమిత్ యానత్ సాధువృత్తాం సాధుసలక్షణం వృత్తమార్యాదికం యస్యాం తా మన్యత్ర సాధుషు కర్మసు వృత్తాం ప్రవర్తమానాం కర్తరి క్తః సువర్ణామపరుషాణి వర్ణా న్యకారాదీని యస్యాం తా మన్యత్ర సురూపాం సుష్ఠు కావ్యలక్షణ విద్భి రన్యత్ర శరీరలక్షణవిద్భి స్సంస్తూయమానాం సమ్యక్ శ్లాఘ్యమానాం సరసగుణయుతాం శృంగారాది రసమాధుర్యాది గుణయుతా మన్యత్ర భర్తురిష్యమాణగుణయుతాం లక్షితాం సంజాతలక్షణాం ప్రతిపాద్యవస్తుసహితా మితి యావత్ అన్యత్ర కన్యార్థిభి ర్లక్షితాం వరణీయత్వేన

నిశ్చితా మిత్యర్థః లక్షణాభ్యాం సర్వలక్షణసంపన్నా ముద్యద్భూషావిశేషా ముద్యత్ప్రకాశమానః భూషావిశేషః అలంకారవిశేషో యస్యాంతా మన్యత్ర సుశీలతాసంపన్నా ముపగతవినయా ముపగతః జ్ఞాతః కవివినయః యస్యాంతా మన్యత్ర పరిప్రాప్తవినయాం ప్రియ్యాత్వం ద్యోతమానార్థరేఖా మర్థానాం రేఖా పరంపరా ద్యోతమానా ఝుడితి స్ఫురంతీ అర్థరేఖాయస్యాంతా మన్యత్ర ద్యోతమానా అర్థరేఖాభాగ్యసూచకరేఖాయస్యాం తథోక్తాంకల్యాణీం తాం మమ కవితాకన్యాం సాహితీకన్యాం త్వం గృహాణ ప్రతిగృహ్ణీష్వ.

హరిబ్రహ్మాదులకుఁగూడ గోచరముగాని నీవు నాకెట్లు ప్రసన్నుఁడవగుదువో దేవా? యని ప్రార్థించుచున్నాఁడు.—

ఇదం తే యుక్తం వా పరమశివకారుణ్యజలధే
గతౌ తిర్యగ్రూపంతవ పదశిరో దర్శనధియా,
హరిబ్రహ్మాణౌ తౌ దివి భువి చరంతౌ శ్రమయుతౌ
కథం శంభో స్వామి న్కథయ మమ వేద్యోసి పురతః. 99

టీ. పరమశివ=సకలదేవతా సార్వభౌముఁడవైన శివుఁడా! కారుణ్యజలధే=కరుణాసముద్రుఁడా! తవ=నీయొక్క, పదశిరోదర్శనధియా=పాదములను, శిరస్సును గనుఁగొనవలయునను బుద్ధితో, తిర్యగ్రూపం=తిర్యగ్జంతువు (పంది, హంస) ల రూపమును, గతౌ=పొందిన, తౌ=ఆ, హరిబ్రహ్మాణౌ=విష్ణుమూర్తియు, బ్రహ్మదేవుఁడును, దివి=ఆకాశమందును, భువి=భూమియందును, చరంతౌ=సంచరించుచున్నవారలై, శ్రమయుతౌ=ఆయాసముతోఁ గూడినవారలు, (స్యాతాం=అయిరి.) శంభో=సుఖప్రదుఁడా! స్వామిన్=సర్వలోకాధినాథా! మమ=నాయొక్క, పురతః=ముందరను, వేద్యః=కనుఁగొనఁదగినవాఁడవు, కథం=ఎట్లుగా, అసి=అగుదువు? కథయ=చెప్పుము. ఇదం=ఇది, తే=నీకు, యుక్తంవా=తగునా?

తా. పరమశివా! మీపాదదర్శనమునకై పందిరూపముదాల్చి శ్రీహరియు శిరోదర్శనమునకై హంసరూపముదాల్చి బ్రహ్మయుఁ బాపమిట్లు తిర్య

గ్జంతువు లగుటయేగాక భూమ్యంతరిక్షము లందంతటఁ దిరిగి పలువిధములఁ బాటుపడిరే కాని ఫలము లభింపరైరి. ఓశంకరా! స్వామీ! సరియే? ఇప్పుడు మీరు నాయెడల ప్రసన్నులై నాకెట్లు తెలియనగుదురో సెలవిండు. శివుఁడు భక్తపరాధీనుఁడుగాన హరిబ్రహ్మలకలవిగాని తనదర్శనమును భక్తుల కొసంగునని ముఖ్యాభిప్రాయము.

అ. హరిబ్రహ్మణో రప్యగోచర స్త్వం మమ కథం ప్రసన్నో భవిష్యసీతి ప్రార్థయన్నాహ:—

వ్యా. తవ మితి. హే పరమశివ సకలదేవతాసార్వభౌమా హే కారుణ్యజలధే కరుణాసముద్ర తవ తే పదశిరో దర్శనధియా పాదమస్తకయో ర్దర్శన మవలోకనం తస్మిన్ ధీ ర్బుద్ధి స్తయా తిర్యగ్రూపం పశుపక్షిస్వరూపం గతౌ ప్రాప్నువంతౌ తౌ ప్రసిద్ధౌ హరిబ్రహ్మాణౌ హరి ర్విష్ణుః బ్రహ్మా ధాతా చ తౌ దివ్యాకాశే భువి భూమ్యాంచ చరంతౌ భ్రమంతౌ సంతౌ శ్రమయుతౌ శ్రమేణాయాసేనయుతౌ సంయుక్తౌ స్యాతా మిత్యధ్యాహార్యం మహాదేవ హరిబ్రహ్మాణౌ పాదశిరోదర్శనా సమర్థత్వా ద్దుఃఖితా విత్యర్థః అప శ్శంభో సుఖప్రదాయక స్వామిన్ సర్వలోకప్రభో మమ మే పురతోగ్రే వేత్తుం యోగ్యః వేద్యః కథం కేన ప్రకారేణాసి కథయసద ఇద మేతత్కార్యం తే తవ యుక్తం యోగ్యంవా అనేన శివస్య భక్తపరాధీనత్వా ద్విష్ణుబ్రహ్మణో రప్యదర్శితం స్వస్వరూపం భక్తానాం దర్శయతీతి భావః.

శ్రీ పరశివ పరబ్రహ్మమునందును సకల దేవతాస్తోత్రములను సర్వాతయు సకలదేవతలకన్న నెక్కుడగు మాహాత్మ్యమునుఁ గలదని తెలుపుచున్నారు.—

స్తోత్రేణాల మహం ప్రవచ్మి నమృషా దేవావిరించాదయ
స్తుత్యానాం గణనా ప్రసంగసమయే త్వా మగ్రగణ్యం విదుః,
మాహాత్మ్యాగ్రవిచారణప్రకరణే ధానాతుషస్తోమవ
ద్ధూతాస్త్వాం విదు రుత్తమోత్తమఫలం శంభో భవత్సేవకాః.

టీ. శంభో=సుఖకారణమైనవాఁడా! భవత్సేవకాః=నీభక్తులయిన, విరించాదయః=బ్రహ్మాదులగు, దేవాః=దేవతలు, స్తుత్యానాం=స్తుతింపఁదగిన వారలయొక్క, గణనాప్రసంగసమయే=లెక్కనుగుణించిచర్చించునప్పుడు, త్వాం=నిన్ను, అగ్రగణ్యం=మొదటగణింపఁదగినవానిఁగా, విదుః=తెలిసికొనుచున్నారు. మా...జే-మాహాత్మ్య=సృష్టిస్థితిలయసామర్థ్యముపుగూర్చిన, అగ్రవిచారణ=మొదటిచర్చను, ప్రకరణే = చేయునప్పుడును, ధానాతుష స్తోమవత్=సారములేని ధాన్యమునందలిపొట్టంతయుంబోలె, ధూతాః=కదలి పోయినవారలై, త్వాం=నిన్ను, ఉత్తమోత్తమఫలం = మిగుల సారమైన ధాన్యముగా, విదుః=తెలిసికొనుచున్నారు. స్తోత్రేః = స్తుతిచేత, అలం = చాలును, అహం=నేను, మృషా=అసత్యము, నప్రవచ్మి=చెప్పను.

తా. శంభో! మహాదేవ! బ్రహ్మాదులగు ముప్పదిమూఁడుకోట్లదేవతలును స్తోత్రార్హులను లెక్కించునప్పుడు నిన్ను మొట్టమొదటివానిగా లెక్కపెట్టుచున్నారు. సృష్టిస్థితిలయసామర్థ్యరూపమైన మాహాత్మ్యమును గుణించి చర్చించునప్పుడు, ధాన్యపురాశి యెగురఁబట్టునప్పుడు పొట్టంతయు దూరముగాఁ బోయినట్లు తామందరు దూరమైపోయి సారమైన ధాన్యమునట్లు నిన్నుత్తమోత్తమునిగాఁ గనుఁగొనుచున్నారు. దేవా! ఇవి ఎట్టిస్తుతిపాఠములు గావు. నేను చెప్పినదంతయు నిజముగాని యిసుమంతయు నసత్యముగాదు. సకల శ్రుతిస్మృతి ప్రసిద్ధము. స్వామీ! బ్రహ్మాదులందఱు మీసేవకులే గదా!

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరాచార్యవిరచిత శివానందలహరిమీఁద విద్యానంద శ్రీశ్రీపాద నరసింహశాస్త్రిచే వ్రాయఁబడిన 'మరందనిష్యంద' మను ఆంధ్రటీకాతాత్పర్యము ముగిసెను.

అ. శివే పరబ్రహ్మణి సకలదేవతా స్తోత్రార్హతా తదధికమాహాత్మ్యం చ ప్రతిపాదయన్నాహ:—

వ్యా. స్తోత్రే ణేతి. శంభో శం సుఖ మస్మా ద్భవతీతి శంభు స్తస్య సంబుద్ధిః హేశంభో భవత్సేవకా స్తవ సేవకాః భక్తాః విరించాదయః విరించిః బ్రహ్మావిరించిః కమలాసన ఇత్యమరకోశా . దదంతత్వమిదం తత్వేన

పాతస్తు సకలలోకాకార సమ్మతయే ఏసయేవాదిర్యేషాం తే దేవా స్త్రిషు లోకేషు యే ప్రసిద్ధాః బ్రహ్మాది త్రయస్త్రింశత్కోటిదేవా ఇత్యర్థః కర్తారః స్తుత్యానాం స్తోతుం యోగ్యా స్తుత్యాస్తేషాం గణనా ప్రసంగసమయే గణనా సంఖ్యాతస్యాః ప్రసంగశ్చర్చాతత్సమయే స్తోత్రార్హ దేవతా విచారణసమయ ఇత్యర్థః త్వా ముగ్రగణ్యం గణయితుం సంఖ్యాతుంయోగ్యః గణ్యాఃఅగ్రేగణనా ప్రారంభే గణ్యస్త్వం త్రిషు లోకేషు త్వమేవాదిమస్తోత్రార్హ దేవతేతి యావత్ తాదృశంవితు ర్జానంతి,కించ మాహాత్మ్యాగ్ర విచారణప్రకరణే మాహాత్మ్యా—మహాత్మ బుద్ధిర్యేషాం తేషాం భావస్తత్వం సృష్టిస్థిత్యంత సామర్థ్యమితి భావ స్తస్యాగ్రవిచారణా ప్రాథమికచర్చాతస్యాః ప్రకరణం ప్రకర్షేణకరణం క్రియా తస్మిన్ ధానాతుషస్తోమస ద్ధూతాః ధానాః క్షుద్రవ్రీహయః అసారవ త్స్వధాన్యేషు ధానాలాజేషు చ స్త్రియామితి వైజయంతీ తాసాం తుషా స్త్వచః 'ధాన్యత్వచితుషః పుమాని'త్యమరః. తేషాం స్తోమ స్సమూహ స్తద్వద్ధూతాః పలాయితా స్సంతస్త్వముత్తమోత్తమఫలం సర్వోత్తమాంతస్సారవ్రీహితద్విదుర్జానంతి – యథాఖలే ధాన్యశుభ్రీకరణే వాతాహతతుషాః దూరీభవంతి తద్వత్త్వదన్యదేవతాః మాహాత్మ్యవిచారణకాలే దూరీకృతా ఇతిఫలితార్థః స్తోత్రేణాలంస్తోత్రేణ సాధ్యం నాస్తీత్యర్థః మృషా అనృతం నప్రవచ్మినవదామియన్మయా స్తుతం తత్సత్యమితి శ్రుతిస్మృతిప్రసిద్ధ మితిచ అన్యమతాకాంక్షా సాధ్యమితిచ వక్తు రభిప్రాయస్య గమ్యమానత్వాత్సకలలోకసమ్మతోఽయమర్థ ఇతి రాద్ధాంతః.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరాచార్య
విరచిత శివానందలహరీ సంపూర్ణమాసీత్.

# సంస్కృతగ్రంథములు.

| | | రు. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రు. | అ. |
| బాలరామాయణము, సటీక | ... | 0 | 2 |
| అధ్యాత్మరామాయణము, మూలము, చిన్నసైజు | ... | 0 | 12 |
| సుందరకాండము, మూలము, చిన్నసైజు | ... | 0 | 12 |
| డిటో ఆంధ్రతాత్పర్యసహితము, నూతనముద్రితము | ... | 1 | 4 |
| శ్రీమద్రామాయణము, మూలము, చక్కనికూర్పు | ... | 1 | 12 |
| డిటో మేలుప్రతి | ... | 4 | 0 |
| మాఘపురాణము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| యజుర్వేదసంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము, చిన్నసైజు, మంచికాగితములు. | | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| వ్రతచూడామణి 360 వ్రతములు, మంచిప్రతి | ... | 1 | 4 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము, అనేకవిషయములఁ జేర్చి యాంధ్ర మహాజనసంప్రదాయానురూపముగఁ బరిష్కరించి ముద్రించి యున్నాము. సాధారణప్రతి | ... | 1 | 4 |
| డిటో మంచిప్రతి | ... | 1 | 12 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 4 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము.—వ్రతసంకల్పము మొదలు పూజ ముగియు వఱకు చేయవలసినవిధులు తెల్పి ప్రాణప్రతిష్ఠ, కలశపూజ, గణాధిపతిపూజ, షోడశోపచారశ్లోకములు మొదలగువానిని తాత్పర్యముతోడ ముద్రించినారము. ఇందు వినాయకవ్రతము, వరలక్ష్మీవ్రతము, సరస్వతీవ్రతము, అనంతవ్రతము, కేదారేశ్వరవ్రతము, గరుడపంచమీవ్రతము, ఈ 6 వ్రతములు గలవు. | ... | 0 | 6 |

ప్రతి 1-కి రు. అ.

వ్రతరత్నాకరము, ద్వితీయభాగము.— ఇందు ఋషిపంచమీ, మథనద్వాదశీ, అమావాస్యాసోమవతీ, కృష్ణాష్టమీ, శ్రీరామనవమీ, అముక్తాభరణసప్తమీ, భక్తేశ్వర, శతవర్తి, లక్షవర్తి, శివరాత్రి, చిత్రగుప్త, క్షీరాబ్ధిశయన, సావిత్రీగౌరి, సంపద్గౌరి, సత్యనారాయణ, రథసప్తమీ, సంకటచతుర్థి, ఏకాదశీగురువారము, శ్రవణద్వాదశీ, శరన్నవరాత్రి, నృసింహజయంతీ అను ఈ 21 వ్రతములు గలవు ... 0 14

| | | | |
|---|---|---|---|
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 2 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 2 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 1 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| మహాన్యాసము, చిన్నసైజు, శుద్ధప్రతి | ... | 0 | 5 |
| రుద్రము, పురుషసూక్తము వగైరాలు, చిన్నసైజు | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము | ... | 0 | 4 |
| సంధ్యావందనభాష్యము, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| మంత్రపన్నములు, మూలము | ... | 0 | 3 |
| కాలామృతము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | | 0 | 8 |
| షట్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనిప్రతి | | 0 | 5 |
| నక్షత్రచూడామణి | ... | 0 | 4 |
| కేరళప్రశ్న, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 3 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| హరిమీడేస్తోత్రము, సటీక | ... | 0 | 3 |
| ఆత్మబోధము ,, | ... | 0 | 4 |
| సౌందర్యలహరి ,, | ... | 0 | 3 |

| | | ప్రతి 1 కి రు. | అ. |
|---|---|---|---|
| వివేకచూడామణి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 10 |
| గంగాలహరి ,, | ... | 0 | 2 |
| శివానందలహరి ,, | ... | 0 | 8 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు, మంచికాగితములు | ... | 0 | 6 |
| భగవద్గీతలు, మూలము, చిన్నసైజు | ... | 0 | 4 |
| భగవద్గీతలు, ఆంధ్రటీకాతాత్పర్యసహితము, పట్టుబెండు | ... | 1 | 8 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, చిన్నసైజు | ... | 0 | 6 |
| భగవద్గీతలు, చిన్నసైజు, శ్రీఅనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | | 0 | 4 |
| సర్వసారోపనిషత్తు, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| నిరాలంబోపనిషత్తు ,, | ... | 0 | 1 |
| కైవల్యోపనిషత్తు ,, | ... | 0 | 2 |
| రఘువంశము 6 సర్గలు, పదచ్ఛేదము, అర్థము, ఆకాంక్షా శబ్ద సమాస తాత్పర్యవ్యాఖ్యానసహితము, సాధారణప్రతి | ... | 3 | 8 |
| రఘువంశము 10 సర్గలు సవ్యాఖ్యానము, శుద్ధప్రతి | ... | 0 | 8 |
| మేఘసందేశము, సవ్యాఖ్యానము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 10 |
| పుష్పబాణవిలాసము | ... | 0 | 2 |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 0 | 10 |
| మాఘము, సవ్యాఖ్యానము 6 సర్గలు | ... | 0 | 10 |
| భర్తృహరిసుభాషితము, ఆంధ్రపద్యతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| శబ్దమంజరి, చక్కనికూర్పు, శుద్ధప్రతి | ... | 0 | 2 |
| ప్రాతఃస్మరణము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| భజగోవిందము, సటీక | ... | 0 | 2 |
| లక్ష్మీనృసింహస్తోత్రము, సటీక | ... | 0 | 2 |
| కృష్ణకర్ణామృతము, ఆంధ్రపద్యటీకాతాత్పర్యము | ... | 1 | 4 |
| సప్తర్షిస్తోత్రము, సటీక, చిన్నసైజు | ... | 0 | 1 |
| దేవీమానసికపూజ ,, | ... | 0 | 1 |
| దేవీఖడ్గమాల ,, | ... | 0 | 1 |

శ్రీరస్తు.

శ్రీశంకరాచార్యకృత

# శి వా నం ద ల హ రి

కృతాంధ్రటీకాసహితము.




చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచే

ప్రకటితము.

1920

శ్రీ ర స్తు.

# శివానందలహరీశ్లోకానాం

## అకారాదిసూచీపత్రికా.

# అకారాదిసూచీపత్రికా.



శ్రీ ర స్తు.

శ్రీశంకరభగవత్పాదప్రణీత

# శివానందలహరి

## సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము.

---

పూజ్యులును దయాసముద్రులును నగు శ్రీశంకరులు పరమేశ్వర నమస్కారమువలన సమస్తపురుషార్థములు చేకూరనగుట యెఱింగి సంసార సాగరమునుండి తాము తరించుటకును ఇతరులను దరింపఁజేయుటకునుం గాఁ బరమేశ్వర స్తోత్రము చేయ నారంభించుచు నిర్విఘ్నముగా గ్రంథము పూర్తియగుటకై పార్వతీ పరమేశ్వర నమస్కార రూపమగు మంగళ మాచరించుచున్నారు:—

కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే,
శివాభ్యా మస్తోకత్రిభువనశివాభ్యాం హృది పునర్భవాభ్యా
మానందస్ఫురదనుభవాభ్యాం నతి రియమ్. 1

టీక. కలాభ్యాం = మహావిద్యాస్వరూపులును, చూ...భ్యాం— చూడాలంకృత=శిఖలచే నలంకరింపఁబడిన, శశికలాభ్యాం = చంద్రరేఖలు గలవారును, ని...భ్యాం – నిజతపః = (ఒకరికొకరు) తమతమ నిరాహారాది వ్రతములయొక్క, ఫలాభ్యాం=ఫలమైనవారును, భక్తేషు=భక్తులయందు, ప్ర...భ్యాం – ప్రకటిత=చూపఁబడిన, ఫలాభ్యాం=కర్మఫలములు గలవా

రును, అ...భ్యాం - అస్తోక=కొలఁదిలేని, త్రిభువన = ముల్లోకములయొక , శివాభ్యాం = శుభములు గలవారును, హృది = మనస్సునందు (ధ్యానించునప్పుడు) పునర్భవాభ్యాం= (అప్పటికప్పుడు) మరల మరలఁ దోఁచుచుండువారును, ఆ...భ్యాం - ఆనంద = పరమానందముతోఁగూడ, స్ఫురత్ = తోఁచుచుండెడు, అనుభవాభ్యాం = స్వరూపసాక్షాత్కారము గలవారును నగు, శివాభ్యాం = ఉమామహేశ్వరుల కొఱకు, ఇయం=ఈ, మే=నాయొక్క, నతిః=నమస్కారము, భవతు = అగుఁగాక.

తా. తమలోఁ దాము చేసిన యుగ్రతపస్సుచేత నొకరికొకరు ఫలముగా నర్ధనారీశ్వరమూర్తులై యెల్లలోకములకు శుభదాయకులై కర్మఫలప్రదాయకులై భక్తులు ధ్యానముచేయుపట్ల నిమిష నిమిషమునను వారల హృదయములయం దావిర్భవించుచు ముముక్షువుల కానందసాక్షాత్కారముల నొసఁగుచు సమస్త విద్యాస్వరూపులయి యున్న యాగౌరీశంకరులకు నమస్కారము.

---

## ⟶ వ్యాఖ్యానప్రారంభః. ⟵

**అవతరణికా:—**

> చిత్రం వటతరోర్మూలే వృద్ధాః శిష్యా గురుర్యువా,
> గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః.

అథ తత్ర భవాన్ పరమ కారుణిక శ్రీశంకరాచార్యః పరమేశ్వర ప్రణతి మహిమ్నా సకలార్థసిద్ధి మధిగత్య స్వయం భవం తర్తు మన్యాం శ్చ తారయితుం పరమేశ్వరం స్తోతు మారభమాణః, అవిఘ్నేన గ్రంథపరిసమాప్తయే శివయో ర్నమనరూపం మంగళ మాచరతి:—

వ్యా. మే మమ ఇయ మసౌ నతిః ప్రణామః శివాభ్యాం శివాచ శివశ్చ శివౌ తాభ్యాం పుమాంస్త్రియేత్యేకశేషః. పార్వతీ పరమేశ్వరాభ్యాం భవతు అస్తు నమస్కార్యగుణాన్ ప్రకటయితుమాహ:—కలా

భ్యామితి. కలాభ్యాం శ్రుతి ప్రసిద్ధ సకల విద్యాస్వరూపాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం చూడాభ్యాం శిఖాభ్యాం అలంకృతే మండితే-శశికళే చంద్రకళే యయో స్తాభ్యాం శశికళాతిశాయి చూడా విశిష్టాభ్యామిత్యర్థః. నిజతపః ఫలాభ్యాం నిజే ఆత్మీయే యే తపసీయే నిరాహారాదితదేకనిష్ఠాద్యుగ్రవ్రతౌ తయోః ఫలాభ్యాం ఫలభూతాభ్యాం పరస్పరతపః ఫలభూతాభ్యా మిత్యర్థః. భక్తేషు స్వభక్తేషు ప్రకటితఫలాభ్యాం ప్రకటితే ప్రకాశితే ఫలే ధర్మాది ఫలదానే యాభ్యాంతాభ్యాం పరహస్తప్రకటిత సర్వ ఫలదానాభ్యా మితి యావత్. అస్తోక త్రిభువన శివాభ్యాం అస్తోకమనల్పం త్రిభువనస్య త్రయాణాం భువనానాం సమాహార స్త్రిభువనం తస్య శివం భద్రం యాభ్యాం తాభ్యాం అనల్ప త్రిభువనభద్రహేతుభ్యా మిత్యర్థః. హృది మనసి పునర్భవాభ్యాం పౌనః పున్యేన ప్రతిధ్యానం జాయమానాభ్యాం యదా యదా ధ్యాయతి తదా తదా నవనవోన్మేషణే నోత్పద్యేతే ఇతి యావత్. సద్యోజాతం ప్రపద్యామీతి శ్రుతేః ఆనందస్ఫురదనుభవాభ్యాం ఆనందేన సాకం స్ఫురణ్ అనుభవః స్వరూపబోధః యయో స్తాభ్యాం ఏతైః కలాభ్యామిత్యాది విశేషణై ర్నమస్కార్యవస్తునో వైశిష్ట్యం ప్రతిపాద్యతే.

శివానందము తనచిత్తము నెడబాయకుండ వేడుకొనుచున్నారు.—

గలంతీ శంభో త్వచ్చరితసరితః కిల్బిషరజో దళంతీ
ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్,
దిశంతీ సంసారభ్రమణపరితాపోపశమనం వసంతీ
మచ్చేతోహ్రదభువి శివానందలహరీ. 2

టీ. హేశంభో=సుఖమునకుఁ గారణమైనవాఁడా! త్వ...తః-త్వత్=నీయొక్క, చరిత=చరిత్రమనియెడు, సరితః=నదినుండి, గళంతీ=స్రవించి పాఱుచున్నదియు, కి...జః-కిల్బిష=పాపములనియెడు, రజః = ధూళిని, దళంతీ=ఖండించు (అణఁచివేయు) చున్నదియు, ధీ...షు-ధీ = బుద్ధులని

యొడు, కుల్యా=పిల్లకాలువలయొక్క, సరణిషు=త్రోవలయందు, పతంతీ= ప్రసరించుచున్నదియు, సం...వం-సంసారభ్రమణ = జననమరణరూపమైన సంసారచక్రమందు తిరుగుటచేఁ గలిగిన, పరితాప = అత్యంతసంతాపముల యొక్క, ఉపశమనం - ఉపశాంతిని, దిశంతీ = ఇచ్చుచున్నదియు, మ... వి - మత్ = నాయొక్క, చేతః = చిత్తమనియెడు, హ్రదభువి = మడు గునందు, వసంతీ = నిలచియుండు నదియునగు, శివానందలహరీ = పార్వతీ పరమేశ్వరులవలనఁగలిగిన యానందప్రవాహము, . విజయతాం=సర్వోత్కృ ష్టముగా నుండుఁ గాక.

తా. ఓశంకరా! భక్తపరిపాలనాది రూపములగు నీచరిత్రములుమహా నదులు. వానినుండి స్రవించి పాఱుచు పాపములనియెడుదుమ్ముల నణఁచు చున్న యీ శివానందలహరి బుద్ధియను పిల్లకాలువగుండ వచ్చి సంసారసం తాపము శాంతిపఱచుచు నాహృదయమను పెద్ద చెఱువులోఁ బడినది. ఇది యెఁకనెన్నఁడును వీడకుండ స్థిరముగా నుండున ట్లనుగ్రహింపుము.

అవ. ఏవం మంగళం నిర్వర్త్యస్వచేతసిశివానందస్థైర్యం ప్రార్థయతే:

వ్యా. గళంతీతి. హేశంభో సుఖకారణ త్వచ్చరిత సరితః తవ తే చరితమేవ భక్తపరిపాలనాది చరిత్రమేవ సరిత్ వాహినీ తస్యాస్సకాశాత్ గళంతీ స్రవంతీ కిల్బిషరజః కిల్బిషం పాపమేవ రజః ధూళిః తద్దళంతీ ఛిం దంతీ ధీకుల్యా సరణిషు ధియఃబుద్ధయఏవకుల్యాః కృత్రిమసరితః తాసాం సరణిషు పదవీషు పతంతీ గచ్ఛంతీ సంసార భ్రమణ పరితాపోపశమనం సం సారే సంసృత్యాం భ్రమణేన భ్రాంత్యా యః పరితాపః అతిదుఃఖం తస్యో పశమనం శాంతిం దిశంతీ ప్రయచ్ఛంతీ మచ్చేతో హ్రదభువి మమచేతః చిత్తమేవ హ్రదః అగాధ జలప్రదేశః తస్య భూః భూమిః తస్యాం వసంతీ తిష్ఠంతీ శివానందలహరీ శివాభ్యాం శ్రుతచరితాభ్యాం జనితః య ఆనందః దుఃఖరాహిత్యరూపః తస్య లహరీ ప్రవాహః విజయతాం సర్వోత్కర్షేణ వర్తతాం సర్వాభ్యః లహరీభ్యః ఉత్కర్షేణ వర్తతా మితి భావః.

శివానంద [illegible] చేయుటచే కలుగునుగనుక శిష్టజన పరమా వశ్యకమని సూచించుచున్నారు:—

త్రయీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యం త్రిణయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్,
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివ మతివిడంబం హృది భజే. 3.

టీ. త్ర...ద్యం - త్రయీ = ఋగ్వేదయజుర్వేద సామవేదములు మూఁటిచేతను, వేద్యం = తెలిసికొనఁ దగినవాఁడును, హృద్యం = హృదయ కమలమున వ్యక్తమగువాఁడును, త్రిపురహారం = స్థూలసూక్ష్మకారణ శరీరములు మూఁటిని నశింపఁజేయువాఁడును, ఆద్యం = సృష్టి కంతకు మొదటనయున్నవాఁడును, త్రిణయనం=మూఁడు కన్నులవాఁడును, జటాభారోదారం = జటాజూటముచేత గంభీరమైనవాఁడును, చ...రం-చలత్ = కదలుచున్న, ఉరగ = పాములనియెడు, హారం = పేరులు గలవాఁడును, మృగధరం = లేడిని దాల్చినవాఁడును, మహాదేవం = గొప్పదేవుఁడును, (స్వప్రకాశ రూపుఁడు), దేవం = ఆనంద స్వరూపుఁడును, మయి = నా యందు, సదయభావం = దయతోఁగూడిన యభిప్రాయము గలవాఁడును, పశుపతిం = బ్రహ్మాదిలోకపాలకుఁడును, చిదాలంబం = స్వరూపజ్ఞానమునకు సాధనమైనవాఁడును, అతివిడంబం = సమయానుసరణముగలవాఁడును, సాంబం = పార్వతీ సమేతుండును నగు, శివం = పరమేశ్వరుని, హృది= మనస్సున, భజే = సేవింతును.

తా. ఏ మహాదేవుఁడు ఋగ్వేద యజుర్వేద సామవేదములు మూఁటి యందుఁ దెలియఁబడునో, ఏ మహాదేవుండు హృదయకమలమునందు స్ఫురించునో, ఏమహాదేవుఁడు స్థూలసూక్ష్మకారణ దేహములు మూఁటిని నిర్మూలము చేయునో, ఏ మహాదేవుండు ప్రపంచమునంతయు సృజించుచు సృష్టికిఁ బూర్వమందునుం గలఁడో, ఏ మహాదేవుండు మూఁడు కన్నులును, జటా

జూటమును, సర్పహారమును, హస్తమున లేడియుం గలిగి గంభీరమూర్తియై యొప్పునో, యే మహాదేవుఁడు మేర లేని స్వప్రకాశము పరమానందమును స్వస్వరూపముగా వెలుఁగొందునో, ఏ మహాదేవుండు స్వరూప సాక్షాత్కా-రమునకుఁ బరమసాధనమో, ఏ మహాదేవుండు బ్రహ్మాది నిఖిలలోకములకుఁ బరిపాలకుఁడై లోకానుకరణముతోఁ గూడి వర్తించునో, అట్టి పార్వతీసమేతుండగు పరమశివుని నాహృదయమందు బుద్ధిప్రేరకునిగా భావించెదను.

అవ. శివానందస్య శివభజనమూలత్వాత్తద్భజన మాసశ్లోక మితి స్వయం భజతే:—

వ్యా. త్రయీవేద్యమితి. అహం త్రయీవేద్యం త్రయ్యా వేదత్రయేణ వేద్యం జ్ఞేయం హృద్యం హృదయాభివ్యక్తం త్రిపురహరం స్థూలాది శరీరత్రయహరం ఆద్యం ఆదౌభవం సృష్టేః పూర్వమపి స్థిత మిత్యర్థః. త్రిణయనం త్రిలోచనం జటాభారోదారం జటాజూటేన ఉదారం గంభీరం చలదురగహారం ఉరసా గచ్ఛంతీత్యురగాః సర్పాః చలంతః స్పందమానాః ఉరగా ఏవ హారః భూషణం యస్య తం మృగధరం ధరతీతిధరః మృగస్యధరః మృగధరః తం హరిణధర మిత్యర్థః. మహాదేవం దీవ్యతీతిదేవః మహాంశ్చాసౌ దేవశ్చ మహాదేవ తం అపరిచ్ఛిన్న స్వప్రకాశరూపమిత్యర్థః. దేవం దీవ్యతేః ప్రమోదార్థత్వాచ్చ ఆనందరూపంమయి మయి విషయే సదయభావం భావనావిశిష్ట మిత్యర్థః. పశుపతిం బ్రహ్మాదిలోకానాం పతింపాలకం పాశవిమోచన మిత్యర్థః. చిదాలంబం చిదః స్వరూపజ్ఞానస్య ఆలంబం సాధనం సాంబముమాసహితం అతివిడంబం ప్రాప్తలోకాను కరణం శివం ఈశ్వరం హృది మనసి భజేభావయే ధీప్రేరకత్వేనధ్యాయామీత్యర్థః.

దేవత లందఱిలోను శివుఁ డుత్తమోత్తముఁ డని తలంచి నీపాదారవిందభజన మనుగ్రహింపుమని యాతనినే వేఁడుకొనుచున్నారు.

సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్,
హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరం యాచే శంభో శివ తవ పదాంభోజభజనమ్. 4

టీ. జగతి = లోకమునందు, క్షుద్రఫలదాః = తుచ్ఛమైన ఫలముల నొసఁగునట్టి, విబుధాః = (ఇతర) దేవతలు, సహస్రం = వేలకొలఁది, వర్తంతే = ఉన్నారు. (అహం = నేను), స్వప్నే వా = కలలోనైనను, తదనుసరణం = ఆదేవతలను భజించుటగాని, తత్కృతఫలం = ఆదేవతలు కలుగఁజేయు ఫలమునుగాని, నమన్యే=వలఁచను (కోరను) శంభో, శివ=సుఖకారణుఁడవును, మంగళస్వరూపుఁడవునగు శంకరా! నికటభాజాం = సన్నిధిని చేరియున్న, హరిబ్రహ్మాదీనామపి = విష్ణుమూర్తి, బ్రహ్మదేవుఁడు మొదలగు వారలకు సైతము, అసులభం = దుర్లభమైన, తవ = నీయొక్క, పదాంభోజభజనం = పాదపద్మసేవను, చిరం = ఎల్లవేళలను, యాచే = యాచించుచున్నాను.

తా. ఏదోకొంచెము ఫలమిచ్చెడు దేవత లెందఱో కలరు. వారిసేవ, వారిఫలములు నాకు కావలయునను నపేక్ష స్వప్నమందైనను లేదు. వద్దు. ఓ ఈశ్వరా! ఎల్లప్పుడును సన్నిధానవర్తులైన బ్రహ్మాదులకుఁ గూడ దొరకని మీపాదసేవయే దయచేయుఁడు. మిమ్ము పదే పదే వేఁడుకొనుచున్నాను.

అ. సర్వదేవతాపేక్షయా శివోత్కర్ష మభిప్రేత్య తత్పాదారవిందభజనం తమేవ యాచతే :—

వ్యా. సహస్రమితి. జగతి భువనే క్షుద్రఫలదాః తుచ్ఛఫలప్రదాతారః స్వల్పఫలదానాదేవ హేతోః సహస్రం సహస్రసంఖ్యాకాః విబుధాః దేవతాః వర్తంతే సంతి అహం స్వప్నే వా వాశబ్దోఽప్యర్థకః స్వప్నేఽపి కిముత జాగ్రదవస్థాయా మితిభావః. తదనుసరణం తేషాం

భజనం తత్కృత ఫలం తైర్దత్తఫలంచ నమస్యే। నాభ్యుప గచ్ఛామి కింతు నికటభాజాం నికటం సన్నిధిం భజంతే సేవంత ఇతి నికటభాజః తేషాం హరిబ్రహ్మాదీనామపి హరిశ్చ బ్రహ్మాచ హరి బ్రహ్మాణౌ తావేవాదీ యేషాంతే తేషామపీత్యర్థః. కర్తరిషష్ఠీ. అసులభం దుర్లభం హేశంభో తవ తే పదాంభోజ భజనం పాదారవిందసేవాం చిరం బాహుకాలికం యాచే అభ్యర్థయే.

ఓరిపిచ్చివాఁడా! ఈదేవతలతో నీకేల? వీరెన్నఁడో ఫలమిచ్చెదరఁట. అదియును కన్నులకుఁగానరాదు. ఇంతకన్న నొకరాజు నాశ్రయించరాదు? ప్రత్యక్షముగా వెంటనే ఫలమిచ్చును. అది మెఱుఁగు గదా అను నభిప్రాయమును మనమునం దుంచుకొని యిట్లు చెప్పుచున్నారు :—

స్మృతౌ శాస్త్రే వైద్యే శకునకవితాగానఫణితౌ
పురాణే మంత్రే వా స్తుతి నటన హాస్యే ష్వచతురః,
కథం రాజ్ఞాం ప్రీతి ర్భవతి మయి కోఽహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ ప్రథితకృపయా పాలయ విభో. ౯

టీ. స్మృతౌ = మనుస్మృతి మొదలగు స్మృతులయందుగాని, శాస్త్రే = తర్క—వ్యాకరణాది శాస్త్రములయందుగాని, వైద్యే = వైద్యమునందుగాని, శ...తౌ—శకున=శకునములు చెప్పుట యందుగాని, కవితా = కవిత్వముజెప్పి మెప్పించుటయందుగాని, గాన ఫణితౌ సంగీతముపాడి రంజింపఁజేయుట యందుగాని, పురాణే = పురాణములు చెప్పుటయందుగాని, మంత్రేవా = మంత్రశాస్త్రమందుగాని, స్తు...షు—స్తుతి=స్తోత్రములుచేసి యుప్పొంగించుటయందుగాని, నటన = నాట్యము సల్పిమోహింపఁ జేయుటయందుగాని, హాస్యేషు = హాస్యములుచెప్పి నవ్వించుటయందుగాని, అచతురః=నేర్పులేనివాఁడను, మయి = (ఇట్టి) నాయందు, రాజ్ఞాం = రాజులకు, ప్రీతిః=ప్రేమ, కథం =ఎట్లు? భవతి = కలుగును.

(ఒకవేళ నిందేదైన నేర్చినను నేర్తునుగాక వారి ప్రేమవలని లాభంబుల మీఁద నాకిచ్ఛయు లేదు). (అతః = కనుక), ప్రథిత = వేదప్రసిద్ధుఁడవును, సర్వజ్ఞః = సమస్తము తెలిసినవాఁడవునునగు, హేపశుపతే = ఓయి సర్వేశ్వరా? కోఽహం = నేనెవ్వఁడనో యెఱుంగని, పశుం = పశుప్రాయుఁడనైన, మాం = నన్ను, కృపయా = దయతో, పాలయ = రక్షించుమా.

తా. సర్వజ్ఞుండవైన ఓయీశ్వరా! శాస్త్రపాండితిలేదు. వైద్యము చేతగాదు. కవిత్వము చెప్పనేరను. సంగీతము పాడరాదు. పురాణము చదువలేను. మంత్రము లెఱుఁగను. ఆటపాటలయందు నేర్పులేదు. మెచ్చి మెచ్చులమాటలు మున్నగునవేవియుఁ జెప్పఁజాల నింక రాజులకు నామీఁద నెట్లు దయవచ్చును? వచ్చియు వారిచ్చు ఫలములు నాకేల? వలదు వలదు. వేదవేద్యా! మహానుభావా! నన్ను నేనే యెఱుఁగని పశువను. నీవు పశుపతివిగదా దయచేసి నీవే నన్ను రక్షింపుము.

అ. పరోక్ష కాలాంతరభావి ఫలదాతృ దేవతానుసరణాత్ప్రీత్యాశు ఫలదాతృరాజాద్యనుసరణం వరమితి తేనైన ఫలం సాధ్యమిత్యత ఆహ:—

వా. స్మృతావితి. స్మృతౌ మన్వాదిస్మృతౌ శాస్త్రే తర్కవ్యాకరణాదౌ వైద్యే భిషక్ఛాస్త్రే శకున కవితా గానఫణితౌ శకునం ప్రయాణాదికాలే కాక, గరుడ జంబుకాది సవ్యాపసవ్యగమనవిధినిషేధ శాస్త్రం కవితా కవేర్భావః కవితా ఛందోరూపేణ గద్య పద్య రూపేణచ యథోచితార్థాభిలాషక శబ్దగుంభనం గానం సంగీతం తేషాం ఫణితిః సభాయాం వాచావిష్కరణం తస్యాం పురాణే శైవవైష్ణవాత్మక గ్రంథ విశేషే మంత్రే మంత్రశాస్త్రే వేతి వికల్పార్థే, స్తుతి నటనహాస్యేషు స్తుతిః స్తోత్రం నటనం నాట్యం హాస్యం పరేషాం హాసనానుకూల, వ్యాపారః తే ష్వహ మచతురః అసమర్థః నిపాతనాత్సాధుః. తస్మాత్ రాజ్ఞాం నృపతీనాం మయి, ప్రీతిః ప్రేమా కథం కేన ప్రకారేణ భవతి స్యాత్ తత్ప్రీతిజన్యం ఫలంచానిష్పి

తం అతః హేపశుపతే హేసర్వజ్ఞ హే ప్రథిత శ్రుతిపరిఖ్యాపిత హేవిభో సర్వవ్యాపక పశుం పశుప్రాయం కోఽహ మిత్యజానానం మాం కృపయా కరుణయా పాలయ రక్ష.

ఇట్లు దేవుని వేఁడుకొని తనబుద్ధిని గుఱించి నీయలవాటు చెప్పిన సామాన్యమైనశాస్త్రములమీఁదికే పఱుగులెత్తెద వది దురభ్యాసము సుమా! ఇంకమానుము. శివభజనము చేయుము అని మెల్లఁగా నందుఁ జొప్పించుచున్నారు :—

ఘటో వా మృత్పిండోఽప్యణు రపి చ ధూమోఽగ్నిరచలః
పటో వా తంతు ర్వా పరిహరతి కిం ఘోరశమనమ్,
వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః. 6

టీ. సుధీః=ఓ మంచిబుద్ధీ, ఘటోవా=కుండగానీ, మృత్పిండోఽపి=మట్టిముద్దగానీ, అణురణీ=పరమాణువుగానీ, ధూమః=పొగగానీ, అగ్నిః=నిప్పుగానీ, అచలః=పర్వతముగానీ, పటోవా=వస్త్రముగానీ, తంతుర్వా=దారముగానీ, ఘోరశమనం=భయంకరుఁడైనయముని, పరిహరతి కిం=పోఁగొట్టునా యేమి? తర్కవచసా = (పైఁజెప్పిన) తర్కశాస్త్రమందలి మాటలచేత, వృథా=వ్యర్థముగా, కంఠక్షోభం=కంఠమున కాయాసమును, వహసి=కలిగించుకొనుచున్నావు. (అదిమాని), శంభోః = శివునియొక్క, పదాంభోజం=పాదపద్మమును, భజ=సేవించుము, తరసా = శీఘ్రముగా, పరమసౌఖ్యం=మోక్షసామ్రాజ్యమును, వ్రజ=పొందుము.

తా. కుండలు చేయుటకు మట్టి సాధనము, దానికి పరమాణువులు కారణము. కొండమీఁద పొగ కనఁబడుచున్నది గాన నిప్పక్కడనుండును. బట్టలు దారములవలన జనించును. ఈ తర్కశాస్త్రవాక్యములలో నొక్కటియు మృత్యువున కడ్డపడునదిగాదు. ఇవి పిడివేసి వర్ణించి కంఠక్షోభ మేల కలిగించుకొనియెదవు వద్దు. శివభజనజేసి మోక్షము బొందుము.

అ. ఏవం సంప్రార్థ్య దురభ్యాస బలేన సామాన్యశాస్త్రీ ధావమానాం బుద్ధిం నివార్య శివభజనం కుర్విత్యను నయతి:—

వ్యా. సుధీః హేశోభనబుద్ధే ఘటోవా కలశోవా మృత్పిండః మృద్వికారోఽపి అణుః పరమాణురపి ధూమః స్పష్టార్థః అగ్నిః వహ్నిః అచలః పర్వతః పటోవా వస్త్రంవా తంతుర్వా సూత్రంవా ఏతే న్యాయశాస్త్రవ్యవహ్రియమాణా శ్శబ్దాః ఘోరశమనం ఘోరః కఠినశ్చాసౌ శమనః యమశ్చ, శమనో యమరాడ్యమ ఇత్యమరః. తం పరిహారతికిం దూరీకరోతి కింవేతి సర్వత్ర వికల్పార్థః తర్కవచసా న్యాయవాక్యేన వృథావ్యర్థం కంఠక్షోభం గళశ్రమం త్వంవహాసి ప్రాప్నోషి శంభోః శం సుఖం భవత్యస్మాదితిశంభుః తస్య పదాంభోజం అంఘ్రి కమలం భజ సేవస్వ తరసా ఝుడితి పరమసౌఖ్యం మోక్ష సామ్రాజ్యం వ్రజ లభస్వ.

ఇట్లు బుద్ధిని శివభక్తియందుఁ జొన్పి మనస్సు మొదలగు నింద్రియములకుఁ గూడ నితరవిషయాసక్తిలేకుండ పరమశివ కైంకర్యాసక్తి గలుగునట్లు ప్రార్థించుచున్నారు:—

మనస్తే పాదాబ్జే నివసతు వచస్స్తోత్రఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతి రపి కథాకర్ణనవిధౌ,
తవ ధ్యానే బుద్ధి ర్నయనయుగళం మూర్తివిభవే
పరగ్రంథా న్కైర్వా పరమశివ జానే పరమతః. 7

టీ. హేపరమశివ=ఓపరమేశ్వరా, మనః=మనస్సు, తే=నీయొక్క, పాదాబ్జే=పాదపద్మమందును, వచః=వాక్కు (వాగింద్రియము), స్తోత్రఫణితౌ=స్తోత్రపాఠములు చదువుటయందును, కరః=చేతులు (హస్తేంద్రియము), అభ్యర్చాయాంచ=పూజయందును, శ్రుతిః=చెవులు. (శ్రవణేంద్రియము), కథాకర్ణనవిధౌ=చరిత్రలు వినుటయందును, బుద్ధిః = బుద్ధి, (నిశ్చయాత్మకమైన అంతఃకరణవృత్తి), తవ=నీయొక్క, ధ్యానే=ధ్యానమందును, నయనయుగళం =.కన్నుదోయి, మూర్తివిభవే = నీదివ్యమంగళ

విగ్రహముయొక్క చక్కదనమందును, నివసతు=స్థిరపడియుండుఁగాక, అతఃపరం = ఇంకమీఁద, కైర్వా = ఏఇంద్రియములచేత, పరగ్రంథాః = నీకైంకర్యమునకు వ్యతిరిక్తములైన గ్రంథములను, జానే = తెలిసి కొందును.

తా. మనస్సు, వాక్కు, హస్తము, శ్రవణము, బుద్ధి, నేత్రము అను నింద్రియములెల్లను సర్వకాల సర్వావస్థలయందును నీకైంకర్యమునం దే మగ్నములై యున్నచో గ్రంథాంతరప్రసక్తి కలుగదు. కావున అట్లు అను గ్రహింపుమని భావము.

అ. ఏవంబుద్ధి మనునీయ మన ఆదీనాం కరణానాం పరమశివకైంక ర్య పరతాం తత్కైంకర్యా ద్బహిరంగభూత గ్రంథావలోక నాపహ్నవేన ప్రార్థయతే:—

వ్యా. మనస్తఇతి. హేపరమశివ తేతవపాదాబ్జే చరణాంభోజేమనః చిత్తంనివసతు. వచః వాగింద్రియం స్తోత్రఫణితౌ స్తూయతే అనేనేతిస్తో త్రం తావక గ్రంథః ఫణితౌ తదుచ్చారణే నివసతు చిరం తిష్ఠతు వాగిం ద్రియం శివస్తోత్రాభిలాషీ భవత్విత్యభిప్రాయః. కరఃహస్తేంద్రియం అభ్య ర్చాయాం త్వత్పూజావిధానే నివసతుహస్తేంద్రియం త్వదభ్యర్చన పరంభవ త్విత్యభిప్రాయః, చకారేణానుక్తమపి శివగుణగణ లేఖనం సముచ్చీయతే, శ్రుతిః శ్రోత్రేంద్రియం కథాకర్ణనవిధౌ చరిత్రశ్రవణ విధానే నివసతు శ్రో త్రేంద్రియం తవ చరిత్ర శ్రవణేవ్యాప్రియతామితిభావః, బుద్ధిః నిశ్చయా త్మకాంతః కరణవృత్తిః ధ్యానే త్వద్విషయక ప్రత్యయావృత్తౌ నివసతు త్వా మేవ సదా ధ్యాయత్వితిభావః. నయనయుగళం నేత్రేంద్రియయుగ్మం ఏక స్యాపీంద్రియస్య యుగళ త్వాభిధానం గోళకాభిప్రాయేణ, మూర్తివిభవే తను శోభాతిశయే నివసతు దివ్యమంగళవిగ్రహరూపం పశ్యత్విత్యభిప్రాయః. ఉక్తరీత్యావట్సు కరణేషు వ్యాప్రియమాణేషు అతః పరంఇత ఉత్తరకాలం కైర్వాకరణైః,వాశబ్దః ప్రశ్నేపరగ్రంథాః ఉక్తార్థాద్బహిరంగభూతాః

గ్రంథాః జానేజానాస్యామి, వర్తమానసామీప్యే ఇతి భవిష్యదర్థేలట్, ఉక్త కరణజాతం సదా త్వదాదేశకరణం భవత్వితి స్పష్టార్థః.

నన్ను భజించుటచేతనే సర్వాభీష్టములు సిద్ధించునెడల కొందఱితరుల నేల సేవింతు రను ప్రశ్నయం దిట్లు చెప్పుచున్నారు:—

యథా బుద్ధి శ్శుక్తౌ రజత మితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్,
తథా దేవభ్రాంత్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే.

టీ. మహాదేవ = ఓదేవదేవుఁడా! పశుపతే=సకలభూతాధిపతీ! జడజనః = మూఢుఁడు, ఈశం=సర్వనియంతవగు, త్వాం = నిన్ను, మనసి = హృదయమందు, నమత్వా = తలంచక (ఎఱుఁగక), శుక్తౌ = ముత్యపుఁజిప్పయందు, రజతమితి = వెండియనియు, కాచాశ్మని = గాజుతాయియందు, మణిః = మాణిక్యమనియు, పైష్టే = పిండిగలిపిన, జలే=నీటియందు, క్షీరం = పాలనియు, మృగతృష్ణాసు = ఎండమావులయందు, సలిలం =జలమనియు, బుద్ధిః = మిథ్యాబుద్ధి, యథా = ఎట్లు, భవతి = కలుగుచున్నదో తథా = అట్లు, భవదన్యమ్=నీకంటె యితరుఁడైనట్టివానిని, దేవభ్రాన్త్యా= దేవుఁడను భ్రాంతిచేత, భజతి = సేవించుచున్నాఁడు.

తా. ముత్యపుఁజిప్పలను వెండియనియు గాజుతాలను మణులనియు పిండినీళ్లను పాలనియు ఎండమావులను నీళ్లనియు భ్రమించునట్లుగా నిన్ను తెలియనేరనిమనుజుఁడు ఇతరుని దేవునిగా భ్రమించి సేవించుచున్నాఁడు.

అ. మద్భజనేనైవ సర్వాభీప్సిత సిద్ధౌ కేచన మదన్యం కుతో భజంతీత్యత ఆహ.—

వ్యా. యథాబుద్ధిరితి. హేమహాదేవ అపరిచ్ఛిన్న స్వప్రకాశరూప హేపశుపతే సకలభూతాధిపతే జడజనః త్వత్స్వరూపం మజానానో జనః

ఈశం సర్వనియంతారం త్వాం భవంతం మనసి హృదయే న మత్వా మ
నసా అనవబుధ్యేత్యర్థః. వేదే నానవబుధ్యేతిచార్థః. భవదన్యం త్వదన్యం
కథాత్యత్ప్రకారయా దేవ ఇతిభ్రాంత్యా భజతి సేవతే అధిష్ఠానాజ్ఞానస్యా
ధ్యాసహేతుత్వాదిభావః. కింప్రకారా భ్రాంతిరిత్యత ఆహ.—శుక్తౌ ముక్తి
కోత్పత్త్యాధారభూతే సాముద్రికవస్తువిశేషే యథా యత్ప్రకారా రజతమితి
దుర్వర్ణమితి బుద్ధిఃజ్ఞానం భవతి కాచాశ్మని రత్నాభాసే మణివత్ప్రకాశ
మాన క్షుద్రశిలాయామిత్యర్థః. మణిరితి మాణిక్యమితి బుద్ధిః పైష్టే పిష్ట
వికారే జలే ఉదకే క్షీరమితి దుగ్ధమితి బుద్ధిః మృగతృష్ణాసు మరుమరీచి
కాసు సలిలమితి జలమితి బుద్ధిః యథా యత్ప్రకారా తత్ప్రకారయా భ్రాం
త్యే త్యన్వయః.

ఏయుపాయముచేతైనను ఈశ్వర ప్రసాదము సంపాదింపవలయు
నని చెప్పియున్నది. అందు సులభోపాయ మెద్దియో చెప్పుచున్నారు:—

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః,
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కి మహో. 9

టీ. జనః = మనుష్యుఁడు, జడమతిః = తెలివితక్కువవాఁడై, కుసు
మార్థం = పుష్పములకొఱకుఁగా, గభీరె = లోఁతైన, కాసారె = చెఱువు
నందు, విశతి = దిగుచున్నాఁడు, విజనె = జనులులేని, ఘోరవిపినె = భయం
కరారణ్యమంగును, విశాలె = విస్తీర్ణమైన, శైలేచ = పర్వతమందును,
భ్రమతి = తిరుగులాడుచున్నాఁడు, హే ఉమానాథ = ఓ పార్వతీపతీ! ఏకం
= ఒక్క, చేతస్సరసిజం = మనస్సనియెడు పద్మమును, భవతే = నీకొఱకు,
సమర్ప్య = సమర్పించి; ఇహ = ఇచ్చట, సుఖేన = సుఖముగా, అవస్థాతుం =
స్థిరుఁడైయుండుటకు, నజానాతి = ఎఱుంగఁడు, కిమహో = ఏమియాశ్చ
ర్యము!

తా. అహహా! మానవు లెంతవెఱ్ఱులు! పుష్పములకొఱకుఁ దా మట వులలోను కొండలలోను దిరుగులాడుచు లోఁతైనచెఱువులలో నీఁదులాడు చుం జిక్కులు వడుచున్నారు. తమతమ మనస్సను పద్మమును పరమేశ్వరుని పాదారవిందములయం దర్పించిన యెడల నెంత సుకరముగానుండును?

అ. యేనకేనాప్యుపాయేన భవత్ప్రసాద స్సంపాదనీయ ఇత్యుక్తం తత్ర సులభః ఉపాయః క ఇతి తత్రాహ.—

వ్యా. గభీరేఇతి. గభీరే అగాధే కాసారె సరసి విజనె జనరహితె ఘోరవిపినె ఘోరవ్యాఘ్రాదిభిర్భయంకరె విపినె అరణ్యే విశాలె విస్తీర్ణె శైలే పర్వతేచ, జడమతిః అనులభోపాయజ్ఞః కుసుమార్థం కుసుమం పుష్పం అర్థం ప్రయోజనం యస్మి న్కర్మణి తద్యథా భవతి తథా భ్రమతి సంచరతి హే ఉమానాథ పార్వతీపతే ఏవం సంబోధనం సకౌతుకం మహాదేవ ముపా పసనీయం ద్యోతయతి ఏకం ఏకత్వ సఖ్యాకం చేతస్సరసిజంచేత ఏవ సరసి జంపద్మం వన్యపుష్పవద్బహుత్వా శ్రయసంపాదనక్లేశోనభవతీతిభావః. భవతే తుభ్యం సమర్ప్య ప్రదాయ జనః ఇహ ఏకత్ర అవస్థాతుం నిశ్చలోభవితుం నజానాతి నబుధ్యతి కిమహో కిమే తదాశ్చర్యకరమిత్యర్థః. దుఃఖకరాల్ప ఫలక బహుదేశ భ్రమణాపేక్షయా సుఖకర బహుఫలకైకదేశావస్థానాజ్ఞా న మాశ్చర్యం జనయతీతి భావః.

ప్రారబ్ధ కర్మవశముచేత నేమేమిజన్మమువచ్చినను రానిమ్ముకాని అన్ని జన్మములయందును నీపాదారవిందస్మరణముమాత్రము కలుగునట్లను గ్రహింపుము. అట్లయినఁ గదా చిత్తమును భవదాయత్తముఁ జేయఁగలుగుదును. అని ప్రార్థించుచున్నారు:—

నరత్వం దేవత్వం నగవనమృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాదిజననమ్,
సదా త్వత్పాదాబ్జ స్మరణపరమానందలహరీ
విహారాసక్తం చే ద్ధృదయ మిహ కిం తేన వపుషా. 10

టీ. నరత్వం = మనుష్యుడుగాఁ గాని, దేవత్వం= దేవుఁడుగాఁగాని, నగ...త్వం-నగ = పర్వతముగాఁ గాని, వన = అడవిగాఁ గాని, మృగత్వం =మృగముగాఁ గాని, మశకతా = దోమగాఁ గాని, పశుత్వం = పశువుగాఁ గాని, కీటత్వం = పురుగుగాఁ గాని, విహగత్వాది=పక్షులు మొదలగునవిగాఁ గాని, జననం = పుట్టుక, భవతు= అగుఁగాక, హృదయం=మనస్సు, ఇహ = ఈ పైజన్మములయందు, సదా=ఎల్లప్పుడు, త్వ...త్వం-త్వత్ = నీయొక్క, పాదాబ్జ = పాదపద్మములయొక్క, స్మరణ =స్మరించుట యనియెడు, పరమానంద = మహానందముయొక్క, లహరీ=ప్రవాహమందలి, విహార = విహరించుటకు, ఆసక్తం= ఆసక్తికలిగినది, భవతిచేత్ = అగునేని, తేన = ఆ, వపుషా = శరీరముచేత, కిం = ఏమిభంగము?

తా. మనస్సు పరమేశ్వరస్మరణము గలదై శివానందలహరియం దోలలాడుచున్నచో నేజన్మమెత్తినను కొదువ లేదని తాత్పర్యము.

అ. ప్రారబ్ధవశేన తరతమభావాపన్నాని బహూని జన్మాని భవిష్యంతి తత్ర చేతస్సమర్పణం కథం ఘటిష్యత ఇత్యాశంక్య తత్రాపి తత్పాదాబ్జస్మరణం ప్రార్థయతే:—

వ్యా. నరత్వమితి. విహగత్వాదిజననం ప్రారబ్ధకర్మ భవతు అస్తునరత్వంనరభావః. దేవత్వాదీనాం పదానామప్యేవమేవార్థః. హృదయంమమచిత్తమ్మిహనరాదిభావేషు సదాసర్వదాత్వత్పాదాబ్జస్మరణ పరమానందలహరీ విహారాసక్తం త్వత్పాదాబ్జస్మరణమేవ పరమానందః జన్యజనకయోరభేద వివక్షయాస్మరణస్యానందత్వరూపణం తస్యలహరీ ఆనందస్ఫూర్తి సాంతత్యంతత్ర విహారః ప్రవేశః తస్మిన్నాసక్తం భవతు ఏవంచేత్తేనవపుషా కిం కిమపి నవిహాస్యత ఇతిభావః.

ఇట్లేజన్మమెత్తినను విఘాతము లేదని చెప్పి చిత్తమీశ్వరాయత్తము గాక వర్ణాశ్రమాది ధర్మము లెన్ని చేసినను నిష్ఫలమని చెప్పుచున్నారు:—

వటు ర్వా గేహీ వా యతి రపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చి ద్భవతు భవ కిం తేన భవతి,
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
దదీయ స్త్వం శంభో భవసి భవభారం చ వహసి. 11

టీ. నరః = మానవుఁడు, వటుర్వా = బ్రహ్మచారియైనను, గేహీ వా = గృహస్థుఁడైనను, యతిరపి = సన్యాసియైనను, జటీవా = జటాధారియైనను, తదితరః, యః, కశ్చిత్ = మఱియెంక నెట్టివాఁడైనను, భవతు = కానిమ్ము, తేన = అందుచేత, హేభవ = ఓ యీశ్వరా ? కిం భవతి = ఏమి యగును. (ఏమియు కార్యము లేదు) పశుపతే = సకలభూతనాయకా ? యదీయం = ఎవనిసంబంధమైన, హృత్పద్మం = హృదయకమలము, భవదధీనం యది = నీ యధీనమయినదిగానుండునో, తదీయః = వానిసంబంధుఁడవుగా, త్వం = నీవు, భవసి = అగుదువు, హేశంభో = ఓ శంకరా ? భవభారంచ = వానిసంసారభారమును, వహసి = (నీవే) భరింతువు.

తా. ఏయేవర్ణములయందున్నను ఏయాశ్రమమందున్నను ఎన్నెన్ని జడలు పెంచుకొన్నను ఎంతవాఁడైనను సరే ఈశ్వరభక్తిలేనిదే లాభ మిసుమంతయు లేదు. హృదయపద్మమునందు నిన్ను ధ్యానించుచు మనస్సు నీయందర్పించి భజించువానికి సంబంధివై వానిభారమంతయు నీపై వేసికొని కాపాడుదువు. ఈశ్వరాయత్తచిత్తుం డగువాఁడు చతుర్విధపురుషార్థములను బొంది జనన మరణ ప్రవాహమునుండి తొలఁగి పోవు నని తాత్పర్యము.

అ. ఉచ్చనీచజన్మభి స్సేవ్యత్వావిఘాత ముక్త్వా హృదయస్య శివాధీనతా మంతరేణ తత్తదాశ్రమధర్మం ప్రాప్యాపి ఫలాభావ మాహ:—

వ్యా. వటుర్వేతి. వటుర్వా బ్రహ్మచారీవా గేహీవా గృహస్థోవా యతి రపి సన్యాసీవా జటీవా జటాధారీవా తదితరః తదన్యః యః కశ్చిద్వా నరః మర్త్యః భవతు భూయాత్ తేన కారణేన హేభవ శంభో కిం కీదృశం కార్యం భవతి న కిమపీత్యర్థః. హేపశుపతే సకలభూతాధినాయక యదీ

యం యత్సంబంధి వ్యాత్పద్మంహృదయకమలం భవదధీనం యది త్వాత్వా
ధీనంచేత్ తదీయః తత్సంబంధీత్వం భవాన్ భవసి అసి హేశంభో త్వం భవ
భారం చ సంసారభారం చ వహసి ధారయసి బ్రహ్మచర్యాద్యాశ్రమ చతు
ష్టయేఽపి జనః త్వయ్యర్పితమనాశ్చేత్తత్ఫలం లభతే నోచేన్నేత్యర్థః. యః
పుమాన్ చిత్తం త్వదధీనం కరోతి తస్య చతుర్వర్గఫలం కరతలామలక మితి
చ భవభారమిత్యనేన జననమరణప్రవాహరాహిత్యం భవతీతి చ మంతవ్యమ్.

ఇట్లు వర్ణాశ్రమాదులకన్న శివభక్తి యుత్తమం బని చెప్పి పర్వత
గుహాదులయందలి నివాసముకన్నను శివభక్తియే మేలని చెప్పుచున్నారు:—

గుహాయాం గేహే వా బహి రపి వనే వాద్రిశిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్,
సదా యస్యై వాంతఃకరణ మపి శంభో తవ పదే
స్థితం చే ద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ.

టీ. గుహాయాం=కొండగుహయందో, గేహేవా =స్వగృహమందో,
బహిరపి = బయట నెచ్చటనో, వనేవా = అడవియందో, అద్రిశిఖరే =
పర్వతశిఖరమందో, జలేవా = నీటియందో, వహ్నౌవా = పంచాగ్నిమధ్య
ముందో, వసతు = నివసించుఁగాక, హేశంభో = సుఖకరుండవగు నోయీ
శ్వరుఁడా, వసతేః=అట్లు నివసించిన మాత్రమున, కిం ఫలం = ఏమిఫ
లమో, వద = చెప్పుము (ఏమియును ఫలము లేదనుట), యస్య=అట్టి వాని
యొక్క, అంతఃకరణమపి = మనస్సుగూడ, సదా = ఎల్లప్పుడును, తవ =
నీయొక్క, పదేఏవ = పాదమందే, స్థితం చేత్=నిలచియున్నచో, అసౌ =
ఇట్లు నిలుచుటయే, యోగః = శివయోగము, సచ = అట్టివాఁడే, పరమ
యోగీ=నిర్వికల్పసమాధి గల పరమయోగియు, సచ=వాఁడే, సుఖీ =
పరమానందము గలవాఁడు నగును.

తా. పర్వతగుహాలు అరణ్యములు మున్నగువానియందు నివాసముచేసి
నంతమాత్రమున ఫలమేమియులేదు. అంతఃకరణముఁగూడ నీశ్వరధ్యాన

మందుఁ జొన్పి తదేకనిష్ఠాగరిష్ఠుఁడై యున్నచో శివయోగియై పరమానందముఁ బొందును.

అ. ఏవ మాశ్రమచతుష్టయ శ్శివభక్త్యా శివభక్తే రేవ వైశిష్ట్యం మత్వా శైలగుహాగ్నిజలవాసాదిభ్యః శివపదారవిందార్పిత నిర్మలాంతఃకరణస్య వైశిష్ట్యం సంపాదయ న్నాహ :—

వ్యా. గుహాయామితి. గుహాయాం గిరిగహ్వరే గేహేవా సద్మనివా బహిః బాహ్యప్రదేశేఽపి వనేవా అరణ్యేవా అద్రిశిఖరే పర్వతాగ్రేవా జలేవా సలిలేవా వహ్నౌవా పంచాగ్ని మధ్యేవా యః పురుషః వసతు వాసం కరోతు వసతేః నివాసాత్ కిం ఫలం కిం ప్రయోజనం త్వం ఇదం వద ఫలా అంతఃకరణమపి యస్య పురుష స్యాంతరింద్రియం పూర్వోక్త స్థానవాస యుక్తం తదపి హేశంభో సదా తవ తే పదే చరణారవింద ఏవ స్థితంచేత్ అసౌ అయమేవయోగః శివయోగః సచపదారవిందే నిహితాంతఃకరణః జనః పరమయోగీ నిర్వికల్పసమాధిమాన్ సచ ఏవపురుషః సుఖీ పరమానందభాగ్భవతీతి శేషః.

అట్టివాఁడను కాలేక యున్న నన్ను జ్ఞాన మొసఁగి రక్షించుట నీ భార మయి యున్నదని చెప్పుచున్నారు :—

అసారే సంసారే నిజభజనదూరే జడధియా
భ్రమంతం మా మంధం పరమకృపయా పాతుముచితమ్,
మదన్యః కో దీన స్తవ కృపణరక్షాతినిపుణః
త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే. 13

టీ. హేపశుపతే = ఆత్మజ్ఞానమును పరిపాలించువాఁడా, అజడ = జడములైన దేహాదులకన్న విలక్షణమైన, పరమ = ఓపరాత్పరా ! అసారే = సారములేనిదియు, నిజభజనదూరే = ఆత్మానుసంధానము దూరమైనదియునగు, సంసారే = సంసారమందు, భ్రమంతం = కొట్టుకొను చున్నట్టియు, అంధం = ఆత్మానాత్మవివేకములేమి గ్రుడ్డివాఁడ నైనట్టియు,

మాం=నన్ను, కృపయా=దయతో, ధియా=స్వరూపజ్ఞానము నిచ్చుటచేత, పాతుం=రక్షించుటకు, ఉచితం=యుక్తము. దీనః=సంసారతాపముచేత దీనుఁడైన, మదన్యః=నాకంటె మఱియొకఁడు, తవ=నీకు, కః=ఎవఁడున్నాఁడు? కృపణరక్షాతినిపుణః=దీనులను సంరక్షించుటయందు మిక్కిలి నేర్పుగలవాఁడును, మే=నాకు (నన్ను), శరణ్యః=రక్షించఁదగినవాఁడు, త్వదన్యః=నీకంటె మఱియొకఁడు, త్రిజగతి=ముల్లోకములయందును, కః=ఎవఁడున్నాఁడు.

తా. దేవా! ముల్లోకములయందును దీనరక్షాపరాయణుండవు నీ వొక్కఁడవే కలవు. నేనును సంసారసంతాపములను సైఁపలేక దీనుండనై నీవే దిక్కుగా నీపాలఁబడియున్నాను. నావంటిదీను లింకెందును గానరారు. కనుక దయచేసి ఆత్మజ్ఞాన మొసఁగి యీదీనుని సంసారతాపము నుండి కాపాడుము.

అ. అనీదృశస్య మమ జ్ఞాన ప్రదానేన రక్షణవిధానం తవ యుక్తమిత్యాహ :—

వ్యా. అసారేతి. హేపశుపతే ఆత్మజ్ఞానపరిపాలక ఆజడ హేజడ దేహాదిభిన్న అతఏవ పరమ పరాత్పరత్వేన ప్రసిద్ధ అసారే నవిద్యతే సారస్సుఖవిశేషో యస్మిన్ తథోక్తే నిజభజనదూరే నిజస్యస్వస్వరూపస్య పరమేశ్వరస్య భజనమనుసంధానం దూరం విప్రకృష్టం యస్మిన్ తస్మిన్ సంసారే సమ్యక్సరతివిషయాననుధావత్యస్మిన్నితి సంసారః తస్మిన్ భ్రమంతం సారషదా భ్రమేణ చరంతం సారవత్తా భ్రమః కుతఇత్యత్రాహ—అంధం ఆత్మానాత్మవివేకశూన్యం మాం కృపయా కరుణయా ధియా వివిక్తస్వరూపజ్ఞానప్రదానేన పాతుం రక్షితు ముచితం యుక్తం అజ్ఞాతనిజస్వరూపం మాం స్వాత్మాత్మలాభ్యం కుర్వితిభావః. సంసారతప్తశరణేన మాయాతాపాన్నివర్తితయా త్వదన్యే సంతి బహవః తన్నివర్తకాశ్చ మదన్యేఽపి సంతిపున్నిష్ఫలంకేన తవ కిం ఫలమితిచేత్తత్రాహ—దీనః సంసారతాపేకృత్యః మత్తః [illegible]

వ. కృపణరక్షాతినిపుణః కృపణః ఆత్మానభిజ్ఞః తద్రక్షాయాం తదజ్ఞాననివర్తనే అతినిపుణః అతీవసమర్థః మే మమశరణ్యాః రక్షణార్హాః అత్రజగత్యస్మిన్ లోకే త్వదన్యః త్వత్తోభిన్నః కోవాస్తి.

వేదశాస్త్రముల నుల్లంఘించుటచేత నా యాజ్ఞమీఱితివి. కాన నీ వపరాధివి. నిన్నురక్షించుటయెట్లు? అందువేమో! నీ వాఁడను గనుక నా తప్పు క్షమించుము అనుచు బాంధవ్యమును జూపుచున్నారు.—



ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోఽహం తేషామపికిముత బంధుత్వ మనయోః,
త్వయైవ క్షంతవ్యా శివ మదపరాధా శ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః.

టీ. హేపశుపతే = ఓపరమేశ్వరా! త్వం = నీవు, ప్రభుః = దైన్యముఁ బాపుటకు సమర్థుఁడవు (కనుకనే), దీనానాం=దీనులకు, పరమబంధుఃఖలు = ముఖ్యబంధువుఁడవు గదా, అహం = నేను, తేషాం = ఆదీనులలో, ప్రముఖ్యః = మొట్టమొదటివాఁడను, అనయోః అపి = ఇట్టి మనకును, బంధుత్వం = చుట్టఱికము, కిముత = (ఉన్నదనివేఱే) చెప్పవలయునా, శివ = ఓ ఆనందస్వరూపుఁడా. సకలాః = సమస్తమైన, మదపరాధాః = నాతప్పులు, త్వయైవ = నీచేతనే, క్షంతవ్యాః = క్షమింపఁదగినవి, మదవనం = నారక్షణము, ప్రయత్నాత్=ప్రయత్నమువలన, కర్తవ్యం = చేయఁదగినది, ఇయం = ఇది, బంధుసరణిః = బంధుమర్యాద.

తా. మహాదేవా! నీవు దీనబంధువుఁడవు. నేను దీనుఁడను. ఇఁక మనకు బాంధవ్యము కలదని వేఱే చెప్పనక్కఱలేదు గదా కాఁబట్టి నా తప్పులన్నియు మన్నించి తప్పక నన్ను నీవే కరుణించి రక్షించవలసి యున్నది. ఇదియే గదా బంధువుల పద్ధతి.

అ. శ్రుత్యాద్యుల్లంఘనరూపేణ మదాజ్ఞాభంగే నాపరాధినం త్వాం

కథం రక్షేయ మహా మితిచే ద్బంధుత్వా న్మ మాపరాధ స్సోఢవ్య ఇతి శదత్ర బంధుతా ముపపాదయతి.

వ్యా. ప్రభుస్త్వమితి. హేపశుపతే త్వం ప్రభుః దీనభావనివర్తన సమర్థః అతఏవ దీనానాం పరమబంధుఃఖలుఆపన్నివర్తకః ఖల్వితి ప్రసిద్ధౌ తేషాందీనానామహంప్రముఖ్యః అగ్రగణ్యః ఏవంచసతి అనయోరావయో రపి బంధుత్వమస్తీతి కిముత వక్తవ్యంకిం హేశివ ఆనందరూప సకలాస్వప్యే మదపరాధాః అక్షోల్లంఘనరూపాణి త్వదనిష్టాచరణా న్యాగాంసి త్వంత వ్యాః క్షమితుం యోగ్యాః మదవనం మద్రక్షణం ప్రయత్నాదుద్యమరూప మనోవ్యాపారాత్కర్తవ్యం కర్తుం యోగ్యం ఇయం ఇయమేవ బంధుసరణిః బంధూనాం పంథాః అతో బంధుత్వాద్ధేతోః మదపరాధం సర్వం సోఢ్వా త్వయాఽహం పంరక్షణీయ ఇతి భావః.

ఈశ్వరుఁడు తన్నుపేక్షించు నేమోనని యట్లు కాకుండఁ జెప్పు చున్నారు.—

ఉపేక్షా నో చే త్కింన హరసి భవద్ధ్యానవిముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్,
శిరస్తద్వై ధాత్రం ననఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కరనఖముఖే నైవ లులితమ్. 15

టీ. పశుపతే = సర్వలోకాధీశ్వరా, ఉపేక్షానోచేత్ = (నన్ను రక్షించుటయందు నీ కుపేక్షకలదేమో) ఆట్లుపేక్ష లేనిచో, దురాశాభూయిష్ఠాం = దుష్టములైన తలంపులతో నిండినదియు, భవద్ధ్యానవిముఖాం = నీధ్యానమునుండి పరాఙ్ముఖమైనదియు, విధిలిపిం = (నాముఖమునిూఁది) బ్రహ్మవ్రాఁతను, కింనహరసి = ఎందుకు తుడిచివేయవు, భవాన్ = నీవు, అశక్తోయది = అశక్తుఁడవేని, ననఖలు = గోటితోఁద్రుంచ నలవిగాని, తత్ = ఆ, సువృత్తం = మిక్కిలి దృఢమైన, వైధాత్రం = బ్రహ్మ సంబంధమైన, శిరః = ఐదవ శిరస్సును, నిర్యత్నం = ప్రయత్నమక్కఱ

లేకుండ, కరనఖముఖేనైవ=చేతిగోటికొనచేతనే, కథంవా=ఎట్లు, లులితం = త్రుంచివేయఁబడినది ?

తా. సాంబశివా ! దురిచ్ఛలను నిన్ను ధ్యానించుటయందు దాసశక్తి లేమికిని సూచకముగా నానుదుట బ్రహ్మ వ్రాసిన వ్రాత నుపేక్షించక తుడిచివేయుము. నాచేతఁగాదని తప్పించుకొనుటకు వీలుగాదు. అబ్రహ్మ దేవుని యైదవతలను గోటితోనే త్రుంచితివి గదా.

అ. స్వస్మిన్ ఈశ్వర స్యోపేక్షా మా శంక్య తత్పరిహారాయాహ—

వ్యా. ఉపేక్షేతి. హేపశుపతే మదపనే త వోపేక్షా భవతీతి ప్రత్యే మి ఏవంనో చేత్ దురాశాభూయిష్ఠాం దుష్టేషు విషయేషు ఆశా ఇచ్ఛా తయా భూయిష్ఠాం త్వచ్చరణాంతదభివ్యంజికామితిభావః. అత ఏవభవద్ధ్యా నవిముఖాం భవతో ధ్యానం విజాతీయ ప్రత్యయానంతరితసజాతీయ ప్రత్య య ప్రవాహః తస్మాద్విముఖాంతదనభివ్యంజికామితిభావః, విధిలిపిం బ్రహ్మ ణఃలిపం రేఖారూపాంలలాటలిపింకిమితి నహరసి నమార్జయసి తత్రాహ మశక్త ఇతి యదిబ్రూషేయు తే భవాన్ తత్ప్రసిద్ధం నవఖలున ఖేనలవితుంఛేత్తుం యోగ్యంనఖలు తిన్న భవతీతి ననఖలు తత్వాంనుతియిత్యైత్రాహ— నువృత్తం నుతరాంవృత్తమత్ దృఢస్థితమత్ వైధాత్రం విధాతృసంబంధి శిరః పంచ మము త్తమాంగం నిర్యత్నం యథాభవతి తథా త్వయా కరనఖముఖేనైవహా స నఖాగ్రైనైవ కథంవా లులితం కేన ప్రకారేణ ఛిన్నం సర్వకర్తవ్యసమర్థ త్వాన్నదుపేక్షాపరిహారణీయేతి భావః. వాశబ్దః ప్రశ్నే.

భక్తుఁడు దీనసంరక్షకుఁడ వగుశివకటాక్షమునకుఁ బాత్రుఁ డగుటకుఁ గా బ్రహ్మదేవుఁడు వానినుదుట దైన్యరేఖలు వ్రాయుచున్నాఁడు. పాప మాతని యైదవతలఁ ద్రుంచినాఁడవు. కానిమ్ము దానితోపాటు తక్కిన నాలుఁగుతలలను మాత్రము ఛేదింపకుము. ఇంక దీర్ఘాయుష్మంతునిగా నుండ నిమ్మని వేఁడుకొను చున్నారు.

విరించి ర్దీర్ఘాయు ర్భవతు భవతా తత్పరశిర

శ్చతుష్కం సంరక్ష్యం స ఖలు భువి దైన్యం లిఖితవాన్,

విచారః కో వా మాం విశదకృపయా పాతి శివ తే
కటాక్షవ్యాపార స్స్వయ మపి చ దీనావనపరః. 16

టీ. విశద = నిర్మలస్వరూపుఁడవైన, శివ = ఓశివుఁడా, విరించిః = బ్రహ్మదేవుఁడు, దీర్ఘాయుః = చిరకాలజీవి, భవతు = అగుఁగాక, భవతా = నీచేత, తత్పరశిరశ్ఛతుష్కం = ఐదవదిగాక తక్కినవానినాలుగు తలలు, సంరక్ష్యం = రక్షింపఁదగినది, సః = ఆబ్రహ్మ, భువి = భూలోకమందు, దైన్యం = దీనభావమును, లిఖితవాన్ ఖలు = (లలాటమున) వ్రాసెను గదా, దీనావనపరః = దీనరక్షణమందు దాసక్తి గల, తే = నీయొక్క, కటాక్షవ్యాపారః = కటాక్షప్రసారము, స్వయమపి = తనంతటతానే, కృపయా = దయతో, పాతి = రక్షించుచున్నది, విచారః = (దైన్యమును వ్రాయుటవలని) విచారము, కోవా = ఏ మున్నది. (ఏమియు లే దనుట).

తా. ఓసదాశివా! బ్రహ్మదేవుఁడు మాలలాటమందు దైన్యము వ్రాయుచున్నాఁడు. అది మా కుపకారముగా నున్నదిగాని విచారకరముకాదు కాఁబట్టియే కదా దీనపోషకమగు మీకటాక్షమునకుఁ బాత్రులమగుచున్నాము అయనదేమో అయిపోయినది. పోనిమ్ము. ఇంక నాతనినాల్గు తలలు మాత్రము ఛేదింపకుము. ఆ బ్రహ్మదేవుఁడు దీర్ఘాయుష్మంతుఁడై యుండుఁ గాక.

అ. భక్తస్యదీనసంరక్షణ తత్పరమశివకటాక్ష విషయతాయాః స్వంపాదనేన పరమోపకారకేదైన్యలేఖనే అధికృతస్య బ్రహ్మణః పంచమశిరశ్ఛేదనప్రసక్తతదన్యశిరశ్చతుష్కచ్ఛేదనాకరణఁతత్ప్రియుక్తదీర్ఘాయుష్యం చ ప్రార్థయతే—

వ్యా. పద్యస్య పూర్వదళేన దైన్యలేఖనస్య విచారహేతుత్వాద్యుక్తోపకారకత్వం కథ మితిచే దుత్తరదళేన తద్విశదీకరోతి. విరించిరితి. హే విశద నిర్మలస్వరూప శివ ఆనందరూప విరించిః విధాతా దీర్ఘాయుః దీర్ఘజీవీ భవతు అస్తు భవతా త్వయా తత్పరశిరశ్చతుష్కం తస్మాత్పంచమ

శిరసోఽన్యత్ శిరసాంచతుష్కంసంరక్ష్యం పంచమశిరోవస్మాస్మచ్ఛిద్యేతే తిభావః. ప్రార్థనాకుతఇతిచేత్తత్రాహ—సః బ్రహ్మాభువిభూమౌలోకేదైన్యందీనభావంలిఖితవాన్ ఖలులలాటేలిలేఖ ఖల్వితి ప్రసిద్ధా యస్మాదేవం తస్మాత్ప్రార్థనాయుక్తేతిభావః తద్దైన్యలేఖనస్యతన్మంగళ ప్రార్థనాహేతుత్వంకథమితిచేద్యస్మా ద్దీనావనపరః తేతవకటాక్షవ్యాపారఃమాంపాతిరక్షతితస్మాన్మంగళప్రార్థనాహేతుత్వమితిభావః. ఏవంచసతి దైన్యలేఖనస్య విచార హేతుత్వమపినాస్తీలాభహేతుత్వాదితిభావః. త్వమివతవకటాక్షవ్యాపారోఽపి స్వయమపిమాంపాతీతిహేతోః దైన్యలేఖనప్రయుక్తవిచారో నకర్తవ్య ఇతి భావః.

దేవా నీపాదారవింద దర్శనము గానిదే యెదురుగా నీకటాక్షప్రసారము నాపైఁ గలుగ నేరదు. అదియును ప్రతిబంధక సామగ్రివలన దుర్లభముగా నున్నదని చెప్పుచున్నారు :—

ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయివిభో
ప్రసన్నేఽపి స్వామిన్ భవదమలపాదాబ్జయుగళమ్,
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణి ర్నిజకనకమాణిక్యమకుటైః. 17

టీ. విభో = ఓసర్వవ్యాపకుఁడవైన, స్వామిన్ = పరమేశ్వరా, మమ = నాయొక్క, పుణ్యానాం=సుకృతములయొక్క, ఫలాద్వా = ఫలమువలననో, మయి = నాయందు, కరుణయావా = దయచేతనో, త్వయి = నీవు, ప్రసన్నేఽపి = ప్రసన్నుఁడవైన, భవదమలపాదాబ్జయుగళం = నిర్మలమైన నీపాదపద్మములను, కథం = ఎట్లు, పశ్యేయం = చూతును, నమస్సంభ్రమజుషాం = నమస్కారముచేయుటయందు తొందరపడుచున్న, నిలింపానాం = దేవతలయొక్క, శ్రేణిః = గుంపు, నిజకనకమాణిక్యమకుటైః=తమతమ రత్నాలు చెక్కిన బంగారు కిరీటములతో, మాం = నన్ను, స్థగయతి = అడ్డగించుచున్నది.

తా. సర్వవ్యాపకుండవైన ఓస్వామీ! నాపుణ్యములవలననో నీదయ చేతనో నీవనుగ్రహించిన ననుగ్రహింతువుగాని పాదదర్శన మగుటయెట్లు? దేవతలందఱును గుంపులు గుంపులుగాగూడి నేను నేను నేనని నమస్కరించుటకు సంతోషముతో తొందరపడుచు వారిరత్నాల కిరీటముల మీపాదముల యందు మోపుచు నా కడ్డమగుచున్నారు.

అ. త్వత్కటాక్షపతనమాభిముఖ్యేన వినా త్వత్పాదారవిందదర్శనం న ఘటిష్యతే తచ్చ దర్శనం విఘటకసామగ్రీబలాద్దుర్లభమిత్యాహ :—

వ్యా. ఫలాద్వేతి. హేవిభో హేసర్వవ్యాపకమమేత్యధ్యాహారః. పుణ్యానాంసుకృతానాంఫలాద్వాకరుణయావాకృపయావా హేస్వామిన్ సకలదేవతాసార్వభౌమ మయి మయివిషయే త్వయి భవతి ప్రసన్నేసత్యపి ప్రీత్యత్యతఃప్రసాదాభిముఖేసత్యపి భవదమలపాదాబ్జయుగళం భవతః తవ అమలంస్వచ్ఛంశుద్ధసత్త్వరూపమిత్యర్థః. పాదాబ్జేపాదావబ్జే ఇవేత్యుపమిత సమాసః. తయోర్యుగళం ద్వంద్వం త్వచ్చరణారవిందయుగళమిత్యర్థః. అహంకథపశ్యేయమీక్షేయం నమస్సంభ్రమజుషాంనమసి నమస్కారే సంభ్రమః ఐదంపర్యంతజ్జుషాం తద్భాజాం నిలింపానాం సురాణాంశ్రేణిః పరంపరా నిజకనక మాణిక్యమకుటైఃమాణిక్యైః రత్నవిశేషైః ఖచితా నీతి మధ్యమ పదలోపః కనకాని కనకవికారాణిచతాని మాణిక్య ఖచితానిచ నిజాని స్వకీయానిచ తాని కనకమాణిక్య మకుటానిచ నిజకనకమాణిక్య మకుటాని తైః మాం స్థగయత్యంతర్హితం కరోతి హేదేవ మమతవసాక్షాత్కారః కథం భవేత్.

మోక్షదాయకుఁ డగు నొక్క పరశివునుండియే హృదయగ్రంథి వీడ వలయు నని కోరుచున్నారు :—

త్వ మేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
వహంత స్త్వన్మూలాం పున రపి భజంతే హరిముఖాః,
కియ ద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా. 18

టీ. హేశివ= సుఖస్వరూపుఁడవైన యీశ్వరుఁడా, లోకానాం = జనులకు, పరమఫలదః = మోక్షఫలము నిచ్చువాఁడవు, త్వం = నీవు, ఏకః = ఒక్కఁడవే, హరిముఖాః = విష్ణువు మొదలగువారు, త్వన్మూలాం = నీవే కారణముగాఁ గలిగిన (నీవొసంగిన), దివ్యపదవీం = వైకుంఠము మొదలగు దివ్యస్థానమును, వహంతః = పొందుచున్నవారై, పునరపి = మరల (ఉత్తమఫలప్రాప్తికై), భజంతే = (నిన్నే) సేవించుచున్నారు, తవ = నీయొక్క, దాక్షిణ్యం = భక్తాభిప్రాయానుసరణము, కియద్వా = ఎంత పరిమాణముకలది ? (పరిమితిలేనిదనుట), మదాశాచ=నాయొక్క, ఆశయు, కియతీ = ఎంతటిది ? (ఇంతయని యెఱుఁగననుట), మద్రక్షాం-ముత్ = అహంకారమునుండి, రక్షాం = నాసంరక్షణమును, కరుణాపూరితదృశా = సంపూర్ణకటాక్ష వీక్షణముతో, కదా = ఎన్నఁడు, వహసి = చేయుదువు.

తా. ఆనందస్వరూపుండవైన ఓమహాదేవా, మోక్షమిచ్చు మహానుభావుఁడవు నీవొక్కఁడవే. విష్ణ్వాదులు నీదయచేతనే వైకుంఠ వాసులైరి. అయ్యును తనివి నొందక నీవలన నున్నత పదవులను గోరుచుండుదురు. ఆహా భక్తులమీఁద నీకెంతదయ? నాయాశ యెంత యని చెప్పుదు. సాంబశివా సంపూర్ణకటాక్షము గలిగి అహంభావమును బాపి నన్ను రక్షించుము.

అ. ఏకస్మాన్మోక్షప్రదా త్పరమశివా దాత్మనః హృదయగ్రంథి నివృత్తిం ప్రార్థయతే —

వ్యా. త్వమితి. హేశివ సుఖస్వరూప లోకానాం జనానాం పరమఫలదః. పరమం అభ్యర్హితం త్రిభ్యః పురుషార్థేభ్యోఽభ్యర్హితంఫలంసాలోక్యాదికమిత్యర్థః. తద్దదాతీతి పరమఫలదః తాదృశ స్త్వమేకఃకుత ఇతిచేత్ హరిముఖాః హరిఃవిష్ణుః సఏవ ముఖం ప్రథమఃయేషాం తే దేవాః త్వన్మూలాం త్వమేవమూలంకారణం యస్యాస్సాతాం దివ్యపదవీం అనుమానుషం వైకుంఠాదిస్థానంవహంతః ప్రాప్నువంతస్సంత స్తత్రతృప్తిమలబ్ధ్వాతతోఽభ్యర్హితఫలప్రాప్తయేత్వామేవ భజంతేసేవంతే యతఃతస్మాదిత్యర్థః. తవ తే దాక్షి

ణ్యం భక్తాభిప్రాయానువర్తనం కియత్ కిం ప్రమాణం ప్రమాణశూన్యమిత్యర్థః. మదాశాచ మమాపేక్షా కియతీ కియత్పరిమాణా ఏతావదితి నజాన ఇతిభావః. మత్ ఆహంకారాత్ రక్షాం మామికాం రక్షాం కరుణాపూరితదృశా పూర్ణకటాక్షవీక్షణేన కదావహసి కరోషి ధాతూనామనేకార్థత్వాత్ స్వహా భావః కృతార్థత్వం వక్తుముచితం మమహృదయగ్రంథిం ఛింధీతి ముఖ్యభావః.

తన్ను భజించువాఁడని యీశ్వరుఁడు బ్రహ్మకొనర్చిన యుపకృతిం బరికించి యీశ్వరభజన చేయుటచేఁ దాము కృతార్థులమైతి మని నిశ్చయించుచున్నారు:—

దురాశాభూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే
దురంతే సంసారే దురితనిలయే దుఃఖజనకే,
మదాయాసం కిం న వ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతిశ్చేత్తవ శివ కృతార్థాః ఖలువయమ్.

టీ. దురాశాభూయిష్ఠే=దుష్టవిషయములయందలి యాశచే మిక్కుటమైనదియు, దురధిపగృహద్వారఘటకే=దుష్టప్రభువుల మందిరద్వారములకుఁ జేర్చునదియు, దురంతే = దురవసానముగలదియు, దురితనిలయే = పాపముల కునికిపట్టును, దుఃఖజనకే=దుఃఖహేతువునైన, సంసారే=జననమరణప్రవాహరూపమైన సంసారమందు, మదాయాసం=నాపరిశ్రమమును, కస్య=బ్రహ్మదేవునియొక్క, ఉపకృతయే = ఉపకారముకొఱకు, నవ్యపనయసికిం=పోఁగొట్టకుంటివాయేమి? వద = చెప్పుము, ఇయం=ఈ (భక్తుల యుపకారమును గుఱించిన), ప్రీతిః=ప్రేమ, తవ=నీకు, చేత్=కలిగియున్నచో, వయమపి=(నిన్నుభజించుచున్నవారమైన) మేమును, కృతార్థాఃఖలు= కృతార్థులమే గదా.

తా. మృత్యుంజయా! దురాశలచేత దుష్టప్రభువుల గృహద్వారములయందుఁ బడి కొట్టుకొనుచు పలుదుఃఖముల పాలుగావలసిన తుదిలేని సంసారమందలి నాపరిశ్రమల నేల నశింపఁజేయవు? నీ భక్తుఁడనగా నున్న

బ్రహ్మదేవుని మీఁదనె వాత్సల్యముచేత నాచేతి చేఁతలు నీ కుపకారము లగుచుండఁ గా బోలు. సరే నేను నీ కుపకారముగ నుండుట కోరుదును మరేమి లోపము? నిన్ను భజించి నేను కృతార్థుఁడ నగుదుఁ గదా.

అ. పూర్వశ్లోకే పద్యేషువిషయసుఖేష్వా హం భజనం ప్రవిశత్య భక్తిం భజమానా యద్బ్రహ్మణే ఉపకారేణ క్రియమాణా ముపకృతిం పర్యాలోచ్య భజమాన స్యాప్యాకృతార్థతాం నిశ్చినోతి:—

వ్యా. మరాళేతి. మరాళ్యాభూయిష్ఠే నిందితవిషయేషు ఆశాప్ర స్పృష్టితయా భూయిష్ఠే బహులే అపి దుర్ధనగృహద్వార ఘటకే దుర్ధనాః దుష్టనృపతయః తేషాం గృహాణి మందిరాణి తేషాం ద్వారాణి ప్రవేశ మార్గాః తాని ఘటయతీతి తద్ఘటకః తస్మిన్ దురంతే దుర్గతిః అంతః అవసానం యస్యతస్మిన్ దురితానిలయే దురితానాం పాపానాం నిలయే స్థానే అతఏవ దుఃఖోత్పాదకే సంసారే జననమరణాది ప్రవాహరూపే మదాయాసం మమపరిభ్రమణరూపం ప్రయత్నం త్వద్విధేయస్య బ్రహ్మణః ఉపకృతయే తచ్చికీర్షితానుల్లంఘనరూపాయై న వ్యపనయసి కిం నాపనుదసికిం కిమితి ప్రశ్నే, వద బ్రూహి ఇష్టమేవేతి చేత్తత్రాహ—ఇయం భక్త్యోప కరణవిషయికాప్రీతిః శ్రీమన్ హేశివ తవ సిద్ధాచేత్ భజమానాః వయముపకృతార్థాః లబ్ధప్రయోజనాః భవిష్యామః ఖల్వితినిశ్చయం ఏక త్వే వివక్షితేఽప్యస్మదోర్ద్వయోశ్చేతి వికల్పేన బహువచనే మహంకృతా ర్థో భవిష్యామీతి పర్యవసితోఽర్థః.

ఇట్టీశ్వర ప్రీతిని గోరికొని యిఁకఁ జాంచల్యము దొలఁగించి నా చిత్తమును నీ యధీనము జేయుమని వేఁడుకొనుచున్నారు.—

సదా మోహాటవ్యా చరతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝుడితి స్వైర మభితః,
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో. 20

టీ. కపాలిన్=బ్రహ్మకపాలము ధరించినవాఁడవును, విభో = సర్వవ్యాపకుఁడవును, శివ=ఆనందస్వరూపుఁడవును, భిక్షో=ఆదిభిక్షుఁడవునగునో దేవా, సదా=ఎల్లప్పుడును, మోహాటవ్యాం = సంసారవాంఛయను మహారణ్యమందు, చరతి=సంచరించుచున్నది, యువతీనాం = జవ్వనులయొక్క, కుచగిరౌ= స్తనములనియెడు పర్వతమందు, నటతి=ఆటలాడుచున్నది, ఆశాశాఖాసు=దారపుత్త్రాదులయందలి ప్రేమయను కొమ్మలయందు, అటతి = దుముకులాడుచున్నది, ఝుడితి=శీఘ్రముగా, అభితః=నలువంకలను, అటతి = తిరుగులిడుచున్నది, అత్యంతచపలం = మిక్కిలి చంచలమైన, మే=నాయొక్క, హృదయకపిం = మనస్సనియెడు కోఁతిని, దృఢం = గట్టిగా, భక్త్యా=భక్తియనెడు త్రాటితో, బద్ధ్వా=కట్టి, భవదధీనం = నీ వశముగా, కురు=చేసికొనుము.

తా. కోఁతివలె సంసారారణ్యమందు చంచలముగాఁ దిరుగుచున్న నా చిత్తమును భక్తి యను గట్టిత్రాటితో బిగియఁగట్టి నీ స్వాధీనపఱచుకొనుము. నాచిత్తమునకు త్వదేకశరణమైన భక్తి ననుగ్రహింపు మని భావము.

అ. ఏవ మీశ్వరప్రీతిం సంప్రార్థ్య మమ చిత్తచాచల్యం పరిహృత్య మచ్చిత్తం త్వదధీనం కురుష్వేతి ప్రార్థయ న్నాహ:—

వ్యా. సదామోహేతి. భోవిభోసర్వవ్యాపక భోశివ సుఖస్వరూప. భోకపాలిన్ కపాలమస్యాస్తీతి తస్యసంబుద్ధిః భోభిక్షో హృదయకపిః సదాసర్వదా మోహాటవ్యాంమోహః సంసారేచ్ఛా సఏవాటవీ అరణ్యం. తస్యాంచరతిసంచరతియువతీనాం నారీణాంకుచగిరౌ స్తనపర్వతే కుచావేవ గిరిః తస్మిన్ నటతినృత్యంకరోతి ఆశాశాఖాసు ఆశాఏవపుత్రదారాదిషు ప్రేమాణః తా ఏవశాఖాః విటపాః తాస్వటతి సంచరతి ఝుడితి శీఘ్రం అభితః ఇతస్తతః స్వైరం స్వేచ్ఛావిహారం యథాతథా అటతి సంచరతి అత్యంతంచపలమతిచపలం మే మమ హృదయకపిం హృదయమేవ కపిరితి రూపకం తం చిత్తవానరం దృఢం నితాంతం భక్త్యాఖ్యయా రజ్జ్వాబద్ధ్వా

చేష్టారహితం కృత్వా భవదధీనం త్వద్వశం కురు కురుష్వ సంసారనిమగ్నం మచ్చిత్తం సదాత్వదేకశరణం కుర్వితి తాత్పర్యమ్.

ఇట్లు మనస్సు నీశ్వరాయత్తముజేసి యింక దానిని కుటీరముగాఁజెప్పి యందు నివసింపు మని యీశ్వరుని వేఁడుకొనుచున్నారు:—

ధృతి స్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివససన్మార్గఘటితామ్,
స్మరారే మచ్చేత స్స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిన్ శక్త్యా సహ శివగణై స్సేవిత విభో. 21

టీ. హేస్మరారే = కాముని కి శత్రువయినవాఁడా, భోస్వామిన్= సకలలోకములను వశపఱచుకొనినవాఁడా, గణైః=స్వరూపమును విమర్శించెడు గణములచేత, సేవిత = ధ్యానింపఁ బడువాఁడా, హేవిభో=ఓ సర్వ వ్యాపకుఁడా, హేశివ = అఖండానంద స్వరూపుఁడవగు పరమేశ్వరా, ధృ .. రాం-ధృతి=ధైర్యమనియెడు, స్తంభ=నిట్రాడు, ఆధారాం=ఆధారము గాఁగలదియు, దృ...ద్ధాం-దృఢ=దృఢమైన, గుణ=త్రిగుణకార్యములగు దేహాదులనియెడు త్రాళ్లతో, నిబద్ధాం = నిలుపఁబడినదియు, సగమనాం= ఎచ్చటికి కావలయునన్నను పోవునదియు, విచిత్రాం = విచిత్ర (వాసనలని యెడు) నానారంగులుగలదియు, పద్మాఢ్యాం=లక్ష్మియు క్తమును, పద్మములు వంటి చిత్తరువులతో నొప్పునదియు, ప్ర...తాం-ప్రతిదివస = ప్రతిదినమందును, సన్మార్గఘటితాం=బ్రహ్మవిచారమందు చేరికగలదియు, రాజమార్గమందమర్పఁ బడినదియు, విశదాం = నిర్మలమైనదియు, మ...టీమ్-మచ్చేతః= నాచిత్తమనియెడు, స్ఫుటపటకుటీం = స్ఫుటమైనడేరాను, ప్రాప్య=పొంది (ప్రవేశించి), శక్త్యాసహ=పార్వతీదేవితోఁగూడ, జయ=సర్వోత్కర్షతో నుండుము.

తా. కామజయము గలిగి సర్వస్వతంత్రుఁడవును సర్వవ్యాపకుఁడవును పరమానంద స్వరూపుఁడవును నగు నోపార్వతీ వల్లభా! నాచిత్త మిత్త

డొక గుడారముగా నున్నది. అదియెట్లన, గుడార మొక నిట్రాటకొయ్యపై నిలచి యుండును, నాచిత్తకుటీరము విషయ సన్న్యాసాధారము పూనియుండు నిట్రాటపై నిలిచియున్నది. గుడారము త్రాళ్లతో బిగియఁగట్టి నిలుపఁబడును. చిత్తమును సత్త్వరజస్తమోగుణములవలన జనించిన దేహాదులతో కట్టఁబడి యున్నది. గుడార మెక్కడకు కావలయునన్నను దీసికొని పోనవచ్చును. చిత్తమిచ్చటచ్చటకుఁ బోవుచుండును గదా! గుడార మనేక రంగులును పద్మములవంటి చిత్రములును గలిగి మంచి మంచి రాజమార్గములయందమ ర్చఁబడియుండును. నాచిత్తము నానావిధములగు జన్మాంతరదుర్వాసనలతోఁ గూడి కరవేయు సంపదను గోరుచున్నది నంతియు బ్రహ్మవిచారమునందు ఘటింపఁబడియున్నది. ఇట్టి నాచిత్తకుటీరమందు శక్తిసమేతుఁడవై నివసించి యుండుము.

అ. ఏవం చిత్తస్యతదధీనతాం సంప్రార్థ్య ఇదానీం చేతసః కుటీత్వని రూపణేన తత్ర తద్వాసం ప్రార్థయతే:—

వా. ధృతిస్తంభేతి. హేస్మరారే కామశత్రో అనేన జితసర్వవిష యత్వం శివస్యనూచ్యతే భోస్వామిన్ వశీకృతసకలభువన గణైస్సేవితగణై స్స్వరూపం విమర్శద్భిః సేవితధ్యాత భో విభో సర్వవ్యాప్యస్థిత భోశివ అఖండానందస్వరూప పరమేశ్వర ధృతిస్తంభాధారాం ధృతిః విషయ నిత్య త్వావధారణంసైవ స్తంభః కుటీస్థిత్యాధారభూత మధ్యప్రదేశస్థదారువిశేషః సఏవ ఆధారం ఆలంబనం యస్యాస్తాం దృఢగుణనిబద్ధాం దృఢైర్బలవద్భిః గుణైః గుణకార్యభూతైః దేహాదిభిః నిబద్ధాం స్థాపితాం అన్యత్ర గుణైః రజ్జుభిః నిబద్ధా మాకృష్య క్లిప్తాం సగమనాం దేశాంతరగమన సహితాం విచిత్రాం వివిధదుర్వాసనా వాసితా మన్యత్ర నానావర్ణాం పద్మాఢ్యాం పద్మయా లక్ష్మీప్రార్థనయా ఆఢ్యాం పూర్ణా మన్యత్ర పద్మాకారచిత్రయు క్తాం ప్రతిదివససన్మార్గఘటితాం ప్రతిదివసం దివసే దివసే సతో బ్రహ్మణః మార్గే అన్వేషణే ఘటితాం యోజితా మన్యత్ర సన్మార్గే రాజమార్గసమీ ప్రదేశే ఘటితాం కల్పితాం విశదాం నిర్మలాం మచ్చేతస్స్ఫటపటకుటీర

మద్వైతమేవ స్ఫుటపటుకుటీ మభివ్యక్తపటగృహం ప్రాప్యానుప్రవిశ్య జయ సర్వోత్కర్షేణావర్తస్వ పంచకోశాతిరేకేణ ప్రకాశస్వేతి భావః. ఆదిమైః పంచభిర్విశేషణైః స్వధర్మసహితం చిత్తస్వరూపం పటకుటీచ ప్రతిపాద్యతే షష్ఠేన విశేషణేన బ్రహ్మాన్వేషణే చిత్తస్య యోజితత్వం విశదమిత్యేత దైకరూప్యేణ చిత్తపటకుట్యో రుభయత్రాస్వేతి. స్మరారే ఇత్యనేన శివస్య జితకామత్వం బోధ్యతే స్వామి న్నిత్యనేన సర్వస్వాతంత్ర్యం విభో ఇత్యనేన వ్యాపకస్వరూపతా శివే త్యనే నానందరూపతా అతో హేతోః పూర్వోక్తప్రకారేణ పరమశివప్రార్థనా యుజ్యతే చిత్తపక్షే సర్వాణి విశేషణాని లింగపరిణామేన యోజనీయాని.

ప్రయత్నపూర్వకముగా బ్రహ్మవిచారణయందుఁ బోనుపఁబడియు దొంగవలె లోభమున ధనాకర్షణాసక్తమైన చిత్తము నోర్వక పట్టి దాని తప్పు పోఁగొట్టుము నీశ్వరుని కప్పగించుచున్నారు:—

ప్రలోభాద్యైరర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే,
ఇమం చేతశ్చోరం కథ మిహ సహే శంకర విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్. 22

టీ. హే తస్కరపతే=దొంగలకు ప్రభువైనవాఁడా, హే శంకర=భక్తులకు సుఖముగలుగఁజేయువాఁడా, హేవిభో=ఓసమర్థప్రభో, ప్రలోభాద్యైః=వశీకరణము మొదలగు నుపాయములచేత, అ...త్రః — అర్థాహరణ=ధనాకర్షణమందు, పరతంత్రః=ఆసక్తిగలవాఁడై, చేతశ్చోరః=చిత్తమనియెడు దొంగ, ధనిగృహే=ధనవంతుని యింటియందు, ప్రవేశోద్యుక్తస్సన్=ప్రవేశింప నుద్యుక్తుఁడగుచు, బహుధా=అనేకవిధములుగా, భ్రమతి=తిరుగుచున్నాఁడు, ఇమం=ఈ, చేతశ్చోరం=చిత్తమనియెడు దొంగను, కథం=ఎట్లుగా, సహే=సహింతును, ఇహ=ఇప్పుడు, తవ, అధీనం, కృత్వా = నీవశము జేసికొని, నిరపరాధే = అపరాధములేనట్టి, మయి=నా యందు, కృపాం=దయను, కురు=చేయుము. (దొంగను పట్టుట పకా్క—

దొంగవలననే నెఱవేఱవలెను. కావున నా చిత్తచోరుని గడిదొంగవగు నీవే పట్టవలెననియు, దొంగ దొంగలజట్టులోనే యుండవలెగాన నీవే యుంచుకొమ్మనియుఁ జిత్రితము. దొంగను మంచిజేసికొనినచో దొంగలభయములేదు.)

తా. లేనిపోని కల్లబొల్లిమాటలు చెప్పి ధనికులచిత్తమును వశపఱచుకొనుట మున్నగాఁ గొన్ని దుష్టోపాయములు పన్ని ధనాకర్షణమునకుఁగా ధనవంతుల యిండ్లఁ దూఱుచు తిరుగులాడుచున్న యీనాచిత్తం బనుచోరుని నే నోర్వలేను. నీ కప్పగించెదను. నీ వశముజేసికొని నిరపరాధి నగునన్ను దయతో రక్షింపుము.

అ. ప్రయత్నవిశేషేణ బ్రహ్మాన్వేషణే ఘటిత మపి చోరవత్ప్రలోభాది నార్థాహరణ పరతంత్రం చిత్త మసహమానః తద్దోషపరిహారాయ తస్యశివాయత్తతాం ప్రార్థయతే:—

వ్యా. ప్రలోభేతి. భో తస్కరపతే తచ్చౌర్యంకుర్వంతీతి తస్కరాః తద్బృహతోరితి సుట్, తల్లోపశ్చ. తేషాం పతిః కర్తవిశేషణేన ప్రవర్తకో నివర్తకశ్చ తాదృశ శంకర భక్తసుఖదాయక భో విభో ప్రలోభాద్యైః ప్రలోభనం ధనికస్య మిథ్యాలాభ ప్రదర్శనేన తస్య మనోవశీకరణం తదేవాద్యం యేషాం తైః దురుపాయైః ధనికే ప్రమత్తే తదర్థగ్రహణాభిప్రాయః, ఋణరూపేణ ధనికదత్తస్యధనస్య ప్రత్యర్పణావసరే తద్దానాపలాపః ఏవమాదయ ఉపాయాః బహువచనే నాకృష్యంతే. అర్థాహరణ పరతంత్రః అర్థం ధనం తస్యాహరణ మాకర్షణం తస్మిన్ పరతంత్రః ఆసక్తః తద్విషయే జాగరూక ఇత్యర్థః. అయం చేతశ్చోరః చేతశ్చిత్తమేవ చోరః తస్కరః సః ధనిగృహే ధన మస్యాస్తీతి ధనీ తస్య గృహం గేహం తస్మిన్ ప్రవేశోద్యుక్తస్సన్ ప్రవేశః అంతర్గృహాగమనం తదర్థ ముద్యుక్తస్సన్ ఉద్యోగీసన్ ప్రయత్నం కుర్వ న్నిత్యర్థః. బహుధా అనేకధా ప్రకారార్థేథాల్. భ్రమతి భ్రామ్యతి ఇమ మేతాదృశపాపగుణవిశిష్టం చేతశ్చోరం చిత్తతస్కరమహా [illegible]ధ్యాహార్యం. కథం సహే తమే ఇహేదానీం తవతే అధీనం స్వవశం.

కృత్వావిధాయ నిరపరాధే నిర్గతః అపరాధః ఆగః యస్మాత్తస్మిన్ మయి మనోభిన్నత్వాత్తస్య నిరపరాధత్వమితి భావః. కృపాం దయాం కురు కురుష్వ.

శివపూజకు ఫలమగు బ్రహ్మత్వ విష్ణుత్వములు గూడ దోషయుక్తములు గాన అవి వలదని నిర్దుష్టమైన మోక్షానందమును గోరుచున్నారు.—

కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫల మితి,
పున శ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథ మిహ సహే శంకర విభో. 23

టీ. హేవిభో = ఓమహాదేవా! త్వత్పూజాం=నీయారాధనమును, కరోమి=చేయుదును, సపది=తత్క్షణమే, భోశంకర=ఓసుఖకరమైన వాఁడా, మే=నాకొఱకు, సుఖదః=నిత్యసుఖము నిచ్చువాఁడవు, భవ=అగుము, తస్యాః=ఆపూజకు, విధిత్వం=బ్రహ్మయగుట, విష్ణుత్వం=విష్ణువగుట, ఫలమితి = ఫలమని, దిశసిఖలు = ఇత్తువుగదా, పునశ్చ=మరలనిటుమీఁదను, దివి=ఆకాశమందును, భువిచ=భూమియందును, త్వాం=నిన్ను, ద్రష్టుం= చూచుటకు, పక్షిమృగతాం = హంసపక్షిరూపముగాని వరాహరూపముగాని, వహన్=ధరించుచు, అదృష్ట్వా=చూడలేక, తత్ఖేదం = పక్షిమృగములుగాఁ బుట్టుటవలని దుఃఖమును, కథం=ఎట్లుగా, సహే=సహింతును, విభో = మహాప్రభో.

తా. ఓసాంబశివా! నిన్నారాధింతును. నాకు పూజాఫలముగా మోక్షానంద మొసంగుము. కాని బ్రహ్మత్వమో విష్ణుత్వమో దానికి ఫలమని మాత్ర మీయవద్దు. అక్కడనుండి హంసగానో పందిగానో బుట్టి నీపాదములను శిరస్సును కనుఁగొనుటకు పదునాలుగు లోకములుందిరిగి శ్రమపడలేను. ఆమీఁద తుదకు నిన్ను కన్గొననేరక క్షుద్రజన్మవలని యవమానమును సహింపనేరను. కాన బ్రహ్మవిష్ణులోకానందములకన్న నధికమైన సాయుజ్యముక్తి యను పరమానందము దయచేయు మని తాత్పర్యము.

అ. విధిత్వ విష్ణుత్వాదిక మపి శివపూజాయాః ఫల దోషదర్శనే నా స్వీకృత్య నిర్దోషం నిత్యసుఖం చ ప్రార్థయతే:—

వ్యా. కరోమీతి. భో విభో అహం తు త్వత్పూజాం తవార్చనాదికం కరోమి సపద్యవిలంబేనైవ భో శంకర మే మహ్యం నిర్దోష నిత్యసుఖప్రదాతా భవ యది తస్యాః పూజాయాః విధాతృత్వం విధాతృత్వం విష్ణుత్వం హరిత్వం వా ఫల మితి మత్వా దిశసి ఫలం దదాసి హి పునశ్చ ఇతర ఉత్తరస్మిన్ కాలే దివి భువి చ త్వాం ద్రష్టుం వీక్షితుం పక్షిమృగతాం పక్షితాం హంసభావం మృగతాం వరాహభావం వా వహన్ ధృత్వా మ దృష్ట్వా తత్ఖేదం తద్దుఃఖం పక్షిభావ మృగభావ ప్రయుక్త మదర్శనకృతం శోకం చ కథం సహే కథం క్షమే పూర్వం కిల హరిబ్రహ్మాణౌ నన్యోన్యోత్కర్ష నిష్కర్ష నిశ్చయేన వివదమానౌ తన్నిర్ణయాయ పరమశివం శరణంగతౌ సంతౌ తదాజ్ఞయా తత్పాదశిరోదర్శనాయ మృగపక్షిభావ మవలంబ్య ప్రవృత్తౌ తవ దర్శనాదుభా వపి పరాభూతా వితి పురాణే ప్రసిద్ధిః. విభో ఇతి పునర్వచన మాదరార్థః.

పైఁ జెప్పిన సాయుజ్యముక్తికి చేరిక సాధనమైన శివసాన్నిధ్యమును గూర్చిన తత్తఱపాటును జూపుచున్నారు.—

కదా వా కైలాసే కనకమణిసౌధే సహ గణై
ర్వసన్ శంభో రగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః,
విభో సాంబ స్వామిన్ పరమశివ పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణ మివ వినేష్యామి సుఖతః.

టీ. కైలాసే = శివనివాసస్థానమగు కైలాసమందు, కనకమణిసౌధే = బంగారు రత్నాలమిద్దమీఁద, గణైస్సహ = ప్రమథగణములతోఁ గూడ, శంభోః = పరమశివునియొక్క, అగ్రే = ముందర, వసన్ = ఉన్నవాఁడనై, స్ఫు...టః — స్ఫుటఘటిత = దృఢముగా కూర్చఁబడిన, మూర్ధాంజలిపుటః = శిరస్సునందలి అంజలిబంధముగలవాఁడనగుచు, భో విభో, భోసాంబ, భోస్వామిన్, భోపరమశివ, పాహి = రక్షింపుము,

ఇతి = ఇట్లు, నిగదన్ = పలుకుచున్నవాఁడనై, సుఖతః=అట్టియానందానుభవమువలన, విధాతౄణాం. కల్పాన్ = అనేక బ్రహ్మకల్పములను, క్షణమివ=నిమేషమాత్రముగా, కదా వా=ఎప్పుడు, వినేష్యామి=గడుపుదునో.

తా. శివస్థానమైన కైలాసమునకుఁ జేరి ప్రమథగణములతోఁ గూడ పరమేశ్వరుని యెదుట హే విభో, హే సాంబ, హే స్వామిన్, హే పరమశివ, పాహి, పాహి యని పలుకుచు సంతోషముతో అనేక బ్రహ్మకల్పములు నిమేషంబులుగాఁ గాలమెప్పుడు కడపుదునో గదా

అ. శుద్ధసాయుజ్యం సంప్రాప్య తదంతరంగ సాధనభూతః సపరిజన సాంబసన్నిధివాసః కదా భవిష్యతీతి కాలవిలంబ మసహమానో౽నుతపతి:—

వ్యా. కదా వేతి. కైలాసే పరమశివనివాసస్థానే తన్నామ్నా ఖ్యాతే కిలేతి చిరంతనప్రసిద్ధ్యా కిలాసః పరమేశ్వరః కిలాస స్యాయం కైలాసః తస్మిన్ కనకమణిసౌధే సువర్ణమణిప్రచురే సుధానిర్మితే సుధయా దగ్ధశర్కరా చూర్ణేన నిర్మిత ఉపరిగృహే గణైస్సహ శంభోరగ్రే పరమశివ పురోభాగే వసన్ వాసం కుర్వన్ స్ఫుటఘటితమూర్ధాంజలిపుటస్సన్ అంజలిః పుట మివాంజలిపుటం మూర్ధ్ని అంజలిపుటం మూర్ధాంజలిపుటం స్ఫుటం వ్యక్తం ఘటితం యోజితం మూర్ధాంజలిపుటం యేన తథా భూతస్సన్ భో విభో భో సాంబ భో స్వామిన్ భో పరమశివ పాహి రక్ష ఇత్యేవం నిగదన్ ఉచ్చైరుచ్చరన్ సుఖతః ఏవం భూతమవస్థాన మహం లబ్ధ్వా నితి సుఖానుభవా ద్ధేతోః విధాతౄణాం బహూనాం బ్రహ్మణాం కల్పాన్ తత్తదవసితసమయాన్ క్షణమివ క్షణకాలమివ కదావా వినేష్యామి యాప యిష్యామి 'వసన్ శంభో మూర్ధ స్ఫుటఘటిత బద్ధాంజలిపుట' ఇతి పాఠే త్వయ మన్వయక్రమః. శంభో ఇత్యస్య సంబుధ్యంతత్వం బోధ్యం. శంభో సుఖజనక భో విభో నానాకారతయా విద్యమాన భో సాంబ అంబయా సహ వర్తత ఇతి సాంబః తస్య సంబుద్ధిః. భో స్వామిన్ సకలాధ్యక్ష భో పరమశివ నిరతిశయానందరూప

అహం కైలాసే గణైః సహ తేషాం భక్త్యాగ్రగణ్యత్వాత్ శివసామీప్య వివాస యోగ్యత్వాచ్చ తత్తుల్య సామీప్య మోక్షానందం ప్రార్థయతీతి పద ప్రయోజనం. పరస్ సర్ పాహీతి నిగదన్ ఉచ్చరన్ సన్ మూర్ధ్ని స్ఫుటఘటిత బద్ధాంజలిపుటః అంజలిః పుటమివ బద్ధం చ తత్ అంజలిపుటం చ మూర్ధ్ని శిరసి స్ఫుటం వ్యక్తం ఘటితం యోజితం బద్ధాంజలిపుటం యేన తథావిధ స్సన్ 'నిమిషమివే'తి పాఠే విధాతౄణాం కల్పాన్ స్థితి సమయాన్ కదా నేష్యామి యాపయిష్యామీత్యన్వయః. 'వినేష్యామీ'తి పాఠే విపూర్వస్య నిఞ్ ధాతోః వినయార్థకత్వేన ప్రకృతానుపయోగాత్ నిమిషమివ నేష్యా మీతి పాఠాంతరం సాధుత్వేన స్వీకృతమ్.

అదియే మఱియొక విధముగాఁ జెప్పుచున్నారు.—

స్తవైర్బ్రహ్మాదీనాం జయజయవచోభి ర్నియమినాం
గణానాం కేళీభి ర్మదకలమహోక్షస్య కకుది,
స్థితం నీలగ్రీవం త్రిణయన ముమాశ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్. 25

టీ. బ్రహ్మాదీనాం = బ్రహ్మ మొదలగువారియొక్క, స్తవైః=స్తోత్రములతోడను, నియమినాం=నియమవంతులగు మహర్షులయొక్క, జయజయ వచోభిః = జయజయధ్వనులతోడను, గణానాం= ప్రమథగణములయొక్క, కేళీభిః=క్రీడలతోడను, మదకలమహోక్షస్య=సంతోషాతిశయమున సొంపుగా నున్న వృషభముయొక్క, కకుది=మూఁపురమునందు, స్థితం = ఉన్నట్టి వాఁడును, నీలగ్రీవం=నల్లనికంఠము గలవాఁడును, త్రిణయనం = మూఁడుకన్నులు గలవాఁడును, ఉమాశ్లిష్టవపుషమ్=పార్వతీదేవిచేత నాలింగనము చేసికొనఁబడిన దేహముగలవాఁడును, కరధృతమృగం = చేతితోఁ బట్టుకొనఁబడిన లేడిగలవాఁడును, ఖండపరశుం=ఖండమైన గండ్రగొడ్డలి గలవాఁడును నగు, త్వాం = నిన్నును, కదా = ఎప్పుడు, పశ్యేయం = చూతును.

తా. స్తోత్రపాఠములతో బ్రహ్మాదులును జయజయధ్వనులతో మహర్షులును ఆటపాటలతో ప్రమథగణంబులుం గొలువ పార్వతీ సమేతుండవై వృషభవాహనముమీఁద వేంచేసియున్న నిసందర్శనము చేయు భాగ్యము నాకెన్నఁడు లభించునో గదా.

అ. ప్రకారాంతరే ణావస్థితం తమేవ స్తౌతి:—

వ్యా. స్తవైరితి. బ్రహ్మాదీనాం బ్రహ్మావాదిర్యేషాం తేషాం సర్వేషాం దేవానా మిత్యర్థః, స్తవైః స్తోత్రైః స్తుతిగ్రంథైః స్తుతం నియమినాం వేదోక్త నియమపరిపాలకానా మృషీణాం జయజయవచోభిః జయజయేతిశబ్దైః ప్రోత్సాహితం గణానాం నంది భృంగి చండీశ్వరాది ప్రమథగణానాం కేళిభిః తౌర్యత్రికాదివిలాసైః ప్రమోదితం మదకల మహోక్షస్య మదేన హర్షాతిశయేన కలః మధురః మహాంశ్చాసౌ వృషా చ మదకలమహోక్షః అచతురేత్యాదినా నిపాతనా దదంతత్వం. తస్య కకుది పిండాకార మాంసోపచితప్రదేశే పృష్ఠస్థాన ఇతి యావత్. స్థిత మాసేదివాంసం నీలగ్రీవం నీలా గ్రీవా కంఠః యస్య తం నీలగ్రీవం త్రిణయనం త్రీణి నయనాని యస్య తమ్ ఉమాశ్లిష్టవపుష మ్ ఉమయా పార్వత్యా ఆశ్లిష్ట మాలింగితం వపుః దేహః యస్య తం కరధృతమృగం కరేణ ధృతః గృహీతః మృగః కురంగః యేన తం ఖండపరశుం ఖండః అర్ధితః పరశుః కుఠారో యస్య తమ్ ఏతాదృశగుణవిశిష్టం త్వా మహం కదా కస్మిన్కాలే పశ్యేయం సాక్షాత్కుర్యాం స్పష్టార్థః.

ఓపరమేశ్వరుఁడ నే నింకొకప్రకారముగాఁ బ్రార్థించుచున్నాను.—

కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్,
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యైర్ముద మనుభవిష్యామి హృదయే.

టీ. హేగిరిశ = పర్వతశాయియగు నోయీశ్వరా, త్వాం=నిన్ను, దృష్ట్వా = చూచి, తవ = నీయొక్క, భవ్యాంఘ్రియుగళం = క్షేమకరమైన పాదములను, హస్తాభ్యాం = చేతులతో, గృహీత్వా = పట్టుకొని, శిరసి = శిరస్సునందును, నయనే = నేత్రమందును, వక్షసి = వక్షస్స్థలమందును, వహన్ = చేర్చుకొనుచున్నవాఁడనై, సమాశ్లిష్య = కౌఁగిలించుకొని, స్ఫుటజలజగంధాన్=వికసించిన పద్మములయొక్క సుగంధమువంటి సుగంధముగల, పరిమళాన్=పరిమళములను, ఆఘ్రాయ = మూర్కొని, బ్రహ్మాద్యైః = బ్రహ్మమొదలగువారిచేత, అలభ్యాం = పొందశక్యముగాని, ముదం=సంతోషమును, హృదయే=హృదయమునందు, కదావా=ఎప్పుడు, అనుభవిష్యామి = అనుభవింతును.

తా. దేవా! నినుఁ జూచి నీపాదములను చేతులతోఁ బట్టి శిరస్సునందును నేత్రములయందును ఱొమ్మునను జేర్చి కౌఁగిలించుకొని యందలిపద్మగంధముల నాఘ్రాణించి బ్రహ్మాదులకును దొరకని యానందము నెప్పుడు పొందుదునో గదా!

అ. తమేవ పరమేశ్వరం భంగ్యంతరేణ ప్రార్థయతే:—

వ్యా. హేగిరిశ గిరౌ శయానత్వాం భవంతం దృష్ట్వా తవ భవ్యాంఘ్రియుగళం క్షేమం కరపాదద్వయం హస్తాభ్యాం గృహీత్వా ధృత్వా శిరసి మూర్ధ్ని నయనే నేత్రే వక్షస్యురసి చ వహన్ సజ్జయ న్నహం సమాశ్లిష్యాలింగ్య స్ఫుటజలజగంధాన్ స్ఫుటాని వికసితాని జలజాని పద్మాని స్ఫుటజలజాని తేషాం గంధఇవ గంధో యేషాం తాన్ పరిమళాన్ విమర్దోత్థగంధానాఘ్రాయ ఘ్రాణేంద్రియే ణానుభూయ బ్రహ్మాద్యైః బ్రహ్మాదిసురైరలబ్ధాంలబ్ధు మశక్యాం ముదం ప్రీతిం హృదయే మనసి కదా కస్మిన్కాలే ఽనుభవిష్యామి తాత్పర్యం స్పష్టమ్.

సర్వసంపూర్ణుఁడగుపరమేశ్వరున కీయవలసిన దొకటియు లేమింజేసి తనమనస్సు నర్పించుచున్నారు.—

కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామరసురభిచింతామణిగణే,
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః.

టీ. హేగిరిశ = పర్వతశాయియగు నో యీశ్వరుఁడా! హేమాద్రౌ = మేరుపర్వతము (బంగారుకొండ), కరస్థే = చేతిలోనుండఁగా, ధనపతౌ = కుబేరుఁడు (ధనపతుఁడు), నికటస్థే = దగ్గఱనుండఁగా, స్వర్భూజ = కల్పవృక్షములయొక్కయు, అమరసురభి = కామధేనువుయొక్కయు, చింతామణి = చింతామణులయొక్కయు, గణే = సమూహము, గృహస్థే = ఇంటిలోనుండఁగా, శీతాంశౌ = చంద్రుఁడు, శిరస్థే = శిరస్సుననుండఁగా, అఖిలశుభే = సమస్తశుభమును, చరణయుగళస్థే = పాదద్వంద్వమందుండఁగా, కం = ఏ, అర్థం = ఇష్టార్థమును, అహం = నేను, దాస్యే = మీకిత్తును, మమ = నాయొక్క, మనః = మనస్సు, భవదర్థం = నీకొఱకు, భవతు = అగుఁగాక.

తా. కైలాసవాసా! మహాదేవా! బంగారుకొండ కోదండముగా నీచేతనున్నది. మహాధనదుండగు కుబేరుండు మిత్రుఁడుగా నీపజ్జ నున్నవాఁడు. కోరినమాత్రముననే యెల్లకోరికల నిచ్చు కల్పవృక్షములు కామధేనువు చింతామణులును నీయధీనములుగా నీయింటనున్నవి. ఆహ్లాదకరుండగు చంద్రుఁడు భూషణంబుగా నీశిరస్సున నున్నవాఁడు. సమస్తశుభంబులును నీపాదములవలనన కలుగుచున్నవి. సాంబశివా! నేనొసంపఁదగిన దొండును గానరాదు గావున నాచిత్తము నర్పించెదఁ జేకొనుము.

అ. వక్ష్యమాణరీత్యా పరమేశ్వరముద్దిశ్యసిద్ధత్వేన హేతునా దాతవ్య వస్త్వనాయోగాత్ స్వమనసః తదధీనతాం ప్రార్థయతే:—

వ్యా. భోగిరీశ శివ హేమాద్రౌ స్వర్ణగిరౌ కరస్థే కరతలస్థే సతి తత్కరస్థత్వంచ మేరుకోదండత్వాదితి భావః. ధనపతౌ రాజరాజే నికటస్థే సమీ

తస్మిన్ సతి సమీపసత్త్వం చ తస్య తత్సఖత్వా దితిభావః. స్వర్భూజామరసురభి చింతామణిగణే స్వర్భూజాః అమరతరవః అమరసురభిః కామధేనుః చింతా మణయః చింతితమాత్రదాయినో మణయః తేషాం గణః సమూహః తస్మిన్ గృహస్థే సతి ఈశ్వర స్యానంతశక్తిత్వా త్తేషాం తద్విధేయత్వేన తద్గృహస్థిత త్వం సంభవతీతి భావః. శీతాంశౌ చంద్రే శిరస్థేసతి శిరసిస్థితే సతి చంద్ర శేఖరత్వ ప్రసిద్ధే రితిభావః. అఖిలశుభే అఖండమంగళే చరణయుగళస్థే సతి పాదద్వంద్వగతే సతి తచ్చరణానాం సర్వమంగళసిద్ధే రితి భావః. పూర్వో క్తేభ్యో హేతుభ్యః కేనాపి వస్తూపచారేణ తవ ప్రయోజనాభావాత్ కంశ్ పృగ్విధమర్థం పదార్థం భవత్తోషకరమహం దాస్యే దాస్యామి అతో హే తో: మమ మనః త్వదర్థం త్వచ్ఛేషం భవతు భూయాత్ సర్వార్థసిద్ధత్వే నేతరానపేక్షణా ద్ధేతోః తవ క ర్తవ్య ముపచార మపశ్య న్నహం కేవలం మనస స్త్వయియ త్తతాం ప్రార్థయా మీతిభావః.

ఉదాహరింపంబోవు హేతువులవలన నట్టిఫలంబులు చేకూఱుటం బట్టి తాను ధన్యుఁడనైతి ననుకొనుచున్నారు.—

సారూప్యం తవ పూజనే శివ మహా దేవేతి సంకీ ర్తనే
సామీప్యం శివభ క్తిధుర్యజనతాసాంగత్యసంభాషణే,
సా లోక్యం చ చరాచరాత్మకతనుధ్యానే భవానీపతే
సాయుజ్యంమమసిద్ధమత్రభవతిస్వామిన్కృతార్థోఽస్మ్యహమ్.

టీ. భోస్వామిన్=ఓసర్వాధ్యక్షుఁడా! తవ=నీయొక్క, పూజనే= పూజచేసినప్పుడు, సారూప్యం = సమానరూపము బొందుటయు, శివమహాదే వేతి సంకీర్తనే=హేశివా! హేమహాదేవా! అని యిట్లు కీర్తించినప్పుడు, సా మీప్యం=సమీపమందుండుటయు, శివ...ణే-శివభక్తి ధుర్య=ఈశ్వరభక్తి యనుభారమును వహించుచున్న, జనతా=జనసమూహముయొక్క,సాంగత్య సంభాషణే = సహవాసము, సల్లాపమును గలిగినప్పుడు, సాలోక్యం = ఒ క్కలోకమందునికియు, హేభవానీపతే = ఓసాంబమూర్తీ! చ...నే -

చరాచరాత్మక=స్థావర జంగమరూపమైన,తను=మూర్తియొక్క, ధ్యానే= ధ్యానముచేసినప్పుడు, సాయుజ్యం = నీతోడనైక్యమును, మమ = నాకు. అత్ర=ఈజన్మమందు, సిద్ధం భవతి = సిద్ధించుచున్నది. (అతః = కనుక) అహం=నేను, కృతార్థః=ధన్యుఁడను, అస్మి=అగుచున్నాను.

తా. దేవా! నీపూజయందు సారూప్యమును, నీనామసంకీర్తనమందు సామీప్యము, నీభక్తులతోఁ గూడి కథాకాలక్షేపములు చేయుపట్ల సాలోక్యము, చరాచరాత్మకమైన నీమూర్తిధ్యానమందు సాయుజ్యమును గూడ నాకీలోకమందే దయచేయుచుంటివిగాన ధన్యుఁడనైతిని.

అ. వక్ష్యమాణహేతుభి ర్వక్ష్యమాణఫలసిద్ధే రాత్మనా కృతార్థతాం స్మరతి:—

వ్యా. సారూప్యమితి. భో స్వామిన్ సర్వాధ్యక్ష తవపూజనే కృతే సతి సారూప్యం సరూపతాసిద్ధి ర్భవతి భో శివ మహాదేవఇతి దేవసంకీర్తనే కృతేసతి తవ సామీప్యం సమీపవర్తిత్వం సిద్ధం భవతి సాంగత్యం సంగతస్యభావ స్సాంగత్య మేకాధికరణవర్తిత్వం చసంభాషణం సమ్యగాలాపః తయో స్సమాహార స్సాంగత్య సంభాషణం శివేభక్తి శ్శివభక్తాస్స్వవ ధూః భార శ్శివభక్తిధూః తాం వహతీతి శివభక్తిధుర్యా జనానాం సమూహో జనతా సాచ సాచ శివభక్తిధుర్యజనతా తస్యా స్సాంగత్యసంభాషణే కృతేసతి సాలోక్యం సమానో లోకో యస్యస లోక స్తస్యభావ స్సాలోక్యం సమానలోకవర్తిత్వమితి యావత్. తత్సిద్ధం భవతి భోభవానీపతే భవస్యపత్నీ భవానీతి యౌగికార్థో నవివక్షితః, అన్యోన్యాశ్రయదోషప్రసంగాత్, కింతు రూఢ్యా అంబికా అర్థః. తస్యాః పతిః భవానీపతి స్తస్యసంబుద్ధిః భో భవానీపతేతవచరాచరాత్మకతనుధ్యానే స్థావరజంగమలక్షణమూర్తిధ్యానే కృతేస త్య త్రాస్మిన్ జన్మని మమ సహ యుజ్యత ఇతి సయుక్ తస్య భావ స్సాయుజ్యంత చ్చ సిద్ధం భవత్యతోఽహం కృతార్థోఽస్మి కృతః ప్రాప్తః అర్థలాభో యస్యసోఽస్మి భవామి.

వేఱొక తెఱఁగునఁ బ్రార్థించుచున్నారు.—

త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయా
మ్యన్వహం, త్వామీశం శరణం వ్రజామి వచసా త్వా
మేవ యాచే విభో, వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం
దివ్యై శ్చిరం ప్రార్థితాం, శంభో లోకగురో మదీయమన
స స్సౌఖ్యోపదేశం కురు. 29

టీ. హే విభో=ఓ సర్వవ్యాపకుఁడా, పరమం=సర్వోత్కృష్టమైన, త్వత్పాదాంబుజం=నీ పాదపద్మమును, అర్చయామి=పూజించుచున్నాను, అన్వహం=ప్రతిదినమును, త్వాం=నిన్ను, చింతయామి=తలఁచుచున్నాను, ఈశం = జగత్కర్తవగు, త్వాం=నిన్ను, శరణం = జననమరణములనుండి రక్షించు దిక్కుగా, వ్రజామి = పొందుచున్నాను, వచసా=వాక్కుచేత, త్వామేవ = నిన్నే, యాచే = (అభీష్టమును) యాచించుచున్నాను, దివ్యైః=దేవతలచేతను, చిరం=చాలకాలముగా, ప్రార్థితాం=ప్రార్థింపఁబడినదియు, సకరుణాం = ప్రేమతోఁ గూడినదియు, చాక్షుషీం = నేత్రముల సంబంధమైన, వీక్షాం = కటాక్షప్రసారమును, మే = నాకు, దిశ= ఇమ్ము, శంభో=సుఖకరుఁడా, లోకగురో = భక్తలోకమునకు రహస్యార్థములను దెలియఁజేయువాఁడా, మదీయమనసః=నామనస్సునకు, సౌఖ్యోపదేశం=బ్రహ్మోపదేశమును, కురు=చేయుమా.

తా. పార్వతీమనోవల్లభా! నీపాదార్చనము చేయుచుఁ బ్రతిదినము నిన్ను దలంచుచు శరణుబొంది వేఁడుకొనియెద. దయచేసి నిఖిల దేవతా ప్రార్థనీయమైన నీకరుణాకటాక్షమును నాయందు రానిచ్చి జననమరణ క్లేశంబులఁ దొలఁగించుచు బ్రహ్మోపదేశ మొనర్పుము.

అ. పునః ప్రకారాంతరేణ తం ప్రార్థయతే:—

వ్యా. త్వదితి. హే విభో వివిధేన ప్రకారేణ భవతీతి విభు స్తస్య సంబుద్ధిః సకలభువనవ్యాపకేత్యర్థః. పరమం సర్వోత్కృష్టం త్వత్పాదాం

బుజం తవపాదః అంబుజమివే త్యుపమితసమాసః. తదర్చయామి పూజయా మ్యర్చాయాః కాయికత్వా ద్ధస్తాదిభిః పూజయామీతి ఫలితోఽర్థః. అన్వహం దినేదినే త్వా మేతాదృశం భక్తపరాధీనం చింతయామి ధ్యాయా మ్యేవం పూజానంతరధ్యానం కృత్వా సంరక్షణం శరణం యాచతే—ఈశం జగత్కర్తారం త్వాం శరణం జననమరణభయనివారకం వ్రజామి ప్రపద్యే వచసా వాగింద్రియేణ త్వామేవ ఏవకారేణ తదితరేషాం యాచ్ఞాకర్తృత్వం వ్యావర్త్యతే. ఇష్టం ధాతోర్ద్వికర్మకత్వా దిష్టమిత్యధ్యాహార్యం. యాచే ప్రార్థయే తదిష్టం కిమితి చే దాహ—దివ్యై ర్దేవతానమూహైః హేశంభో సుఖజనక లోకగురో లోకానాం భక్తజనానాం గురో రహస్యార్థప్రకాశక మే మహ్యం దివ్యై ర్దివి భవైర్దేవై శ్చిరం చిరకాలాత్ప్రార్థి తాం సకరుణాం కరుణా సహితా మతిప్రీత్యాసహ వర్తత ఇతిసకరుణాం తాం చాక్షుషీం చక్షుస్సంబంధినీం కటాక్షవీక్షణరూపాం దిశ దేహి సుఖమేవ సౌఖ్యం స్వార్థే తద్ధితః. సుఖస్వరూపం బ్రహ్మ తస్యోపదేశం కుర్యాత్మనః బ్రహ్మతాదాత్మ్యబోధనం కు ర్విత్యభిప్రాయః. మదీయమనసః మమసంబంధి మానసస్య సౌఖ్యోపదేశం కురు కురుష్వ విషయసుఖ స్యానిత్యత్వేన దుఃఖోత్తరత్వేన చ తదుపేక్ష్య సౌఖ్యం బ్రహ్మేతి బ్రహ్మపర్యంతానుధావనం కృత మితి ధ్యేయమ్.

ఇప్పుడు నే నున్నస్థితిలో నీశుశ్రూష చేయఁజాల నని యనుచున్నారు.—

వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మతాన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా,
పాత్రే కాంచనగర్భతా స్తి మయి చే ద్బాలేందుచూడామణే
శుశ్రూషాంకరవాణి తే పశుపతే స్వామిం స్త్రిలోకీగురో.—

టీ. హేబాలేందు చూడామణే = ఓచంద్రశేఖరుఁడా! హేపశుపతే = సంసారబంధమోచకుఁడా! హేస్వామిన్ = ఓసర్వశరీరాధ్యక్షా! త్రిలో

కీగురో=మూఁడు లోకములకును రహస్యార్థములను ప్రకటించువాఁడా తే=నీయొక్క, వస్త్రోద్ధూతవిధౌ = వస్త్రోపచారము చేయుటయందు, సహస్రకరతా=సూర్యుఁడగుటయు (వేయికరములుగలుగుట), పుష్పార్చనే=పుష్పోపహారార్పణమందు, విష్ణుతా = విష్ణునగుటయు (వ్యాపకత్వము), గంధే=గంధోపచారమందు, గంధవహాత్మతా = వాయురూపుఁడగుటయు, అన్నపచనే=అన్నము వండుటయందు (హవిరుపచారము చేయుటయందు,) బర్హిర్ముఖాధ్యక్షతా=ఇంద్రుఁడగుటయు (అగ్నిముఖుల కధ్యక్షుఁడగుట), పాత్రే=పాత్రోపచారమందు (అర్ఘ్యవిధి), కాంచనగర్భతా = హిరణ్యగర్భుఁడగుటయు(ధనపూర్ణుఁడగుట), మయి=నాయందు, అస్తిచేత్=ఉన్నయెడల, తే = నీయొక్క, శుశ్రూషాం=సేవను, కరవాణి=చేయఁజాలుదును.

తా. సర్వవ్యాపకా! నీకు వస్త్రోపచారము చేయుటకు వేయిచేతులవాఁడు గావలయు. నీకు పుష్పోపచారము జేయుటకు వ్యాపకుండు గావలయు, నీకు గంధోపచారము చేయుటకు గంధవహుండు గావలయు. వంట చేసి నీకు హవిస్సు నివేదనజేయుట కగ్నిముఖాధ్యక్షుండు గావలయు. నీ కర్ఘ్యపాత్రము సమర్పించుట కాం గర్భశ్రీమంతుఁడు గావలయు. అట్టి సూర్యుండును, విష్ణువును, వాయుదేవుఁడును, దేవేంద్రుఁడును, హిరణ్యగర్భుండును నైననేకాక నీ కుపచారముచేయ నాతరమా?

అ. ఈదృశస్యత నైవంభూతోఽహం శిశ్రూషాం కర్తుం న ప్రభవామీ త్యాహ:—

వ్యా. వస్త్రోద్ధూతేతి. హే బాలేందుచూడామణే చంద్రశేఖర హేపశుపతే పశూనాం సంసారబద్ధానాం పతే బంధవిమోచకస్వామిన్ సర్వశరీరాధ్యక్ష వాన్యతోఽస్తి ద్రష్టేతి శ్రుతేః. త్రిలోకీగురో లోకత్రయస్యాపి గూఢార్థప్రకాశక ప్రథమ తృతీయ సంబుద్ధిభ్యాం తస్యవ్యాపకతా ప్రత్యాయ్యతే. ద్వితీయచతుర్థాభ్యాం పాశవిమోచకత్వం రహస్యార్థబోధకత్వంచ ప్రత్యాయ్యతే. ఏతావన్మహిమ్నస్తవ శిశ్రూషాం తదాకరవాణి విరచయాని కదేతి చేత్ వస్త్రోద్ధూతవిధౌ వస్త్రోపచారవిధానే సహ

ప్రకరతానూర్యతా మయ్యస్తి చేత్ కరసహస్రస్య లోకత్రయవ్యాపకత్వేన వ్యాపకీభూతపరమేశ్వరాచ్ఛాదకత్వం సంభవతి నేతరస్యేత్యభిప్రేత్యాత్మని తత్తాసంభావనం పుష్పార్చనే తదనంతరకర్తవ్యపుష్పోపచారవిధానే విష్ణుతా విష్ణోర్భావః విష్ణుతా వ్యాపకత్వం విష్ణుసదృశవ్యాపకత్వమిత్యర్థః. మయ్యస్తిచేత్ గంధే గంధోపచారే గంధవహత్వతా వాయుస్వరూపతా విలక్షణగంధప్రాపకత్వశక్తేః వాయౌ విద్యమానత్వాత్. తత్తాసంభావనమన్నపచనే పక్వాహవిరుపచారే బర్హిర్ముఖాధ్యక్షతా బర్హిరగ్నిర్ముఖంయేషాం తేషామధ్యక్షః ఇంద్రః తత్తాచ మయ్యస్తి చేత్తవ శుశ్రూషాంతదాకరవాణిపాత్రే పాత్రోపచారే కాంచనగర్భతా హిరణ్యగర్భత్వంబ్రహ్మత్వమర్థపూర్ణత్వం చ మయ్యస్తి చేత్తదా తవ శుశ్రూషాం కరవాణీత్యన్వయః.

పరమేశ్వరునియందున్న లోకోత్తరమైనశక్తిని జూపుచున్నారు.—

నాలం వా పరమోపకారక మిదం త్వేకం పశూనాం పతే<br>
పశ్యన్కుక్షిగతాంశ్చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్,<br>
సర్వామర్త్యపలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం<br>
నిక్షిప్తం గరళం గళేన గిళితం నోద్గీర్ణ మేవ త్వయా. 31

టీ. హేపశూనాంపతే=ఓభూతనాథా! కుక్షిగతాన్ = కడుపులోనున్న, చరాచరగణాన్=స్థావరజంగమసమూహములను, బాహ్యస్థితాన్=వెలుపలనున్నవారలను, రక్షితుం=కాపాడుటకు, పశ్యన్=ఆలోచించుచు, త్వయా=నిచేత, అతిజ్వాలాకరం=మిక్కిలి తాపము కలుగఁజేయునదియు, భీకరం = భయంకరమును నగు, గరళం = కాలకూటవిషము, స...ధం - సర్వామర్త్య = సమస్తదేవతలయొక్కయు, పలాయన = పాఱిపోవుటయనియెడు రోగమునకు, ఔషధం = మందగునట్లుగా, గళే = కంఠమందు, నిక్షిప్తం = నిలుపఁబడినదై, నగిళితం = మ్రింగఁబడలేదు, నోద్గీర్ణమేవ = వెడల నుమియఁబడను లేదు, పరమోపకారకం = మిక్కిలి యుప

కారకమైన, ఇదం ఏకం=ఇదియొక్కటియే, నాలంవా=(నీమహిమ దెలియుటకు) చాలదా.

తా. నిఖిల లోకభయంకరమై సంతాపకరమైన కాలకూటమును భయపడి పాఱిపోవుదేవతల నూఱడించుటకుఁగా నీకంఠమందె యుంచుకొని ఉమియక మ్రింగక కడుపులోని వారలకును వెలుపలివారలకును బాధగలుగకుండ మహోపకార మొనర్చితివి దేవా నీమహిమ యెఱుంగుట కీదృష్టాంత మొక్కఁడు చాలదా!

అ. పరమేశ్వరనిష్ఠసర్వాతిశాయిశక్తిమత్త్వం ప్రదర్శయితుమాహ:—

వ్యా. నేతి. భో పశూనాంపతే ఏవం సంబోధనేన జగతా మవశ్య భరణీయత్వం సూచ్యతే. కుక్షిగతా నుదరస్థితాన్ చరాచరగణాన్ స్థావర జంగమసమూహాన్ బాహ్యస్థితాంశ్చ తా న్రక్షితుం నిర్భయా న్కర్తుం వశ్యన్ పర్యాలోచయ న్నభూ స్త్వ మిత్థం పర్యాలోచ్య త్వయా అతి జ్వాలాకార మత్యంతతాపకరం భీకరం భయజనకం గరళం కాలకూటం సర్వామర్త్యపలాయనౌషధం యథా తథా అమర్త్యాః అమరణధర్మాణః సర్వేదేవాః తేషాం పలాయనమసహనేన దిశి దిశి ధావనం తదేవ రోగః ఏక దేశవర్తిరూపకం తస్యౌషధం నివర్తకం యథా భవతి తథా గళే కంఠే నిక్షిప్తం స్థాపిత మతఏవ నగిళితం నభక్షితం నోద్గీర్ణం చ బహిరోష్ఠేత్సృష్టం నవాంతం చేత్యర్థః. ఏవకారశ్చార్థః. అవ్యయానా మనేకార్థత్వా దేకం వరమోపకారక మతిశయేనానుగ్రాహక మిద మిత్థంకరణం తవ మహిమావ గతయే నాలంవా నపర్యాప్తంవా వా శబ్దః కాకుస్వరసూచకః. తుశబ్దో ఉన్యేషా మీదృశం మహిమానం వారయ తీత్థంకరణ మనితరసాధారణం త్వన్మహిమానం గమయతీతి భావః.

పరమశివుఁడు తీసికొనిన విషమును గూర్చి మూఁడువిధములఁబ్రశ్నించుచున్నారు:—

జ్వాలోగ్ర స్సకలామరాతిభయదః క్ష్వేళః కథం వాత్వయా
దృష్టః కించ కరే ధృతః కరతలే కిం పక్వజంబూఫలమ్,

జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా కంఠదేశే భృతః
కిం తే నీలమణి ర్విభూషణ మయం శంభో మహాత్మన్వద.

టీ. హేమహాత్మన్ = సర్వజ్ఞుఁడవైన యీశ్వరుఁడా! జ్వాలో గ్రః= మంటలచేత సహింపఁగూడనిదియు, స...దః-సకలామర = అందఱు దేవతలకు, అతిభయదః=మిగుల భయంకరమునునగు, క్ష్వేళః= విషము, త్వయా= నీచేత, కథంవా=ఎట్లుగా, దృష్టః=చూడఁబడినది? కించ = అంతియకాక, కరే=హ స్తమందు, ధృతః = ధరించఁబడినది(చేతితోఁ దాఁకఁబడినది)? కరతలే=అఱచేతియందు, నిహితః=ఉంచుకొనఁబడినది? పక్వజంబూ ఫలంకిం= పండిన నేరేడుపండా యేమి? జిహ్వాయాంచ=నాలుకయందును, నిహితః= వేసికొనఁబడినది, సిద్ధఘుటి కావా = సకలసిద్ధికారియగు నౌషధఘుటికయా యేమి? కంఠదేశే=కంఠప్రదేశమందు, భృతః = భరింపఁబడినది. అయం= ఈకాలకూటవిషము, తే=నీకు, విభూషణం = అలంకారమైన, నీలమణిః కిం=ఇంద్రనీలమాణిక్యమా యేమి? వద=చెప్పుము.

తా. తీవ్రజ్వాలలు గ్రమ్ముచు సకలదేవతలకును భయంకరమైన యీ కాలకూటవిషమును కన్నులతో గాంచుటయేకాక చేతితో నెత్తి అఱచేతిలో నుంచుకొంటి విది నేరేడుపండా ఏమి? ఇదిగాక నాలుకమీఁద వేసికొన్నావు. సిద్ధఘుటికయా ఏమి? మఱియును కంఠమందటులనే యుంచుకొంటి విది యింద్రనీలమాణిక్యమా ఏమి ? చెప్పుము.

అ. పరమశివ పరిగృహీతం విషం త్రేధా వికల్ప్య పృచ్ఛతి:—

వా. జ్వాలేతి. భో మహాత్మన్ అపరిచ్ఛిన్నస్వరూప సర్వజ్ఞేతి యావత్. జ్వాలో గ్రః జ్వాలాభి స్సర్వతో వ్యాపినీభిః కీలాభిః వహ్నేర్ద్వయోర్జ్వాలకీలా విత్యమరః. క్ష్వేళస్యాపి వహ్నితుల్యత్వా జ్జ్వాలానాం గౌణ్యావృత్త్యా తద్ధర్మత్వోపపత్తిః. ఉగ్రః అసహ్యః సకలామరాతిభయద స్సకలదేవతాతిభయంకరః క్ష్వేళః త్వయా కథం వా దృష్టః కించ కరేచ ధృతః గృహీతః కరతలే నిహితశ్చ అతః పక్వజంబూఫలం కిం సఏష క్ష్వేళః

జిహ్వాయాం నిహితశ్చ అతః సిద్ధఘుటికా వా, సకలసిద్ధికారిణీ ఘుటికా ఔషధగోలకం వా కంఠదేశే భృతశ్చాతో౽యం తే భూషణం నీలమణిః కిం వద బ్రూహి కింవా శబ్దా సర్వత్ర ప్రశ్నార్థకా. స్పష్టార్థో౽యమ్.

దిగువ నుదాహరింపఁబోవు సాధనములలో నేదేని యొక్క-దానిచేత మోక్షము సులభమగుట నూహించి యితరదేవతానుసరణము విఫల మనుచున్నారు.—

నాలం వా సకృ దేవ దేవ భవత స్సేవా నతి ర్వా నుతిః
పూజా వా స్మరణం కథాశ్రవణమ ప్యాలోకనం మాదృశామ్,
స్వామి న్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కా వా ముక్తిరితః కుతో౽పి భవతి చేత్కిం ప్రార్థనీయం తదా.

టీ. హే స్వామిన్ = సర్వభూతాధ్యక్షుండవైనదేవా! భవతః = నీయొక్క-, నతిర్వా = కాయికమైననమస్కారమేని, నుతిర్వా = వాక్కు-తోడి స్తోత్రమేని, పూజా వా=పూజయేని, స్మరణం=మనసులో స్మరించుటయేని, కథాశ్రవణమపి = చెవులతో నీచరిత్రలు వినుటయేని, ఆలోకనం= కన్నులతో నీమూర్తిఁ జూచుటయేని, సకృదేవ = ఒక్కమాఱుమాత్రమే, భవతః=నీయొక్క-, సేవా=భజనము, మాదృశాం = నావంటివారలకు, నాలంవా=(ముక్తియొసఁగ) చాలదా? ఇతః = ఈపైయుపాయమును విడిచి, ముక్తిః= మోక్షము, కా వా=ఎట్టిది? కుతో౽పి = పైయుపాయములలోనే యొకదానినుండియైనను, భవతి చేత్ = ముక్తిగలుగునేని, తదా = అప్పుడు, అ...న-అస్థిర=శాశ్వతముగాని, దేవతా=దేవతలయొక్క-, అనుసరణాయాసేన=ఆశ్రయించు ప్రయత్నముచేత, కింలభ్యతే = ఏమిలాభమగును, ప్రార్థనీయం=కోరఁదగినదియు, కిం= ఏమున్నది?

తా. ఓస్వామీ! మహాదేవా! కాయిక వాచిక మానసికంబు లగు నమస్కారము, స్తోత్రము, స్మరణము మున్నగు నీసేవలయం దొక్కొ-క్క-టియు మోక్షమునకు సంపూర్ణసాధన మగును. ఈయుపాయములను వీడి వేఱ

మోక్షము లేదు. అస్థిరులయిన యితరదేవతల ననుసరించి యేమిలాభము ? వారిని కోరఁదగిన దేమున్నది ?

అ. వక్ష్యమాణానాం సాధనానా మన్యతమేన ముక్తి స్సులభేతి మత్వాన్యదేవతానుసరణే వైయర్థ్య ముపపాదయతి:—

వ్యా. నాలమితి. హే స్వామిన్ సర్వభూతాధ్యక్షదేవ స్వప్రకాశ స్వరూప భవత స్తవ సకృ త్సేవా ఆవృత్త్యా వినా భజనం కరణత్రయసాధారణమిదం.ఇదమేవ విశిష్యాహ—నతిర్వా నమస్కారో వా ఇదం కాయికం నుతిః స్తోత్రం వా ఇదం సేవనం వాచికం పూజా వా సపర్యావా ఇదం చ సర్వసాధారణం స్మరణం స్మృతిరిదం సేవనం మానసికం కథాశ్రవణ మపి చరిత్రశ్రుతిరపీదం శ్రోత్రమాలోచనం చ దర్శనం చ చాక్షుష మేతద్దేవ ముక్తానా మన్యతమ త్వద్భజనం మాదృశా మస్మద్విధానాం ముక్తిప్రాపణే నాలం వా న పర్యాప్తం వా అంతిమౌ వాశబ్దః కాక్వర్థః. ఆదిమాః వాశబ్దాః వికల్పార్థాః. ఇదమేవ పర్యాప్తమితి పర్యవసితోఽర్థః. ఇతః ఇమ మన్యతమ ముపాయం విహాయ ప్రాప్యాముక్తిః కా వా కీదృశీతి ప్రశ్నార్థే కాకుః నకాపీత్యర్థః. ఉక్తానాం మధ్యే కుతోఽప్యుపాయా న్ముక్తిర్భవతీతిచే త్తదా అస్థిరదేవతానుసరణాయాసేన అస్థిరాః యా దేవతాః ఉపాధ్యభిమానప్రయుక్త మస్థిరత్వం తాసా మనుసరణం భజనం తస్య య ఆయాస స్తదనుకూలప్రయత్నవిశేష స్తేన కిం లభ్యతే తతః ప్రార్థనీయం కిం న కిమపీత్యర్థః. ఉక్తానాం భజనానాం మధ్యే సకృత్కృత మప్యేకమేవ భజనం ముక్తిప్రాపణే పర్యాప్తమితి భావః.

అపరమశివుని తెలిఁగు మతి యేరికిని రా దని చెప్పుచున్నారు.—

కిం బ్రూమ స్తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో భవ
ద్ధైర్యంచేదృశమాత్మనస్థితిరియంచాన్యైః కథంలభ్యతే,
భ్రశ్య ద్దేవగణం త్రస న్మునిగణం నశ్య త్ప్రపంచం లయం
పశ్య న్నిర్భయ ఏకఏవ విహరత్యానందసాంద్రోభవాన్.

టీ. హేపశుపతే=ఓభూతనాథా! హేశంభో=ఓశంకరా, తవ=నీయొక్క, సాహసం=తెగింపు (అసాధ్యసాధనము), కింబ్రూమః=ఏమని చెప్పుదును? ఈదృశం=ఇటువంటి, భవద్ధైర్యం=నీధైర్యము, కస్య=ఎవ్వనికి, అస్తి=కలదు? ఇయం=ఈ(ఇట్టి), ఆత్మనః=తన (నీ) యొక్క, స్థితిశ్చ=ఉనికియును, అన్యైః=ఇతరులచేత, కథం = ఎట్లుగా, లభ్యతే = పొందఁబడును, ఆనందసాంద్రః = ఆనందముతో నిండియున్న, భవాన్=నీవు, భ్రశ్యద్దేవగణం = పడిపోవు దేవతాగణంబును, త్రస్యన్మునిగణం = భయపడుచున్న మునిగణంబును, నశ్యత్ప్రపంచం=మాయమై పోవుచున్న ప్రపంచమునుంగలదియగు, లయం = ప్రళయకాలమును, పశ్యన్ = చూచుచు, నిర్భయః=భయము లేనివాఁడవై, ఏక ఏవ=ఒక్కఁడవే, విహరతి=విహరించుచున్నావు.

తా. ఓపశుపతీ! ఏమి నీసాహసము ? ఏమి ? నీధైర్యము? మఱి యెవ్వరేని యిట్లు నిలిచియుండఁ గలుగుదురా ? వాళోన్ముఖులై దేవతలందఱు నిటునటు పాఱఁజూచుచుండ మునులందఱు గడగడలాడుచు భయకంపితులగుచుండ తుదకు దృశ్యప్రపంచమంతయు నశించిపోవుచుండ నీవొక్కఁడవే గదా నిర్భయుఁడవై పరమానందపరిపూర్ణుఁడవై మహాప్రళయమం దోటులేక విలసిల్లుచుంటివి !

అ. పరమశివస్య స్థితి.రన్యదుర్లభేత్యాహ:—

వ్యా. కిమితి. హే పశుపతే శంభో తవ సాహసం దుర్ఘటకరణం కిం బ్రూమః కిమితి వదామః ఈదృశంవక్ష్యమాణవిషయంధైర్యం నిశ్చయః కస్యాస్తి నకస్యాపీత్యర్థః. ఇయ మాత్మస్థితి శ్చ ఇత్థంభూత మాత్మనోఽవస్థానం చాన్యై స్త్వదితరైః కథం కేన ప్రకారేణ లభ్యతే త్వదితరే తత్ప్రకారానభిజ్ఞా ఇతి భావః. ఆనందసాంద్రః నిబిడానంద స్వరూపః భవాన్ త్వం భ్రశ్య ద్దేవగణం భ్రశ్యన్ స్వస్థానేభ్య శ్చ్యవన్ దేవగణః సురసమూహో యస్మిన్ త్రసన్ మునిగణః బిభ్యన్మునిగణో ఋషిగణో యస్మిన్

నశ్య త్ప్రపంచం ప్రపంచః దృశ్యమాత్రం నశ్యన్ అదర్శనం ప్రాప్నువన్ యస్మిన్ లీయతేఽస్మిన్ సర్వమితి లయః ప్రళయకాలః తంపశ్యన్ సన్ నిర్భయః భయరహితః ఏక ఏవ విహరతీతి యత్ ఇయ మవస్థితిరితి పూర్వేణాన్వయః. యద్యపి మహాప్రళయే నాశ ప్రతియోగిత్వం పరమశివేతరేషాం సర్వేషా మవిశిష్టం తథాపి దేవగణ మునిగణయోర్భ్రంశత్రాస కథనం నాశ పూర్వావస్థా ప్రదర్శనమితి జ్ఞేయం. మహాప్రళయే ప్యవస్థాన ప్రతిపాదనా త్పరమశివస్య నిత్యత్వ మవసీయతే.

‘పరమశివుని గుణంబులన్నియుఁ దెలిసినట్లేకదా! అతఁడు పరమాప్తుఁడని మాత్రము స్మరించుచుండెదను.’ అని ప్రతిజ్ఞ చేయుచున్నారు.—

యోగక్షేమధురంధరస్య సకలశ్రేయఃప్రదోద్యోగినో
దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః,
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శంభోత్వంపరమాంతరంగఇతిమేచిత్తేస్మరామ్యన్వహమ్.

టీ. యో...స్య-యోగ=అలభ్యవస్తువులను లభింపఁ జేయుటయందును, క్షేమ=లబ్ధమైనదానిని పరిపాలించుటయందును, ధురంధరస్య=భారము వహించినట్టియు, సకలశ్రేయః ప్రదోద్యోగినః = సమస్త శుభంబుల నిచ్చెడు నట్టి యుద్యోగము గలిగినట్టియు, దృ...నః-దృష్టాదృష్ట = ఐహికాముష్మికములకు, మత=సమ్మతమైన యుపాయమును, ఉపదేశకృతినః= ఉపదేశించు నేర్పు గలిగినట్టియు, బాహ్యాంతరవ్యాపినః=బాహ్యప్రపంచమందును నిండియున్నట్టియు, సర్వజ్ఞస్య=సర్వజ్ఞుఁడ వైనట్టియు, దయాకరస్య = దయఁజూచునట్టియు, భవతః - నీయొక్క (సంబంధమైనది), మయా=నాచేతను, వేదితవ్యం=తెలియఁదగినదియు, కిం=ఏమియున్నది? త్వం=నీవు, మే=నాకు, పరమాంతరంగః=అత్యంతాప్తుఁడవు, ఇతి=అని, అన్వహం = ప్రతిదినమును, చిత్తే = మనస్సునందు, స్మరామి=తలఁచుచున్నాను

తా. ప్రజలయోగక్షేమభారము వహించుట, సకల శ్రేయస్సుల నొసంగుచుండుట, ఐహికాముష్మికసాధనంబులైన యుపాయముల నుపదేశించుట, ఎక్కడఁ జూచినను తానయై నిండియుండుట, సర్వజ్ఞత్వము, ఎల్లరను దయతోఁ జూచుట, ఇవియన్నియు నీగుణములు గదా! పరమేశ్వరా! మహాదేవా! మహానుభావా! ఇంక నేనేమి తెలిసికొనవలయును? నీవే నాకు పరమాప్తుఁడ వని యెల్లవేళలను దలంతును. అదియే నాకు శ్రేయస్కరమగుఁగాక.

అ. పరమశివస్య గుణాన్ విదిత ప్రాయా న్కృత్వా తస్య పరమాప్తత్వస్మరణం ప్రతిజానీతే:—

వ్యా. యోగక్షేమఇతి. శంభో యోగక్షేమధురంధరస్య ధరతివహతీతి ధరః ధురోధరః ధురంధరః అలబ్ధస్య లాభో యోగః లబ్ధస్య పరిపాలనం క్షేమ స్తయో ర్ధురంధరస్య సకలశ్రేయః ప్రదోద్యోగినః సకలాని చ తాని శ్రేయాంసి చ తాని ప్రదదాతీతి తత్ప్రద స్సచాసా వుద్యోగశ్చ సోఽస్యాస్తీతి సకలశ్రేయఃప్రదోద్యోగీ తస్య దృష్టాదృష్టమతోపదేశకృతినః దృష్ట మైహిక మదృష్ట మాముష్మిక మేతదుభయఫలకత్వే నాభిమతోయ ఉపాయ స్త స్యోపదేశ స్తత్ర్కృతిన స్సమర్థస్య బాహ్యాంతరవ్యాపినః బహి ర్భవాని బాహ్యా న్యంతర్భవా న్యాంతరాణి తాని వ్యాప్నోతీతి వ్యాప్య తిష్ఠతీతి తద్వ్యాపిన స్సర్వజ్ఞస్య సర్వం జానాతీతి సర్వజ్ఞ స్తస్య దయాకరస్య కరోతీతి కరః దయాయాః కరః దయాకర స్తస్య భవతః భవత్సంబంధి మయా వేదితవ్యం జ్ఞాతవ్యం కిం కిమ స్తీతి శేషః. త్వం మే పరమాంతరంగ అత్యంతాప్తః ఇత్యేవ్వహ మనుదిన మహం చిత్తే స్మరామి సర్వదా త్వయి పరమాప్తత్వస్మరణం మమ శ్రేయస్కర మితి భావః.

భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభే సాంబ తవాంఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలమ్,
సత్త్వం మంత్ర ముదీరయ న్నిజశరీరాగారశుద్ధిం వహన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణ మాపాదయన్.

టీ. హేసాంబ=ఓసాంబమూర్తీ! భక్తః=భక్తుఁడనైన నేను, నిజశరీర = స్వకీయశరీరమనునట్టి, అగారశుద్ధిం=గృహముయొక్క పరిశుద్ధిని (దోషములు లేమి), వహన్=సంపాదించుచున్నవాఁడనై, రుచిరం = మనస్సునకింపైన, కల్యాణం=మంగళమనియెడు వివాహమంగళమును, ఆపాదయన్=సంపాదింపఁ బోవుచు, భక్తిగుణావృతే=భక్తియను నూలుపోఁగుల తోఁ జుట్టఁబడినదియు, ముదమృతాపూర్ణే=సంతోషమనునట్టి యుదకములతో నిండింపఁబడినదియు, ప్రసన్నే=స్వచ్ఛమైనదియు నగు, మనఃకుంభే= మనస్సను కలశమందు, తవ=నీయొక్క, అంఘ్రిపల్లవయుగం=పాదంబులను రెండు పల్లవములను, సంవిత్ఫలం=జ్ఞానంబను కొబ్బరిబొండంబును, సంస్థాప్య=ఉనిచి, సత్త్వం=సత్త్వగుణ ప్రధానమైన, మంత్రం = తారకమంత్రమును, ఉదీరయన్ = ఉచ్చరించుచు, పుణ్యాహం = పుణ్యాహవాచనమును, ప్రకటీకరోమి=ప్రకాశింపఁజేయుదును.

తా. ఓం సాంబమూర్తీ! నేను భక్తుండనై నాశరీరం బనుగృహంబును నిర్దుష్టముగా శుద్ధపఱచికొని మనఃప్రియంబగు కల్యాణంబును గావింపఁబూని యందులకుగా భక్తియను నూలుపోఁగులు చుట్టి సంతోషమను జలంబుతో నించిన నామనస్సను కలశంబున నీపాదపల్లవములను, నీజ్ఞానంబను నారికేళఫలంబును జేర్చి కలశస్థాపనముచేసి తారకమంత్రోచ్చారణపూర్వకముగాఁ బుణ్యాహవాచనము నెఱవేర్తును. ఎల్లవేళలను మనస్ఫూర్తిగా మీపాదపద్మములను స్మరించెద నని తాత్పర్యము.

అ. పదార్థరూపకేణ పరమశివం ప్రీణయతి:—

వ్యా. భక్తఇతి. హే సాంబ భక్తః నిజశరీరాగారశుద్ధిం వహన్ అహం నిజం ఆత్మీయం శరీరం తదేవాగారం గృహం తస్య శుద్ధిం దోషశూన్యతాం వహ న్సంపాదయ న్నహం రుచిరం మనః ప్రియం కల్యాణం మంగళంత దేవ వివాహం మంగళ మాపాదయ న్సంపాదయ న్ఛలే శతృప్రత్యయః. కల్యాణఫలక ఇత్యర్థః. తథా భూత స్స న్భక్తిగుణావృతే భక్తిరేవగుణ స్తంతు స్తేనావృతే వేష్టితే ముదమృతాపూర్ణే ము త్సంతోష స్సైవామృత

ముదకం తే నాపూర్ణే వ్యాప్తే ప్రసన్నే స్వచ్ఛే మనః కుంభే మనః మానస మేవ కుంభః కలశ స్తస్మిన్ తవాంఘ్రిపల్లవే కిసలయే తయో ర్యుగం యుగ్మం సంవిత్ఫలం సంవి ద్భవద్జ్ఞానమేవఫలం నారికేళఫలం తచ్చ సం స్థాప్య నిక్షిప్య సత్త్వం సత్త్వగుణప్రధానం మంత్రం తారకమంత్ర ముదీరయన్నుచ్చరన్ పుణ్యాహం పుణ్యాఖ్యాహం కర్మ ప్రకటీ కరోమి ప్రకాశయామి మనసా త్వదంఘ్రియుగళం సదా స్మరామీతి భావః.

విద్వాంసులు వేదసముద్రము తరిచి యంను సారముగా ననుగ్రహింతు రనుచున్నారు.—

ఆమ్నాయాంబుధి మాదరేణసుమనస్సంఘాస్సముద్యన్మనో
మంథానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వా మథిత్వా తతః,
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్య మాతన్వతే.

టీ. సుమనస్సంఘాః=పండితబృందములు (దేవబృందములు), సముద్యత్=గుణసముదాయముతో నొప్పుచున్న, మనః = మనస్సును, దృఢభక్తి రజ్జుసహితం = అచంచలభక్తి యనుత్రాడుతోఁ గూడిన, మంథానం=కవ్వముగా, కృత్వా=చేసి, ఆమ్నాయాంబుధిం = వేదసముద్రమును, ఆదరేణ=ఆసక్తితో, మథిత్వా=తరిచి, తతః=దానివలన, సోమం=చంద్రుని,కల్పతరుం=కల్పవృక్షమును, సుపర్వసురభిం = కామధేనువును, చింతామణిం= చింతామణిని, ధీమతాం=బుద్ధికి సమ్మతమైన, నిత్యానందసుధాం = శాశ్వతానందప్రదమైన యమృతమును, నిరంతరరమాసౌభాగ్యం = అవిచ్ఛిన్న లక్ష్మీ సమృద్ధిని, ధీమతాం=బుద్ధిమంతులకు, కల్పద్రుమం = కల్పవృక్షము వంటివాఁడును, సుపర్వసురభిం = కామధేనువువంటివాఁడును, చింతామణిం=చింతామణివంటివాఁడును, నిత్యానందసుధాం=అమృతమువంటి నిత్యానందస్వరూపుఁడును, నిరంతరరమాసౌభాగ్యం=మోక్షలక్ష్మీ సమృద్ధి రూపుఁడును నగు, సోమం=ఉమాసమేతుఁ డగుపరమేశ్వరుని,ఆతన్వతే=విస్తరించి పొందుచున్నారు.

తా. దేవతలందఱును మందరగిరిని కవ్వముగాఁ జేసి సముద్రము మథించి కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, అమృతము, చంద్రుఁడు వీనిని సంపాదించినట్లు విద్వాంసులందఱు తమమనస్సును కవ్వముగాఁజేసి భక్తి యనుత్రాడు గట్టి వేదంబు లనియెడు మహాసముద్రమును తరిచి యందుండి భక్తిశాలురకు కల్పవృక్ష చింతామణి కామధేనువులవంటివాఁడును నిత్యానందస్వరూపుఁడును మోక్షలక్ష్మీస్వరూపుఁడును నగు సోమేశ్వరుని సాధించుచున్నారు.

అ. విపశ్చిత్సమూహాః ఆమ్నాయసముద్రం మథిత్వా తజ్జన్యఫలభూతం త్వాం లభంత ఇత్యాహ:—

వ్యా. ఆమ్నాయాంబుధిమితి. సుమన స్సంఘాః సుమనసాం విదుషాం సుష్ఠు శాస్త్రాభ్యాససంస్కృతం మనః యేషాం తేషాం విదుషాం సుపర్వాణ స్సుమనస ఇతి కోశమహిమ్నా దేవానామపి సంఘాః సమూహాస్సముద్యత్ గుణసముదాయం ప్రాప్నువ న్మనః మానసం దృఢభక్తి రజ్జు సహితం దృఢభక్తి రచంచలాభక్తిస్సైవ రజ్జు స్తయాసహితం యుక్తంమంథానం కృత్వా మథనదండం కృత్వా తేన ఆమ్నాయాంబుధి మామ్నాయః వేదఏవాంబుధిః జలధి స్త మాదరేణాసక్త్యా మథిత్వా తత స్తస్మా త్సోమం కల్పతరుం సుపర్వ సురభిం చింతామణింధీమతాం నిత్యానందసుధాం నిరంతరరమా సౌభాగ్య మాతన్వతే వి స్తరేణ లభంతే ధీసుతాం బుద్ధిశాలినా మర్థాంతరే నిత్యానందసుధా మిత్యస్య విశేషణం ధియః మతే రిష్టాం సమ్మతాం కల్పద్రుమం దేవతరుసదృశం సుపర్వసురభిం కామధేనుసమానం చింతామణిసదృశం నిత్యానందసుధా మమృతతుల్య నిత్యానందస్వరూపం నిరంతరరమా సౌభాగ్యం శాశ్వతముక్తిలక్ష్మీసమృద్ధిరూపం సోమ ముమాసహితం పరమేశ్వర మాతన్వతే వి స్తరేణ లభంతే దేవసమూహాః సముద్రం మథిత్వా చంద్రాదిపదార్థా న్యథా అలభంత తథా వేదా న్సంశోధ్య మథనజన్యసకలపదార్థ సమష్టిరూపం పరమశివం లభంత ఇతి భావః.

పరమశివచంద్రుని దర్శనముచేత ఆనందసముద్రము పొంగి యభివృద్ధి నొందును. అందు విబుధులకుఁ బ్రవృత్తి గలుగు నని చెప్పుచున్నారు.—

ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్న శ్శివ
స్సోమ స్సద్గణసేవితో మృగధరః పూర్ణ స్తమోమోచకః,
చేతః పుష్కరలక్షితో భవతి చే దానందపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తి స్తదా జాయతే.

టీ. ప్రా...ర్తి-ప్రాక్పుణ్యాచల = పూర్వజన్మమందలి పుణ్యముల గుట్టయొక్క; తూర్పుదిక్కున నుండు పుణ్యాకరమైన పర్వతము(ఉదయగిరి) యొక్క, మార్గ=మార్గమున, దర్శిత= చూపఁబడిన, సుధామూర్తిః=అమృత శరీరము (అమృతమయమగుబింబము) కలవాఁడు, ప్రసన్నః = స్వచ్ఛమైన వాఁడును, శివః=ఆనందస్వరూపుఁడు (ఆహ్లాదకరమైనవాఁడు), సద్గణసేవితః=సజ్జనపుంజముచేఁబూజింపఁబడినవాఁడు(నక్షత్రగణముచేఁ జుట్టుకొనఁ బడినవాఁడు), మృగధరః=లేడినిదాల్చినవాఁడు, పూర్ణః=అంతటను నిండిన వాఁడు(షోడశకలాపరిపూర్ణుఁడు),తమోమోచకః=అజ్ఞానము(చీఁకటి)బాపు వాఁడు,సోమః=ఈశ్వరుం డనుచంద్రుఁడు, ప్రాగల్భ్యేన=ప్రౌఢిమచేత, చేతఃపుష్కరలక్షితః = హృదయాకాశమందు చూడఁబడినవాఁడు, భవతి చేత్=అగునేని, ఆనందపాథోనిధిః = ఆనందసముద్రము, విజృంభతే= ఉప్పొంగుచున్నది. తదా=అప్పుడు,సుమనసాం=సంస్కరింపఁబడిన చిత్తము గలవారలకు, వృత్తిః = (అం దోలలాడవలయునను) ప్రవృత్తి, జాయతే = కలుగుచున్నది.

తా. పురుషుఁడు పూర్వజన్మమందు సంపాదించుకొనిన యుదయ పర్వతప్రాయం బగుపుణ్యము మీఁదుగాఁ దనయమృతశరీరంబు భక్తలోకం బులకుఁ గనుపఱచి ప్రసన్నుఁడు ఆనందమయుండు నయి నక్షత్రపుంజం బట్లు సాధుబృందంబులు చుట్టుకొని సేవింప మృగధరుండును పరిపూర్ణుఁ డును తమోనివారకుండు నగుచు చంద్రుఁడుంబోలె హృదయాకాశమందు

సోమేశ్వరుండు పరమప్రబోధముతో వెలుఁగొందెనేని ఆనందసముద్రము పొంగును. అప్పుడు శుద్ధాంతరంగు లగు విబుధులచిత్తము రంజిల్లును.

అ. పరమశివం చన్ద్రదర్శనే నానందసముద్రో వర్ధతే తత్ర సుమనసాం ప్రవృత్తి ర్జాయత ఇత్యాహ:—

వ్యా. ప్రాగితి. సోమఏవ సోమశ్చంద్ర స్స కథం భూతః ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః. అచలసదృశం పర్వతసదృశః పుణ్యం పుణ్యాచలః ప్రాక్పూర్వజన్మని సంభూతః పుణ్యాచలః ప్రాక్పుణ్యాచలః సఏవ ప్రాగ్దిగ్వృత్తిపుణ్యపర్వత స్తస్య మార్గః పంథాః తేన దర్శితా ప్రదర్శితా సుధా అమృతమయీమూర్తి శ్శరీరం యస్య స తథోక్తః. అన్యత్ర ప్రాక్తన పుణ్యాతిశయేన సంసూచితామృతశరీరఇత్యర్థః. ప్రసన్న స్స్వచ్ఛః ఉభయత్ర స్వచ్ఛత్వం తుల్యం. శివః ఆనందకరః అన్యత్ర సుఖస్వరూపః సద్గణసేవితః నక్షత్రసమూహ పరివృతః అన్యత్ర సాధుసందోహపూజితః మృగధరః ధరతీతి ధరః మృగస్య ధరః మృగధరః ఇదం చోభయత్ర సమానం. పూర్ణః షోడశభిః కలాభిః పూర్ణ పూర్తింగతః అన్యత్ర సర్వవ్యాపక స్తమో మోచకః తమః అంధకార స్తస్య మోచకః నివర్తకః అన్యత్రాజ్ఞానమోచకః ఏతాదృశ స్సోమః ప్రాగల్భ్యేన బోధనశక్త్యా చేతః పుష్కరలక్షితః హృదయాకాశే లక్షితః దృష్టః భవతి చే దానందపాథోనిధిః ఆనంద ఏవ పాథోనిధి స్సముద్రః స విజృంభతే వర్ధతే తదా సుమనసాం సంస్కృతచిత్తానాం వృత్తిః ప్రవృత్తి ర్జాయతే తస్మిన్ సుజ్జనబుద్ధి ర్జాయత ఇతి భావః.

ఒక నగరమందు మంచిరాజుండుటంజేసి దేశంబునకు సర్వసమృద్ధి గలిగినట్లు హృదయపుండరీకమునందు పరమేశ్వరుఁ డుండుటంజేసి నాకు సర్వసమృద్ధియుఁ గలిగిన దని చెప్పుచున్నారు.—

ధర్మో మే చతురంఘ్రికః సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగలితాః కాలాస్సుఖావిష్కృతాః,

జ్ఞానానంద మహౌషధి స్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతంసే స్థితే. 39

టీ. రాజావతంసే=చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడును (రాజశ్రేష్ఠుఁడును), మాన్యే=సర్వపూజ్యుఁడును (సర్వసమ్మతుఁడును) నగు శివుఁడు (రాజు), మే=నాయొక్క. మానసపుండరీకనగరే=కమలమునంటి మనస్సనియెడు నగరమందు, కైవల్యనాథే=కైవల్యముతోఁగూడినప్రభువై, స్థితే=ఉండఁగా, చతురంఘ్రికః = నాలుగుపాదములు గలిగిన, ధర్మః= ధర్మము, సుచరితః=సుఖముగా నాచరింపఁబడినది. పాపం=పాపము,వినా శం=నాశమును, గతం = పొందినది. కామక్రోధమదాదయః = కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ననునవి, విగళితాః = తొలఁగిపోయినవి, కాలాః = పక్షము మాసము సంవత్సరము మొదలగు కాలములు, సుఖావిష్కృతః = సుఖమును ప్రకటించుచున్నవి. జ్ఞా...ధిః- జ్ఞానానంత్యే = జ్ఞానసాధనగ్రంథబాహుళ్య మనియెడు, మహౌషధిః=సిద్ధి సాధనమయిన యోషధి, సదా=ఎల్ల వేళలను, సుఫలితా=చక్కఁగా ఫలించినది, భవతి=అగుచున్నది.

తా. ధార్మికుఁ డైనరాజు=స్వతంత్రాధీశ్వరుఁడై నగరియందుండి పరిపాలించుచుండఁగా దోషములన్నియుఁ దొలఁగిపోయి భూమి ఫలవంతమై సర్వసమృద్ధి గలిగినట్లు నాహృదయపుండరీకమందు పరమేశ్వరుఁడు మోక్షాధినాథుఁడై నివసించియుండ నాకు కామక్రోధాద్యంతశ్శత్రువర్గము పాపములుం దొలఁగిపోయి జ్ఞానసాధనంబు లనియెడు నోషధులు ఫలించి యెల్ల వేళలను సుఖంబు సమకూఱినది.

అ. కస్మింశ్చిన్నగరే సురాజస్థిత్యా దేశస్య సర్వసమృద్ధివద్ధృత్పుండరీకే పరమేశ్వరస్థిత్యా మమ సర్వసమృద్ధి స్సంజాతేత్యాహ:—

వ్యా. ధర్మ ఇతి. రాజావతంసే రాజా చంద్రః అవతంసః శిరోభూషణం యస్య తస్మిన్ అన్యత్రావతంసశబ్దస్య శ్రేష్ఠవాచిత్వాద్రాజశ్రేష్ఠ ఇత్యర్థః. మాన్యే సర్వపూజ్యే అన్యత్ర, సర్వసమ్మతే శివే రాజని చ మే

మమ మానసపుండరీకనగరే మానసం పుండరీక మివ మానసపుండరీకం త దేవ నగరం పురం తస్మిన్ కైవల్యనాథే కేవలత్వ విశిష్టనాథే ఏకనాథ ఇత్యర్థః. అన్యత్ర లోకప్రసిద్ధపుర్యామివ స్థితే సతి కైవల్యనాథ ఇత్యేత ద్విధేయవిశేషణం. చతురంఘ్రిక శ్చత్వారోంఘ్రియో యస్య స ధర్మః సుచరిత స్సుఖే నాచరితః అనుష్ఠితఇత్యర్థః. పాపం దురితం వినాశం గత మదర్శనం ప్రాప్తం కామక్రోధమదాదయ ష డంతశ్శత్రవో విగళితాః బహిర్నిర్గతాః కాలాః మాస పక్ష సంవత్సరాత్మకా స్సుఖావిష్కృతస్సుఖమేవా విష్కుర్వంతీతి ప్రకాశయంతీతి తథోక్తాః క్విబంతోఽయం శబ్దః. జ్ఞానానంత్యమహౌషధిః జ్ఞానానాం జ్ఞానసాధనగ్రంథానా మానంత్యం బాహుళ్యం తదేవ మహౌషధిః సిద్ధసాధనౌషధిః సదా సర్వస్మిన్కాలే సుఫలితా సుతరాం సంజాతఫలా భవతీ త్యధ్యాహారః. ధార్మికే రాజన్యేకనాథే శాసతి సతి దేశే సర్వదోషనివృత్తిః సర్వగుణసమృద్ధిశ్చ యథా భవతి జనానాం తథా మమ హృదయపుండరీకే పరమశివే వసతి సర్వగుణసమృద్ధి స్సర్వదోషనివృత్తి శ్చ సంజాతేతి భావః.

ఈదాహరింపంబడు ఫలంబు బొందియున్నందున నాకు దుర్భిక్షము వలనిభయము లే దనుచున్నారు.—

ధీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశిదివ్యామృతైః,
హృత్కేదారయుతా శ్చ భక్తికలమా స్సాఫల్యమాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవన్విశ్వేశ భీతిః కుతః. 40

టీ. హేభగవన్=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవైన, హేవిశ్వేశ = ఓ సకలభువనాధిపతీ, ధీయంత్రేణ=బుద్ధి యనుమోటతో, వచోఘటేన = వాక్కులను కుండచేత, కవితాకుల్యోపకుల్యాక్రమైః=కవిత్వమనియెడు కాలువలు పిల్లకాలువలు మొదలగువానిగుండా, ఆనీతైః = (హృదయ మనుపొలములోనికి) తేఁబడిన, సదాశివస్య = పరమశివునియొక్క, చ...తైః=చరి

తాంభోరాశి=చరిత్రలనియెడు సముద్రముయొక్క, దివ్యామృతైః=మంచి నీళ్ళచేతను, హృత్కేదారయుతాః=హృదయం బనుపొలమునఁ బుట్టియున్న, భక్తికలమాః=భక్తియను వరిపైరులు, సాఫల్యం=పంటను, ఆతన్వతే=విస్తరించుచున్నవి. సేవకస్య=నీసేవకుఁడ నగు, మమ=నాకు, దుర్భిక్షాత్ = కఱవువలన, భీతిః=భయము, కుతః=ఎక్కడిది ?

తా. హే భగవన్ ! విశ్వేశ్వరా ! నీచరిత్రం బనుమహాసముద్రములోని దివ్యామృతము కవిత్వం బనుకాలువలు పిల్లకాలువలు మొదలగువాని గుండ వాక్కనుకుండతో నాబుద్ధి యనుమోటవలన హృదయ మనుపొలములోనికి ప్రవహించి భక్తి యనుసస్యమును ఫలవంతముగాఁ జేయుచున్నది. ఇఁక నెంతకఱవు వచ్చినను నాకేమి భయము? మీచరిత్రలు తలఁచుచు భక్తితో మిమ్మెప్పుడు సేవించు చుందు నని భావము.

అ. వక్ష్యమాణలక్షణస్య ఫలభాజో మమ న దుర్భిక్షా ద్భీతి రిత్యాహ:—

వ్యా. హే భగవన్ సమగ్రైశ్వర్యాదిసంపన్న ! "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః, జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగఇతీరణా. ఉత్పత్తిం చ వినాశం చ భూతానామాగతిం గతిం, వేత్తి విద్యామవిద్యాం చ భగవాన్ స ఇతి స్మృతః". ఇతి చ ప్రమాణాత్ హే విశ్వేశ సకలభువనాధిపతే ! త్వత్సేవకస్య మమ ధీయంత్రేణ ధీరేవ బుద్ధిరేవ యంత్రం ఘటీయంత్రం తేన వచోఘటేన వాక్కలశేన కవితాకుల్యోపకుల్యాక్రమైః కవే ర్భావః కవితా సాహిత్యం సైవ కుల్యా ఉపకుల్యా చ తస్యాః క్రమై రానుపూర్వీభిః హృత్కేదారం ప్రాపితైః హృదయక్షేత్రం ప్రాపితై స్సదాశివస్య పరమశివస్య తవ చరితాంభోరాశిదివ్యామృతై శ్చరితం చరిత్రమేవాంభోరాశి స్సముద్ర స్తస్య దివ్యామృతై శ్శుద్ధోదకైః హృత్కేదారయుతా శ్చ హృత్ హృదయమేవ కేదారః క్షేత్రం తద్యుక్తా శ్చ భక్తికలమాః భక్తయఏవకలమాః శాలీ సస్యాని తే సాఫల్యంసఫలత్వ మాతన్వతే విస్తారయంతి. ఆతన్వత ఇత్యత్ర వికరణభేదా ద్బహువచన

మితిగార్హ్యం. ఏవం సేవకస్య మమ దుర్భిక్షా క్షామకాలాత్ భీతి ర్భయం కుతః కాభీతి రిత్యర్థః. సార్వవిభక్తికస్తసిః. మమ హృదయేసర్వదా త్వాం భజామీ త్యభిప్రాయః.

ఈక్రిందివిషయములయందు మూఁగతనము చెవిటితనము మున్నగునవి రాకుండఁ జేయుమని వేఁడుకొనుచున్నారు.—

పాపోత్పాతవిమోచనాయరుచిరైశ్వర్యాయ మృత్యుంజయ
స్తోత్రధ్యాననతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే,
జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయన శ్రోత్రైరహం ప్రార్థితో
మామాజ్ఞాపయ తన్నిరూపయముహుర్మామేవమామేఽవచః.

టీ. హేమృత్యుంజయ = మృత్యువును జయించినవాఁడా! పాపోత్పాతవిమోచనాయ = పాపం బనునుత్పాతమును బాపుటకొఱకును, రుచిరైశ్వర్యాయ=ఇష్టమైన యైశ్వర్యముకొఱకును, స్తో...నే-స్తోత్ర = (నిన్ను) స్తోత్రముచేయుట, ధ్యాన=(నిన్ను) ధ్యానించుట, నతి=(నీకు) నమస్కారము చేయుట, ప్రదక్షిణ=(నీ) ప్రదక్షిణముచేయుట, సపర్యా=(నీ) పూజసేయుట, ఆలోకన = (నిను) జూచుట, ఆకర్ణనే = (నీకథలు) వినుట-వీనివిషయమై, జి...త్రైః-జిహ్వా=నాలుకచేతను, చిత్త=మనస్సుచేతను, శిరః=శిరస్సుచేతను, అంఘ్రి=పాదములచేతను, హస్త=చేతులచేతను, నయన = కన్నులచేతను, శ్రోత్రైః=చెవులచేతను, అహం=నేను, ప్రార్థితః=ప్రార్థింపఁబడితిని. మాం=నన్ను, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపింపుము (అట్లు చేయుమని సెలవిమ్ము), తత్=ఆస్తోత్రాదికమునుగూర్చి, మాం=నన్ను, ముహుః = మాటిమాటికి, నిరూపయ=పురికొల్పుము, మే=నాకు, అవచః = మూఁగతనము, మైన=కలుగనీయకుము.

తా. ఓ మృత్యుంజయుఁడా! పాపములు బోయి యిష్టార్థముసిద్ధించుటకుఁగాఁ బరమేశ్వరుని స్తుతింపుమని నాలుకయు, ధ్యానింపు మని మనమును, నమస్కరింపు మని శిరస్సును, ప్రదక్షిణము చేయుమని పాదములును, పూజించు మని చేతులును, చూడు మని కన్నులును, కథలు విను మని

చెవులును నన్ను కోరుచున్నవి. నీయాజ్ఞ లేనిదే ఆకోరిక నే నెట్లు తీర్పఁగలుగుదును ? నాకాజ్ఞయిచ్చి పలుమా ఱట్లు చేయుటకు న న్నలపలఱుపుము. ఇందు నాకు మూఁగతనము మతిలేమి కుంటితనము గ్రుడ్డితనము మొదలగు నవి రాకుండఁ జూడుము. ప్రతిబంధక మేమియు లేకుండఁ జింతితార్థ సిద్ధి యొసఁగు మని తాత్పర్యము.

అ. వక్ష్యమాణార్థజాతే మూకత్వాది దోషపరిహారార్థం ప్రార్థ్యతే:—

వ్యా. పాపోత్పాతఇతి. హే మృత్యుంజయ మత్యుః యమః తం జయతీతి మృత్యుంజయ స్తస్య సంబుద్ధిః పాపోత్పాతవిమోచనాయ పాప మే వోత్పాతః విపత్సూచకకాదాచిత్కనిమిత్తం తస్య విమోచనాయ పరిత్యాగాయ రుచిరైశ్వర్యాయ సర్వస్వాతంత్ర్యాయ స్తోత్రధ్యాన నతి ప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే స్తోత్రం చ ధ్యానం చ నతిశ్చ ప్రదక్షిణం చ సపర్యా చ ఆలోకనం చ ఆకర్ణనం చ ఏతేషాం సమాహారే విషయే జిహ్వాచిత్తశిరోంఘ్రిహ స్తనయనశ్రోత్రైః సమాహారఘటక స్వస్వవిషయే యథాసంఖ్యం ప్రార్థితోஉహ మస్మి .త్వదాజ్ఞాపనం వినా తత్ప్రార్థిత మర్థం నిర్వోఢుం న శక్నోమి. తస్మా న్మా మాజ్ఞాపయ ఏవం ప్రార్థిత మర్థం కుర్వితి విధేహి తత్సమాహారపదార్థం మాం నిరూపయ ముహుః ప్రదక్షిణ మనుసంధాపయ మే మమ అవచః వచసోஉభావః మూకత్వమితి యావత్. ఏత చ్చ అధ్యాతృత్వాదీనాం దోషాణా ముపలక్షణం. మూకత్వాదయోదోషాః మైవ భూవన్ మామేవ మామేవ చ ఇత్యత్ర మాం ఏవ మా మే అవచః ఇతిచ్ఛేదః. ప్రతిబంధకేన వినా ప్రార్థితార్థనిర్వాహో మమ భూయాదితి ప్రార్థయితు రభిప్రాయః.

ఈశ్వరుఁడు దుర్గాతిప్రియుఁడు గావునఁ దన మనోదుర్గమున నివసింపుమని వేఁడుచున్నారు.—

గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమశ్చాప్తబలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థితః,

విద్యా వస్తుసమృద్ధి రిత్యఖిలసామగ్రీసమేతే సదా
దుర్గాతిప్రియ దేవ మామకమనోదుర్గే నివాసం కురు. 42

టీ. హేదుర్గాతిప్రియ = పర్వతదుర్గమందు మిగుల ప్రీతి గలిగిన, హేదేవ=ఓయిపరమశివుఁడా, పరిఖాపదం=అగడ్తకు లక్షణమయిన, గాంభీర్యం=గాంభీర్యము (లోఁతు) ను, ఘనధృతిః = దిట్టమైనధైర్యము, ప్రాకారః=కోటగోడయును, ఉద్యద్గుణస్తోమః=పుట్టుచున్న సద్గుణపుంజము, ఆప్తబలం = నమ్మకమైన బలమును, దేహస్థితః = శరీరమందున్న, ఘనేంద్రియచయః=కన్నుమొదలగు నింద్రియములు, ద్వారాణి = రాకపోకలకు ద్వారములును, విద్యా=ఈశ్వరునిగురించిన జ్ఞానము, వస్తుసమృద్ధిః=పదార్థ సంపత్తియును, ఇతి=ఇట్టి, అఖిలసామగ్రీసమేతే=దుర్గమునకుఁ గావలసిన పదార్థములన్నియు సమగ్రముగానున్న, మామకమనోదుర్గే=నామనస్సను దుర్గమందు, సదా = ఎప్పుడును, నివాసం=నివాసమును, కురు = చేయుము.

తా. మిగుల దుర్గమంబగు కైలాసపర్వతమునఁ బ్రీతితో నివసించుచున్న యోదేవా ? నామనంబుగాంభీర్య మగడ్తగను, ధైర్యము ప్రాకారముగను, ఉదయించుసుగుణంబులు బలంబుగను, చక్షురాదీంద్రియములు ద్వారములుగను, పరమశివజ్ఞానము సర్వపదార్థసంపత్తిగను దుర్గలక్షణసమగ్రంబై యున్నది. దుర్గప్రియుండవుగావున నీవిందు నివసింపుము.

అ. దుర్గాతిప్రియత్వేన హేతునా స్వమనోదుర్గే శివస్య వాసం ప్రార్థయతే:—

వ్యా. గాంభీర్యమితి. హే దుర్గాతిప్రియదుర్గః దుఃఖేన గంతు మర్హః అచలః అత్యంతం ప్రీతివిషయో యస్యస తథోక్త స్తస్య సంబుద్ధిః హేదేవ పరమశివ పరిఖాపదం పరితః ఖాయతే అవదార్యతఇతి పరిఖాజలదుర్గ స్తస్యాః పదం లక్షణం గాంభీర్యం గంభీరభావం అగాధతేతి యావత్ ఘనధృతి స్సాంద్రధైర్యం తదేవ ప్రాకారస్సాలః. ని. 'ప్రాకారో వరణ స్సాల' ఇత్యమరః. ఉద్యద్గుణస్తోమః ఉద్యంతః ఉత్పద్యమానాః గుణా స్సాధుగుణా స్తేషాం స్తోమ స్సమూహ స్సఏ వా ప్తబల మాప్తం విశ్వసనీయం బల

మాపన్నివృత్తిసాధకం దేహస్థితః దేహే విద్యమానఘనేంద్రియచయః ఘనేంద్రియాణి చక్షురాదీని తేషాం చయ స్సందోహ స్సఏవ ద్వారాణి గమాగమస్థానాని విద్యా శివవిషయకజ్ఞానం సైవ వస్తుసమృద్ధి ర్గోప్యపదార్థ సంపదిత్యేవంభూతానాం దుర్గాపేక్షితాఖిలపదార్థానాం సామగ్రీ సమగ్ర భావః పౌష్కల్యం తయా సమేతే మామకమనోదుర్గే మమేదం మామకం యన్మన స్తదేవ దుర్గం దుష్ప్రవేశస్థానం తస్మిన్ త్వమిత్యధ్యాహారః సదా సర్వదా నివాసం వసతిం కురు విధేహీతి ప్రార్థనాయాం లోట్.

పరమశివుఁ డాదికిరాతమూర్తియగుట దలంచి కిరాతవాంఛితములన్ని యు నాయందున్నవిగాన మఱెందును బోవలదని వేఁడుచున్నారు.—

మా గచ్ఛ స్త్వమిత స్తతో గిరిశ భో మయ్యేవ వాసం కురు
స్వామి న్నాదికిరాత మామకమనః కాంతార సీమాంతరే,
వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్య మోహాదయ
స్తా న్హత్వా మృగయావినోదరుచితాలాభంచసంప్రాప్స్యసి.

టీ. హే ఆదికిరాత = ఓయాదికిరాతమూర్తీ? భోగిరిశ = ఓకైలాస వాసా? స్వామిన్=మహాప్రభో? త్వం=నీవు, ఇత స్తతః=ఇటునటు,మాగచ్ఛః=పోకుము. మయ్యేవ=నాయందే, వాసం=నివాసమును,కురు=చేయుము మామకమనఃకాంతారసీమాంతరే=నాహృదయంబను నరణ్యప్రాంతమున, మదజుషః = (మమ్మెవ్వరును జయింపలేరను) గర్వముతోఁగూడిన, మాత్సర్య మోహాదయః=మాత్సర్యము, మోహము మొదలగు, మృగాః = అడవిమృగ ములు, బహుశః=అనేకములుగా, వర్తంతే=తిరుగుచున్నవి. తాన్=వానిని, హత్వా=చంపి, మృగయావినోదరుచితాలాభంచ=వేఁటతోఁ గాలముగడపు టయందలి కోరికయొక్క ఫలితమును, సంప్రాప్స్యసి = పొందఁగలవు.

తా. ఓ ఆదికిరాతమూర్తీ దేవా! నీవెందును బోక నామనమునందె యుండుము. నామనంబు మహారణ్యంబు. అందుఁ గామక్రోధాదులు క్రూర మృగంబులు మెండుగానున్నవి. వాని వేఁటాడి వేఁటయందలి నీయానం దముఁ దీర్చికొందువు.

అ. పరమశివ స్వాదికిరాతభావం సంభావ్య కిరాతలభ్యం ఫలం మయి సులభ మితి హేతో ర్మత్తోఽన్యత్ర గమనం మాభూ దితి ప్రార్థయతే.

వ్యా. మాగచ్ఛఇతి. భో ఆదికిరాత ఆదివ్యాధ అత ఏవ గిరిశగిరౌశయాన స్వామిన్ సర్వాధ్యక్ష! త్వ మిత స్తతః మాగచ్ఛః మైవవ్రజ. మయి వాసం కురు. మల్లభ్యం ఫలమిహ నాస్తీతిచే దస్తీత్యాహ. మామకమనఃకాంతారసీమాంతరే మదీయమనఏవ కాంతార మితరదుర్గమో వన ప్రదేశ స్తస్య సీమాంతరే మర్యాదామధ్యే మదజుషః అస్మాన్ జేతుం కోపి న సమర్థ ఇతి గర్వభాజఃమాత్సర్యమోహాదయః మాత్సర్యం మత్సరభావః అన్యస్మిన్నకారణతః ప్రద్వేషః మోహః అనాత్మ న్యహం బుద్ధిరహంకారఇతి యావ త్తదాదయో దోషాః కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాఖ్యా ఏవ మృగాః వన జంతవః బహుశః బాహుళ్యేన ప్రవర్తంతే తాన్ హత్వా హింసిత్వా మృగయావినోదరుచితాలాభం మృగార్థమటనం మృగయా తయా వినోదః కాల యాపనం తస్మిన్ రుచిరిచ్ఛాయస్య సః తస్యభావ స్తత్తా తస్యాః లాభః ఫలం మృగహననం తం చ సంప్రాప్స్యసి యథేచ్ఛం లప్స్యసే భవతః ఇష్ట లాభాద్ధేతోః మయ్యేవ వాసం కుర్వితి ప్రార్థయితు స్తాత్పర్యం. వినోద మచిరా దాగత్య సంప్రాప్స్యత ఇతిపాఠే ఆరా త్సమీప మేవాగత్య ఏత్య మృగయావినోదం సంప్రాప్స్యసీత్యర్థః. 43

మహాదేవుని సింహరూపముగాఁ గొనియాడుచున్నారు.—

కరలగ్నమృగః కరీంద్ర భంగో
ఘనశార్దూలవిఖండనోఽ స్తజంతుః,
గిరిశో విశదాకృతి శ్చ చేతః
కుహరే పంచముఖోఽ స్తి మే కుతో భీః. 44

టీ. కరలగ్నమృగః = చేతనిఱికిన మృగముగలవాఁడును, కరీంద్రభంగః = గజాసురుని భంగపఱచినవాఁడును (ఏనుఁగులజంపునదియు), ఘన

శార్దూలవిఖండనః=ప్రబలుఁడైన వ్యాఘ్రాసురుని ఖండించినవాఁడును (పెద్ద పులులజంపునదియు), అస్తజంతుః = తనయందు లీనమగు ప్రాణికోటిగలవాఁడును (జంతువులనిరసించునదియు), గిరిశః = పర్వతమందు శయనించువాఁడును, విశదాకృతిః=తెల్లని శరీరకాంతిగలవాఁడును. పంచముఖః=అయిదు ముఖములుగలవాఁడును (తెఱువఁబడిన ముఖముగలదియు) నగు పరమేశ్వరుఁడను సింహము, మే=నాయొక్క, చేతఃకుహరే=చిత్తంబను గుహయందు అస్తి=కలదు. మే=నాకు, భీః=భయము, కుతః=ఎక్కడిది ?

తా. సింహమునకు మృగములు చేతఁ జిక్కుచుండును. పరమేశ్వరుఁడు మృగమును చేత నిడికొంచుకొనియె. అది వ్యాఘ్రముల ఖండించును. ఈయన వ్యాఘ్రాసురుని ఖండించెను. దానిఁజూచి జంతువులన్నియుఁ గనపడకుండఁ బాఱిపోవును. ఆయనయందే జంతుజాలమంతయు లయించును. ఇరువురకును పర్వతమే వాసస్థలము, శరీరకాంతి తెలుపు, పంచముఖత్వ ముభయులకు నున్నది. అట్టి మహాదేవుఁడు సింహములాగున నా చిత్తకుహరమునందు నివసించియున్నాఁడు. నాకేభీతియును లేదు.

అ. మహాదేవం సింహత్వనిరూపణేన స్తౌతి:—

వ్యా. కరలగ్న ఇతి. పంచముఖః ఏవపంచముఖః పంచముఖానియస్యేతి వ్యుత్పత్త్యా పరమేశ్వరః అన్యత్ర పంచముఖః వ్యక్తముఖః సింహః పచివ్యక్తీకరణే ఇతిధాతోః కర్తరి అచ్ప్రత్యయే పంచేతిరూపసిద్ధిః. మే మమ చేతః కుహరే చేతఏవ చిత్తమేవ కుహరః గిరిగుహా తస్మిన్ త్వెవం సతి భీతి ర్భయం కుతః కస్మా ద్భయం భవిష్యతి న కుతోపీత్యర్థః. స కథంభూత ఇత్యాకాంక్షాయామాహ—కరలగ్నమృగః కరే హస్తే లగ్నస్సంబద్ధో మృగో యస్యత థోక్తః కరీంద్రభంగః కరీంద్రస్య కరిశ్రేష్ఠస్యాన్యత్ర గజాసురస్యభంగో యేన తథోక్తః వ్యధికరణబహువ్రీహిః. ఘనశార్దూలవిఖండనః ఘనో బలవాన్ యశ్శార్దూలః వ్యాఘ్రః అన్యత్ర వ్యాఘ్రాసురః తం. వివిధం ఖండయతి ఛినత్తీతి తథోక్తః అస్తజంతుః అస్తాః నిరస్తాః జంతవో యేన అన్యత్రాస్తాః

స్వరూపే లీనాః జంతవో యస్యతథోక్తః గిరిశః గిరౌ శయానః గిరిశత్వ ముభయత్ర తుల్యమేవ. విశదాకృతి ర్విశదా ధవళా ఆకృతిర్యస్య ఇదమప్యు భయత్ర తుల్యమేవ. స్పష్టార్థోఽయం.

పరమశివునియొక్క పాదద్వంద్వమను పక్షి గూఁటిలో తన చిత్తపక్షి విహరించుటను గోరుచున్నారు.—

ఛందశ్శాఖిశిఖాన్వితై ర్ద్విజవరై స్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే,
చేతః పక్షిశిఖామణే త్యజ వృథా సంచార మన్యై రలం
నిత్యం శంకర పాదపద్మయుగళీనీడే విహారం కురు. 45

టీ. హే చేతః పక్షిశిఖామణే=మనస్సనియెడు పక్షిశ్రేష్ఠమా! ఛంద శ్శాఖిశిఖాన్వితైః=వేదములనియెడు వృక్షములయొక్క కొమ్మలచివరలతో (వేదాంతములతో). అన్వితైః=సంబంధించిన, ద్విజవరైః=బ్రాహ్మణశ్రేష్ఠుల (పక్షిశ్రేష్ఠముల) చేత,సంసేవితే=ఆశ్రయింపఁబడినదియు, శాశ్వతే = నిత్య మైనదియు, సౌఖ్యాపాదిని=సుఖముసంపాదించునదియు, సుధాసారైః = అమృతరసముగల, ఫలైః=ఫలములతో, ఖేదభేదిని = సంసారదుఃఖమును (ఆఁకలిని) పోఁగొట్టునదియు, దీపితే=ప్రకాశవంతమైన, శంకరపాదపద్మ యుగళీనీడే=ఈశ్వరునియొక్క పాదపద్మద్వంద్వమను గూఁటియందు, విహా రం=విహారమును, కురు=చేయుము. అన్యైః=ఇతరములతో, అలం=చాలును. వృథా=నిష్ఫలమైన. సంచారం=సంచారమును, త్యజ=విడువుము.

తా. ఓ చిత్తపక్షిసత్తమా! ఇటునటు దిరిగి యేల వృథా శ్రమపడె దెదవు? పరమేశ్వరుని పాదద్వంద్వము చక్కని చిలుకగూఁడు. దాని కెన్నఁడును చలనంబులేదు. అందుఁ జక్కని వెల్గుతునుగలదు. అది మిగుల సౌఖ్యావహము. అమృతఫలముగలిగి దుఃఖనివారకమై యొప్పుచున్నది. అందు విహరించి యానందింపుము. చూడు. అనేక ద్విజసత్తము లాయాశాఖల శిఖ

రంబులకు సంబంధించియుండి దాని నాశ్రయించుచుందురు. నామనస్సు పరమశివుని పాదారవిందములను మాత్రము స్మరించుచుండుఁగాక యని తాత్పర్యము.

అ. పరమశివపాదయుగళీనీడే చేతఃపక్షిసంచారం ప్రార్థయతే:—

వ్యా. హే చేతఃపక్షిశిఖామణే చేత శ్చిత్తమేవ పక్షిశిఖామణిః పక్షిశ్రేష్ఠ స్తస్య సంబుద్ధి స్త్వం ఛందశ్శాఖిశిఖాన్వితై శ్శాఖాః ఏషాం సంతీతి శాఖిన శ్ఛందాంస్యేవ శాఖినః వృక్షా స్తేషాం శిఖా ఏవ శిఖాఃఉపనిషద స్తాభిరన్వితై స్సంబద్ధై స్తద్విద్భి రిత్యర్థః ద్విజవరైః బ్రాహ్మణోత్తమై స్తై రేవ పక్షిశ్రేష్ఠై స్సంసేవితే సమ్యగాశ్రితే శాశ్వతే నిత్యే నాశరహిత ఇత్యర్థః సౌఖ్యాపాదిని సుఖసంపాదిని సుధాసారై స్సుధాయా ఇవ సారో రసః యేషాం తైః ఫలైః జ్ఞానవైరాగ్యాదిభి స్తై రేవ ఫలై ర్వ్యాప్తే ఖేదభేదిని ఖేదం సంసారదుఃఖం తద్భినత్తి భినత్తీతి తద్భేదిని అన్యత్ర క్షుధాజన్యశోకభేదిని దీపితే సంజాతప్రకాశే శంకరపాదపద్మయుగళీనీడే పాదౌ పద్మే ఇవ పాదపద్మౌ శంకరస్య శివస్య పాదపద్మౌ శంకరపాదపద్మౌ తయోర్యుగళీ ద్వంద్వం సైవ నీడః కులాయ స్తస్మిన్ విహారం కురు సంచారం విధేహి. అన్యై రితరదేవసంబంధిపాదయుగళీనీడై రలం తే ఉపేక్షణీయా ఇతి భావ స్తత్ర వృథా. విఫలం సంచారం త్యజ పరిహర. పరమశివపాదారవింద విషయమేవ మన్మనోఽస్త్వితి తాత్పర్యం.

మానసరాజహంసకు గౌరీపతియొక్క పాదసౌధాంతరాళమునందు నివాసము విధించుచున్నారు.—

ఆకీర్ణే నఖరాజికాంతివిభవై రుద్యత్సుధావైభవై
రాధౌతేఽపి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే,
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు
స్థిత్వా మానసరాజహంస గిరిజానాథాంఘ్రిసౌధాంతరే.

టీ. హేమానసరాజహంస = ఓమనస్సను రాజహంసమా ! నఖరాజి కాంతివిభవైః = గోటిపరుసలయొక్క కాంత్యతిశయములచేత, ఆకీర్ణే = నిండి యున్నదియు, ఉద్యత్సుధావైభవైః = దినదినము వృద్ధిఁబొందుచున్న చంద్రునియమృతకిరణములు వ్యాపించుటచే (సున్నపుపూఁతలచే), ఆధౌతే = శుభ్రపడినదియు, అపిచ = మఱియును, పద్మరాగలలితే = పద్మములయొక్క యెఱుపువంటి యెఱుపుతో నొప్పునదియు (పద్మరాగమణులు చెక్కినదియు), హంసవ్రజైః = హంసమంత్ర ధ్యానపరుల సమూహములచేత (హంస లగుంపులచేత), ఆశ్రితే = సేవింపఁబడినదియు నగు, గిరిజానాథాంఘ్రి సౌధాంతరే = పార్వతీపతియొక్క పాదంబను మేడలోపల, రహసి = రహస్యమందు, భక్తివధూగణైస్సహ = భక్తియను భార్యలతోఁగూడ, నిత్యం = ఎప్పుడును, స్వేచ్ఛావిహారం = ఇష్టమైనసంచారమును, కురు = చేయుము.

తా. ఓ నామానసరాజహంసమా ! నీ వాపార్వతీకాంతుని పాదంబను సౌధాంతరాళమునం దేకాగ్రముగ భక్తికాంతాసమేతవై స్వేచ్ఛావిహారము ననుభవించి యానందింపుము. ఆపాదసౌధము గోళ్ళపరుసమెఱుంగుసమృద్ధిగా వెలుంగ నాచంద్రశేఖరుని మస్తకంబున నిత్యోదితుండై యుండుచంద్రుని యమృతకిరణప్రసారము సున్నపుఁబూఁతగను పద్మములవంటి రక్తిమ పద్మరాగముల చెక్కడముగను జెలువొంది యున్నది. మఱియు హంస (హంసమంత్రము జపించువారియొక్క [illegible] దాయములచే నిత్యము నాశ్రయింపఁబడుచున్నది.

అ. మానసరాజహంసస్య గౌరీరమణాంఘ్రిసౌధాంతరే వాసం విధత్తే:—

వ్యా. ఆకీర్ణ ఇతి. హే మానసరాజహంస [illegible] హంసః రాజదంతాదిషుపరమిత్యుపసర్జనస్యోత్తరనిపాతః. హంసశ్రేష్ఠ ఇత్యర్థః. మానసమేవ రాజహంస స్తస్య సంబుద్ధిః నఖరాజికాంతివిభవైర్నఖానాం రాజిః పంక్తిః తస్యాః కాంతిః ద్యుతి స్తస్యాః విభవై ర్విభూతిభి

స్వవృద్ధిభి రిత్యర్థః. ఆకీర్ణే వ్యాప్తే ఉద్యత్సుధాంశువైభవై రుద్యతః నిత్యాభ్యుదయం ప్రాప్నువతః మూర్ధ్ని స్థితస్య చంద్రస్య సుధాః అమృతమయకిరణా స్తాసాం వైభవై ర్వ్యాప్తిభి రన్యత్ర సుధా ఏవ సుధాః దధ్కర్కరాచూర్ణాని తాసాం విభవై ర్వ్యాప్తిభి రాధౌతే ధవళితే అపిచకించ పద్మరాగలలితే పద్మస్య రాగ ఇవరాగః కాంతివిశేష స్సఏవ పద్మరాగాఖ్య రత్నవిశేష స్తేన లలితే ఖచితే హంసవ్రజై రాశ్రితే హంసాః హంసమంత్రార్థధ్యానపరా స్తఏవ హంసాః హంసపక్షిణ స్తేషాంవ్రజై స్సమూహై రాశ్రితే ఉపాసితే అన్యత్రాశ్రితే ఆక్రాంతేగిరిజానాథాంఘ్రిసౌధాంతరే గిరిజానాథస్య పార్వతీనాథస్యాంఘ్రిరేవ సౌధః ప్రాసాదః తస్యాంతరే అంతర్విద్యమానే గృహే తత్ర భవ ఇత్యణ్. ఆదివృద్ధిశ్చ. రహస్యావ్రతస్థానే భక్తిబధూగణై స్సహ భక్తయ ఏవవధ్వః భార్యాస్తాసాంగణా స్సంఘా స్తై స్సహ నిత్యం సదా స్వేచ్ఛావిహారం స్వచ్ఛందక్రీడాం కురు విధేహి. మహాదేవస్య పాదారవింద సేవాజన్యసుఖం ప్రియతమాసంగజన్య సుఖ సదృశ మితిభావః. 46

శంభుధ్యానవసంతసంగిని హృదారామేఽఘజీర్ణచ్ఛదా
స్స్రస్తా భక్తిలతాచ్ఛటావిలసితా పుణ్యప్రవాళశ్రితాః,
దీప్యంతే గుణకోరకా జపవచఃపుష్పాణి సద్వాసనాః
జ్ఞానానందసుధామరందలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః. 47

టీ. శంభుధ్యాన = ఈశ్వరధ్యానం బను, వసంతసంగిని = వసంతర్తుసంబంధముగల, హృదారామే = హృదయం బను పూవులతోఁటయందు, స్రస్తాః = రాలిపోయిన, అఘజీర్ణచ్ఛదాః = పాపంబులనునట్టి పండుటాకులును; విలసితాః = శోభమానములైన, పుణ్యప్రవాళశ్రితాః = పుణ్యములనునట్టి చిగురుటాకులను బొందినవియును, గుణకోరకాః = సద్గుణములనునట్టి మొగ్గలుగలవియు, జపవచఃపుష్పాః = జపవాక్కులనునట్టి పుష్పములు గలవియు, సద్వాసనాః = సత్కర్మసంస్కారములనునట్టి సువాసనలు

గలవియు నగు, భక్తిలతాచ్ఛటాః = భక్తియను తీవజొంపములును, జ్ఞానానందసుధామరందలహరీ = జ్ఞానము, ఆనందమునను అమృతమకరందముల యొక్క ప్రవాహము, సంవిత్ఫలాభ్యున్నతిః=బ్రహ్మజ్ఞాన మను ఫలాభివృద్ధి యును, దీప్యంతే = ప్రకాశించుచున్నవి.

తా. దేవా! మీధ్యానంబు వసంతకాలముగా సంప్రాప్తమగుట వలన నాహృదయంబనుపూలతోఁటలో పాపములన్నియు పండుటాకులుగా రాలిపోయినవి. పుణ్యములు చిగురుటాకులుగా మొలకలెత్తినవి. వాని మీఁద సద్గుణములు మొగ్గలుగా బయలుదేరినవి. వనవనలాడుచు మీభక్తి తీవలు సాగుచున్నది. అందు జపవచనంబులు పుష్పములుగ నుదయించినవి. సత్కర్మసంస్కారములు సువాసన వెదజల్లుచున్నవి. జ్ఞానానందము లమృతమకరందములుగాఁ బాఱుచున్నవి బ్రహ్మజ్ఞానము ఫలంబుగా స్ఫురించుచున్నది. ఇట్లునాహృదయ ముద్యానగుణంబు లన్నియుఁగల్గి యొప్పారు చున్నది. కనుక నే హృదయారామ మనఁదగియున్నదని తాత్పర్యము.

అ. హృదయారామే ఆరామలక్షణాని సంతీత్యాహ:—

వ్యా. శంభుధ్యానఇతి. శంభుధ్యానవసంతసంగిని శంభుధ్యానమేవ వసంతః వసంతసమయస్తేన సంగస్సంబంధోస్యాస్తీతి తథోక్తే హృదారామే హృదయోద్యానే స్రస్తాః చ్యుతాః అఘజీర్ణచ్ఛదాః అఘాని పాపా న్యేవ జీర్ణపత్రాణి తే విలసితాః శోభమానాః పుణ్యప్రవాళశ్రితాః పుణ్యాన్యేవ ప్రవాళాని కిసలయాని తాని శ్రితాః ప్రాప్తాః ద్వితీయాశ్రి తేత్యాదినా ద్వితీయాతత్పురుషః. గుణకోరకా స్సద్గుణాఏవకోరకాః కుట్మలాః యాసాంతాః జపవచాంసి వ్యక్తవర్ణోచ్చారణాని తాన్యేవ పుష్పాణి యాసాంతా స్సద్వాసనా స్సతాం సాధుకర్మణాం వాసనా సంస్కారస్సైవ వాసనా గంధో యాసాంతాః భక్తిలతాచ్ఛటాః భక్తయఏవ లతాః వ్రతతయస్తాసాం ఛటా స్సంఘాస్తాశ్చ జ్ఞానానందసుధామరందలహరీ జ్ఞానం చానందశ్చ జ్ఞానానందౌ సుధామృతంమరందం మధు సాచ సచతౌజ్ఞానానందావేవ సుధామరందౌ.తయో ర్లహరీ ప్రవాహ స్సాచ సంవిత్ఫలాభ్యు

న్నతి స్సంవిద్బ్రహ్మజ్ఞానం తదేవ ఫలం తస్యాభ్యున్నతి ర్వృద్ధి స్సాచైతే సర్వే దీప్యంతే ప్రకాశంతే మమ హృదయ ముద్యానసర్వగుణసంపన్న మితి భావః.

పరశివధ్యాన ముత్తమఫలదాయకమని బోధించి యితరదేవతాశ్రయణమునుండి మనస్సును మరలించుచున్నారు.—

నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృ త్సద్వాసనావిష్కృతమ్,
శంభు ధ్యానసరోవరం వ్రజ మనోహంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం ప్రాప్స్యసి. 48

టీ. హేమనోహంసావతంస=ఓమానసరాజహంసమా! ని...యం-నిత్యానంద=శాశ్వతానందమను, రస = ఉదకమునకు, ఆలయం = ఉనికిపట్టును, సు...యం - సుర = దేవతలయొక్కయు, ముని = పరమహంసలయొక్కయు, స్వాంత = హృదయములను, అంబుజాత = పద్మములకు, ఆశ్రయం = ఆధారమును, స్వచ్ఛం = నిర్మలమును, సద్ద్విజసేవితం = యోగ్యులయిన ద్విజుల (రాజహంసల) చేత సేవింపఁబడినదియు, కలుషహృత్ = పాపహరమును, స...తం - సద్వాసనా = సత్కర్మవాసనల చేత (సువాసనలచేత), ఆవిష్కృతం = ప్రకటింపఁబడినదియునగు, శం...రం-శంభుధ్యాన = ఈశ్వరధ్యానంబను, సరోవరం = మంచిసరస్సును, స్థిరం = స్థిరమైనదానిని, వ్రజ = పొందుమా, క్షు...మం-క్షుద్రాశ్రయ = అల్పుల నాశ్రయించుటయును, పల్వలభ్రమణ = పడియలనుగుఱించిన త్రిప్పటచేత, సంజాత = పుట్టిన, శ్రమం = ఆయాసమును, కిం = ఏల, ప్రాప్స్యసి = పొందెదవు?

తా. ఓ మామనోరాజహంసమా! క్షుద్రదేవతల నాశ్రయించుట వల్ల కొన్ని పాపములు తొలఁగినఁ దొలఁగుఁగాక: శాశ్వతానందము చేకూ

రదు. అది కేవలము నీరునిలిచెడు చిన్న చిన్న గుంటలకెల్లఁబోయి శ్రమజెందు టగాని వేఱుకాదు. అట్టి పట్టియాయాస మేలపడియెదవు ? శంభుధ్యానము చేయుము. అది మహాసరోవరము. అందు శాశ్వతానందము జలముగను, దేవతలు, మునులు మున్నగువారిచిత్తములు కమలములుగను స్థిరముగా నిండియుండును. బ్రాహ్మణ క్షత్రియాదులగు పెద్దలెల్లరును హంసాదిపక్షులుగా నిత్యము సేవించుచుందురు. అది పాపములెల్లఁ బాపును. సత్కర్మసంస్కారమునఁగాని లభింపదు. మంచిమంచివాసనలను వెదజల్లుచుండును. తక్కిన చెఱువుల వలె నది యెక్కప్పుడును తఱుఁగునది కాదు. బహిరంగసాధనములను విడిచి యంతరంగసాధనము నవలంబింపుమని ముఖ్యాభిప్రాయము.

అ. మనసః శివధ్యానాశ్రయణమేవ సర్వోత్తమఫలదాయక మితి నిర్ణీయాన్యదేవతాశ్రయణవ్యావృత్తిం కుర్వ న్నాహ.—

వ్యా. నిత్యానందఇతి. హే మనోహంసావతంస హంసానా మవతంస శ్శ్రేష్ఠః రాజహంసః మనఏవ హంసావతంస స్తస్య సంబుద్ధిః నిత్యానంద రసాలయం నిత్యానంద శ్శాశ్వతానంద స్సఏవ రసః ఉదకం తస్యాలయం స్థానం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం సురా శ్చ దేవా శ్చ మునయశ్చ పరమహంసా శ్చ తేషాం స్వాంతాని హృదయాని తా న్యేవాంబుజాతాని జలజాని తేషా మాశ్రయం మాలయం స్వచ్ఛం మలరహిత మన్యత్ర విజాతీయప్రత్యయానంతరితం సద్ద్విజసేవితం సంత శ్చ తే ద్విజాః బ్రాహ్మణాదయ స్త్రయోవర్ణా స్తై స్సేవిత మన్యత్ర సద్విజాః రాజహంసా స్తై స్సేవితం కలుషహృత్కలుషాణి పాపాని హరతీతి కలుషహృత్ అన్యత్రాపి సమానమేవ సద్వాసనావిష్కృతం సతాం సాధుకర్మణాం వాసనయా సంస్కారేణావిష్కృతం ప్రకటిత మన్యత్ర సద్వాసనా సుగంధ స్తేనావిష్కృతం ప్రకటితం శంభుధ్యానసరోవరం శంభోర్ధ్యానం విజాతీయప్రత్యయానంతరిత సజాతీయప్రత్యయప్రవాహ స్తదేవ సరోవరం వరం సర శ్శ్రేష్ఠం సర ఇత్యర్థః తత్త్వం వ్రజ గచ్ఛ స్థిరం ధ్యానసరోవరం ప్రసిద్ధం సర అస్థిర మితిభావః క్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం · క్షుద్రాః ఉభ

యతారతమ్యానభిజ్ఞా స్త్రేషా మా శ్రయః పాపేభ్య స్తారణసమర్థం నము క్తిద మిత్యర్థః తాదృశం యత్స్వల్పలం శంభుధ్యానసరోవరాదల్పం తదుపేక్ష్య య ద్భ్రిమణం సంచార స్తేన జాతోయ శ్శ్రమ స్తం కిం కిమర్థం ప్రాప్స్యసి గ మిష్యసి? బహిరంగసాధనం పరిత్యజ్యాంతరంగసాధన మనుతిష్ఠేతి భావః.

శివభక్తిలభ్యమగు ఫలమును గోరుచున్నారు.—

ఆనందామృతపూరితాహరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్న ముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా,
ఉచ్చైర్మానసకాయమానపటలీ మాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మసంవర్ధితా. 49

టీ. ఆ...తా-ఆనందా=(శివభక్తియందలి) ప్రేమయను, అమృత=ఉదకముతో,పూరితా=నింపఁబడినదియు, హ...తా-హర=శివునియొక్క,పదాంభోజ=పాదపద్మమను, ఆలవాల=పాదునుండి, ఉద్యతా=పుట్టి పెరిఁగినదియు, స్థై...ఘ్నం-స్థైర్య=చిత్తస్థైర్యంబను, ఉపఘ్నం=ప్రాఁకును,ఉపేత్య=పొంది, శాఖోపశాఖాన్వితా=చిలవలు పలవలు పొందుకొనినదియు, ఉచ్చైః=ఉన్నతమైన, మా...లీం-మానస=మనస్సను, కాయమాన=పందిళ్లయొక్క, పటలీం=సమూహమును, ఆక్రమ్య=అలముకొని, నిష్కల్మషా=చీడమొదలగు వానిచే శిథిలముగాక, సత్కర్మసంవర్ధితా=పురాకృతపుణ్యకర్మముల (దోహదక్రియల) చేత వృద్ధిఁబొందింపఁబడినదియు నగు, భక్తిలతికా=భక్తియను తీఁగ, మే=నాకు, నిత్యాభీష్టఫలప్రదా = శాశ్వతమైన నాయభీష్టఫలము నిచ్చునది, భవతు=అగుఁగాక.

తా. పరమేశ్వర సేవానురక్తి సిరుపోతగను పరశివచరణకమలము పాదుగను జిత్తస్థైర్యము ప్రాఁకుముకంపగను నమరఁ బయలుదేరి చిలవల పలవల నల్లుకొనుచుఁ గ్రమముగా నున్నతమైన నామనస్సనియెడుపందిరియం

తట వలముకొని చీడమున్నగు దోషములచే శిథిలము గాకుండనున్న యీభక్తిలతామతల్లి పురాకృతపుణ్యకర్మమను దోహదక్రియలచేఁ బెంపొంది నామనోభీష్టమగు శాశ్వతఫలంబును ఫలించునుగాత.

అ. శివభక్తిసాధ్యం ఫలం ప్రార్థయతే:—

వ్యా. ఆనందామృతఇతి. ఆనందామృతపూరితా ఆనందఃశివభక్తా ప్రీతి స్సఏవామృతమంభ స్తేనపూరితా సంతర్పితా హరపదాంభోజాలవాలోద్యతా శివపదాంభోజమే వాలవాలఃఆశ్రయభూమి స్తస్మాదుద్యతాఊర్ధ్వం ప్రసృతా వృద్ధిం గతేత్యర్థః స్థైర్యోపఘ్నం స్థైర్యం స్థిర భావస్సఏవోపఘ్నః ఆశయః ఉపష్టంభదారువిశేష స్తముపే త్యావష్టభ్యశాఖోపశాఖాన్వితాశాఖాః మహాశాఖాః ఉపశాఖాః అల్పశాఖా అవయవవిశేషాఇత్యర్థ స్తాభిరన్వితా సంయుతా ఉచ్చైర్మానసకాయమానపటలీ ఉత్కృష్టాని చ తాని మానసాని చ తాన్యేవ కాయమానాని లతారోహణార్థం కల్పితఛదింషి (ఆంధ్రభాషాయాం పందిళ్ళు) తేషాం పటలీ సమూహ స్తామాక్రమ్యారువ్యా నిష్కల్మషా శైథిల్యాదిరహితా సత్కర్మప్రవర్థితా సత్కర్మభిః పురాకృతపుణ్యవిశేషైః సంవర్థితా వృద్ధిం ప్రాపితాన్యత్ర దోహదాదిభిర్వర్థితా ఓషధివర్థక సంస్కారై రిత్యర్థః భక్తిలతికా భక్తిస్సైవా సైవ లతికాలతాస్వార్థేకః మే మమ నిత్యాభీష్టఫలప్రదా అభీష్టఫల మైచ్ఛికఫలం నిత్యం శాశ్వతం చ తదభీష్టఫలం చ తత్ప్రకర్షేణ దదాతీతి సా భవత్వస్తు.

ఇప్పుడు శ్రీశైలవాసియగు భ్రమరాంబికాసమేతమల్లికార్జును భజించుచున్నారు.—

సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామ మసకృ త్సద్వాసనాశోభితమ్,
భోగీంద్రాభరణం సమ స్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితమ్. 50

టీ. సం...తం-సంధ్యారంభ = సాయంకాలమందు, విజృంభితం = తాండవనృత్యమునవిజృంభించునట్టియు(పుష్పములువికసించునదియు),శ్రు... తం-శ్రుతిశిరస్థానాంతర = వేదములకు శిరస్థానము లైనయుపనిషత్తు లను నితరస్థలమందు (చెవులయందును, తలమీఁదను), అధిష్ఠితం = బోధ్యముగా నున్నదియు (అలంకారముగానున్నదియు), స...మం-సప్రేమ=ప్రేమతోఁ గూడిన, భ్రమరా(ర) = భ్రమరాంబికచేతను (తుమ్మెదలచేతను), అభిరామం = మనోహరమైనట్టియు, అసకృత్ = ఎల్లప్పుడును, సం...తం-సద్వాసనా=సాధువులయొక్క భావనచేత (మంచిసువాసనచేత), శోభితం = ఒప్పునట్టియు, భో...ణం-భోగీంద్ర = వాసుకి (భోగవంతులకు), ఆభరణం=భూషణముగాఁ గలిగినట్టియు (భూషణమైనట్టియు), స...జ్యం-సమస్తసుమనః=ఎల్లదేవతల (విద్వాంసుల) చేతను (సకలపుష్పములకంటెను), పూజ్యం = పూజింపఁదగినట్టియు, గు...తం-గుణ = సత్త్వగుణముచేత (సుగంధగుణముచేత), ఆవిష్కృతం=ప్రకటితమైనట్టియు, శివాలింగితం= పార్వతీదేవిచేతఁ గౌఁగిలించుకొనఁబడిన, శ్రీ...గం-శ్రీగిరి=శ్రీశైలమందున్న మల్లికార్జున = మల్లెతీఁగయల్లుకొన్న మద్దిచెట్టుంబోలిన, మహాలింగం = పరమాత్మసూచకమైన మహాలింగమును, సేవే = భజించుచున్నాను.

తా. శ్రీశైలపర్వతమందు వేంచేసి యున్న మల్లికార్జునమహాలింగము మల్లెతీఁగయల్లుకొన్న మద్దిచెట్టుతోఁ బోల్చివర్ణింపఁబడినది. యెట్లన, ఈశ్వరుఁడు సాయంకాలమందు తాండవనృత్యముతో భక్తుల నానందపఱచును. అది పుష్పవికాసములతోనట్లుచేయును. అతఁడు శ్రీశైలమందుఁగాక శ్రుతి శిరస్సులనఁగా,ఉపనిషత్తులయందునుండును. దానిపుష్పములు శ్రవణములయందును శిరస్సులయందు నలంకారములుగా నుండును. మల్లికార్జునుఁడు భ్రమరాంబతోడను అర్జునవృక్షము భ్రమరములతోడను గూడి యొప్పును. ఈశ్వరునికి సద్వాసనయనఁగా, సాధుభావనయొక్క శోభయు దానికి సువాసనయొక్క శోభయుఁగలదు. భోగీంద్రుఁడు (శేషాహి) శంకరునికాభరణము. భోగీంద్రులనఁగా మహాభోగవంతులకు దానిపుష్పము అలంకారములు. పర

మేశ్వరుఁడు సుమనఃపూజ్యుఁడు అనఁగా సర్వదేవతలచేతనుఁ బూజింపఁ బడువాఁడు. దానిపుష్పంబు లన్నిపుష్పములకంటెను మిగుల శ్లాఘనీయములు. భగవంతుఁడు సత్త్వమువలన దెలియఁబడును. అయ్యది సుగంధగుణంబునఁ దెలియనగును. ఇట్లు శ్రీశైలపర్వతంబునఁ బరమాత్మసూచకంబుగా నవతరించియున్న మల్లికార్జునమహాలింగమూర్తిని భజించెద నని తాత్పర్యము.

అ. అధునా శ్రీశైలవాసినం శివం భజతే.

వ్యా. సంధ్యారంభఇతి. శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శ్రీగిరౌ శ్రీశైలేవిద్యమానం మల్లికార్జునమహాలింగం మల్లికావల్ల్యాసంశ్లిష్టార్జునవృక్షసదృశం మహాలింగం లీనం సూక్ష్మం పరమాత్మానం గమయతీతి లింగమతఏవ మహత్తల్లింగమహంసేవే భజే ఇతి క్రియాన్వయః. తత్కీదృశం శివాలింగితం శివయా పార్వత్యా ఆలింగితం పీఠికారూపయా శక్త్యా ఆవిష్టమితి భావః ఉభయో రుపమానోపమేయభూతయో రర్జునమహాలింగయో ర్ధర్మాన్ ప్రతిపాదయితుం శ్లిష్టవిశేషణై రర్జునమహాలింగే విశినష్టిసంధ్యారంభవిజృంభితం సంధ్యాయా స్సాయంసంధ్యాకాలస్యారంభే ప్రాదుర్భావే విజృంభితం నర్తన ప్రకటనేన భక్తానుగ్రాహక మన్యత్ర పుష్పవికసనేన శోభితం శ్రుతిశిరస్స్థానాంతరాధిష్ఠితం శ్రుతీనాం వేదానాం శిరస్స్థానాన్యుపనిషద శ్శైలాదస్యాని స్థానాని స్థానాంతరాణ్యస్వపదవిగ్రహస్తాన్యధిష్ఠాయాభిధేయతాసంబంధేన స్థితం కర్తరి క్తః అన్యత్ర శ్రుతి శ్చ కరశ్చ శ్రుతిశిరసీకర్ణ మూర్ధానౌ తయోస్స్థానాంతరం స్థానభేద స్తదధిష్ఠాయస్థితం స్వావయవైః పుష్పై రిత్యర్థః సప్రేమభ్రమరాభిరామం ప్రేమయుక్తయాభ్రమరయా భ్రమరాంబికయా భిన్నశక్త్యాభిరామం మనోజ్ఞ మన్యత్ర ప్రేమసహిత చంచరీకై రభిరామ మసకృ త్సర్వదా సతాం సాధూనాం వాసనయా భావనయా శోభితం వ్యాప్త మన్యత్ర సద్వాసనయా సాధుగంధేనశోభితం భోగీంద్రాభరణం సర్పభూషణ మన్యత్ర భోగః ఏషా మస్తీతిభోగిన స్తేషా మింద్రాశ్శ్రేష్ఠాః విషయానుభవితార స్తేషా మాభరణం భూషణం

సమస్తసుమనఃపూజ్యం సమస్తైస్సుమనోభి ర్దేవై ర్విద్వద్భిశ్చ పూజ్య మన్యత్ర సర్వేభ్యః పుష్పేభ్యః పూజ్యంపూజ్యకుసుమవిశిష్టం గుణావిష్కృతం గుణేసత్త్వగుణసంబంధేనావిష్కృతం ప్రకాశితమన్యత్రగంధాదిగుణై రావిష్కృతం ప్రకాశిత మేతాదృశం లింగం సేవేఇతి క్రియాయా మన్వయః. మల్లికార్జునమితి విభక్తిపరిణామేన విశేషణానాం తత్రాప్యన్వయః స్పష్టార్థోఽయం.

భ్రమరాంబాపతిని భ్రమరపతిగా నిరూపించి తన మానసకమలము నందు విహరించుటకు వేఁడుకొనుచున్నారు.—

భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణా చాదృతః,
సత్పక్షస్సుమనోవనేషు సపున స్సాక్షాన్మదీయే మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః. 51

టీ. భృంగీచ్ఛానటనోత్కటః-భృంగి(గీ) = భృంగియను ప్రమధుని యొక్క (భృంగజాతియొక్క), ఇచ్ఛా=అభిప్రాయముచేత (అపేక్షలను), నటన=వర్తించుటయందు (అనుకరించుటయందు), ఉత్కటః=ఉత్కటేచ్ఛ గలిగినట్టియు, క...హీ-కరిమద = గజాసురుని బలగర్వమును (ఏనుఁగుమదము), గ్రాహీ=అణఁచిపట్టినట్టియు (గ్రహించుస్వభావముగలిగినట్టియు), స్ఫు...దః-స్ఫురత్=ప్రకాశించుచున్న, మాధవ = మోహినీరూపుఁడైన మాధవునియందు (వసంతమందు), ఆహ్లాదః=ఆనందముగలిగినట్టియు, నాదయుతః=ప్రణవనాదప్రతిపాద్యుఁడైనట్టియు (ఝుంకారధ్వనితోఁ గూడినట్టియు), మహాత్=గొప్ప, (అ) సితవపుః = తెల్లనిశరీరము గలిగినట్టియు (నల్లనిశరీరము గలిగినట్టియు), పంచేషుణా = మన్మథునిచేత, ఆదృతః = బాణలక్ష్యముగను(సహాయముగను) ఆదరింపఁబడినట్టియు, సుమనోఽవనేషు-సుమనః=దేవతల (విద్వాంసుల) యొక్క, అవనేషు=సంరక్షణములయందు (సుమనోవనేషు=పూలతోఁటలయందు), సత్పక్షః=ఉన్నయభిమానము గలిగి

నట్టియు, సాక్షాత్ = కన్నులయెగురనున్నట్టియు, శ్రీశైలవాసీ = శ్రీశైలమందు భక్తుల ననుగ్రహింప లింగరూపమున నున్నట్టియు, విభుః=పలువిధ రూపంబు లగుచున్నట్టియు, భ్రమరాధిపః = భ్రమరాంబాపతియనునట్టి భృంగశ్రేష్ఠము, మదీయే = నాసంబంధమైన, మనోరాజీవే=మానసకమలమందు, విహరతాం=విహరించుఁగాక.

తా. హేవిభో! శ్రీశైలవాసా! భ్రమరాంబాధిపతీ! నీవు భ్రమరాధిపతివి అనఁగా తుమ్మెద ఱేఁడుగావున నాచిత్తకమలంబునవిహరింపుము. అది యెట్లన, నీవు నిభక్తుఁడగు భృంగీశ్వరుని యిచ్ఛానుగుణముగా ప్రవర్తింపఁ జాలుదువు. తుమ్మెగఱేఁడు భృంగియనఁగా తుమ్మెదలజాతి, దానియపేక్ష ననుసరించి ప్రవర్తించును. నీవు గజాసురునిమదమును నిగ్రహించితివి, అది గజముల మదజలము గ్రహించును. నీకు మోహినిరూపముధరించిన మాధవునియం దాహ్లాదము స్ఫురించినదిగదా, దానికి (మాధవ అనఁగా) వసంతమునం దాహ్లాదము ప్రస్ఫురించును, నీకు ప్రణవనాదము, దానికి ఝుంకారనాదము. మన్మథుఁడు నిన్నుబుష్పబాణముతో నాదరించెను, దానిని సహాయముగానాదరించెను. నీకు సుమనోవనము = విబుధరక్షణమం దభిమానము, దానికి సుమనోవనము = పుష్పవనమం దభిమానము. కాఁబట్టి నాచిత్తకమలమం చెడబాయకయుండుట సహజమేగదా యని తాత్పర్యము. 51

అ. భ్రమరాధిపతిత్వ నిరూపణేన స్వమనోరాజీవే విహరణం ప్రార్థయతే:—

వ్యా. వివిధం భవతీతి విభుః సోకామయత బహు స్యామితి శ్రుతేః శ్రీశైలవాసీ భక్తానుగ్రహాయ లింగరూపేణ శ్రీశైలవాసీ భ్రమరాధిపః భ్రమరాంబాయాః అధిపః సఏవ భ్రమరాధిపః భృంగరాజః మన్మనఏవ రాజీవం పద్మం తస్మిన్విహరతాం సంచరతాంభృంగాణాంరాజీవవాసస్స్వభావాద్యాదితిభావః. తమేవశ్లిష్టవిశేషణై ర్విశినష్టి—భృంగీచ్ఛానటనోత్కటః భృంగిణః భక్తవిశేషస్యేచ్ఛయా నటనే నర్తనే ఉత్కటః ఉత్కటేచ్ఛ

అన్యత్ర భృంగజాతేరిచ్ఛాయా అపేక్షాయాః నటనేఽనుకరణే ఉత్కటః ఉత్కటేచ్ఛః కరిమదగ్రాహీ కరిణో గజాసురస్య మదః బలవత్తాభిమాన స్తం గృహ్ణాతి తత్సంహరణేనహంతీతి తథోక్తః అన్యత్ర కరిణాం గజానాం మదః మదజలం తద్గ్రహణశీల స్తాచ్ఛీల్యే ణినిః. స్ఫురన్మాధవాహ్లాదః మాధవే మోహినీ రూపాపన్నే ఆహ్లాదః ప్రవృత్త్యౌత్సుక్యం స్ఫురన్ప్రకాశమానః మాధవాహ్లాదో యస్యాన్యత్ర మాధవే వసంతే ఆహ్లాదః ఆనందః స్ఫురన్మాధవాహ్లాదో యస్య నాదయుతః ప్రతిపాద్యత్వసంబంధేన ప్రణవ నాదసహితః అన్యత్ర ఝుంకారధ్వనియుతః మహాసితవపు స్సితంశుభ్రం వపు ర్యస్యసః మహాంశ్చాసౌ సితవపుశ్చేతి తథోక్త మన్యత్రాసితం నీలం వపు ర్యస్య మహాంశ్చాసౌ నీలవపు శ్చ తథోక్తం పంచేషుణాచాదృతః పంచేషుణా మన్మథేనాదృత స్స్వబాణలక్ష్యత్వేన నిశ్చితః అన్యత్రాదృత స్స్వసహాయత్వేన నిశ్చిత స్సుమనోవనేషు సత్పక్ష స్సుమనసాందేవానా మవనేషు రక్షణేషు సత్పక్ష స్సత్పక్షోభిమానో యస్య తథోక్తః అన్యత్ర సుమనసాం పుష్పాణాం వనేషూద్యానాదిషు సక్ విద్యమానః పక్షోఽభిమానో యస్య తథోక్త స్సాక్షా చ్చక్షురాదీంద్రియవిషయః ఉభయత్ర తుల్యార్థక మిదమేవం భూత స్సశ్రీశైలవాసీ భ్రమరాధిపతి ర్విహరతామితి పూర్వేణాన్వయః సర్వదా మనస్యాత్యంతికసంయోగేన తిష్ఠత్వితిభావః.

మేఘముగా భావించిన శంకరుని నాచిత్తచాతకంబు కోరుచున్నది. యని చెప్పుచున్నారు.—

కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్యఫలోదయాయ సుమన స్సంసేవ్య మిచ్ఛాకృతిమ్,
నృత్యద్భక్తమయూర మద్రినిలయం చంచజ్జటామండలం
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాం మే మనశ్చాతకః.

టీ. హేశంభో=సుఖోత్పత్తికారణమైనవాఁడా! హేనీలకంధర=నల్లనికంఠముగలవాఁడా, (నీల=నల్లని, కం=జలమ్ము, ధర=ధరించినవాఁడు,

మేఘుఁడా') మే = నాయొక్క, మనశ్చాతకః = మనస్సను చాతకపక్షి, కారుణ్యామృతవర్షిణం=దయయను నమృతమును వర్షించునట్టియు (కనికరము వల్ల జలమునువర్షించునట్టియు), ఘు...శం-ఘన-గొప్పదియగు, విపత్=ఆపద యను (సస్యనాశము మున్నగువిపత్తుగలిగిన), గ్రీష్మ=అతితాపమును (గ్రీష్మమును), ఛిదా=ఛేదించుటకు, కర్మఠం = సమర్థమైనట్టియు,వి...య-విద్యాసస్య=విద్యయను పైరుయొక్క, ఫలోదయాయ=ఫలము (బ్రహ్మానందానుభవము) జనించుటకొఱకు, సుమనస్సంసేవ్యం = దేవతలచేతను, పండితులచేతను (కర్షకులచేతను), ఆశ్రయింపఁదగినట్టియు, ఇచ్ఛాకృతిం=కామరూపమైనట్టియు, నృత్యద్భక్తమయూరం - నృత్యత్ = నాట్యముచేయుచున్న, భక్త=భక్తులనియెడు (మేఘమందుఁబ్రీతిగల), మయూరం=నెమళ్లుగలిగినట్టియు, అద్రినిలయం = పర్వతము నివాసస్థలముగాఁ గలిగినట్టియు, చం...లం-చంచత్=చలించుచున్న, జటా = జడలయొక్క (మెఱుపులయొక్క), మండలం=సమూహము గలిగినట్టియు, త్వాం=నిన్ను,'సదా = ఎల్లప్పుడును, వాంఛతి=కోరుచున్నది.

తా. హేశంభో! నీలకంధరా! నాచిత్తచాతకంబు నీలమేఘంబునుం బోలె వాంఛితసిద్ధికై నిన్నుదర్శింప వేచియున్నది. మేఘంబు కరుణతో జలంబును వర్షించును, నీవుకరుణామృతంబునువర్షింతువు. అది సస్యాదుల నెండింపఁజేయు గ్రీష్మమును దొలఁగింపఁగలదు, నీవు మహావిపత్సంతాపములను దొలఁగింతువు. అది సస్యములు చక్కఁగా ఫలింపఁజేయును, నీవును విద్యయనుసస్యమునకు బ్రహ్మానందానుభవమును ఫలముగాఁ గలిగించెదవు. దేవతలు పండితులు మున్నగువారందఱు సుమనస్కులై నిన్ను భజించెదరు, కర్షకులెల్ల శుభప్రదమైన సస్యఫలమందు మనస్సుగలవారై మేఘునపేక్షింతురు. మయూరంబులు మేఘునిఁజూచి ప్రీతిమంతములై నాట్యముసేయును, భక్తులట్లు నీయెదుర నాట్యము సల్పుదురు. నీవు కైలాసపర్వతమున నివసింతువు, మేఘుఁడును పర్వతంబున నివసించును. కామరూపంబును జటావల్లియు నుభయులకుం గలదు, (మేఘుపక్షమున జట యనఁగా మెఱుపు).

అ. మేఘత్వేన నిరూప్యమాణం శంకరం మే మనశ్చాతకో వాంఛ తీత్యాహ:—

వ్యా. కారుణ్యామృతఇతి. హే నీలకంధర నీలః కంధరః గ్రీవా య స్య తస్య సంబుద్ధి రన్యత్ర ధరతీతి ధరః కస్య జలస్య ధరః కంధరః మేఘః నీలశ్చాసౌ కంధరశ్చ నీలకంధరః తస్య సంబుద్ధి శ్శంభో సుఖోత్పత్తికారణ భూత త్వాం భవంతం సదా సర్వదా మే మమ మనశ్చేతఏవ చాతకః పత న్మేఘబిందుభక్షణః పక్షివిశేషః వాంఛతీచ్ఛతి త్వద్దర్శనేన వాంఛితమర్థం ప్రాప్తు మిచ్ఛతీతి భావః. కథంభూతంత్వా మిత్యాకాంక్షాయాం కారుణ్యా మృతవర్షిణం కారుణ్యమేవామృతం తద్వర్షణశీల మన్యత్ర కారుణ్యా దమృతే ముదకం వర్షతి తచ్ఛీలమస్యేతి కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీ ష్మచ్ఛిదాకర్మఠం ఘనా మహతీ విపత్ క్షయమప్లఖం సైవ గ్రీష్మః అతితాప స్తస్యచ్ఛిదాఛేదనం భిదాదిభ్యోఽజిత్యఙ్ ప్రత్యయః. స్త్రీలింగతాచ తస్యాం కర్మఠం కర్మశూరం తచ్ఛేదన సమర్థమిత్యర్థః అన్యత్ర ఘనానుమ తీవిపత్సస్యాదిశోషణరూపాయస్యసః ఘనవిపత్సచాసౌ గ్రీష్మస్తస్యాభిదాఛే దనం తస్యాం కర్మఠం తచ్ఛేదనసమర్థమిత్యర్థః. విద్యాసస్యఫలోదయాయ విద్యైవ సస్యం తస్యఫలం బ్రహ్మానందానుభవ స్తస్యోదయః ఉత్పత్తి స్తస్మై సుమనస్సంసేవ్యం సుమనోభి ర్దేవై ర్విద్వద్భిశ్చ సంసేవ్యం సమ్య క్సేవితు మర్హం మన్యత్ర సస్యఫలోదయాయ సుమనోభి శ్శోభనే సస్యాది ఫలే మనః యేషాంతే సుమనసః కర్షకాస్తై స్సంసేవ్యం సమ్యగపేక్షితు మర్హం మిచ్ఛాకృతింస్వేచ్ఛయా ప్రాప్యాకార ముభయత్ర సమానమేవేదం నృత్యద్భక్తమయూరం భక్తాఏవ మయూరాః కేకినః నృత్యంతో భక్తమ యూరాః యస్య దర్శనేన తథోక్త మన్యత్ర భక్తాః మేఘేప్రీతిమంతః అర్శఆదిభ్యోజితి భక్తిశబ్దా దచ్ప్రత్యయః. యేమయూరాః భక్తాశ్చ తే మ యూరాశ్చ భక్తమయూరాః నృత్యంతో భక్తమయూరాః యస్య పురత స్స తథోక్తః అద్రినిలయ మద్రిః కైలాసస్సఏవ నిలయో నివాసో యస్య తథోక్త మన్యత్రచ ఏష ఏవార్థః వర్షాకాలే అత్ర మేఘానా మవస్థానస్య

ప్రత్యక్షదృష్టత్వా దద్రినిలయత్వోపపత్తిః చంచజ్జటామండలం జటానాం కేశపాశానాం మండలః చంచత్ జటామండలః యస్య తథోక్త మన్యత్ర జటానాం విద్యుతాం మండల శ్చంచత్ జటామండలో యస్య తథోక్త మేతాదృశం త్వామితి క్రియాయామన్వయః ఈశ్వరస్య మేఘత్వేనస్తుతిః.

ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీ నతా
నుగ్రాహిప్రణవోపదేశనినదైః కేకీతి యో గీయతే,
శ్యామాంశైలసముద్భవాంఘనరుచిం దృష్ట్వానటంతంముదా
వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే. 53

టీ. యః=ఏశివుఁడు (ఏనెమలి), ఆకాశేన = ఆకాశముచేత, శిఖీ= శిఖావంతుఁడు అనఁగా వ్యోమకేశుఁడనుట (శిఖండకముగలిగిన నెమలి), సమస్తఫణినాం=సకలసర్పములకును, నేత్రా=నాయకుఁడైనవాసుకిచేత, కలాపీ= భూషణవంతుఁడు (పింఛముగల నెమలి),న...దైః.నత=నమ్రులైనవారిని, అనుగ్రాహి=అనుగ్రహించుస్వభావముగల, ప్రణవ=ప్రణవమంత్రముయొక్క, ఉపదేశ=ఉపదేశమందలి, నినదైః=ధ్వనులచేత, కేకీతిచ=కేకాధ్వనిగలవాఁడు అనియును (కేకాధ్వనిగల నెమలి), గీయతే= గానముచేయఁబడుచున్నాఁడో, శ్యామాం=నీలవర్ణమైనట్టియు, ఘనరుచిం= మేఘకాంతినంటికాంతిగల శైలసముద్భవాం=పార్వతిని (పర్వతమందు బయలుదేరిన మేఘకాంతిని), దృష్ట్వా=చూచి, నటంతం=నాట్యముసేయునట్టియు, వేదాంతోపవనే=వేదాంతమను నుద్యానవనమందు, విహారరసికం=సంచరించుటయందు రసికుఁడైనట్టియు, తం=ఆ, నీలకంఠం=నల్లనికంఠముగల యీశ్వరుఁడను నెమలిని, ముదా =సంతోషముతో, భజే=సేవించుచున్నాను.

తా. నెమలిశిఖండము, కలాపము (పింఛము) గలది గనుక శిఖియు, కలాపియు, కేకాధ్వనిచేయునది గనుక కేకియునని పేరువడసెను. దేవా! నీవు ను ఆకాశముచేత శిఖి (శిఖగలవాఁడు)యు, వాసుకిచేత కలాపి (భూషణముగలవాఁడు)యు, భక్తానుగ్రహార్థమైన ప్రణవనాదముచేత కేకియునైతివి.

ఇదిగాక యదిపర్వతమందుఁబుట్టిన మేఘకాంతిం జూచి యానందముతో నృత్యము సేయును, నీవును హిమవత్పర్వతమం దుదయించి మేఘకాంతితో నొప్పుచున్న యాశ్యామలాంబను జూచి యానందనృత్యము సల్పుదువు. అది యుద్యానవనమందును దేవర యుపనిషదుద్యానవనమందు నానందసంచారము చేయుదురు. నీలకణ్ఠశబ్ద ముభయార్థకమే గదా! వ్యోమకేశుండును నాగయజ్ఞోపవీతుండును ప్రణవోపదేశముచేత భక్తుల ననుగ్రహించు వాఁడును పార్వతీవల్లభుండును వేదాంతవేద్యుండునునగు నీలకంఠుని భజించెదను.

అ. మహాదేవం మయూరత్వే నిరూపణేన స్తౌతి:—

వ్యా. ఆకాశేతి. నీలకంఠం నీలః కంఠో యస్యే త్యుభయత్రాపితుల్యావ్యుత్పత్తిః నీలకంఠమేవ నీలకంఠం మయూరం భజే కథం భూతం నీలకంఠ మిత్యాకాంక్షాయా మాహ—యః మయూరత్వేన నిరూపితః ఆకాశేన శిఖీశిఖాస్యాస్తీతి శిఖీ ఆకాశేన శిఖీ వ్యోమకేశత్వా త్సమస్తఫణినాం నేత్రా సమస్తసర్పాణా మధిపతినా ఆదిశేషేణ కలాపీ కలాపో స్యాస్తీతి కలాపీకలాపో భూషణే బర్హ ఇత్యమరః. నతానుగ్రాహిప్రణవోపదేశనినదైర్నతానంతః ప్రపణమనస్కా— నను గృహ్ణాతి తచ్ఛీల మస్యేతివ్యుత్పత్త్యానతానుగ్రాహీ నతానుగ్రహణశీల ఇత్యర్థః స చాసౌ ప్రణవశ్చ తస్యోపదేశో విజ్ఞాపనం తజ్జన్యనినదై ర్ధ్వనిభిః కేకీతి చ గీయతే త్రిభి ర్విశేషణైః శ్శిఖిత్వ కలాపిత్వ కేకిత్వరూపధర్మాః పరమశివే ఉపపాద్యంత ఇతభావః. శ్యామాంశ్యామలవర్ణాం ఘనరుచింఘనస్య మేఘస్యేవ రుచిః కాంతి ర్యస్యాస్తాం శైలసముద్భవాం శైలస్సముద్భవః ఉత్పత్తిహేతు ర్యస్యాస్తాం దృష్ట్వాముదా సంతోషేణ నటంతం నృత్యంతం ఘనరుచిం మేఘశోభాం దృష్ట్వానటంతమితి మయూరపక్షే వేదాంతోపవనే వేదాంతః ఉపనిషత్సఏవోపవనం క్రీడావనం తస్మిన్విహారరసికం సరసం తం నీలకంఠ మహం భజే ఇతి క్రియాయా మన్వయః స్పష్టార్థోఽయం.

పార్వతీ పరమేశ్వరులను మయూరీమయూరములుగా నిరూపించి ప్రార్థించుచున్నారు.—

సంధ్యాఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటాచంచలా,
భక్తానాం పరితోషబాష్పవితతి ర్వృష్టి ర్మయూరీ శివా
యస్మి న్నుజ్జ్వలతాండవం విజయతే తం నీలకంఠం భజే.

టీ. సంధ్యా=సాయంకాలము, ఘర్మదినాత్యయః=వర్షారంభకాలము గను, హ...నః-హరి=విష్ణుమూర్తియొక్క, కర=హస్తములచేతనైన, ఆఘాత=వాయింపుచేత, ప్రభూత=పుట్టిన, ఆనక=మద్దెలయొక్క, ధ్వానః=ధ్వని, వారిదగర్జితం=ఉఱుముగను, దివిషదాం=దేవతలయొక్క, దృష్టిచ్ఛటా=చూపులపరంపర, చంచలా=మెఱుపుగను, భక్తానాం=భక్తులయొక్క, పరితోషబాష్పవితతిః=ఆనందాశ్రుధార, వృష్టిః=వర్షముగను, శివా=పార్వతీదేవి, మయూరీ=ఆడనెమిలిగను, యస్మిన్=ఏనీలకంఠుఁడను నెమలియందు, ఉ...వం-ఉజ్జ్వల=ప్రకాశమానమైన, తాండవం = తాండవమనునృత్యము, విజయతే = సర్వోత్కృష్టముగానున్నదో, తం=ఆ, నీలకంఠం=శివుని, భజే =కొలుచుచున్నాను.

తా. ప్రదోషకాలమను వర్షాకాలంబున శ్రీహరివాయించు మద్దెల చప్పుడుఱుముగను నంతరిక్షమందుండి చూచుచున్న దేవతలచూడ్కులు మెఱుపులుగను భక్తుల యానందబాష్పధార ధారావృష్టిగను జెలువొందఁ బరమానందముతోఁ దాము మయూరీమయూరములుగాఁ దాండవనృత్యక్రీడాభిరతులైన పార్వతీపరమేశ్వరుల నాశ్రయింతును. 54

అ. పార్వతీపరమేశ్వరౌ మయూరీమయూరత్వ నిరూపణేనస్తౌతి.-

వ్యా. సంధ్యా ఇతి. సంధ్యాసాయంసమయ ఏవ ఘర్మదినాత్యయః ఘర్మదినాని గ్రీష్మదివసాస్తా న్యతియంతి యస్మిన్ సః ఘర్మదినాత్యయః మేఘప్రాదుర్భావకాలఇత్యర్థః. హరికరాఘాతప్రభూతానకధ్వానః హరేః విష్ణోః కరాభ్యాం య ఆఘాతస్తాడనం తేన ప్రభూతః ప్రకర్షేణోత్పన్నః ఆనకస్య వాద్యవిశేషస్య ధ్వానః ధ్వని స్స ఏవ వారిదగర్జితం మేఘస్తనితమ్.

దివిషదాం దేవానాం దృష్టిచ్ఛటాదృష్టీనాం వీక్షణానాం ఛటాసమూహ స్సైవ చంచలావిద్యుద్భక్తానాం సేవమానానాం పరితోషబాష్ప ఆనందాశ్రూణి తేషాం వితతి ర్ధారాసైవ వృష్టి ర్జలోత్సర్గ శ్శివా పార్వతీ సా మయూరీ పుంయోగే జీష్ నీలకంఠఏవ నీలకంఠః పుమాన్మయూర స్తం భజే యస్మిన్నీలకంఠే ఉజ్జ్వలతాండవ ముజ్జ్వలం ప్రకాశమానం తాండవం నటనం విజయతే సర్వోత్కర్షేణ వర్తతే స్వలింగసహితో వర్ష ర్తుర్వ్యధామయూరతా ణా మానందతాండవహేతు రేవం సంధ్యాసమయః పార్వతీపతే రానంద తాండవహేతురితిభావ స్తత్సమయే తస్య సాయంనటత్వప్రసిద్ధే ర్నీలకంఠే మయూరత్వారోపణమాత్రేణ ప్రకృతాలంకారపూర్తౌ సత్యాం శివాయాం మయూరీత్వారోపణం తస్యా అపి స్తుతికోటిప్రవేశం ద్యోతయతి శివా యాః యద్యపి భజనక్రియాయాం నాన్వయ స్తథాపి తస్యాః పృథఙ్మయూరీత్వారోపణే స్తుతివిషయతాం వినా అన్యత్ఫలం నపశ్యామః.

ఆద్యాయామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయసాధ్యాయ తే
విద్యానందమయాత్మనే త్రిజగత స్సంరక్షణోద్యోగినే,
ధ్యేయాయాఖిలయోగిభి స్సురగణై ర్గేయాయమాయావినే
సమ్యక్తాండవసంభ్రమాయ జటినే సేయం నతి శ్శంభవే. 55

టీ. ఆద్యాయ = ప్రపంచమునకు మొదటివాఁడును, అమితతేజసే= మితిలేని తేజస్స్వరూపముగలవాఁడును, శ్రుతిపదైః = వేదవాక్యములచేత, వేద్యాయ= తెలియఁదగినవాఁడును, సాధ్యాయ = భక్తానుగ్రహమునకొఱకు ప్రతిమాదిరూపమునఁ బ్రతిష్ఠింపఁబడినవాఁడును, విద్యానందమయాత్మనే= చిదానందమయమైనయాత్మస్వరూపుఁడును, త్రిజగతః=ముల్లోకములయొక్క సం... నే-సంరక్షణ=కాపాడుటయందు, ఉద్యోగినే=ప్రవృత్తిగలవాఁడును, అఖిలయోగిభిః = యోగులందఱిచేతను, ధ్యేయాయ= ధ్యానించఁదగినవాఁడును, సురగణైః=దేవగణములచేతను, గేయాయ = గానముసేయఁదగినవాఁడును, మాయావినే=చిచ్ఛక్తితోఁగూడినవాఁడును, సమ్యక్తాండవసంభ్ర

మాయ=చక్కని తాండవనృత్యమందు తొందరగలవాఁడును, జటినే=జడలు దాల్చినవాఁడును, శంభవే=సుఖకరుండునునగు, తే=నీకొఱకు, సా=అ, ఇయం=ఈ, నతిః=నమస్కారము అగుఁగాక.

తా. ఎవరెవరి నుద్దేశించి చేసిననమస్కారమైనను సర్వజగత్కార ణుండును సర్వాంతర్యామియునగు శుద్ధస్వరూపుఁడైన యాపరమశివునికే చెందుఁగాక యని తాత్పర్యము.

అ. శుద్ధరూపం శంభుం నమస్కరోతి:—

వ్యా. ఆద్యాయేతి. శంభవే శం సుఖ మస్మాద్భవతీతి శంభుస్తస్మై సా యా నతి స్స్వర్గోద్దేశ్యకా భాతిలోకే సేయం నతి శ్శంభవే శంభూద్దేశ్య కాభవత్వితి ప్రార్థనా స్వర్గోద్దేశ్యకాయాః నతే శ్శంభుమాత్రోద్దేశ్యక త్వప్రార్థనాకథం ఘటతే ఇతిచే త్తస్యైవ కృత్స్నజగత్కారణత్వేనసర్వా త్మత్వాద్ఘటత ఇత్యాహ_ఆద్యాయకృత్స్నజగదుత్పత్తేః పూర్వం విద్యమా నాయ నిత్యాయేత్యర్థః తత్కుతఇతి చేదాహ- అమితతేజసే అమితమపరి చ్ఛిన్నం తేజః జ్యోతి స్తత్స్వరూపాయ తత్కేనవేద్యతే ఇతిచేదాహ శ్రుతిపదై ర్వేదవాక్యై ర్వేద్యాయ బోధ్యాయ అర్చాదిరూపేణ కథందృ శ్యతే ఇతిచేదాహ—సాధ్యాయ భక్తానుగ్రహార్థం ప్రతిష్ఠాప్యాయతత్స్వ రూపం కిమితి చేదాహ—విద్యానందమయాత్మనేవిద్యాచిత్ ఆనందస్సుఖం తన్మయం తదభిన్నం ఆత్మస్వరూపం యస్యతస్మై స్వార్థే మయట్ తస్య లీ లామయం వ్యాపారమాహ—త్రిజగత స్సంరక్షణోద్యోగినే త్రయాణాం జ గతాం సమాహార స్త్రిజగ త్తస్యసంరక్షణే ఉద్యోగినే ప్రవృత్తిమతేసఃయో గైకగమ్యఇత్యాహ అఖిలయోగిభి రఖిలై ర్యోగిభి స్సమాధిమద్భిర్ధ్యేయా య ధ్యాతుమర్హాయ ఏవంభూతః కైర్గీయత ఇతిచేదాహ-సురగణైర్దేవసంఘై ర్గేయాయగాతుం యోగ్యాయతస్య నిత్యశక్తియోగమాహ-మాయావినే మా యాచిచ్ఛక్తి స్సాస్యాస్తీతి మాయావీ అస్మాయామేధాస్రజోవినిరితి వినిః సమ్యక్తాండవ సంభ్రమాయ సమ్యక్తాండవం సమీచీననర్తనం తస్మిన్సంభ్ర మస్త్వరాయస్య తస్మై జటినే జటాః అస్య సంతీతి జటీతస్మై భక్తానుగ్రహా

ర్థం మునిరూప మాశ్రయమాణాయేత్యర్థః తస్మై నతి రితి క్రియాన్వయః. స్పష్టోఽర్థః.

సకలప్రపంచస్వరూపుఁడగు పరమశివుని గొనియాడుచున్నారు.—

నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే
సత్యాయాదికుటుంబినే మునిమనః ప్రత్యక్షచిన్మూర్తయే,
మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాంత సంచారిణే
సాయం తాండవసంభ్రమాయ జటినే సేయంనతిశ్శంభవే.

టీ. నిత్యాయ=నిత్యుఁడును (చలనములేనివాఁడు), త్రిగుణాత్మనే =సత్త్వరజస్తమోగుణములు శరీరములుగాఁ గలవాఁడును (బ్రహ్మవిష్ణు రుద్ర స్వరూపుఁడు), పురజితే=స్థూలసూక్ష్మకారణశరీరములను, లేక త్రిపురా సురులను జయించినవాఁడును, కాత్యాయనీశ్రేయసే=పార్వతీదేవియొక్క తపఃఫలమైనవాఁడును, సత్యాయ=భూతభవిష్యద్వర్తమానకాలములు మూ టియందును బాధలేనివాఁడును, ఆదికుటుంబినే=మొట్టమొదటి సంసారియై నవాఁడును,ము... యే-మునిమనః=మునీశ్వరులయొక్క మనస్సులకు,ప్రత్య క్ష=గోచరమైన, చిన్మూర్తయే=చిత్స్వరూపముగలవాఁడును, మా...య-మాయా=మాయాశక్తిచేత, సృష్ట=సృజింపఁబడిన, జగత్త్రయాయ=ముల్లో కములు గలవాఁడును, స...ణే-సకల=సమస్తమైన, ఆమ్నాయాంత=ఉపని షత్తులయందును, సంచారిణే=సంచరించువాఁడును (ఉపనిషద్వాక్యములచే బోధింపఁబడువాఁడు), సాయం=సాయంకాలమున, తాండవసంభ్రమాయ= తాండవమాడుతొందరగలవాఁడును, జటినే=జడలుదాల్చినవాఁడును, శంభ వే=సుఖోత్పత్తికారణమైనవాఁడును నగు పరమేశ్వరునికొఱకు, సా=ఆ, ఇయం=ఈ, నతిః=నమస్కారము అగుఁగాక.

తా. నిత్యుఁడును, బ్రహ్మవిష్ణు రుద్రరూపములు గలవాఁడును, త్రి పురవిజయియు, కాత్యాయనీమనోహరుఁడును, సత్యస్వరూపుఁడును, ము నులమనంబులకు గోచరమగు చిత్స్వరూపుఁడును, మాయవలన ముల్లోకములు

గల్పించువాఁడును, వేదాంతవేద్యుండును, తాండవనృత్యమునందుఁ బరమానందము నొందువాఁడును, జటాజూటముగలవాఁడును, మొట్టమొదటి సంసారియునగు శివునికి నానమస్కారము.

అ. సకలప్రపంచరూపిణం పరమశివం స్తౌతి:—

వ్యా. నిత్యాయ ధ్రువాయ చలనరహితాయేత్యర్థః త్రిగుణాత్మనే త్రయోగుణా స్సత్వరజస్తమాం స్యాత్మాన శ్శరీరాణి యస్య తస్మై బ్రహ్మవిష్ణురుద్రాత్మనే ఇత్యర్థః పురజితే పురాణి స్థూలసూక్ష్మకారణాఖ్యశరీరాణి తాని జయతీ త్యభిభవతీతి పురజిత్ తస్మై అథవా ప్రసిద్ధాని త్రీణి పురాణి "తేషా మసురాణా మి"త్యర్థవాదసిద్ధాని తాని జయతీ త్యభిభవతీతి పురజిత్తస్మై కాత్యాయనీ శ్రేయసే కాత్యాయన్యాః పార్వత్యా శ్శ్రియ సేతపః ఫలరూపాయ సత్యాయ కాలత్రయాబాధ్యాయ ఆదికుటుంబినే ప్రాథమిక సంసారిణే భక్తానుగ్రహాయ కుటుంబవేషధారిణే ఇత్యర్థః మునిమనః ప్రత్యక్షచిన్మూర్తయే మునీనాం మనాంసి తేషాం ప్రత్యక్షోగోచరః చిన్మాత్రిశ్చిచ్ఛరీరంయస్య తస్మై మాయాసృష్టజగత్రయాయ జగతాం త్రయం జగత్రయంమాయయాసృష్టం మాయాసృష్టం మాయాసృష్టం జగత్రయం యేన తస్మై సకలామ్నాయాంతసంచారిణే సకలోపనిషత్ప్రతిపాద్యాయేతిభావః సాయం తాండవసంభ్రమాయ తురీయపాదస్య పూర్వవదేవార్థః. స్పష్టోఽర్థః.

సేవించుటయందు నేర్పులేనివాఁడనైనను నన్ను తప్పక సంరక్షించవలయునని సహేతుకముగాఁ జెప్పుకొనుచున్నారు.—

నిత్యం స్వోదరపోషణాయ సకలా నుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవత స్సేవాం నజానే విభో,
మజ్జన్మాంతరపుణ్యపాకబలత స్త్వంశర్వసర్వాంతర
స్తిష్ఠ స్యేవహి తేనవాపశుపతే తేరక్షణీయోఽస్మ్యహమ్.

టీ. నిత్యం=అనుదినమును, స్వోదరపోషణాయ=తనపొట్టపోసికొనుటకొఱకు, విత్తాశయా=ధనలోభముతో, సర్వాన్ = ధనముగలవారినంద

అను, ఉద్దిశ్య=గుఱించి, వ్యర్థం=నిష్ప్రయోజనముగా, పర్యటనం=సంచారమును, కరోమి=చేయుచున్నాను. హేవిభో=సర్వవ్యాపకుఁడవైనయోదేవా! భవతః=నీయొక్క, సేవాం=భజనమును, నజానే=ఎఱుఁగను. హేపశుపతే=సర్వప్రపంచపాలకుండవును, హేశర్వ = భక్తపాపధ్వంసకుఁడవునగు పరమేశ్వరా! మ...తః-మజ్జన్మాంతరపుణ్య=నాపూర్వజన్మార్జితపుణ్యముయొక్క, పాకబలతః=పరిపాకవశమువలన, త్వం=నీవు, సర్వాంతరః=అన్నమయాదికోశము లన్నిటికంటెను సూక్ష్మరూపుఁడవై యంతర్యామివిగానాయంతరంగమున, తిష్ఠస్యేవహి=ఉన్నావుగదా. తేనవా = ఆహేతువుచేతనైనను, తే=నీకు, అహం=నేను, రక్షణీయః=రక్షింపఁదగినవాఁడను, అస్మి=అగుదును.

తా. దేవా! పొట్టపోసికొనుటకు ధనాశతో ధనవంతుల నెందఱనో యాశ్రయించి తిరుగుచుంటినేగాని నినుసేవించుట యెంతమాత్రమెఱుఁగకయుంటిని. ఇంతమాత్రముతో నన్నుపేక్షించి యూరకుండకుము. పూర్వజన్మమం దేదో యించుక పుణ్యముచేసికొంటిని గావుననేగదా! సర్వాంతర్యామివగు నీవు నాయందును పంచకోశవిలక్షణుండవైయున్నావు. కాన నన్ను రక్షించుభారము నీమీఁద నున్నది.

ఆ, సేవాపరిజ్ఞానశూన్యోప్యహం తే అవశ్యం సంరక్షణీయ ఇత్యత్ర హేతు మాహ.—

వా. నిత్యమితి. నిత్య మనవరతం స్వోదరపోషణాయ స్వోదరంకుక్షి స్తస్య పోషణాయ తదాదిసర్వాంగానాం పుష్టికారణాయ విత్తాశయా ధనవాంఛయా సకలానుద్దిశ్య సర్వాన్విత్తవతః నిమిత్తీకృత్యవ్యర్థం నిష్ప్రయోజనం పర్యటనం పరితస్సంచరణం కరోమి రచయామి మత్సేవాకరణేన సప్రయోజనం క్రియతా మితిచే త్తత్రాహ - హేవిభోసర్వవ్యాపక ఈదృశస్య భవత్సేవాం భజనం నజానే తర్హి కింక ర్తవ్యమితి ప్రార్థయసే ఇతిచేత్తత్రాహ.—హే పశుపతే పశూనాం బ్రహ్మాదిస్తంబాంతానాం సర్వేషాం పతే పాలక. హి యస్మా న్మజ్జన్మాంతరపుణ్యపాకబలతః మమ జన్మాంతరే

ష్వన్యేషు జన్మసు కృతాని యాని పుణ్యాని తేషాం పాకబలతః పాకస్యఫల ప్రదానోన్ముఖత్వం తద్వశాత్ హే శర్వ భక్తపాపహింసకః త్వం సర్వాంతరః అన్నమయాదిభ్యః కోశేభ్యః అంతరః సూక్ష్మత్వే నాంతర్యామితయా తిష్ఠన్నేవ స్థితిం కరోష్యేవ తేన వా హేతునా తే త్వయా కర్తరి షష్ఠీ అహం రక్షణీయోఽస్మి. రక్షితుం యోగ్యో భవామి. స్పష్టార్థోఽయం.

అజ్ఞానమును తెలఁ దొలఁగించి సాక్షాత్కరింపుమని పరమేశ్వరుని వేఁడుకొనుచున్నారు:—

ఏకోవారిజబాంధవః క్షితినభో వ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోపి భవతి త్వం కోటిసూర్యప్రభః,
వేద్యః కిం నభవ స్యహో ఘనతరం కీదృగ్భవే న్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయమే పశుప తే సాక్షాత్ప్రసన్నో భవ.

టీ. హేపశుపతే=ఓయిపరమేశ్వరా! వారిజబాంధవః=పద్మబాంధవుఁడైనసూర్యుఁడు, ఏకః=ఒక్కఁడయ్యును, క్షితినభోవ్యాప్తం=భూమ్యంతరిక్షములు నిండిన, తమోమండలం=అంధకారరాశిని, భిత్వా= భేదించి, లోచనగోచరోఽపి = కన్నులకగపడుచున్నవాఁడును, భవతి=అగుచున్నాఁడు. త్వం=నీవు, కోటిసూర్యప్రభః=కోట్లకొలఁది సూర్యులయొక్క కాంతిగలవాఁడవు, వేద్యః = తెలిసికొనఁదగినవాఁడవు, కింనభవసి=ఏలకావు? అహో=ఎంతవింత! ఘనతరం = మిగులదట్టమైనది యయ్యును, మత్తమః = నాయజ్ఞానాంధకారము, కీదృక్ = ఏపాటిది, భవేత్=అగును ? తత్ = కనుక, సర్వం=ఆయజ్ఞానమునంతను, వ్యపనీయ=తొలఁగించి, సాక్షాత్ = ప్రత్యక్షమై, ప్రసన్నః=అనుగ్రహించువాఁడవు, భవ=అగుమా.

తా. దేవా! మహాదేవా! ఒక్కసూర్యుఁడే భూమి ఆకాశమునిండిన చీఁకటినిబోఁగొట్టి కన్నులకగపడుచున్నాఁడు. కోటిసూర్యులవెలుఁగొందుచున్నాఁడవు. నీవేల ప్రత్యక్షముగావు ? ఎంతదట్టముగానున్నను నాయజ్ఞానాంధకారము దొలఁగించుట నీకొకలెక్కయా? కాదుకాదు. నాయజ్ఞానము బాపి సాక్షాత్కరించి యనుగ్రహింపుము.

అ. అజ్ఞానరూపప్రతిబంధభేదనపూర్వకం పశుపతిసాక్షాత్కారం ప్రార్థయతే.—

వ్యా. ఏకేతి. హే పశుపతే అజ్ఞానవారక? వారిజబాంధవః పద్మబంధు రేకో౽ద్వితీయస్సన్ క్షితినభోవ్యాప్తం క్షితి ర్భూమిః నభ ఆకాశంచ క్షితినభసీ తే వ్యాప్తంవ్యాప్యస్థితం తమోమండల మంధకారసమూహం భిత్వా లోచనగోచరోపి చక్షుర్విషయోపి భవతి. త్వం తు కోటిసూర్యప్రభః అపరిమితసూర్యాణాం ప్రభేవ ప్రభా యస్య తథోక్త స్త్వం వేద్యః జ్ఞానవిషయః కిం సభవసి కిమితి నభవసి ఘనతరమతిశయేన సాంద్రమపి మత్తమః మమాజ్ఞానరూపం. తమః కీదృక్తవ కియదిత్యర్థః తత్తస్మా త్సర్వం కృత్స్నం పూర్వోక్తం తమః వ్యపనీయాపనోద్య సాక్షాత్ ప్రత్యక్షః ప్రసన్నః అనుగ్రాహక శ్చ భవ ఏధి. ఏకస్మిన్నేవ సూర్యే సకలజనప్రత్యక్షే సమస్తతమోభేదిని చ సతి తత్కోటిసదృశ స్త్వ మప్రత్యక్షః అతమోభేదీ చ భవసీతి యత్తచ్చిత్రం తస్మా త్ప్రత్యక్ష స్తమోనివర్తక శ్చ భవేతి భావః.

అయ్యో తెలుఁగున నీపాదారవింద భజనము సేయ నాచిత్తము గోరుచున్నది అనుచున్నారు.—

హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా,
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్. 59

టీ. హేపశుపతే=సకలభూతములకునధిపతియు, హేవిభో=సర్వవ్యాపకుఁడవునగు, హేగౌరీనాథ= ఓపార్వతీపతీ ! హంసః=హంసపక్షి, పద్మవనం=కమలములగుంపును, చాతకః=చాతకపక్షి, నీలాంబుదం=నల్లమబ్బును, కోకః=చక్రవాకపక్షి, కోకనదప్రియం=సూర్యుని, చకోరః=చకోరపక్షి, ప్రతిదినం=దినదినమును, చంద్రం=చంద్రునిని, యథా=ఏప్రకారముగా,

సమిచ్ఛతి=కోరుచున్నదో, తథా=అప్రకారముగా, మామకం=నాసంబంధమైన, చేతః=చిత్తము, చిన్మార్గమృగ్యం=ఉపనిషత్తులయందు వెదుకఁదగిన, కైవల్యసౌఖ్యప్రదం=కేవలనిర్గుణపరబ్రహ్మభావంబనుసౌఖ్యం బొసఁగునట్టి,భవత్పాదాబ్జయుగళం=మీపాదపద్మద్వంద్వమును, వాంఛతి=కోరుచున్నది.

తా. పార్వతీవల్లభా! హంస పద్మములను, చాతకము వర్షాకాలమేఘమును, చక్రవాకము సూర్యుని, చకోరము చంద్రునిఁగోరినట్లు, ఉపనిషద్వేద్యమై కైవల్యసౌఖ్యము నొసఁగునట్టి నీపాదకమలమును నాచిత్తము కోరుచున్నది.

అ. సోపమానం త్వత్పాదారవిందభజనం మన్మనః వాంఛతీతి ప్రార్థయతే:—

వ్యా. హంసఇతి. హే పశుపతే హే విభో హే గౌరీనాథ! హంసః పద్మవనం కమలషండం యథా సమిచ్ఛతి వాంఛతి చాతకః జలదోత్సృజ్యమానోదకబిందూనపేక్షమాణః పక్షివిశేషః నీలాంబుదం వర్షుకమేఘం యథా వాంఛతి సమిచ్ఛతి కోక శ్చక్రవాకః కోకనదప్రియం పద్మబంధుం సూర్యమిత్యర్థః యథా చకోరశ్చంద్రకిరణభు క్పక్షివిశేషశ్చంద్రం సమిచ్ఛతి తథా మామకం మదీయం చేతశ్చిత్తం చిన్మార్గమృగ్యం చిన్మార్గే షూపనిషత్సుమృగ్య మన్వేషణీయం కైవల్యసౌఖ్యప్రదం కైవల్యం కేవలం నిర్గుణం బ్రహ్మ తస్య భావ స్తత్త్వం తదేవ సౌఖ్యం సుఖం తత్ప్రదదాతీతి తత్ప్రదం భవత్పదాబ్జయుగళం భవతః పదేబ్జే ఇవ భవత్పదాబ్జే తయోర్యుగళం వాంఛతి అభిలషతి. స్పష్టార్థోఽయం.

తనమనమును శంకరుపాదసేవచేయుమని నియమించుచున్నారు:—

రోధ స్తోయహృత శ్శ్రమేణ పథిక శ్ఛాయాంతరోర్వృష్టితో
భీత స్స్వస్థగృహం గృహస్థ మతిథి ర్దీనః ప్రభుం ధార్మికమ్,
దీపం సంతమసాకుల శ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేత స్సర్వభయాపహం వ్రజసుఖం శంభోఃపదాంభోరుహమ్.

టీ. హేచేతః=ఓమానసమా! తోయప్లుతః=నీటివేగమునఁగొట్టుకొని పోవువాఁడు, రోధః=తీరమును, పథికః=బాటసారి, శ్రమేణ=అలసట చేత, తరోః=చెట్టుయొక్క, ఛాయాం = నీడను, వృష్టితః=వర్షమువలన, భీతః= భయపడినవాఁడు స్వస్థగృహం=సుఖమైనయిల్లును, అతిథిః = భోజనసమయమునకుఁ పొరుగూరనుండి వచ్చినవాఁడు, గృహస్థం=సంసారిని, దీనః=దరిద్రుఁడు, ధార్మికం=ధర్మాత్ముఁడైన, ప్రభుం = రాజును, సంతమసాకులః= చీఁకటిలోఁగొట్టుకొనుచున్నవాఁడు, దీపం=దీపమును, శీతావృతః=చలిపట్టుకొన్నవాఁడు, శిఖినంచ=అగ్నిహోత్రమునున్ను, యథా=ఏప్రకారముగా (ఆశ్రయించునో), తథా=ఆప్రకారముగా, త్వం=నీవు, సర్వభయాపహం= ఎల్లభయములను బాపునదియు, సుఖం = సుఖకరమైనదియునగు, శంభోః= శివునియొక్క, పదాంభోరుహం=పాదకమలమును, వ్రజ=ఆశ్రయింపుము.

తా. చెట్టునీడ నడకవలనిబడలిక మాత్రము దీర్చును. గట్టియిల్లు వానకుఁదడియకుండ నాపును. ఏటియొద్దు ప్రవాహవేగమునఁగొట్టుకొనిపోకుండ సహాయమగును. గృహస్థు అతిథియొక్క ఆకలినిమాత్రము తీర్చును. ధర్మాత్ముఁడైన ప్రభువు దారిద్ర్యముమాత్రము తొలఁగించును. దీపము చీఁకటిఁబాపి వెలుతురునిచ్చును. నిప్పుదగ్గఱకుఁబోయిన చలిపోనాడు. ఓచిత్తమా! పరమేశ్వరుని పాదపద్మము సంసారమందలి సమస్తభయములను బోఁగొట్టును. నీవీశ్వరపాదకమలము నాశ్రయించి సుఖంబు గనుము.

అ. చేతస స్సోపమానం శంభోః పాదాంబుజభజనం విధత్తే :—

వ్యా. రోధఇతి. హే చేతః మానస! తోయప్లుత స్తోయేన వేగవతా జలేన ప్లుతః ఆకృష్టః పురుషః రోధఃతీరం యథా వ్రజతి పథికః మార్గగామీ శ్రమేణ గ్లాన్యా తరోర్వృక్షస్య ఛాయామనాతపం యథా వృష్టితః వర్షాద్భీతః భయం ప్రాప్తః పురుష స్స్వస్థగృహం స్వరిత్యవ్యయం సుఖేన తిష్ఠంత్యస్మిన్నితి స్వస్థం సుఖావస్థానాధికరణం గృహంయథా అతిథిర్వైశ్వదేవాంతే అన్నాపేక్షయా గ్రామాంతరా దాగచ్ఛ న్పురుషఃగృహస్థం గార్హస్థ్యధర్మయుక్తం సంసారిణం యథా దీనః దారిద్ర్యతప్తః పురుషః ధార్మి

కం ధర్మానుసారిణం ప్రభుం దానసమర్థం పురుషం యథా సంతమసాకుల స్సంతమసేన గాఢాంధకారేణ పీడ్యమానః దీపం యథా శీతావృత శ్శీతేన హిమేన ఆవృతః వ్యాప్తః పురుషః శిఖిన మగ్నిం యథా తథా త్వం సర్వభయాపహం సకలభయఘ్నం సుఖం సుఖకరం శంభో శ్శివస్య పదాంభోరుహం వ్రజ ప్రాప్నుహి. దృష్టాంతభూతార్థజాతం తత్తత్సంకటమాత్రనివర్తకం దార్ష్టాంతికం పదాంభోరుహం తు సంకటసుఖయో ర్నివర్తనప్రవర్తనహేతుత్వా దవశ్యగమ్య మితిభావః.

భక్తిస్వరూపము నిర్ణయించుచున్నారు.—

అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధు స్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే. 61

టీ. ఇహ=ఈలోకమందు, నిజబీజసంతతిః = తనగింజలరాశి, అంకోలం=ఊడుగుచెట్టును, సూచికా=సూది, అయస్కాంతోపలం = సూదంటుఱాయిని, సాధ్వీ=పతివ్రత, నైజవిభుం = తనభర్తను, లతా=తీఁగ, క్షితిరుహం=వృక్షమును, సింధుః = నది, సరిద్వల్లభం = సముద్రమును, యథా= ఏప్రకారముగా (తనంతట తానే), ప్రాప్నోతి=పొందుచున్నదో, తథా = ఆప్రకారముగా, చేతోవృత్తిః=చిత్తవృత్తి, పశుపతేః=ఈశ్వరునియొక్క, పాదారవిందద్వయం = పాదకమలయుగళమును, సదా = ఎల్లప్పుడును, ఉపేత్య=పొంది, తిష్ఠతి = ఉండుట ఏదికలదో, సా=అది, భక్తిరితి=భక్తి యని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. ఊడుగుగింజలుపండి నేలరాలిపోయి మరల వానికవియే యాచెట్లు నంటుకొనిపోవును. సూది సూదంటుఱాయిదగ్గఱకు పరుగెత్తిపోయి దానినంటుకొనును. పతివ్రత యొడఁబాయక యొన్నడుఁదనపతిని వెంబడించి యుండును. తీఁగ దాని కదియే చెట్టునల్లుకొని పెనవైచుకొనును. నదులు

దొరలిదొరలిపోయి సముద్రముతో నేకమగును. అట్లు మనోవృత్తి శివుని చరణకమలములయందుఁ జొచ్చియుండుటయే భక్తి (పరమశివసాయుజ్యము వలయుననుప్రీతి) యని పెద్దలు చెప్పుదురు.

అ. భక్తిరూపం నిశ్చినోతి:—

వ్యా. అంకోలమితి. నిజబీజసంతతి ర్నిజాని చ తాని బీజాని చ తేషాం సంతతి స్సమూహః అంకోల మంకోలః వృక్షవిశేష స్తం యథా స్వయమేవ ప్రాప్నోత్యస్య వృక్షవిశేషస్య బీజాని పరిపాకకాలే భూమౌ పతిత్వా పురుషప్రయత్నం వినైవ పునస్స్వస్థానం ప్రవిశంతీతి ప్రసిద్ధిః సూచికా అయోమయీ సూక్ష్మశలాకికా అయస్కాంతోపల మయస్కాంత స్స్వయం లోహాకర్షణశక్తోపలవిశేష స్తం యథా సాధ్వీ పతివ్రతా నైజ మాత్మీయంవిభుం భర్తారం యథా స్వయం లతా వ్రతతిః క్షితిరుహం వృక్షం యథా స్వయం సింధు స్సరిత్సరిద్వల్లభం నదీపతి మిహాత్ర యథా ప్రాప్నోతి చేతోవృత్తిః చిత్తస్య వ్యావృత్తిః పశుపతే ర్మహాదేవస్య పాదారవిందద్వ యం చరణపద్మయుగళం స్వయ ముపేత్య సదా సర్వదా తథా తిష్ఠతీతి యత్సా భక్తిః పరమశివే ప్రీతి స్తత్సాయుజ్యం మే భూయాదితి ప్రీతి రిత్యుచ్యతే అభిధీయతే భక్తిరేతాదృశీతి నిశ్చినోమీతి భావః.

తల్లి బిడ్డను పోషించునట్లు భక్తిభక్తుని కాపాడునని చెప్పుచున్నారు—

ఆనందాశ్రుభి రాతనోతి పులకం నైర్మల్యత శ్ఛాదనం
వాచాశఙ్ఖముఖస్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః,
రుద్రాక్షై ర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యఙ్కే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి. 62

టీ. హే దేవ!=స్వయంప్రకాశస్వరూపుఁడవైనఓపరమేశ్వరుఁడా! భక్తిజననీ=నీభక్తియనియెడు తల్లి, ఆనందాశ్రుభిః = ఆనందబాష్పములచేత, పులకం=రోమాంచమును, ఆతనోతి=విస్తరింపఁజేయును. నైర్మల్యతః=నిర్మలత్వముచేత, ఛాదనం (ఆతనోతి)=(ఈఁగలు దోమలు చలి మొదలగు బాధ

లేకుండ) బట్టకప్పుటయు నొనర్చును. వాచాశంఖముఖస్థితైః = వేదవాక్యము శంఖముయొక్క ముఖమందున్నట్టి, చ...తైః-చరిత్ర = నీచరిత్రములని యెడు, అమృతైః = పాలతో, జఠరాపూర్తిం (ఆతనోతి) = కడుపునిండఁ జేయును. రుద్రాక్షైః=రుద్రాక్షలచేతను, భసితేన = విభూతిచేతను, వపుషః= శరీరముయొక్క, రక్షాం (ఆతనోతి) = సంరక్షణముచేయును. భవద్భావనా పర్యంకే=నీతలంపనియెడు మంచమందు, వినివేశ్య=పరుండఁబెట్టి, భక్తార్భకం=భక్తుండను శిశువును, రక్షతి=కాపాడును.

తా. ఓమహాదేవా! తల్లి ప్రేమవల్ల నానందబాష్పములొలుక బిడ్డను జేరఁదీసి రోమాంచితగాత్రుని చేయునట్లు భక్తిరసము భక్తుని కానందబాష్పములొలికించి యొడలుపులకించి యుప్పొంగఁజేయును. తల్లి బిడ్డకు ఈఁగలు, దోమలు, చలి మున్నగుబాధలేకుండ బట్టకప్పినట్లు భక్తి నిర్మలభావము నావరింపఁజేయును. తల్లి శంఖములోఁ బోసి కడుపార పాలుగుడిపినట్లు భక్తి వేదాది వాక్యముఖముగా నీ చరిత్రామృతములు తనివిదీర నాస్వాదింపఁ జేయును. రుద్రాక్షములు ధరింపఁజేసి విభూతి పెట్టించి యంగరక్షఁ గావించును. తల్లి బిడ్డను మంచమునఁ బరుండఁబెట్టి కాపాడుచుండినట్లు భక్తి మనమునం దీశ్వరధారణయను మంచమునఁ బ్రవేశపెట్టి పరిపాలించును. భక్తరక్షకము భక్తిగాక వేఱొండు లేదని తాత్పర్యము.

అ. జననీవ ద్భక్తి ర్భక్తార్భకం రక్షతీత్యాహ.—

వ్యా. ఆనందాశ్రుభిరితి. హేదేవ స్వప్రకాశ స్వరూప! భక్తిజననీ తవ భక్తిరేవ మాతా సా భక్తార్భకం భక్తఏవార్భక శ్శిశుస్తం భవద్భావనా పర్యంకే భవతః భావనా మనసిధారణం సైవ పర్యంకః మంచః తస్మిన్వినివేశ్య శాయయిత్వా రక్షత్యవతి. రక్షణప్రకారమాహ-ఆనందాశ్రుభిః స్వంతోషబాష్పజలైః పులకం రోమాంచం శిశుశరీరే ఆతనోతి విస్తారయతి యథామాతా శిశుప్రేమజన్యనేత్రసలిలై శ్శిశుశరీరపతితై శ్శిశుశరీరే పులకముత్పాదయతి తథా స్వాశ్రయనిష్ఠచక్షుర్గళితై స్తచ్ఛరీరపతితైః పులకంజనయతీతి భావః.స్వాశ్రయభక్త్యో రభేదో వివక్షితః నైర్మల్యాతః భక్తశిశునిష్ఠ

నిర్మలభావేన ఛాదనం శీతమశకాదిపీడానివర్తకం వస్త్రరూపకం వచనమాతనోతి న్యైల్యాత ఇత్యత్ర సార్వవిభక్తిక స్తసిః వాచాశంఖ ముఖస్థితైః వాచా వేదాదివాక్ హలంతానాం వాగురేర్ముఖే రాబంతత్వస్యేష్టత్వా ద్వాచాశబ్దో నశంకాస్పదః. 'వష్టివాగురిరల్లోప'మితి కారికాత్ర ప్రమాణం. సైవ శంఖ స్తన్ముఖస్థితై స్తన్నిష్ఠై శ్చరిత్రామృతై ర్భవ చ్చరిత్రాణ్యేవామృతాని క్షీరాణి తైర్జఠరాపూర్తిం జఠరస్యోదరస్యాపూర్తిం సమంతాత్పూరణ మాతనోతి యథా శంఖస్థితేన పయసా శిశూదరం పూరయతి తథా భక్తజననీ పూర్వోక్తలక్షణై స్త్వచ్చరిత్రామృతై శ్శిశోః క్షుధానివృత్తిం సంపాద యతీతి భావః. రుద్రాక్షై ర్భసితేన భస్మనాచ వపుష శ్శరీరస్య రక్షామాతనో తీతి సర్వత్రానుషజ్యతే. భక్తరక్షణవిషయే భక్తితుల్యాన్యారక్షికా నాస్తీతి భావః. 52

శివభక్తియొక్క వైచిత్ర్యము వర్ణించుచున్నారు.—

మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే.
గండూషాంబునిషేచనం పురరిపో ర్దివ్యాభిషేకాయతే,
కించి ద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం నకరో త్యహో వనచరో భక్తావతంసాయతే. 63

టీ. పశుపతేః=శివునియొక్క, అంగస్య=అవయవమునకు, మార్గావర్తితపాదుకా=పలుమారు దారినడచినప్రాతచెప్పు, కూర్చాయతే=కనుబొమలవడువైనది. పురరిపోః = త్రిపురాంతకునికి, గండూషాంబునిషేచనం = పుక్కిలించిన నీరుచల్లుట, దివ్యాభిషేకాయతే = గంగాజలముతోడియభిషేకమయినది. కించిద్భక్షితమాంసశేషకబళం=కొంచెముతినఁగా మిగిలినమాంసపుతునుక, నవ్యోపహారాయతే = క్రొత్తనివేదనద్రవ్య మగుచున్నది. వనచరః = కిరాతుఁడు, భక్తావతంసాయతే = ఉత్తమభక్తుఁడగుచున్నాఁడు, భక్తిః=భక్తి, కిం న కరోతి=ఏమిచేయదు? అహో=ఎంతవిచిత్రము !

తా. ఆహాహా! ఏమి శివభక్తిమహిమ చమత్కారము ? చిరకాలము దారినడచి ప్రాతగిలిపోయిన కాలిచెప్పు ఆకాళహస్తీశ్వరునకు * కనుబొమలనడిమిచోటుగాఁ జేర్పనయ్యె. ఒకభక్తుఁడు పుక్కిలించి యుమిసిననీరు, త్రిపురహరునకు గంగాజలాభిషేకమయినది. సగము కొఱికితినఁగా మిగిలిన మాంసఖండము అజగదీశ్వరునకు మహానివేదనద్రవ్యముగా నుపయోగపడినది. అడవులందిరుగుచు మృగాదిహింసకుండైన కిరాతుండు భక్తాగ్రగణ్యుండయ్యె. ఇంతయేల? భక్తివల్ల ఏమేమి కానోపదు?

అ. శివభక్తేర్వైచిత్ర్యం వర్ణయతి:—

వ్యా. మార్గేతి. పశుపతేః శివసంబంధినః అంగస్యావయవస్య మార్గావర్తితపాదుకా మార్గే వ్యధ్వన్యావర్తితా సకృదనుభూతా పాదుకా పాదరక్షా కూర్చాయతే భ్రూమధ్యస్థానాయతే భ్రూమధ్యస్థానమివాచరతి పురరిపోః త్రిపురాంతకస్యాంగస్య గండూషాంబునిషేచనం ముఖప్రవేశితజలనిషేచనం దివ్యాభిషేకాయతే దివ్యాంబునః గంగాజలస్యాభిషేక ఇవాచరతి కించిద్భక్షిత మాంసశేషకబళం కించిదీషద్భక్షితం ఖాదితం మాంసం పలలం తస్య శేషః అవశిష్టాంశ ఏవ కబళం గ్రాసస్తస్న వ్యోపహారాయతే నవ్యః నూతనః ఉపహారః నివేద్యద్రవ్యం సఇవాచరతి వనచరః వ్యాధః భక్తావతంసాయతే భక్తశ్రేష్ఠ ఇవాచరతి సర్వత్రాచారార్థేక్యజ్ భక్తిః కిం నకరోతి సర్వం కరోత్యేవేతి భావః. స్పష్టోఽర్థః. పాదుకా కూర్చాయతఇత్యస్య కశ్చన భక్తః ఆరబ్ధకాళహస్తీశ్వరపూజనః భక్త్యతిశయేన మహాదేవస్య ప్రసాదసిద్ధయే భక్తదృఢతరభక్తి పరీక్షణాయ స్వముఖస్థయోర్నేత్రయో స్సాశ్రుణోః ప్రకటితయో స్సతో స్తత్స్థానే ప్రశస్తే స్వీయనేత్రేఉత్పాట్య దిత్సు స్తన్నేత్రస్థానప్రత్యభిజ్ఞానాయ స్వపాదుకాంభ్రువోర్మధ్యస్థానే నిచిక్షేపేతి పురాణప్రసిద్ధి బలాదుపపత్తిః.

* ఒకభక్తుఁడు, భక్తిదార్ఢ్యము పరీక్షించుటకు భగవంతుఁడు కన్నులనీరు దెచ్చుకొనఁగా,నవితీసి తనమంచికన్ను లమర్చఁబోయిగురుతునకుఁగాఁ దన కాలిచెప్పును దేవునికనుబొమలనడుమ నుంచినాఁడనిపురాణప్రసిద్ధము.

దేవా! నాచిత్తపాదుకలు దొడిగికొని విహరింపుము. అని వేడుకొనుచున్నారు.—

వక్షస్తాడన మంతకస్య కఠినాపస్మారసంమర్దనం
భూభృత్పర్యటనం నమత్సురశిరః కోటీరసంఘర్షణమ్,
కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే
మచ్చేతోమణిపాదుకావిహరణం శంభో సదాంగీకురు. 64

టీ. గౌరీపతే=పార్వతీవల్లభా! శంభో=మంగళకరుడా! అంతకస్య=యమునియొక్క, వక్షస్తాడనం=ఱొమ్ముదన్నుటయు, క...నం - కఠిన = కఠినమైన (భేదింపరాని), అపస్మార = స్వరూపాజ్ఞానముయొక్క, సమ్మర్దనం = నిగ్రహించుటయు (చితుకఁదొక్కుట), భూభృత్పర్యటనం = వెండికొండయందు సంచరించుటయు, న...ణం-నమత్ = నమస్కరించుచున్న, సుర=దేవతలయొక్క, శిరః = శిరస్సులయందలి, కోటీర = కిరీటములయందు, సంఘర్షణం = ఒరయుటయు, ఇదం = ఈనాలుగును, మృదులస్య = మార్దవయుక్తమైన, తావక పదద్వంద్వస్య = నీ పాదద్వయముయొక్క, కర్మ = వ్యాపారము. మచ్చేతోమణిపాదుకావిహరణం — మత్=నాయొక్క, చేతః = చిత్తమనియెడు, మణిపాదుకావిహరణం = మణిమయమైన పాదుకలతో సంచారమును, సదా=ఎల్లప్పుడును, అంగీకురు =అంగీకరింపుము.

తా. పార్వతీవల్లభా! యమునిఱొమ్ము తన్నవలెను. అతికఠోరమైనయపస్మార మణఁగఁద్రొక్కవలెను. కొండమీఁదఁ దిరుగవలెను. నమస్కరింపవచ్చిన దేవతాదుల కిరీటములరాపిడి కోర్వవలెను. ఇదియంతయు మిగుల కఠినకృత్యము, నీపాదము లతికోమలములు. నాచిత్తంబను నున్నని మణిపాదుకలను దొడిగికొనుటకు దయచేసి యంగీకరింపుము. నామనస్సున మీపాదములు నిలిపి నన్ను రక్షింపుఁడని తాత్పర్యము.

అ. స్వచేతః పాదుకావిహరణం ప్రార్థయతే:...

వ్యా. వక్షస్తాడన మితి. అంతకస్య యమస్య వక్షస్తాడనం వక్షస్యురసి తాడనం పాదేన ప్రహరణం కఠినాపస్మారసంమర్దనం కఠినః దుర్భేదః యోఽపస్మారః స్వరూపాప్రత్యయ స్తస్య సమ్మర్దనం నిగ్రహణంభూభృత్పర్యటనం భూభృతి రజతాద్రౌ పర్యటనం పరిభ్రమణం నమ త్సుర శిరః కోటీరసంఘర్షణం నమతాం సురాణాం శిరాంసి తదలంకారభూతేషు కోటీరేషు సంఘర్షణం సంస్పర్శనం హే గౌరీపతే పార్వతీపతే హే శంభో సుఖదాయక! ఇద మేతత్త్రయం మృదులస్య మార్దవయుక్తస్య తావకపదద్వంద్వస్య తవేదం తావకం పదయో ర్ద్వంద్వం తచ్చ తథోక్తం తస్య కర్మ వ్యాపారః త్వం మచ్చేతోమణిపాదుకా విహరణం మణేః పాదుకా మణిపాదుకా మణిమయీ పాదుకేత్యర్థః మచ్చేతః మమ చిత్తమేవమణిపాదుకా తయా విహరణం మచ్చేతోమణిపాదుకావిహరణం సదానవరత మంగీకురు స్వీకురు పూర్వోక్తకఠినవక్ష ఆద్యైక సంఘర్షణజన్యాపీడానివృత్తయే అతిమృదుళమామకచిత్తమణిపాదుకావిహరణ మంగీకృత్య మాంత్రాయస్వేతి ప్రార్థయితు రభిప్రాయః.

పరమశివుని పాదారవిందములు సేవించువానికి దుర్లభమేమియు లేదని రూఢిగాఁ జెప్పుచున్నారు.—

వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకలికా నీరాజనం కుర్వతే,
దృష్ట్వా ముక్తివధూ స్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే
యచ్చేత స్తవ పాదపద్మభజనం తస్యేహ కిందుర్లభమ్. 65

టీ. హేభవానీపతే=ఓపార్వతీవల్లభా ! యచ్చేతః=ఏపురుషునియొక్క చిత్తము, తవ=నీయొక్క, పాదపద్మభజనం = పాదకమలము సేవచేయునో, దృష్ట్వా=వానిఁజూచి, వైవస్వతః = యముఁడు, వక్షస్తాడనశంకయా=ఱొమ్మతన్నునను భయముచేత, విచలితః=పాఱిపోవుచున్నాఁడు. నిర్జ

రాః=దేవతలు, కో...నం-కోటీర=కిరీటములయందు,ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, రత్నదీప=దీపములవంటి రత్నములయొక్క, కలికా=అంకురముల చేత, నీరాజనం=నీరాజనమును, కుర్వతే=చేయుచున్నారు.ముక్తివధూః=ముక్తికాంత, నిభృతాశ్లేషం = గాఢాలింగనమును, తనోతి = చేయుచున్నది. తస్య = ఆభక్తునికి, ఇహ = ఈలోకమందు, దుర్లభం = లభ్యముకానిది, కిం=ఏది ?

తా. పార్వతీమనోహరా ! చంద్రశేఖర ! మీ పాదసేవకునిజూచి మునుపటియట్లే ఱొమ్మునఁ దన్నునువేమోయని భయపడి యముఁడు పాఱి పోవును. దేవతలందఱు కాళ్ళమీఁదఁబడి మ్రొక్కి తమకిరీటములయందలి మాణిక్యదీపములతో నీరాజనము లిత్తురు. ముక్తికాంత తనంతఁ దావచ్చి గాఢాలింగనమొసఁగును. ఇఁక నీభక్తునకేమి దుర్లభము ? సర్వము సులభమ యనితాత్పర్యము.

అ. పరమశివపాదపద్మం భజమానస్య సుర్లభరాహిత్యం ప్రతిజానీతే —

వ్యా. వక్షేతి. హే భవానీపతే పార్వతీరమణ యచ్చేతఃయస్య పురుషస్య చేతశ్చిత్తం తవ పాదపద్మభజనం భవతి తవ తే పాదపద్మభజనం పాదపద్మసేవకం భవతి జాయతే తం దృష్ట్వా వైవస్వతః యమః వక్షస్తాడన శంకయా శివభక్తదోర్హేణ పూర్వవన్మమ వక్షః పరమశివ స్తాడయిష్యతీతి శంకయా విచలితః దూరం పలాయితో భవతి నిర్జరాః వాగ్ధకనూన్యాః దేవాః కోటీరోజ్జ్వలరత్నదీపకలికానీరాజనం కోటీరేషు కిరీటేషూజ్జ్వలాః ప్రకాశమానాః రత్నాని దీపాఇవ రత్నదీపాః కోటీరోజ్జ్వలాశ్చ తే రత్నదీపాశ్చ తేషాం కలికాభి రంకురై ర్నీరాజనం కోటీరోజ్జ్వల రత్నదీపకలికానీరాజనం తత్తస్య కుర్వతే విరచయంతి ముక్తివధూ ర్ముక్తి రేవ వధూ రంగనాతస్య నిభృతాశ్లేషం దృఢాలింగనం తనోతి విస్తరేణ కరోతి తత స్తస్యభక్తస్యేహాస్మి న్లోకే కిం కిం ఫలం దుర్లభం లబ్ధుమశక్యం సర్వం సులభమేవేతి భావః. శివపాదారవిందార్పితచిత్తస్య సర్వం సులభమేవేతి భావః.

'నన్ను రక్షింపుము' అని వేడుకొనుచున్నారు.—

క్రీడార్థం సృజసి ప్రపంచ మఖిలం క్రీడామృగా స్తే జనాః
యత్కర్మాచరితం మయా చ భవతః ప్రీత్యై భవత్యేవ తత్,
శంభో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మా న్మామకరక్షణం పశుపతే క ర్తవ్య మేవ త్వయా. 66

టీ. శంభో=సుఖకరుండవైన పరమేశ్వరుఁడా! అఖిలం = సమస్తమైన, ప్రపంచం=లోకమును, క్రీడార్థం = లీలామాత్రఫలముగా, సృజసి=సృజించుచున్నావు. తే=నీకు, జనాః=ప్రజలు, క్రీడామృగాః=విలాసార్థమైన జంతువులు, మయా=నాచేత, యత్=ఏ, కర్మ=కర్మము, ఆచరితం=ఆచరింపఁ బడినదో, తత్=ఆకర్మము, భవతః=నీయొక్క, ప్రీత్యై=క్షేమకొఱకు, భవత్యేవ=అగుచున్నది. మచ్చేష్టితం=నావ్యాపారము, స్వస్య=నీసంబంధమైన, కుతూహలస్య=ఇష్టమునకు, కరణం=సాధకమైనది, నిశ్చితం=నిశ్చయము. తస్మాత్=కాఁబట్టి, హేపశుపతే=ఓపరమశివుఁడా! మామకరక్షణం=నాసంరక్షణము, త్వయా = నీచేత, కర్తవ్యమేవ = చేయఁదగినదియ.

తా. పరమేశ్వరా! నీ వీప్రపంచమంతయు సృజించుట లీలార్థము గదా! ఈప్రజలందఱు నీవినోదార్థమైన జంతువులుగదా! వారివారి చెంపుడుజంతువుల నడవడులు వారికిఁ ప్రేమాస్పదములగుటజగత్ప్రసిద్ధమే కావున నేఁజేయుసత్కర్మములుగాని దుష్కర్మములుగాని యేచేష్టలైనను నీకు తృప్తికరములగును. కాన నన్ను రక్షింపవలసినవాఁడ వగుచున్నావు.

అ. ఆత్మరక్షణం కర్తవ్యమితి ప్రార్థయతే:—

వా. క్రీడార్థమితి. హే శంభో ఇదం పరిదృశ్యమాన మఖిలంప్రపంచం క్రీడార్థం క్రీడా లీలా అర్థః ప్రయోజనం యస్మిన్కర్మణి తద్యథా భవతి తథా సృజసి. నిర్మాసి ఆప్తసర్వకామస్య తవ వినా క్రీడయా నాన్యత్ప్రయోజనంపశ్యామః. తే తవేమేజనాః క్రీడామృగాః క్రీడాయై లీలాయై

నిర్మితా మృగాః భవంతిమయా యత్కర్మాచరితం యద్య త్కర్మాచరితం కృతం చకారః అసాధుకర్మసముచ్చినోతి. తత్సర్వం భవత స్తవ ప్రీత్యై ప్రేమ్ణే భవత్యేవ ఏవకారః అప్రీతిం వ్యవచ్ఛినత్తి. మచ్చేష్టితం మద్వ్యాపారః స్వస్య భవ త్సంబంధినః కుతూహలస్య కుతూహలవిషయస్య కరణ మనుష్ఠానరూపం భవతీదం నిశ్చితం నిశ్చయ ఇత్యర్థ స్తస్మాత్ హే పశుపతే మామకరక్షణం మదీయరక్షణం త్వయా భవతా కర్తవ్యమేవ ఏవకారేణాకర్తవ్యతాయాః వ్యుదాసః లోకే క్రీడామృగకృతం సర్వం క్రీడయితు రిష్టాయ యథా భవతి తథాఽస్మత్కృతం సర్వం భవదిష్టాయ భవ త్వితి ప్రార్థయితుర్భావః.

ఈశ్వరధ్యానము శరణుజేసికొనియెద ననుచున్నారు.—

బహువిధపరితోష బాష్పపూర
స్ఫుటపులకాంకితచారుభోగభూమిమ్,
చిరపదఫలకాంక్షి సేవ్యమానాం
పరమసదాశివభావనాం ప్రపద్యే.

టీ. బ...మిం—బహువిధ = నానాప్రకారములైన, పరితోష బాష్ప పూర=ఆనందబాష్పములయొక్క ప్రవాహమునకు, స్ఫుట = వ్యక్తపడిన, పులకాంకిత=రోమాంచరూపమైన, భక్తిచిహ్న=భక్తియొక్క గుఱుతునకు, చారు=రమ్యమైన, భోగభూమిం=భోగస్థానమును, చి...నాం—చిరపద =శాశ్వత కైలాసస్థానమనెడు, ఫల=ఫలమును, కాంక్షి= అపేక్షించువారిచే, సేవ్యమానాం = సేవింపఁబడునదియు, పరమసదాశివ భావనాం=సర్వోత్కృష్టుండగు, సాంబశివుని ధ్యానమును, ప్రపద్యే = శరణు పొందుచున్నాను.

తా. ఆనందబాష్పములు రోమాంచము మొదలగు భక్తిభావముల కాలవాలమై నిరంతరము కైలాసవాసము గోరువారి కాశ్రయణీయమైన యీశ్వరధ్యానము చేయుచుండు నని తాత్పర్యము.

అ. శివభావనాం ప్రపద్యఇతి నివేదయతి:—

వ్యా. బహ్వీతి. బహువిధపరితోషబాష్పపూరస్ఫుటపులకాంకితచారుభోగభూమిం పరితోషబాష్పాణ్యానందాశ్రూణి బహువిధాని బహుప్రకారాణిచతా న్యానందాశ్రూణి చ తేషాం పూరః ప్రవాహ స్తస్యచస్ఫుటం స్పష్టం పులకాంకితం పులకరూపం భక్తిచిహ్నం తస్యచచారుభోగభూమిం రమణీయభోగస్థానం చిరపదఫలకాంక్షి సేవ్యమానాం చిరపదం శాశ్వతస్థానం కైలాసఇత్యర్థః తదేవ ఫలం ప్రయోజనంతత్కాంక్షంతే అపేక్షంత ఇతి తత్కాంక్షిణ స్తైః సేవ్యమానా మాశ్రీయమాణాం పరమసదాశివభావనాం సదాశివః నిత్యానందస్వరూపః పరమశ్చ సర్వేభ్యః ఉత్కృష్ట స్తథాభూతస్య భావనాం ధ్యానం ప్రపద్యే శరణీకుర్వే సర్వదా శివధ్యానపరోభవామీ త్యభిప్రాయః.

తన కావుపాలు కావలసి యావును మేపుకొనలేనివాఁడందులకుఁగాఁ జాల పశువులుగలవాని నాశ్రయించినట్లు తనభక్తియను గోవుయొక్కపుష్టికై పశుపతియగు పరమశివుని బ్రార్థించుచున్నారు.—

అమితముదమృతం ముహు ర్దుహంతీం
విమలభవత్పదగోష్ఠ మావసంతీమ్,
సదయ పశుపతే సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తిధేను మేకామ్. 68

టీ. సదయ=దయతోఁగూడినవాఁడా! పశుపతే = ఓపశుపాలకుఁడా! అమితముదమృతం=అపరిమితానందంబనుపాలు, ముహుః = మాటిమాటికి, దుహంతీం=పితుకనిచ్చునదియు, వి...ష్ఠం-విమల = నిర్మలంబగు, భవత్పద=నీపాదంబులనెడు, గోష్ఠం = పశువులచావడిని, ఆవసంతీం=నివసించునదియు, సుపుణ్యపాకాం = మంచిపుణ్యములకు ఫలమైనదియునగు, మమ=నాయొక్క, భక్తిధేనుం=భక్తియనుగోవును, ఏకాం=ఒక్కదానిని, పరిపాలయ=కాపాడుము.

తా. పశుపతీ! పరమేశ్వరా! నీవపారమైన దయగలవాఁడవు. ఎంతయోపుణ్యము ఫలింపఁబట్టి నాకీభక్తియనుగోవు లభించినది. ఇదియపరిమితానందరూపమైనపాలు పదేపదే యిచ్చును. నీపాదరూపమైన పశువులచావడిలోఁ గట్టికొననిచ్చి యీయావు నొక్కటిఁ గాచిపెట్టుము.

అ. భక్తిపరిపాలనం ప్రార్థయతే;—

వ్యా. అమితముదితి. హే సదయదయాసహిత! పశుపతే పశుపాలక! అమితముదమృతం అమితముదపరిచ్ఛిన్నానందస్వైవామృతం క్షీరంతద్దుహాంతీం ప్రపూరయంతీం విమలభవత్పదగోష్ఠం భవతః పదమేవగోష్ఠం గోస్థానం విమలం చతత్ భవత్పదగోష్ఠం చ తదావసంతీం తత్రవాసంకుర్వంతీమిత్యర్థః ఉపాన్వధ్యాఙ్వస ఇత్యాధారస్య కర్మసంజ్ఞయా ద్వితీయా. సుపుణ్యపాకాం విమలపుణ్యఫలభూతామేవంభూతాం మమ మే భక్తిధేనుం భక్తిరేవ ధేను స్తామేకాం పరిపాలయ పుష్య యథా — లోకే కశ్చన ధేనుజన్యఫలం భోక్తుకామ స్తద్రక్షణాసమర్థస్సన్ తద్రక్షణసమర్థం కంచన గోమంతం దయాళుం ధేనురక్షణాయ ప్రార్థయతే తద్వత్త్వద్విషయక మద్భక్తిపరిపాలనాసమర్థ స్తత్ఫలభోగకామః అహం భక్తిపోషణసమర్థం త్వాం తత్పుష్టిం సంపాదయేతి ప్రార్థయామీతి ప్రార్థయితు ర్భావః.

దేవా! నే ననేకదోషముల కాటపట్టైనను జంద్రునివలె నన్నునుం జేకొనుమని వేఁడుచున్నారు.—

జడతా పశుతా కళంకితా
కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ
అస్తి యది రాజమౌళే
భవదాభరణస్య నాస్తి కిం పాత్రమ్. 69

టీ. జడతా=మూఢత్వము (జలమయుఁడగుట), పశుతా=వివేకములేమి (పశువగుట), కళంకితా = కళంకము గలిగియుండుట, కుటిలచరత్వం చ=కుటిలముగా సంచరించుటయు, మయి=నాయందు, నాస్తి=లేదు. దేవ =

మహాదేవా ! రాజమౌళే=చంద్రశేఖర ! అస్తియది=ఉన్నయెడల, భవదాభరణస్య = నీయలంకారమునకు, పాత్రం = తగినవాఁడను, నాస్మి కిం = కానా ?

తా. దేవా ! జడత్వము, పశుత్వము, కళంకము, కుటిల సంచారము నాకులేవు. ఇవియన్నియు చంద్రుని కున్నవి. అతను జలమునఁ బుట్టినాఁడు గనుక జడుఁడు. గురుపత్నీగమనము సేసినాఁడుగనుక పశువు కళంకము గలవాఁడు గనుక కళంకి. వంకరగానున్న బింబముతోఁ దిరుగువాఁడు గనుక కుటిలచరుఁడు. అట్టిచంద్రుని శిరస్సునఁ బెట్టికొను చంద్రశేఖరుఁడవైతివి. 'ఓచంద్రశేఖరా ! ననుగూర్చి ఈలక్షణములు నీకునుఁ గలవు. నీవు మూఢుఁడవు గనుక జడుఁడవు. వివేకము లేనివాఁడవు గనుక పశువు. పాపములచేత కళంకివి. కుటిలప్రవర్తనవలన కుటిలచరుఁడవు' నని యందురు వారేమి? అట్లయినచో భూషణముగా నన్నేల గ్రహింపవు? గ్రహింప వలసినదే. అందుకు దగినవాఁడనే యగుదును. మేధావులు దోషశాలురను దరికి జేరనీయరు. నీవు దయతో నట్టివారలను సైతము చేరఁదీసి కాపాడుదువని నీతలమీఁది చంద్రునిమూలమున దెలిసికొంటిని. కాఁబట్టి నన్నును రక్షింపుమని తాత్పర్యము.

అ. దోషాశ్రయ మపి మాం చంద్రమివ భూషణాయ స్వీకుర్వితి ప్రార్థయతే:—

వ్యా. జడేతి. జడతా మాఢ్యం జలోత్థతా చ ప్రకాశా నాశ్రయత్వమేవ మాఢ్యం సూర్యతేజసాభిభవాచ్చంద్రస్య ప్రకాశా నాశ్రయత్వం తదా మాయాంసం భవతి పశుపతా పశువ ద్వివేకాభావః పశుతా సా చ గురుపత్నీగ్రహణేన ప్రసిద్ధా కళంకితా కళంకలింగత్వం కుటిలచరత్వం బింబకౌటిల్యేన సంచరిష్ణుత్వం ఏతేషాం దోషాణాం సముదాయ శ్చంద్రేస్తి న మయి హే దేవ హే రాజమౌళే చంద్రశేఖరభవదాభరణస్య భవతః భూషణత్వేన గ్రహణస్య కిమితి పాత్రం నాస్మి యద్యపి దోషవద్గ్రహణం బుద్ధిశాలినో న సమ్మన్యతే త్వంతు దయావశా త్తదపి సమ్మన్యసే దోషయు

క్తచంద్రపరిగ్రహాదేవం ప్రత్యేమితస్మాన్మద్గ్రహణమపి యుక్తమేవేతి ప్రార్థ యితు రభిప్రాయః.

శివుఁ డెల్లప్పుడును నా హృదయమందేకలఁడు గాన పూజించుట సులభమని చెప్పుచున్నారు.—

అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యా
పరివసితుం సులభః ప్రసన్నమూర్తిః,
అగణితఫలదాయకః ప్రభు ర్మే
జగదధికో హృది రాజశేఖరోఽస్తి. 70

టీ. ప్రసన్నమూర్తిః=సుముఖమైన మూర్తిగలవాఁడును, అ...కః-అగణిత=ఎంచఁ దరముగాని, ఫల=వాంఛితమునకు, దాయకః=దాతయు, ప్రభుః=సర్వసమర్థుఁడును, జగదధికః=జగత్తుకన్న నెక్కువవాఁడును నగు, రాజశేఖరః=చంద్రశేఖరుఁడు, మే = నాయొక్క, హృది = హృదయమందు, అస్తి= కలఁడు. అరహసి = బహిరంగముననుు, రహసి = ఏకాంతమందును, స్వతంత్రబుద్ధ్యా=స్వాధీనమను తలంపుతో, పరివసితుం=పరిచర్య సేయుటకు, సులభః=సులభమైనవాఁడు, భవతి=అగును.

తా. స్వాధీనుఁడైన సార్వభౌముని తన యిష్టము వచ్చినచోటికిఁ గొనిపోయి తనయభీష్టము సాధించుకొనుట సులభమైనట్లు సుముఖుఁడై యెల్లకోర్కెలు దీర్చుచు సర్వసమర్థుఁడై జగదతీతుఁడుగానున్న యీరాజశేఖరుఁడు నాహృదయమందేయున్నవాఁడు గనుక యేకాంతముగను బహిరంగముగను గూడ స్వతంత్రముగాఁ బూజింప వచ్చును.

అ. సర్వదా మమ హృదయవర్తిత్వా త్పూజయితుం సులభ ఇత్యాహ :—

వ్యా. అరహసీతి. ప్రసన్నమూర్తిః ప్రసాదోన్ముఖీమూర్తి ర్యస్య తథోక్తః అగణితఫలదాయకః· అగణితం సంఖ్యారహితం ఫలం మనోవాంఛితం తస్య దాయకః ప్రదాతా ప్రభుః ప్రభవతి. సృష్ట్యాదికర్మ కర్తుం

శక్నోతీతి ప్రభుః అభిలషితకర్తకరణసమర్థ ఇత్యర్థః జగదధికః జగతోధికః చిద్రూపత్వేన జగద్విలక్షణ ఇతియావత్ జగదధిపఇతి పాఠే సర్వేషాం జగతాం సర్వేషు కర్తసు ప్రేరకః 'యస్సర్వేషు భూతేష్వి' త్యంతర్యామి బ్రాహ్మణమంత్రప్రమాణ మేవంభూతః రాజశేఖరః చంద్రమౌళి స్సార్వభౌమఇతి చ ధ్వన్యతే మమ హృది మనస్య స్తిస్థిరీభవత్యతః కారణాత్సః అరహసి బహిః ప్రదేశే అంతఃకరణా ద్భిన్న దేశ ఇత్యర్థః. రహస్యంతఃకరణప్రదేశేచ మనసీత్యర్థః స్వతంత్రబుధ్యా స్వాయత్తఇతి బుధ్యావరివసితుం పరిచరితుం సులభః అనాయాసలభ్యః భవతీ త్యధ్యాహారః.యథాలోకే స్వాయత్తః ప్రసాదాదిపూర్వోక్తగుణోపేతి స్సార్వభౌమ స్స్వాయత్తం ప్రదేశం ప్రాపయ్య స్వేష్టం సాధయితుం సులభ స్తథాయమపి సులభో భవతీతి భావః.

ఈశ్వర స్మరణములచేత పాపములు నిర్మూలమైపోయి విద్వద్వరిష్ఠుఁడు శివసారూప్యము పొందునని చెప్పుచున్నారు.—

ఆరూఢభక్తిగుణకుంచితభావచాప
యుక్తై శ్శివస్మరణబాణగణై రమోఘైః,
నిర్జిత్య కిల్బిషరిపూ న్విజయీ సుధీంద్ర
స్సానంద మావహతి సుస్థిరరాజలక్ష్మీమ్. 71

టీ. సుధీంద్రః=విద్వద్వరిష్ఠుండు, ఆరూఢభక్తిగుణకుంచితభావచాపయుక్తైః-ఆరూఢ=పొడుకొనిన, భక్తి=భక్తియను, గుణ=అల్లెత్రాటిచేత, కుంచిత = వంచఁబడిన, భావ = అంతఃకరణంబను, చాప = ధనుస్సునందు, యుక్తైః = కూర్పఁబడిన, అమోఘైః = విఫలములుగాని, శివస్మరణచాపగణైః - శివ = ఈశ్వరునియొక్క, స్మరణ = స్మరణమను, బాణగణైః = బాణపుంజములతో, కిల్బిషరిపూన్ = పాపంబులనెడు శత్రువులను, నిర్జిత్య= నిశ్శేషముగా జయించి, విజయీ = జయముగలవాఁడగుచు, సానందం = ఆనందముతోఁగూడునట్లుగా, సుస్థిరరాజలక్ష్మీం = స్థిరమైన బ్రహ్మాదులకు రాజైన పరమశివునియొక్క సారూప్యమను స్థిరమైన రాజలక్ష్మిని, ఆవహతి=పొందును.

తా. లోకమం దొకరాజు ధనుర్బాణములతో శత్రురాజుల జయించి ఆరాజలక్ష్మిని పొంది సార్వభౌముఁ డైనట్లు విద్వద్వరిష్ఠుఁడు ఆరూఢభక్తి యల్లెత్రాడుగను అంతఃకరణవృత్తి ధనుస్సుగను నమర్చికొని అం దీశ్వరస్మరణము బాణముగా నెక్కుపెట్టి పాపంబులను శత్రువులనెల్ల జయించి పరమానందముతో పరమేశ్వర సారూప్యలక్ష్మిని పొంది దుష్టనిగ్రహ శిష్టపరిపాలనరూపముగా సర్వశాసకుఁ డగును.

అ. శివస్మరణైః పాపాని నిర్మూలీకృత్య విద్వద్వరిష్ఠ శ్శివసారూప్యలక్ష్మీం ప్రాప్నోతీత్యాహ :—

వ్యా. ఆరూఢేతి. సుధీంద్రః బుద్ధిమద్వరిష్ఠః ఆరూఢభక్తిగుణకుంచిత భావచాపయుక్తై రారూఢా అభివ్యాప్యోత్పన్నా భక్తిస్సైవ గుణః జ్యాధనుర్గుణ ఇత్యర్థః తేన కుంచితః నమీకృతః భావః అంతఃకరణవృత్తిరూపా బుద్ధిస్సఏవ చాపః కోదండః కుంచితశ్చాసౌ భావచాపశ్చ తత్రయుక్తై ర్యోజితై ర్యోజన మంతర్భావితణిజర్థః అమోఘై రవిఫలై శ్శివస్మరణబాణగణై శ్శివస్మరణాన్యేవ బాణాస్తేషాం గణైః పుంజైః కిల్బిషరిపూన్ కిల్బిషాణ్యేవ రిపవశ్శత్రవస్తాన్ నిర్జిత్య నిశ్శేషం జిత్వా విజయీ సన్ విజయవాన్ సన్ సానంద మానందసహితం యథాతథా సుస్థిరరాజలక్ష్మీం రాజ్ఞో లక్ష్మీః రాజలక్ష్మీః దుష్టనిగ్రహశిష్టపరిపాలనరూపా లక్ష్మీస్సర్వశాసనమితి యావదిత్యర్థాంతరం సుతరాం స్థిరాః బ్రహ్మాదయస్తేషాం రాజానుస్థిరరాజాపరమశివస్తస్య లక్ష్మీస్సారూప్యలక్ష్మీస్తా మావహతి ప్రాప్నోతి యథాలోకే కశ్చన భూపతి ర్బాణై స్సర్వాన్ రిపూన్ జిత్వా రిపురాజలక్ష్మీం ప్రాప్నో త్యేనం భక్తః భక్తిపూర్వక శివస్మరణైః కిల్బిషజయపూర్వకం శివసాయుజ్యం ప్రాప్నోతీతి భావః.

శివభక్తులు ధన్యులని చెప్పుచున్నారు.—

ధ్యానాంజనేన సమవేక్ష్య తమః ప్రదేశం
భిత్త్వా మహాబలిభి రీశ్వరనామమంత్రైః,

దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యేపాదపద్మ మిహ తే శివ తే కృతార్థాః. 72

టీ. శివ = సాంబశివుఁడా! ధ్యానాంజనేన = ధ్యానంబను కాటుక చేత, సమవేక్ష్య = లెస్సగా కనిపెట్టి, ఈశ్వరనామమంత్రైః = ఈశ్వరుని యొక్క నామమంత్రములనియెడు, మహాబలిభిః = గొప్పపూజోపకరణముల చేత, తమఃప్రదేశం = అజ్ఞానంబను స్థలమును, భిత్వా = త్రవ్వి, యే = ఏ భక్తులు, దివ్యాశ్రితం = దేవతలచేత పొందఁబడిన, భుజగభూషణం = సర్వ మాభరణముగాఁ గలిగిన, తే = నీయొక్క, పాదపద్మం = పాదకమల మును, ఇహ = ఈజన్మమందు, ఉద్వహంతి = ఎత్తికొనుచున్నారో, తే = వారు, కృతార్థాః = జన్మసాఫల్యము బొందినవారు.

తా. నిధులు వెదుకువాఁడు కన్నుల కంజనము వేసికొని యది కనిపెట్టి యాచోట నిధిరక్షక దేవతలం బూజించి త్రవ్వి యానిధిగొని ముదమంది నట్లు భక్తుఁడు ధ్యానాంజనముతో మీపాదపద్మనిధిం గనుఁగొని మీనామ మంత్రముతో మహాబలియొనర్చి ఆవరణమైన యజ్ఞానము దొలఁగించి దేవ తాశ్రితమును భుజగభూషితమునగు మీపాదపద్మములంగొని కొల్చి జన్మ సాఫల్యముగాఁ బరమానంద మొందునని తాత్పర్యము.

అ. శివపాదభక్తసేవకానాం కౌర్తార్థ్యమాహ :—

వ్యా. హే శివ ధ్యానాంజనేన ధ్యానమేవాంజన మంతఃస్థాపిత ప రోక్షవస్తుప్రకాశనసమర్థ మౌషధం తేన సమవేక్ష్య సమ్య గంతస్థితం శివ పాదపద్మరూపం వస్తుజ్ఞాత్వా ఈశ్వరనామమంత్రైరేవ మహాబలిభి ర్నిధి పరిపాలకదేవతా ప్రసాదజననసమర్థైః పూజోపకరణై స్తమః ప్రదేశంతమః పదపద్మా జ్ఞానమేవ ప్రదేశః వస్త్వావారకస్థలవిశేష స్తంభిత్వా ఖాత్వా యే భక్తాః దివ్యాశ్రితం దివి భవాః దివ్యా స్సురై స్తై రాశ్రితం ప్రాప్తం భుజగ భూషణం భుజగ స్సర్పో భూషణం యస్య తథోక్తం తే పాదపద్మ మి హాస్మిన్ జన్మన్యుద్వహంత్యుద్ధృత్యానుభవంతి తే కృతార్థాః ప్రాప్తజన్మ

ఫలా।భవంతి లోకే యదా కశ్చి దంజనవిశేషా త్తే నేత్రే కృత్వా నిక్షేపప్ర దేశం జ్ఞాత్వా నిక్షేపరక్షకదేవతాం బల్యాదిభి స్స్వాయత్తీకృత్యావారక ప్రదేశభేదనేన తత్రత్యం నిధిం లబ్ధ్వా ముద మనుభవతి తథా భక్తాఅపిధ్యా నాదిపూర్వోక్తోపాయై స్త్వ త్పాదారవిందం సాక్షాత్కృత్యానన్యసులభం తజ్జనిత మానంద మనుభవంతీతి భావః.

శివపాదభజన మక్కఱయైన దనుచున్నారు.—

భూదారతా ముదవహ ద్యదపేక్షయా శ్రీ
భూదారఏవ కి మతః స్సుమతే లభస్వ,
కేదార మాకలితము క్తిమహౌషధీనాం
పాదారవిందభజనం పరమేశ్వరస్య. 73

టీ. హే సుమతే = ఓసద్బుద్ధీ! యదపేక్షయా = దేనియపేక్షచేత, శ్రీభూదారఏవ=లక్ష్మియు భూమియు భార్యలుగాఁగల మహావిష్ణువే, భూదారతాం= వరాహరూపమును, ఉదవహత్ = తాల్చెనో, కిం=ఇది సుప్రసిద్ధమేకద! అతః=కనుక, ఆకలితముక్తిమహౌషధీనాం-ఆకలిత = అపేక్షితములైన, ముక్తి=సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము క్తులనియెడు, మహౌషధీనాం = గొప్పమూలికలకు, కేదారం = పంటపొలమైన, పరమేశ్వరస్య = మహాదేవునియొక్క, పాదారవిందభజనం = పాదకమల సేవను, లభస్వ = పొందుము.

తా. ఓసుబుద్ధీ! చూచితివా! లోకవంద్యుఁడైన యామహావిష్ణువు సైత మా మహాదేవుని పాదసందర్శనమునకై వరాహరూపమెత్తి పలువిధముల పరిశ్రమముల కోర్చినాఁడు! నీవాపరమేశ్వర పాదభజనము సేయుము. దానివలన సాలోక్యము సామీప్యము సారూప్యము సాయుజ్యము ననుముక్తులు పంటనేలయం దోషధులు ఫలించినట్లు ఫలించును.

అ. పాదారవిందభజనస్యావశ్యకతామాహ:—

వ్యా. హే సుమతే శోభనా చ సా మతిశ్చ తస్యాస్సంబుద్ధిర్యద పేక్షయా యత్పాదారవిందదర్శనాపేక్షయా శ్రీభూదారశ్శ్రీశ్చ భూశ్చ శ్రీభువౌ తే దారాః యస్య సః విష్ణురేవ భూదారతాం వరాహభావముదవహాత్ ప్రాప్నోత్ కింకిమితి ప్రసిద్ధా అతః కారణాదాకలితముక్తి మహౌషధీనామాకలితాః ఆశంసితాః ముక్తయస్సాలోక్యాద్యాశ్చతుర్విధాః తా ఏవ ఓషధయస్తాసాం కేదారముత్పాదకం పరమేశ్వరస్య తత్పాదారవిందభజనం పాదారవిందయోర్భజనం సేవాం లభస్వ ప్రాప్నుహి యతః కారణాల్లోకవంద్యో మహావిష్ణురేవ స్వాభిలషితపూర్తయే వరాహీభూయ శివపాదారవిందదర్శనమైచ్ఛత్తాదృశం భజనం త్వమపి కురుష్వేతి ప్రార్థయితుర్భావః హరిబ్రహ్మాణౌ పరస్పరశ్రైష్ఠ్య నిర్ధారణపరౌ శివపాదమూర్ధదిదృక్షయా వరాహహంసరూపం ప్రాప్తౌ ఇతి పురాణప్రసిద్ధిః.

ఆశాపాశక్లేశ దుర్వాసనాది
 భేదోద్యుక్తైర్దివ్యగంధైరమందైః,
ఆశాశాటీకస్య పాదారవిందం
 చేతఃపేటీం వాసితాం మే తనోతు. 74

టీ. ఆశాశాటీకస్య = దిగంబరుఁడైన యీశ్వరునియొక్క, పాదారవిందం = పాదపద్మము, మే=నాయొక్క, చేతఃపేటీం = చిత్తమనుపెట్టెను, ఆశాపాశక్లేశదుర్వాసనాదిభేదోద్యుక్తైః—ఆశాపాశ = పాశమువలె బంధకమైన యాశయు, క్లేశ=అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశ మను పంచక్లేశములు ననియెడు, దుర్వాసనాది = చెడ్డసంస్కారము (దుర్గంధము) లను, భేద = భేదించుటయందు, ఉద్యుక్తైః = ప్రవృత్తములైన, అమందైః=కొలఁదిగాని, దివ్యగంధైః = దివ్యమైన పరిమళములచేత, వాసితాం = సువాసనగలదానిఁగా, తనోతు=చేయుఁగాక.

తా. దిగంబరుండగు పరమేశ్వరునియొక్క పాదకమలము నాచిత్త పేటికయందలి యాశాపాశములు పంచక్లేశములు మున్నగు దుర్వాసనల

నణంచి దివ్యమైన సువాసనలతో నింపుగాక. ఈశ్వరపాదపద్మము నాచిత్త మం దెడబాయక యుండుగాక యని తాత్పర్యము.

అ. స్వచేతః పేటీ సౌగంధ్యం ప్రార్థయతే:—

వ్యా. ఆశాపాశ ఇతి. ఆశాశాటీకస్య ఆశా దిక్శాటీ అంబరం యస్య బహువ్రీహౌ కప్రత్యయః ఆశాశాటీకస్య దిగంబరస్యేత్యర్థః తస్య పాదార విందం పాదఏవారవిందం పద్మం తస్మై మమ చేతః పేటీం చేతశ్చిత్తమేవ పేటీ మంజూషా తా మాశాపాశక్లేశదుర్వాసనాదిభేదోద్యుక్తైరాశావిషయ తృష్ణా అలం బుద్ధివిరహరూపా సాపాశ ఇవ రజ్జురివ పాశసాదృశ్యం చ ఆశాయాః బంధకత్వేన ఆశాపాశః ఉపమానోత్తరపదకర్మధారయః క్లేశాః పంచ అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశాః అవిద్యా స్వరూపాజ్ఞాన మస్మి తా అస్మీత్యస్య భావః అస్మితా దేహే అహ మిత్యభిమానః రాగః విషయే అనురక్తి ర్ద్వేషః అనిష్టవిషయే అప్రీతి రభినివేశః స్వర్గేషు కర్మసు కర్తవ్య త్వాగ్రహః క్లిశ్యం తేజనాః ఏభిరితి క్లేశాః అవిద్యాదయః ఆశాపాశ శ్చ క్లేశా శ్చ ఆశాపాశక్లేశా స్తఏవ దుర్వాసనాః దుస్సంస్కారాః దుర్గంధా శ్చ తాసాం భేదేభేదనే ఉద్యుక్తైః ప్రవృత్తైరమందై రనల్పై ర్దివ్యగంధై ర్దేవయోగ్యపరిమళై ర్వాసితాం సంజాతవాసనాం వాసశబ్దాదితచ్ప్రత్యయ స్తనోతుకరోతు మమ చేతసి దిగంబరస్య పాదారవిందం సదా తిష్ఠత్వితి భావః.

కళ్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్,
చేతస్తురంగ మధిరుహ్య చర స్మరారే
నేత స్సమ స్తజగతాం వృషభాధిరూఢ. 75

టీ. వృషభాధిరూఢ=నందివాహనమెక్కువాఁడా! సమస్తజగతాం= ఎల్లలోకములకును, నేతః=నాయకుఁడా! స్మరారే=కామవైరీ! కల్యాణినం=

శుభలక్షణములు గలదియు, సరసచిత్రగతిం = సరసముగాఁ జిత్రములైన యాస్కందితము మున్నగు నడకలుగలదియు, సవేగం = వేగముతోఁగూడి నదియు, సర్వేంగితజ్ఞం=అందఱి యింగితంబులు నెఱిఁగినదియు, అనఘం= నిర్దుష్టమైనదియు, ధ్రువలక్షణాఢ్యం = (సుళ్లుమొదలగు) స్థిరమైన చిహ్నములుగలదియునగు, చేతస్తురంగం=(నా) చిత్తంబను గుఱ్ఱంబును, ఆరుహ్య =ఎక్కి, చర=సంచరింపుము.

తా. సకల జగన్నాయకా! మహాదేవా! నీకు వృషభముగదా వాహనము? అంతకన్న గుఱ్ఱము మెఱుఁగుగాదు? ఇదిగో చూడు. ఇప్పుడు నామనస్సే గుఱ్ఱముగానున్నది. దీనినెక్కి చక్కగా స్వారిచేయుము. ఇదికల్యాణి. యజమానికి శుభసూచకములైన లక్షణములు కలిగియున్నవి. సరసమైనది. అనురాగముఁ జూపుచుఁ బోవును. దీనిపోకలు పలుతెఱఁగులు. కదము మున్నగు నడకలన్నియు నడచును. మిగుల వేగమైనది. ఇంగితము కని పెట్టి ప్రవర్తించును. ఏదోషములు లేవు. స్థిరమైన లక్షణములున్నవి.అనఁగా సుళ్లుమంచివి. నీవు జగన్నాయకుఁడవు గనుక గుఱ్ఱమునెక్కి సంచరించుట యుక్తమైనది. నిత్యము నామనస్సునందు నీస్మరణము గలుగున ట్లనుగ్రహింపుమని తాత్పర్యము.

అ. తదేవ భంగ్యంతరేణ స్తౌతి:—

వ్యా. కల్యాణినమితి. హే వృషభాధిరూఢ హే సమస్తజగతాం నేతః సమస్తజగత్ప్రభో స్మరారే కామరిపో చేతస్తురంగం చేత ఏవాశ్వః అశ్వసాదృశ్యా దశ్వస్త మధిరుహ్యారుహ్య చర భ్రమ చేతస్తురంగం కల్యాణినమిత్యాది విశేషణై ర్విశినష్టి కల్యాణినం కల్యాణాఖ్యలక్షణయుక్తం యజమానస్యాశ్వపతే శ్శుభసూచక మిత్యపి ద్యోత్యతే సరసం చిత్రగతిం సరసా సానురాగా చిత్రా బహుప్రకారా చ గతి ర్యస్య తం తథోక్త మాస్కందితం ధౌరితకం రేచితం వల్గితం ప్లుత మిత్యేవం రూపాగతిః సవేగం వేగసహితం సర్వేంగితజ్ఞం సర్వేషా మింగిత మంతర్గతం భావం జానాతీతి తజ్జ మనఘం నిర్దోషం ధ్రువలక్షణాఢ్యం రేఖారూపావర్తనాది స్థిరలక్షణ

సహితం చేతః పక్షే విషయపరిత్యాగేన ఈశ్వరే స్థిరవృత్తిత్వం లక్షణం నిర్మలమనసః లక్షణమేతత్ చేతసి తురంగత్వారోపణస్య చేతస్తురంగయో స్సాదృశ్యం వినా అనౌచిత్యాదిమాని విశేషణాని చేతస్యపి యోజనీయాని తురంగస్య స్వసాధిక గుణత్వా జగన్నేతృత్వా త్తైవ తురంగాధిరోహణేన సంచరణం యుక్తమితి భావః.

జన్మసాఫల్యమును వేఱొకవిధముగాఁ జెప్పుచున్నారు.—

భక్తిర్మహేశ పదపుష్కర మావసంతీ
కాదంబినీవ కురుతే పరితోషవర్షమ్,
సంపూరితో భవతి యస్య మన స్తటాక
స్తజ్జన్మసస్య మఖిలం సఫలం చ నాన్యత్. 76

టీ. భక్తిః=సేవ, మహేశపదపుష్కరం = ఈశ్వరపాదరూపమైన యాకాశమున, ఆవసంతీ = స్థిరముగానున్నదై, కాదంబినీవ = మేఘమాల యుంబోలె, పరితోషవర్షం = ఆనందవృష్టిని, కురుతే = కలిగించుచున్నది, (తేన= ఆవర్షముచేత) యస్య = ఏపురుషునియొక్క, మన స్తటాకః =మన స్సనుచెఱువు, సంపూరితః=నిండింపఁబడినది, భవతి=అగునో, తజ్జన్మసస్యం= వానిజన్మమనుపైరు, అఖిలం = నిశ్శేషముగా, సఫలం = ఫలవంతమైనది (అగును), తదితరంచ=అదిగాక తక్కినదిమాత్రము, న=(సఫలము) కాదు.

తా. భక్తిమేఘమాలికబోలె మహాదేవుని పాదపద్మంబను గగనం బునందు వ్యాపించినదియై యానందవర్షము కురియును. అట్టి యావర్షమున కేపురుషుని మానససరోవరమంతయు నిండునో వానిజన్మంబను సస్యంబు సఫలమైనది యగునుగాని తక్కినది కాదు. ఈశ్వర చరణారవిందభక్తి లేక యానందము కలుగుట దుర్లభమని తాత్పర్యము.

అ. జన్మసాఫల్యం భంగ్యంతరేణాహ:—

వ్యా. భక్తిరితి. భక్తి స్సేవా మహేశ పదపుష్కరం మహేశస్య పద పుష్కరం చరణాకాశం. ని 'వ్యోమపుష్కర మంబర' మిత్యమరః. ఆవ

సంతీ సతీ తత్ర స్థిరా భవంతీ సతీత్యర్థః కాదంబినీవ మేఘమాలేవ పరితోష వర్ష మానందవృష్టిం కురు తే జనయతి యస్య పురుషస్య మనస్తటాకః మన ఏవ తటాకస్తేన సంపూరితో భవతి సంవర్ధితో భవతి తజ్జన్మ సస్యం తస్య పురుషస్య జన్మఉత్పత్తి స్తదేవ సస్య మోషధి రఖిలం నిశ్శేషం యథాభవతి తథాసఫలం ఫలవ ద్భవ త్యన్యచ్చాన్య త్తదితర జ్జన్మసస్యంచోత్పత్తి సస్యం న సఫలం చ శబ్దోఽయం తు స్థానని వేశీ పూర్వపక్షవ్యావృత్తిప్రయోజనః. ఈశ్వరచరణారవిందభక్తిం వినా ఆనందో దుర్లభఇతి భావః.

ఇంక రెండుశ్లోకములలో పలుతెఱంగుల విచారపడుచున్న బుద్ధి యొక్కవిచారము బాపుమని వేఁడుకొనుచున్నారు.—

బుద్ధి స్థిరా భవితు మీశ్వరపాదపద్మ
సక్తా వధూ ర్విరహిణీవ సదా స్మరంతీ,
సద్భావనా స్మరణదర్శనకీర్తనాది
సమ్మోహితైవ శివమంత్రజపేన వింతే. 77

టీ. హే ఈశ్వర=నిగ్రహానుగ్రహసమర్థుఁడవైన ఓదేవా! విరహిణీ= భర్తృవియోగముఁబొందిన, వధూరివ = భార్యవలె, పాదపద్మసక్తా= (మీ) పాదకమలములయం దాసక్తికలిగినది గనుకనే, సదా=ఎల్లప్పుడును, స్మరంతీ = తలఁచుచున్న, బుద్ధిః=అంతఃకరణవృత్తి, శివమంత్రజపేన = 'శివ' అను మీనామమంత్రముయొక్క జపముచేత, సంమోహితైవ = మోహపడినదియేయగుచు, స్థిరా =స్థైర్యము గలిగినది, భవితుం=అగుటకు, సద్భావనాస్మరణదర్శనకీర్తనాది-సత్=సత్యమైన మీపాదపద్మముయొక్క, భావనా=ధ్యానము,స్మరణ=స్మరణము, దర్శన=దర్శనము, కీర్తన=కీర్తనము, ఆది=మున్నగువానిఁగూర్చి, వింతే=విచారపడుచున్నది.

తా. కరుణాసముద్రుండవైన మహాదేవా! మీపాదపద్మములయం దాసక్తి గలిగియున్న నాబుద్ధి భర్తృవియోగముఁ బొందినభార్యవలె నిరంత రము ధ్యానముచేయుచు 'శివ' యను మీనామమంత్రము జపించుచు మోహ

ము నొందినదియై స్థైర్యముతోఁ జను మీపాదధ్యానము, మీపాదస్మరణము, మీపాదసందర్శనము, మీపాదసంకీర్తనము, మీపాదపూజనము మొదలగు వానిఁగూర్చి విచారించుచున్నయది. దీని నుద్ధరింపుము.

అ. అనేకధా విచారయంతీం బుద్ధిం విచారా త్సముద్ధరేతి ద్వాభ్యాం ప్రార్థయతే:—

వ్యా. బుద్ధీతి. హే ఈశ్వరకర్తు మకర్తు మన్యథాకర్తుం చ సమర్థ విరహిణీ వధూరివ విరహిణీ భర్తృవియోగం ప్రాప్తవతీ వధూరివ భార్యేవ పాదపద్మ సక్తాతవ పాదపద్మే సక్తా ఆసక్తిమత్ అతఏవ సదా సర్వదా స్మరంతీ ధ్యాయంతీ బుద్ధి రంతఃకరణవృత్తి శ్శివమంత్రజపేన శివఇతి మంత్రస్య జపే నావృత్త్యా సమ్మోహితైవేదం కర్తవ్య మిదం నేతి విచారం ప్రాపితైవ సతీ స్థిరాస్వయమేకత్ర స్థైర్యశాలినీ భవితుం సద్భావనా స్మరణదర్శన కీర్తనాది ప్రతి సతః సత్యస్య పాదపద్మస్య భావనాధ్యానం చ స్మరణ మనుభూతానుసంధానం చ దర్శనం తద్విషయకచాక్షుషజ్ఞానం చ కీర్తనం తదభిలాషక శబ్దోచ్చార శ్చ తా స్త్వేవాదయో యస్య తత్ప్రతి విందతే విచారయతి విచారణార్థోఽయంశ్నమ్ వికరణస్థో విదధాతు స్సత్తాయాం విద్యతే జ్ఞానే వేత్తి వింతే విచారణే విందతే విందతి ప్రాప్తౌ శ్యన్ లుక్శ్నం శేష్వయం క్రమాత్.

ధ్యానము మున్నగువ్యాపారములయం దేమి చేయుమనని సంశయపడుచున్న యీనాబుద్ధికి శ్రేష్ఠగుణము లుపదేశించి విచారము దొలఁగింపుమని వేఁడుకొనుచున్నారు.—

సదుపచారవిధి ష్వనుబోధితాం
    సవినయాం సుహృదం సముపాశ్రితామ్,
మమ సముద్ధర బుద్ధి మిమాం ప్రభో
    వరగుణేన నవోఢవధూ మివ. 78

టీ. ప్రభో=సమర్థుఁడవైన పరమేశ్వరా! సదుపచారవిధిషు-సత్ = సత్యమైన మీపాదపద్మముయొక్క, ఉపచారవిధిషు = పూజావిధానముల యందు, అనుబోధితాం = క్రమముగా నుశిక్షితమైనదియు, సవినయాం = విధేయమైనదియు, సుహృదం=శుద్ధమైన మనస్సుకలదియు, సదుపాశ్రితాం =మంచియాశ్రయణముగలదియునగు, మమ = నాయొక్క, ఇమాం=ఈ, బుద్ధిం=బుద్ధిని, వరగుణేన=శ్రేష్ఠమైనగుణము నుపదేశించుటచేత, నవోఢ వధూమివ=క్రొత్తగాఁబెండ్లాడిన భార్యనుంబోలె, సముద్ధర=ఉద్ధరింపుము.

తా. సర్వార్థ సిద్ధిదాయకుఁడవగు పరమేశ్వరా! మీపాదపూజ యందు నుశిక్షితమై వినయముతోఁగూడి పరిశుద్ధభావముతోఁ బెద్దలయాశ్ర యణముచేయు నాబుద్ధికి, ఉపచారము చేయుటయందు సుశిక్షితురాలును, వినయవంతురాలును. శుద్ధాంతరంగము గలిగినదియు, ఆశ్రయించి యున్నది యు నగు క్రొత్తగాఁబెండ్లిచేసికొనిన భార్యకుంబోలె సద్గుణముల నుపదేశించి సంశయము దీర్చి చేకొనుము.

అ. భావనాదిషు వ్యాపారేషు కిం కుర్యామితి సందిహానా మిమాం పూర్వోక్తాం బుద్ధిం శ్రేష్ఠగుణోపదేశేన విచారా త్సముద్ధరేతి ప్రార్థ యతే:—

వ్యా. సదుపచారేతి. హే ప్రభో సర్వార్థఘటనసమర్థ సదుపచార విధిషు సతస్త్వత్పాదపద్మస్యోపచారవిధిషు పూజావిధానే ష్వనుబోధితా మనుక్రమేణ బోధితాం శిక్షితాం సవినయాం సన్నమోనుసరణయుక్తాం సు హృదం శుద్ధమనస్కం సంతముపాశ్రితా మాశ్రయమాణాం కర్తరి క్తః మమ మే ఇమాం బుద్ధిం వరగుణేన శ్రేష్ఠగుణోపదేశేన నవోఢవధూమివ నవం యథాతథా ఊఢాపత్నీత్వేన స్వీకృతా సా చ సా వధూశ్చేతా మివ సము ద్ధరోద్ధమయ ప్రకృతసందేహం పరిహరేతి భావః యథా కశ్చిద్వర స్సద్యో వివాహసంస్కృతాం భార్యాం శ్రేష్ఠగుణోపదేశేన సంశయా దుద్ధరతి తథేమాం బుద్ధిం సంశయా త్సముద్ధరేతి భావః.

ఈశ్వరపాదప్రత్యక్షముఁ గోరుచున్నారు.—

నిత్యం యోగిమనస్సరోజదళసంచారక్షమ స్త్వత్క్రమ
శ్శంభో తేన కథం కఠోరయమరాడ్వక్షః కవాటక్షతిః,
అత్యంతంమృదులంత్వదంఘ్రియుగళంహా మేమనశ్చింతయ
త్యేతల్లోచనగోచరం కురు విభో హస్తేన సంవాహయే. 79

టీ. హేశంభో = ఓయీశ్వరుఁడా ! త్వత్క్రమః = మీపాద విన్యాసము, నిత్యం = ఎల్లప్పుడును, యోగిమనస్సరోజదళసంచారక్షమః - యోగిమనః=యోగీశ్వరులయొక్క మనస్సనియెడు, సరోజ = పద్మము యొక్క, దళ=రేకులతోఁ గూడ, సంచార=కూడితిరుగుటయందు, క్షమః= సమర్థమైనది. తేన=అట్టిమృదువైన మీపాదముతో, కఠోరయమరాడ్వక్షః కవాటక్షతిః - కఠోర=మిక్కిలికఠినమైన, యమరాట్ = యమధర్మరాజు యొక్క, వక్షః కవాట = తలుపువంటిఱొమ్ముయొక్క, క్షతిః = భేదనము (తన్నుట), కథం=ఎట్లు? అత్యంతం=మిక్కిలి, మృదులం=మార్దవముగలిగిన, త్వదంఘ్రియుగళం=మీపాదయుగ్మమును గూర్చి, మే=నాయొక్క, మనః= మనస్సు, చింతయతి = చింతిల్లుచున్నది, హాఅయ్యో ! ఏతత్ = ఈపాద యుగ్మమును, లోచనగోచరం=కన్నుల కగపడుదానిఁగా, కురు=చేయుము. హస్తేన=చేతితో, సంవాహయే = పట్టి యొత్తెదను.

తా. దేవా! యోగిమానసపద్మములయందు సంచరింపఁదగిన మీ పాదములతోనా ? మొద్దుతలంపువలె కఠోరమైనయాయమునిఱొమ్ము ద న్నుట! మీపాదములు మిగుల కోమలమైనవి. అన్నన్నా! నామనస్సునకు మిగుల విచారముగా నున్నది. దేవా ! నాకన్నులకగపడునట్లు చేయుము నా చేతులతో మీ యడుగులొత్తి సేవించెదను.

అ. శివపాదాపరోక్ష్యం ప్రార్థయతే:—

వ్యా. హే శంభో త్వత్క్రమ స్త్వత్పదవిన్యాసః నిత్యం సదా యోగిమనస్సరోజదళసంచారక్షమః, యోగిమనఏవ-సరోజం పద్మం తస్య

దశ్లైచ్ఛద్రై స్సహ సంచారోఽఘటనం తత్ర క్షమ స్సమర్థ స్తేన మృదుళేన పదేన కఠోరయమరాడ్వక్షః కవాటక్షతి ర్యమరా డ్ధర్మరాజ స్తస్యవక్షః ఉరః కఠోర మతికఠినం తచ్చ తత్ తత్కవాటఇవ కవాటసదృశం తస్య క్షతిర్భేదనం కథ మాసీదితి చిత్ర మత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం మే మనశ్చింతయతి హా కష్టం హే విభో ఏతత్పదయుగళం మే లోచన గోచరం నేత్రవిషయం కురు, తద్ధస్తేన కరేణ సంవాహయే పీడయామి. స్పష్టో భావః.

ఏష్య త్యేష జనిం మనోఽస్య కఠినం తస్మి న్నటా నీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః,
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమన స్తల్పేషు వేద్యాదిషు
ప్రాయ స్సత్సు శిలాతలేషు నటనం శంభో కిమర్థం తవ. 80

టీ. హేశంభో = ఓశంకరుఁడా! ఏషః = వీఁడు, జనిం = ఉత్పత్తిని, ఏష్యతి = పొందఁబోవుచున్నాఁడు. అస్య = వీనియొక్క, మనః = మనస్సు, కఠినం = కఠోరమైనది, తస్మిన్ = దానియందు, అటాని = సంచరింపవలసినవాఁడను, ఇతి = అని, మద్రక్షాయై = నాసంరక్షణముకొఱకు, కోమలపదన్యాసః = మృదువైనయడుగులు వెట్టుట, గిరిసీమ్ని=పర్వతప్రదేశమందు, పురా=(నేనుపుట్టక) మునుపు, అభ్యాసితః = అలవాటు చేయఁబడినది. నోచేత్ = అట్లుకాదేని, దివ్యగృహాంతరేషు = రమ్యమైన గృహములయొక్క మధ్యప్రదేశములును, సుమన స్తల్పేషు=పూవులపాన్పులును, వేద్యాదిషు = అరుఁగులు మొదలగునవియు, ప్రాయః = బాహుళ్యముగా, సత్సు = ఉండఁగా, శిలాతలేషు = ఱాతినేలలయందు, తవ = నీకు, నటనం = నాట్యము, కిమర్థం = ఎందుకొఱకు ?

తా. ఓకైలాసవాసా! సాంబశివ! నీవు నన్నుగూర్చి యీపురుషుఁడు భూమిలోఁబుట్టఁబోవును. వీనిమనస్సు మిగుల కఠినముగానుండును. అప్పుడు నాకు దానియందు సంచరింపవలసివచ్చును. అని యాలోచించి నాసంరక్షణ

మున్నకై నేను పుట్టకపూర్వమే కొండలమీఁద నీకోమలపాదములతో నడచుట కలవాటుచేసితివి. లేకపోయినచో మిద్దెలు, మేడలు, పూలపాన్పులు, మంచిమంచియరుఁగులు నుండగా నీకేల యీఱాళ్ల మీఁద నాట్యముచేయ వలసివచ్చినది ?

అ. ప్రకారాంతరేణ స్తౌతి:—

వ్యా. ఏష్యతీతి. హేశంభో ఏషజనః జని ముత్పత్తి మేష్యతి లప్స్యతే అస్యమనః కఠినం కఠోరం తస్మి న్నటాని సంచ రాణీతిహేతునా మద్రక్షాయై మమ త్రాణాయ కోమలపదన్యాసః మృదులపదయో ర్విన్యాసః గిరిసీమ్ని పర్వతమధ్య ప్రదేశే పురా మజ్జననా త్పూర్వ మభ్యాసితః, అవర్తితః నోచేన్నైవం యది దివ్యగృహాంతరేషు రమణీయగృహమధ్యేషు సుమనస్తల్పేషు పుష్పసమానశయనేషు వేద్యాదిషు వేదికాప్రభృతిషు చ స్థానేషు ప్రాయస్సత్సు శిలాతలేషు పాషాణప్రదేశేషు తవ నటనం నాట్యం కిమర్థం కిం ఫలకం స్పష్టోఽర్థః.

ఇట్టిలక్షణములుగలవాఁడు జీవన్ముక్తుఁడగునని చెప్పుచున్నారు:—

కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచిద్ధ్యానసమాధిభి శ్చ నతిభిః కంచి త్కథాకర్ణనైః,
కంచి త్కంచి దవేక్షణై శ్చ నుతిభిః కంచి ద్దశా మీదృశీం
యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు.

టీ. హే ఉమామహేశ = పార్వతీప్రాణవల్లభుఁడవైన ఓమహాదేవా ! కంచిత్కాలం = కొంతసేపు, భవతః = నీయొక్క, పాదారవిందార్చనైః=కమలములవంటి పాదములపూజలతోడను, కంచిత్ = కొంతసేపు, ధ్యానసమాధిభిశ్చ = నిరంతరధ్యానముయొక్క నియమములతోడను, కంచిత్ = కొంతసేపు, నతిభిః = నమస్కారములతోడను, కంచిత్ = కొంతసేపు, కథాకర్ణనైః=చరిత్రలు వినుటతోడను, కంచిత్=కొంతసేపు, అవేక్షణైశ్చ = దర్శనములతోడను, కంచిత్=కొంతసేపు, నుతిభిః=స్తోత్రముల

